శ్రీః

# శ్రీకృష్ణావతారతత్త్వము

## పదునొకండవ ప్రకరణము.

ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందు ప్రధానాంధ్రపండితుఁడగు

కావ్యస్మృతితీర్థ

జనమంచి శేషాద్రిశర్మ విరచితము.

౧౧

౬




చెన్నపురి:

వావిళ్ల ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1930

# కల్యాణప్రవృత్తి.

సత్యాన్వేషణ తత్పరులారా !

శ్రీకృష్ణావతారతత్త్వమునందుఁ బదునొకండవ ప్రకరణము మీకర్పింపనోచితిని. ఇదియే మహాభాగ్యమని తలంచుచున్నాఁడను. ఈప్రకరణముతో నాప్రయత్నమును బూర్తి చేయఁదలంచితినని మున్నే విన్నవించియుంటిని. ద్రవ్య మింకఁ జేకూరదని యించుకజంకితిని. సర్వకార్యధురంధరుఁడు శ్రీకృష్ణుఁ డున్నవాఁడు. నాకేమిశ్రమమని యూహించువాఁడనయ్యుఁ బ్రాక్కర్మవాతావరణము నన్నావరించుటం జేసి కాఁబోలు భయము తోఁచుచుండును. వ్రాయఁదగువిషయములను జాలవఱకుఁ దగ్గించి ముగింపఁదలంపుఁగొన్న నాకు "దైవం మానుషరూపేణ" యన్నచందమున మ-రా-శ్రీ, జి. రామేశ్వర రావు బి. ఏ. బి. యల్. గా రనంతపురమునుండి యొకలేఖ వ్రాసిరి. పూనిన కార్యము తగ్గింపక సాగింపవలయుననియు శక్త్యనురూపముగఁ బోషకులను జేర్చి తోడ్పడుదుమనియు నాలేఖయందుఁ గల విషయములు. ఆలేఖ యందుకొని పఠించి లేని యుత్సాహమును దెచ్చుకొంటిని. వారింతకుముందే చాలనెలలక్రిందటనే పోషక ద్రవ్య మనుగ్రహించి తమపేరు ప్రకటింపవలదని కోరిరి. వల్లాకో యద్దాని కంగీకరించితి. ఇంతదనుక వారిపేరు ప్రకటింపనైతిని. వెండియు నీలేఖ వ్రాయుటయు మఱికొన్నిదిన

ములలో నేనమంద్రను బోధకులనుగాఁ జేర్చించితిమని వ్రాయు టయు సాగెను. పరమేశ్వరునియాశయ మీకార్యము నా చేతనే యింకను జేయింపఁబూనినదే యని నిశ్చయించుకొని భగవద్గీతలను నాయెఱింగినంత వ్యాఖ్యతో నిండుఁ బొందు పఱచితిని.

ముఖ్యముగా నీప్రకరణమున భారతకథలే కలవన వలయు. అందుఁ గృష్ణచరిత్రమునకు బాహ్యసంబంధముగలకథ లనే యత్యంతము సంగ్రహించి వ్రాసితిని. భగవద్గీతలకు నొక వ్యాఖ్యానముకూడ వ్రాసితిని. భాష్యత్రయము పెక్కువ్యా ఖ్యలు నాచేఁ బూర్వము పఠితములు. వానిం దడవక నాకృషి ఫలముగా వ్రాసినదేయీవ్యాఖ్యయనియెఱుంగఁదగు.దానింబరి శీలించిన నాకృషియెంతయో యెఱుంగనగును. దానికి గీతా హృదయ మనునామము కల్పింపఁబడియెను. వెనుకంజ వేయక తోఁచినవిషయమును వివరించితిని. నీవేమి క్రొత్తకల్పన మొన రించితివా యని మాత్రము ప్రశ్నింపకుఁ డని మిమ్ముఁ బ్రార్థించు వాఁడ. నాభావమే సర్వజనసమ్మత మనునంతయజ్ఞానము నాకు లేదు. నాభావమిది యని సకారణముగా వ్రాసితి నన్నుసంతో షము దొలఁగింపశక్యము కాదనిమాత్రమువిన్నవించువాఁడను. చక్కఁగా దానిం బరిశీలింపఁ బ్రార్థించెదను. తప్పులుండిన నాకు నెఱింగించుట యొప్పులున్న నన్నాశీర్వదించుట యను నివియే నిక్కమగు పండితులకృత్యములు. పెఱవారు లెన్నివిధముల నన్నుఁ దూలనాడినను నానామధేయార్థము ననుసరించి కదలను.

ఈప్రకరణము శ్రీకృష్ణావతారతత్త్వమునఁ బ్రధాన మని తలంతును. భగవంతునియుపదేశములే యిందుఁగలవు. అదియే గీతాశాస్త్ర మనంబడును. పారాయణముచేయువారి కొఱకు మూలమునుగూడ నిందుఁజేర్చితిని. కథలు లేవే యని విసుఁగుకొనక పఠింపఁ బ్రార్థింతును. పండ్రెండవప్రకరణముతో నీతత్త్వము పూర్తియగును. ద్రవ్య మింకను జాలదు. చాలదు చాలదని తెల్పుట నా కాచారమని పాఠకమహాశయు లెఱుంగకపోరు. అట్లని యూరకుండ మనసు రాదు. చందాదా రులలో నిరువురు మహాశయులు నిలుపవలదని వ్రాసినవారు కలరు. వారికిం గృతజ్ఞుఁడను. ధనమిచ్చినను ద్వరగాఁ బనిసా గింపుఁడని త్వరపెట్టినను విసుగుకొనక నాపని తమపనిగా భావించువారు మ-రా-శ్రీ, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు కలరుగదా యనునదియే నాకుంగలధైర్యము. నేను శేషాద్రిని. వారు వేంకటేశ్వరులు. ఇట్లుండ నా కార్యము నుజ్జగింప వారి కెట్లు శక్యమగును? ఇన్నిసంబంధములు గలిసి యీపనిని సాగించుచున్నవి.

మహాశయులారా! పునరుక్తిదోషమున కుదాహరణ ముగ నెన్నోవిషయములు వ్రాసియుందును. వానినెల్ల క్షమింపఁ బాఠకమహాశయులను గోరుచున్నాఁడను. వ్రాసినవిషయ ములం గలలోపములను నాకుం దెల్పుఁడని యాశీర్వదింపుఁడని పండితాఖండలులం బ్రార్థించుచున్నాఁడను. పండ్రెండవసంపుట మును ద్వరగా వెలువరించుభాగ్యము నాకుం గల్గింపుమా పర

మేశ్వరా యని కృపానిధిని శ్రీకృష్ణుని నాశ్రయించుచున్నాఁ
డను. నా కీకార్యమునకుఁ దోడ్పడువారిని రక్షింపుమా
యని శ్రీహరి నభ్యర్థించుచున్నాఁడను. ఇంతకంటె వ్రాయఁ
దగినవిషయములు లేవని యెల్లరకుఁ దెలియఁజేయుచున్నాఁ
డను ఇంతట మఱేమియు వ్రాసి మిమ్మలయింపక విరమించు
చున్నాఁడను. ఉపోద్ఘాతముల నందింపుఁడని మహాశయులనే
తన్ముఖమున వినీతుఁడనై వేఁడుచున్నాఁడను.

ఇట్లు, విన్నవించు, సజ్జనపాదసేవకుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ శ్రీ శ్రీ

# పోషకులు.

## శ్రీకృష్ణావతారతత్త్వమును బోధించుపుణ్యపురుషులు.

### కడప.

మ. రా. శ్రీ. కే. గుండురావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, వి. పిచ్చయ్యగారు, బి. ఏ., ప్లీడర్.
,, సి. లక్ష్మీనారాయణశాస్త్రిగారు, బి. ఏ., బి. ఎల్.
,, కావూరు శ్రీనివాసరావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, యస్. సుబ్బరావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, పి. సుబ్బరావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, వి. రాధాకృష్ణయ్యగారు, బి. ఏ., బి. ఎల్.
,, బి. సి. దేవరాజులునాయుడుగారు, బి. ఏ., బి. ఎల్.
,, సి. నారాయణరెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్.
,, సి. సి. రామచంద్రరావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, కస్తూరి సూర్యనారాయణరావుగారు, ప్లీడర్.
,, భోగసాధము వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, పత్తి రాఘవులుశ్రేష్ఠిగారు.
,, కంచిరాజు లక్ష్మీనరసింహయ్యగారు.
,, సుంకేసుల సుబ్బయ్యగారు.
,, కామిసెట్టి లక్ష్మీనరసయ్యశ్రేష్ఠిగారు.
,, కామిసెట్టి వెంకటేశముశ్రేష్ఠిగారు.
,, మల్లెముకొండు రామలింగయ్యశ్రేష్ఠిగారు.
,, మాలేపాటి చిన్నవెంగన్నశ్రేష్ఠిగారు.
,, అన్నలూరు శేషగిరిరావుగారు.
,, బి. శేషగిరిరావుగారు.
,, శ్రీగంథము నరసింహరావుగారు.
,, వేమగంటి శ్రీనివాసరావుగారు, బి. ఏ., ఎల్. టి.
,, పి. వీరభద్రరావుగారు.
,, పుష్పాల వేంకటస్వామినాయుడుగారు.

మ. రా. శ్రీ. కాట్రపాటి చలపతిరావుగారు
,, బొందలకుంట వేంకటనారాయణరావుగారు
,, సకలా వేంకటసుబ్బయ్యగారు
,, చిల్లా వేంకటకొండయ్యగారు
,, వీరబోయిన కొండయ్యగారు
,, బచ్చు వేంకటసుబ్బయ్యశేష్ఠిగారు
,, పప్పు సీతారామయ్యగారు, ఎమ్. ఏ.
,, యూదాటి వేంకటసుబ్బయ్యశాస్త్రిగారు
,, సగరం గురురావుగారు, బి. ఏ.
,, గడియారము కృష్ణస్వామయ్యగారు
,, గజరాంపల్లి రామచంద్రరావుగారు
,, సూర్యవంశము వేంకటసుబ్బరావుగారు
,, గంగవరము వేంకటనారాయణరెడ్డిగారు, మిన్నాయగారిపల్లె
,, మాకము లింగంశెట్టిగారు, బీమలపెంట
,, మద్దిరాల చెంచయ్యశెట్టిగారు, నందిమండలము
,, రంగారెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్., డిస్ట్రిక్టుబోర్డు. ప్రెసిడెంటు.
,, దేవతి పిచ్చయ్యశేష్ఠిగారు
శ్రీమతి తలుపుల వేంకటసుబ్బమ్మగారు

## క మ లా పు ర ము.

మ. రా. శ్రీ. బచ్చు రాఘవయ్యశేష్ఠిగారు
,, జి. సుబ్బరావుగారు
,, రాణువ ఫణిరావుగారు
,, హనుమగుత్తి చెంచిరెడ్డిగారు, గ్రామమునిసిఫ్, హనుమగుత్తి

## వ ల్లూ రు.

,, సముద్రాల రామస్వామిగారు
,, బెస్తవేముల నరసయ్యశేష్ఠిగారు

మ. రా. శ్రీ. తంగటూరు చెన్నయ్యశాస్త్రిగారు [శాస్త్రిగారు
,, వంకదారు మాచయ్యగారి మల్లయ్యకుమారుడు సుబ్బయ్య
,, పోలేపల్లి వెంగన్న శాస్త్రిగారు, ఆరణిపోలేపల్లి సుబ్బయ్య
శాస్త్రిగారు

## ఎఱ్ఱగుంట్ల.

,, ఎఱ్ఱగుంట్ల వెంకటసుబ్బయ్యగారు, కరణము
,, ఎఱ్ఱగుంట్ల వెంకటసుబ్బయ్యగారు
,, మాలేపాటి నాగయ్యగారు, తల్లము సూరయ్యగారు
,, పేర్ల నాగిరెడ్డిగారు
,, పి. శ్రీనివాసులు నాయుడుగారు
,, శంకరయోగి సుబ్బరావుగారు, నిడుజువ్వి

## పులివెందుల.

,, నద్దాల బోగాదిశాస్త్రిగారు, వేములకొత్తపల్లి [పల్లి
,, పోలేపల్లి సుబ్బయ్యకుమారుడు సుబ్బయ్యశాస్త్రిగారు, వెం
,, పుల్లగూర వెంకటశేషయ్యశాస్త్రిగారు, వెంపల్లి
,, కావుటూరు ఆనందరావుగారు, పోలీసు సబ్ ఇన్స్పెక్టరు
,, లింగిరెడ్డి సంగిరెడ్డిగారు, ఎద్దులాయగారికొత్తపల్లె
,, వడ్లగుంట అశ్వత్థయ్యగారు, వెంపల్లి
,, పట్టిరెడ్డి కొండారెడ్డిగారు, లింగాల [గారు చాగలేరు
,, ఘంటసాల చిన్నసుబ్బయ్యకుమారుడు వెంకటసుబ్బయ్య
,, సోముసర్వారెడ్డిగారు, పాపాయపల్లె, జమ్ములమడుగుతాలూకా

## ప్రొద్దుటూరు.

,, కొప్పరపు వెంకటసుబ్బయ్యశాస్త్రిగారు
,, నారాయణము రామసుబ్బయ్యశాస్త్రిగారు
,, సి. నరసరామశాస్త్రిగారు, బి. ఏ., ప్లీడరు
,, యం. రామస్వామయ్యగారు, ప్లీడరు
,, రావులూరు సుబ్బరావుగారు, డిప్టీనాజరు

మ. రా. శ్రీ. ఉప్పలూరు భద్రయ్యగారు
,, డి. రాజశేఖరకవిసింహులుగారు, శతావధానులు
,, ఆర్ గోవిందరావుగారు బి. ఏ., తహశీల్ దారు
,, సి. యస్. కృష్ణమాచార్యులుగారు, బి. ఏ., బి. ఎల్.

## రా జం పే ట.

,, ఆర్కాటు పరశురామరావుగారు, యస్. యల్. సి. కింద
,, నూకల వేంకటసుబ్బయ్యగారు, అప్పయరాజుపేట[గ్రా]రు
,, పిడతల చిన్న వేంకటసుబ్బయ్యగారు, పెనగలూరు
,, అచ్యుతన్న రామచంద్రరావుగారు, టంగుటూరు
,, మంచి వీరరాఘవయ్యగారు, మందపల్లె
,, ఏచూరు. చెంచుసుబ్బయ్యగారు, శేషమాంబాపురము
,, పుట్టా నాగసుబ్బయ్యశాస్త్రిగారు, చిట్టివేలు
,, గాలా వేంకటరెడ్డిగారు పాటూరు గ్రామమునిసిఫు.
,, జి. సుందరరావుగారు, బి. ఏ., ప్లీడరు.

## సి ద్ధ వ ట ము.

వల్లా చెంచుపావిరెడ్డిగారు, చంద్రపల్లి గ్రామమునిసిఫ్
,, గోపవరము గోపాలరెడ్డిగారు, గోపవరము గ్రామమునిసిఫ్
,, యూదాళ్ల వేంకటరామయ్యశాస్త్రిగారు, చిన్నపురెడ్డిపల్లి

## రా య చో టి.

,, కోట బాలయ్యకుమారుఁడు సుబ్బయ్యశాస్త్రిగారు, నీలకంఠరావుపేట.
,, రేవులూరు సిద్ధయ్యశాస్త్రిగారు, కస్తూరివారిపల్లె
,, చిన్నబయ్యన్నగారిలక్ష్మన్నగారు, ఎఱ్ఱదొడ్డిపల్లె
,, కుర్నూతుల వేంకటరమణయ్యగారు, లక్కిరెడ్డిపల్లె
,, పర్వతరాజు వేంకటరమణయ్యగారు, సూలికేడు
,, పుల్లగూర బాలసుబ్బయ్యపుత్త్రకుమారుఁడు పిచ్చయ్యశాస్త్రిగారు, నీలకంఠరావుపేట;

## అనంతపురము మండలము, హిందూపురము.

మ. రా. శ్రీ. కరణము కృష్ణరావుగారు, జేవినహళ్లి.
,, శ్రీరామగిమ్మయ్యశ్రేష్ఠిగారు, ,,
,, పెద్ద నరసప్పగారి హనుమంతుగారు, నక్కలహళ్లి
,, రెడ్డిపల్లె అప్పారావుగారు, కొడిగిపల్లె
,, ఈడిగి అంజనప్పగారు, జేవినహళ్లి
,, బి. నారాయణరావుగారు, బ్యాడిగెర,మడకశిరతాలూకా
,, దొంతి భీమయ్యగారు, హిందూపురము
,, కట్టా అయ్యగారి గుండయ్యశ్రేష్ఠిగారు
,, మూకము సీనయ్యగారి నారాయణయ్యశ్రేష్ఠిగారు
,, నేగు బుచ్చయ్యశ్రేష్ఠిగారు
,, గోరంట్ల వెంకటేశయ్య శ్రేష్ఠిగారు
,, ఆర్. వెంకటేశయ్యశ్రేష్ఠిగారు
,, పొచ్చి శెట్టి ఆదినారాయణయ్యశ్రేష్ఠిగారు
,, కట్టా శ్రీనివాసయ్యశ్రేష్ఠిగారు

### అనంతపురము.

,, వెలమగూరు ఆత్మారామప్పగారు, పినాకినీముద్రాక్షరశాలాధికారులు
,, హట్టి శివరావుగారు, ప్లీడరు
,, పులమతి ఆదిమూర్తిరావుగారు, ప్లీడరు
,, జి. భద్రయ్యశ్రేష్ఠిగారు
,, జి. రామయ్యశ్రేష్ఠిగారు
,, బి. వెంకటప్పగారు
,, వి. టి. కృష్ణారెడ్డిగారు, గ్రామమునిసీఫ్
,, వి. ఓబులేశప్పగారు.
,, కొమూరుపల్లె వెంకటరావుగారు, అనుంపల్లె
,, రాచర్ల తిప్పయ్యగారు, బెస్తూప
,, రాధాకృష్ణయ్యగారు ,,

మ. రా. శ్రీ. జి. రామేశ్వరరావుగారు, బి.ఏ., బి.ఎల్., అడ్వకేటు
,, టి. వెంగల్వరాయశ్రేష్ఠిగారు, ప్లీడరు.
,, కంబదూరు రామదాసరావుగారు,బి.ఏ.,బి.ఎల్.,అడ్వకేటు
,, మానెంపల్లి నారాయణరావుగారు, బి.ఏ., బి.ఎల్.,
,, సింగనమల శ్రీనివాసులుగారు, బి. ఏ., ప్లీడరు
,, హారేసముద్రము శేషగిరిరావుగారు, ప్లీడరు
,, అంగదహాళ్లి కృష్ణమూర్తిరావుగారు [illegible]
,, నాగరాజు అశ్వత్థమయ్యగారు రామలింగాయనపల్లి [illegible]
,, ఆళ్లగడ్డ రామచంద్రప్పశ్రేష్ఠిగారు

గుత్తి.

,, యన్. సుబ్బరావుగారు, బి. ఏ., ప్లీడర్
,, వై. శేషప్పగారు, ప్లీడరు
,, వై. కొండలరావుగారు
,, సి. సుందరరామయ్యగారు, మునిసిపుకోర్టు
,, ఆర్కాటు గుండురావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, సిద్ధవరము వేంకటసుబ్బయ్యగారు, బి. ఏ., ప్లీడరు
,, కోవూరు వేంకటరావుగారు, పెన్షనర్
,, నిట్టూరు లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ., ప్లీడరు
,, తరిమెల సుబ్బారెడ్డిగారు, తరిమెల
,, జంబులపాడు పెద్దవెంకటప్పగారు, ధర్మపురి
,, కాన్గోవి, కృష్ణమూర్తిరావుగారు, రివిన్యూ ఇన్‌స్పెక్టరు
(ఇప్పటినివాసము అపురు.)
,, మొలకతాళ్ల చిన్నపుల్లయ్యగారు, గాండ్లపాడు

బళ్లారి మండలము.

,, విట్టా శేషప్పశ్రేష్ఠిగారు, ప్రజాసంఘ కార్యదర్శులు.
,, రావుసాహెబు, జే. పాపయ్యశ్రేష్ఠిగారు
,, అయ్యగారిబుస్సెట్టిగారు
,, వి. భీమరావుగారు, వ్యాపారస్థులు, ఆదవాని.

మ. రా. శ్రీ. దేశిరాజు సత్యనారాయణమూర్తిగారు, కగణము పెద్దపట్టగ్రామము
,, పెద్దిరెడ్డి రామరావుగారు, కైకవరము

విశాఖపట్టణమండలము.

,, మాడుగుల వేంకటఅప్పారావుగారు
బొంతలకోడూరు

గంజాంమండలము.

,, పుల్లెల వేంకటరమణయ్యపంతులుగారు, ఇచ్ఛాపురము

నెల్లూరుమండలము.

,, వెలంపల్లె రామకృష్ణమ్మగారు, నెల్లూరు
,, ములుమూడి లక్ష్మీనరసింహాయ్యగారు
,, బొమ్మిశెట్టి లక్ష్మీనరసింహస్వామిశ్రేష్ఠిగారు
,, ఇడమకంటి వేంకటరామిరెడ్డిగారు, తాళ్లూరు
,, అల్లంపాటి పోలిరెడ్డిగారు, మంగుపల్లె
,, పత్తి గురుమూర్తిశ్రేష్ఠిగారు, గుల్లూరు
,, పువ్వాడ సుబ్బరాయశ్రేష్ఠిగారు, చిన్నబజారు
,, అన్నలూరు చిన్నచెన్నప్పనాయుండుగారు, ఎనమదలగ్రామ
మునిసిపు, తూర్పుకంభంపాడు
,, గట్టుపల్లి రామబ్రహ్మముగారు, వేంకటగిరి

చెన్నపురము.

,, వి. యన్. నరసింహాచార్యులుగారు, బి. ఏ., బి. ఏల్.,
,, కట్టా జోగయ్యగారు
,, వాకాటి కృష్ణయ్యశ్రేష్ఠిగారు, ఆచెప్పనాయకవీధి

చిత్తూరుజిల్లా.

,, జే. కృష్ణరావుపంతులుగారు, బీ.ఏ., అడ్వకేట్, చిత్తూరు.
,, పి. వి. చెన్నరాయశ్రేష్ఠిగారు, వాయల్పాడు
,, అయ్యాదొర నాయుండుగారు, పుత్తూరు.

నైజాము - కమ్మంమెట్టు.

,, జములాపురపు వేంకటేశ్వరరావుగారు, వకీలు.

# విషయసూచిక.

శ్రీరస్తు.

# శ్రీకృష్ణావతారతత్త్వము

## పదునొకండవప్రకరణము.

---

శ్లో. "వక్షఃస్థలే చ విపులం నయనోత్పలే చ
మందస్మితే చ మృదులం మదజల్పితే చ,
బింబాధరే చ మధురం మురలీరవే చ
బాలం విలాసనిధిమాకలయే కదా ను. ౬౬

బాలోఽయమాలోలవిలోచనేన
వక్త్రేణ చిత్రీకృతదిఙ్ముఖేన,
వేషేణ ఘోషోచితభూషణేన
ముగ్ధేన దుగ్ధే నయనోత్సవం నః. ౬౭

పశుపాలబాలపరిషద్విభూషణం
శిశురేష శీతలవిలోలలోచనః,
మృదులస్మితార్ద్రవదనేందుసంపదా
మదయన్మదీయహృదయం విగాహతే. ౭౧

ధేనుపాలదయితాస్తనస్థలీధన్యకుంకుమసనాథకాంతయే,
వేణుగీతగతిమూలవేధసే తేజసే తదిదమాం నమో నమః.

సోఽయం మునీంద్రజనమానసతాపహారీ
సోఽయం మదవ్రజవధూవసనాపహారీ,

సోఽయం తృతీయభువనేశ్వరదర్పహారీ
సోఽయం మదీయహృదయాంబురుహాధిహారీ (1)
సముచ్ఛ్వసితయౌవనం తరళశైశవాలంకృతం
మదచ్ఛురితలోచనం మదనముగ్ధహాసామృతమ్,
ప్రతిక్షణవిలోభనం ప్రణయపీతవంశీముఖం
జగత్త్రయవిమోహనం జయతి మామకం జీవితమ్." (2)

శ్రీకృష్ణకర్ణామృతేషు

మహాశయులారా! సత్యాన్వేషణతత్పరులారా! శ్రీకృష్ణావతారతత్త్వమునందుఁ బదవప్రకరణమును బఠించితిరి. అందు శ్రీకృష్ణపరమాత్మ యొనరించిన యమానుషకృత్యములు గలగాథలు పెక్కులు గలవు. వానిం బఠించుటచే మీకు నమితానందనము గలిగియుండును. భగవద్గాథలు సకలసంతాపహారకములు శాశ్వతానందసంధాయకములుకదా. అట్టి పరమపావనగాథ లెట్టివారికే నానందమును గలిగించునని నీరసమనస్కుఁ రసముగల మీమాట చెప్పనేల? దీనావన మనుపేరు ప్రకరణమునకుఁ దగియున్నదని మీ రూహించియుందురు. వానిని బరిశీలనమాలోచింపఁగా నానామ మర్థానికిఁ దగియేయున్నది. అందుఁ గల ధన్యోపాఖ్యాన మద్భుతముకదా. అందలిభావ మెఱింగినవారే ధన్యులు. వాసుదేవమాహాత్మ్యము, అర్జునగర్వభంగము, శ్రీకృష్ణమహత్త్వము, ఉషాకన్యాచరిత్రము, ఉషావివాహము, ద్వారకానగరమున సాగుట, శ్రీకృష్ణమూర్తి తపస్సు చేయుట, శివుఁడు ప్రత్యక్షముకాఁగా హరి యాతని స్తుతించుట, శివుఁడు హరికి వరములొసంగుట, మార్కండేయునకు శ్రీకృష్ణుఁడు శివలింగమహిమమును దెల్పుట, షోడశసహస్ర

స్త్రీలయిండ్లనున్న హరిని నారదుండు దెలియుంగుట, కుచేలోపా
ఖ్యానము, హరి వసుదేవునకు జ్ఞానోపదేశముఁ జేయుట, మృ
తపుత్త్రులం దెచ్చి కృష్ణబలరాములు దేవకికిఁ గనబఱచుట, శ్రుతి
గీతలు, భృగుముని త్రిమూర్తులప్రాశస్త్యమును శోధింపఁ
బోవుట, శ్రీకృష్ణనిర్యాణము, కష్టపెట్టఁబూనిన కౌరవులకు
హరి విశ్వరూపమును గనఁబఱచుట యను లీలలోనగు గాథ
లీప్రకరణమున ముఖ్యములు. అందు: కృష్ణుఁడు తపస్సుచే
యుట శ్రుతిగీతలు అనునవి ముఖ్యతమములు. శ్రుతిగీతలు
వ్రాయునపుడు వానియంతరార్థ మిదియని నావ్రాసినది పరిశీ
లింపఁదగినది. కాని యాయర్థము ప్రధానమని భక్తులూహింతు
రనియే నావిశ్వాసము. మఱియు శ్రుతిగీతలం జదువునపుడు
వానిధోరణింబట్టి యాలోచింపఁగా నట్టివారికి భగవద్భక్తి
తోడ్పాటు చూపునేని యాయర్థమే సత్యమనియుఁ దోఁపక
పోదు శ్రీకృష్ణుఁడు శంకరుంగూర్చి తపమొనరింపఁ గైలాస
మునకుఁ బోయెను శివుఁడు ప్రత్యక్షమై వరము లొసంగెను.
అన్నకథను విన్నయంతనే యులికిపడువారు లేకపోలేదు. మహా
త్ములెందరో యట్టివారు కలరు. ఈకథ కూర్మపురాణమునందు
గలదు. ఆయులికిపడుమహానుభావులు కూర్మపురాణమున నీకథ
గలదనఁగానే కొంత యూఱటఁ జెందుదురు. అది తామసపు
రాణమని, యందలికథలు రాక్షసులులోనగు తామసులకుఁ
గల్పింపఁబడినవనియు వారితాత్పర్యము. కాని యిట్టి విషయ
ములు హరివంశమునందును గలవు. అపుడు వానినిగూడఁ
దప్పనజాలుదురా. అనలేరు కాని నడుమ నెవ్వరో కల్పించి యం
దుఁ జొప్పించిరనియు వారనుదురు. పాపము! పాపము! వారి

మనస్సున నెంత భేదతమస్సావరించియున్నదో తెలియ శక్యము కాదు. విష్ణుపురాణము పురాణవర్యమని వారెన్నుదురు. సాత్త్వికపురాణమనియు వానిని వాడుదురు. అందునుగూడ,

"త్వయా యదభయం దత్తం తద్దత్తమభయం మయా,
మత్తో విభిన్నమాత్మానం ద్రష్టుమర్హసి శంకర. ౫౦
యోఽహం సత్వం జగచ్చేదం సదేవాసురమానుషం,
అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదృష్టయః" ౫౧
౫ అం. ౩౩ అధ్యా.

నీశ్లోకములు గలవు. విష్ణువాక్యములుగా నివి యందున్నవి. శంకరా నీకు నాకును భేదమే లేదనియు భేదముగల దనువారవిద్యామోహితాత్ములనియు విష్ణువు పల్కెను. ఇప్పుడు వారేమనఁగలరు? ఆవిష్ణువు మావిష్ణువుగాఁడనవలయునేతప్ప ఏలు వాక్కున కవకాశము చాలదు.

"అహం త్వం సర్వగో దేవ త్వమేవాహం జనార్దన,
ఆవయోరంతరం నాస్తి శబ్దైరర్థైర్జగత్పతే.
నామాని తవ గోవింద యాని లోకే మహాంతి చ,
తాన్యేవ మమ నామాని నాత్ర కార్యా విచారణా."
హరివంశము.

అని హరివంశమునఁ గలదు. హరివంశముకూడ శివవిష్ణుభేదము తప్పని బోధించుచున్నయది. ఏపురాణమునందు నేభారతభాగములయందుఁ బరికించినను శివనారాయణాభేదమే స్పష్టమగును. ఇటులుండ శివ యన్నంతనే వారికిట్టియులికిపాటేటికో తెలియఁజాలకయున్నాఁడను. ఇట్టి విష్ణుద్వేషులుకూడఁ గొం

యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౨౩
ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహం,
సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః." ౨౪
గీత ౩ అ.

అను నీగీతావాక్యములు పైయర్థమును దృఢపఱచుచున్నవి.

ఇట్లు లోకహితార్థము ధర్మమును స్థాపించి యధర్మము నున్మూలింప శ్రీకృష్ణుఁ డవతరించి విచిత్రకార్యము లొనరించె నవి మానవసాధ్యములా యని ప్రశ్నించు టవివేకమూలమను టకంటె నింకేమనవలయును? సర్వేశ్వరుని యనంతశక్తి నెఱుంగకపోవుట యటుండఁగాఁ దచ్ఛక్తిని సామాన్యమానవశక్తితోఁ బోల్చి తూలనాడుట కేవల పాపజనకకార్యము. ఎన్నిజన్మములయందో యత్యంతనిష్ఠమై తపమొనరించినవారుకూడ భగవన్మహాత్వము నెఱుంగఁజాల మనుచుండ నల్పమతు లెఱిఁగి నట్లు నటించుట పరిహాసపాత్రకార్యముగాక మఱేమిటి? సాధుమతు లట్టిదుర్వాదముల నాలకింపక భగవత్కార్యములను స్మరించుచు నదియే నియతతప స్సనుకొనుచుండవలయు. దాన నహంకారము తొలఁగు. శాంత మలవడు. దానిచే భగవన్మహిమము నుంతయే నెఱుఁగదరంబగు. అద్దానిచే భగవత్ప్రీతికిఁ బాత్రులగుదురు. కావున నట్టిపరాత్పరుని దివ్యగాథల నికఁ జదువుదము. ఆమహాత్ముని దివ్యబోధామృతసారముఁ గ్రోలుదము. అయ్యది మనయాధివ్యాధులఁ దొలఁగించు. భక్తిని గుదురుకొల్పును. అయ్యది యిహాముత్రఫలముల నొడఁగూర్పఁ జాలును, మహాశయులారా! ఈ ప్రకరణమునఁ బరాత్పరుఁడు

దివ్యబోధముల నొనరించును. తాను సర్వకర్మసాక్షిమాత్రుఁ
డుగ నుండి యాయావ్యక్తులచే నాయా కార్యములఁ జేయిం
చును తా సర్వసాక్షియని వారికెల్లఁ దెలియంజేయును. వా
రింతక రెఱుంగఁజాలకున్నఁ జక్కఁగా నెఱింగించును. ఆ
దివ్యచారిత్రమును బఠింతము. ఇఁక నామహాకార్యమునను శ్రద్ధ
వహింపుఁడు. సర్వేశ్వరానుగ్రహము తప్పక కలుగును. ఇఁకఁ
గథ వినుఁడు.

శ్రీకృష్ణుఁడు రాయబారముపోయి ధార్తరాష్ట్రులకడ
వలయుతంత్రములు నడిపి కర్ణునితో మాటలాడి యతని మనో
భావమును దెలిసికొని సాత్యకికృతవర్మలఁగూడి యుపప్లావ్యం
బునఁ బాండవులం గలిసికొనియె. కౌరవసభావిశేషములఁ దేట
తెల్లముగా నెఱింగించెను. సంధిపొసంగదనియు, యుద్ధము
తప్పక సాగవలయుననియు, మనుష్యుల వధించుట యుద్ధకాల
మున నందును నీసమయమున నించుకేనియుఁ బాపము కాదని
యుఁ దెలిపెను. విజయము ధర్మము నాశ్రయించియుండునని
యుఁ జెప్పెను. సేనాసన్నాహము చేయవలయుననియు హెచ్చ
రించెను. ఈయుద్ధమునకుఁ గురుక్షేత్రము తగియున్నదనియు
నుపదేశించెను. కురుక్షేత్రము భరతఖండమునఁగల సుక్షేత్రము
ల నుత్తమోత్తమము. అందు యుద్ధముసాగినమేలని శ్రీహరిభా
వము. సరస్సులు పెక్కులుగలవు. తరుషండమండితమా క్షేత్రమ
నుట సుప్రసిద్ధమే. అట్టితావు యుద్ధమునకుఁ దగినది. అందు మృతి
నొందఁదగుజీవులు పెక్కండ్రుగలరని భగవంతుఁ డెఱుంగును.
ఏచోట నేదేహి మృతినొందవలయునో ఆచోటున కాదేహిని
విధి యీడ్చుకొనిపోవును. కర్మానుసారముగా నచ్చట మృతి

గాంచఁదగువారెల్లఁ జేరుదురు. మన మిందఱ మిందు నే[illegible]
జేరుచున్నామని యొక్కరుకూడ నాలోచింపరు. బలవ[illegible]
మగుకర్మము వారి కాయూహ పుట్టనీయదు. మహా[illegible]
మున నచ్చటికిం బొడ్లికిం బోవున ట్లరుగుదురు. సంఘాతమర
ణము మనలో నెవ్వరికిఁగలదో యని యెఱుంగఁగోరువా[illegible]
లేరు. ఏయూహ చేయఁదగునో దానిని మానుదురు. [illegible]
లున కేది ముఖ్యమనియు నాలోచింపరు. ఇట్టివారు [illegible]
మేలొనఁగూర్ప నెట్లు సమర్థు లగుదురు "స్వయం తీర్ణాః పరా
తారయంతి" అన్న నానుడి యంద తెలుంగుదురు. ము[illegible]
ట్టిదని స్వానుభవమున నెఱింగినవారు మరల వచ్చి పామరుల
నచ్చటికిం బిలుచుకొనిపోవుట[illegible]ండె, యీమార్గమునఁబో[illegible]
ముక్తిమండపద్వార మగుపడునని తెలుపుట[illegible]ండె సాగినట్లు
చెప్ప వలనుపడదు. చిలుకలపలుకులువలె నాయాగ్రంథము
లనుండి ప్రమాణములుచూపుటకు మహాత్ములేల కావలయు
ను? అది సామాన్యవిద్యావంతుఁడును చేయఁగలఁడు. దీనిం
బట్టిచూడఁగా ముక్తులు దేశికులుగా దొరకుట కడునరిది యని
స్ఫురించును. ఒక్కభగవంతున కీకార్యము సులభతమము. ఆ
మహనీయమూర్తియే కపిలాదిరూపములఁదోఁచి ముక్తిమార్గ
మిద్దియని యుపదేశించినట్లు పురాణములు తెలుపుచున్నవి. ఆ
పరమపురుషుఁడే శ్రీకృష్ణనామమున నిపు డవతరించి భూభార
మును హరింపఁ దలంపుఁగొన్నవాఁడు. అతఁ డెఱుంగనివిషయ
ము లేవి యుండును? సర్వజ్ఞుఁడు కదా శ్రీహరి.సర్వకర్తయునగు
కాఁబట్టియే కురుక్షేత్రమున మృతినొంది వీరస్వర్గము నలంక
రింపఁదగినవా రెందరో యందఱే యీమహాసంగ్రామమునఁ

చేయుదురు. వారితోడి కష్టముల ననుభవింపఁదగినవారు మఱికొందఱు చేయుదురు. మానవులుగాక తిర్యగ్జంతువులు చేరును. ఈదేహధారు లందఱు అనేకవిధకర్మములను గొంచెము గనో గొప్పగనో చేసియుందురు. ఆఫలమును గలిసి యనేకవిధముల ననుభవింతురు. దానిని దప్పింపఁ దరముగాదు. ఇన్నియు నూహించియే యీశ్వరుఁడు కురుక్షేత్రమున యుద్ధక్రతువు చేయఁ బ్రారంభించెను. వీరులరక్తమాంసములం బీల్ప ననేక కంకగృధ్రాదు లుత్పన్నంబు లయ్యెను. సర్వపరికరములు సిద్ధము లయ్యెను. రాజకుమారులెల్ల యుద్ధమునకుఁ బెండ్లికిం బోవునట్లు పోవసాగిరి. పిలువకపోయినను మేము మేమని కౌరవపాండవుల పక్షముల నొక్కటఁ జేరుచుండిరి. ప్రతిపక్షవీరుల నాశనము చేయఁ గంకణముకట్టుకొని శపథములు పలుకుచుండిరి.

మృత్యువు ప[illegible]సంహారము విస్తృతము గావించి నిలుచుండ నందఱు అందు జొచ్చిరి. అదియే ఘోరసంగ్రామరంగము. కర్మములు దృఢతమపాశముల మెడలకుందగిలించి యొక్కొక్కరు నీడ్చుకొనిపోవుచుండ నావక్త్రబిలంబున వశులై ప్రవేశించుచు వేఱొకరునిఁ జంపఁ బ్రయత్నించుచుండుటకంటె విచిత్రవృత్తాంత మేమియున్నది? తాను కర్తనని విఱ్ఱవీఁగుట నైజమైనది. అంతియగాని కర్మము ననుసరించి ఫలము లందఁ గలవనియుఁ దాన వశుఁడై వాని ననుభవింపక తప్పదనియు నూహించువారు లేరు. అదియే విధిబలవత్తరమనుట కుదాహరణము. ఈవిషయమెల్లఁ జక్కఁగా నాలోచించినచో సంసారవ్యామోహము నశించుననుట యొకయబ్బురమా?

ఎవ్వారేని ప్రతిదిన మీవిషయము స్మరించువారు గలరా
యన్న దుర్లభమే యనవలయును. అట్టివారుండిన జగత్తు మిథ్య
గాఁదోఁచుట సులభ మనవలయు. ఇట్టిసిద్ధాంతములఁ బల
పఱచుకొని భారతయుద్ధము చదువవలయునుగాని యెవ్వ
రెవ్వ రెన్నెన్ని బాణములం బ్రయోగించిరనికాని యెవ్వరికి
లక్ష్యమం దెక్కువగ శుద్ధిగలదనికాని యూహించుచుఁ జదువ
రాదు. అది వ్యర్థకాలక్షేపమువంటి దగును. ఒక్కయుద్ధరంగ
మును గుఱించినగ్రంథమును జదువునపుడు దానివలని యుప
యోగములు లోనగువాని నేర్చుకొనవలయును. విశేషజ్ఞా
నము సంపాదింపనది యవకాశమిచ్చును. దానినుండి యనేక
సంశయములఁ దీర్చుకొన నవకాశము కలదు. అట్టియుద్ధమునే
మీరిప్పుడు చదువఁబోవునది. అందులకు భగవంతుఁడు కర్తయై
యుండును. ఆయుద్ధభూమియందే మానవులకు సకలధర్మముల
నుపదేశించును. అవియే భగవద్గీత లనంబడును, సర్వోపనిష
త్సారములై యవి యుండును.

మహాశయులారా! కృష్ణావతారమునకు ఫలముగా
నున్నవిషయముల ననేకములను మీరీప్రకరణమునఁ జదువఁ
గలరు. ఇతరావతారములయం దిట్టివి కానరావు. తాను గార్య
ముచేయుటయే. కృష్ణావతారమునందన్ననో తాఁ జేయుట,
యితరులచేఁ జేయించుట, అవిచాలక సకలధర్మములఁ దా నుప
దేశించుట యను నిన్నియు విశేషములు. కావున మీరీప్రక
రణమును శ్రద్ధాభక్తులతోఁ బఠింపవలసియుండును. నాస్తిక
లయు, ఆస్తికాభాసులయు మాటలఁ బాటింపరాదు. అవి
సంసారకూపమున ముంచునవి. అలసులు పరమపురుషార్థవిదు

రింపను. ఇది నిశ్చితము. నాకడ వీరాగ్రేసరులు పెక్కండ్రు కలరు. వారు యుద్ధమొనరింతురు. నన్నొకరు గోరికొనుఁడు. ఆవీరుల నొక్కరు గోరికొనుఁడు. మీయిద్దఱియందును నరుఁడు చిన్నవాఁడు. లోకాచారమును బాటించి యీభాగములలో మొదటఁ గోరఁదగినవాఁడు బాలుఁడు కాన నర్జునుఁడు తొలుత గోరుకొనందగును. అనుటయుఁ బాండవమధ్యముఁ డావాక్యాలమృతధారలుగా నుండ సంతసించి మహాత్మా! నీవు నాపక్షమున నుండుమని వేఁడెను. హరి యల్ల నవ్వి యర్జునా! నే నాయుధములఁ దాల్పననుట మఱువలేదుకదా యని యడుగ మహాత్మా! మఱువలేదు. నిరాయుధుఁడవగు నీసహాయమే నాకుఁ గావలయుననియె. దుర్యోధనుఁ డర్జునుఁడు తెలివి తక్కువయగుటచే నట్లు కోరెనని తలంచుచు జ్ఞానహీనుఁడు కానఁ బెక్కండ్రవీరులం గోరుకొనియెను. భగవంతుఁ డందుల కానందించెను ఇరువురును బలరాముని నట్లే ప్రార్థించిరి. యుద్ధముచేయ నొల్లనని వారివేఁడికోలు నతఁడు నిరాకరించెను. వారు మరలి తమతమపురంబుల కరిగిరి.

శ్రీకృష్ణానుమతిని బాండవులు కురుక్షేత్రమున కరిగిరి కదా. అందు సర్వస్థలమున శిబిరముల నాయత్తపఱచుకొని యుండిరి. దృష్టద్యుమ్నుఁడు సర్వసేనాధిపతిగా నిర్ణయింపఁబడియె. తక్కినవా రెందరో తమతమసేనల కధిపతులై యుండిరి. ఏడక్షౌహిణులసేన పాండవపక్షమునఁ బోరాడ సంసిద్ధముగ నుండెను. పదునొకండక్షౌహిణులసేన కౌరవపక్షమునఁ బాండవుల నెదుర్కొన సంసిద్ధమయ్యెను. ఈపదునెనిమిదక్షౌహిణులసేనయు నాకురుక్షేత్రమునఁ బోరవలసిన

రియే. వీరుంగాక పెక్కండ్రు సేవకులును నుండవలసినవారుగ
నుండిరి. అల్పసంఖ్యాకులతోఁ దక్కినవారెల్లఁ బ్రాణముల
నానగాంగమున గల్పించుటకు సంసిద్ధులైరి. ఆమరణప్రయ
త్నము మహోత్సాహముగా వారికిఁ దోఁచెను అట్లు తోఁచినఁ
గాని వారు మృతినొందఁ బ్రయత్నింతురా! విధిబలవత్తరము
నుట కింతకంటె నుదాహరణము వేఱొండు కావలయునా!
అన్నింటికంటెఁ బ్రాణములు ప్రధానములుగా నెంచఁబడునవి.
వానిని లెక్కసేయక పోవునంతటియుత్సాహమును గల్పించి
విధి బలవత్తరముకాదన్న నవివేకముకదా? త్రిప్పలను లోఁబ
డనివా రుండరనుట నిక్కము. ఆవిషయమే ముందు శ్రీకృష్ణు
నుపదేశములయందు మీరు చదువఁగలరు. ఆవిషయ మొక్క
దానిని గ్రహించినఁజాలును. దానిచే గర్వము నశించును.
తాను గర్తనన్న యజ్ఞానము తొలంగును. సర్వమునకు భగవం
తుఁడే కర్తయన్న జ్ఞానము పొడసూపును. దానికంటెఁ గావల
సిన దేమున్నది? ఆయహంకారము నశించి యాజ్ఞానము కలుగు
టకే యిన్ని శాస్త్రములు ఇన్ని పురాణములు పుట్టినవి. ఇన్ని యు
న్నను బ్రత్యక్షానుమానములఁ దెలియుచున్నను స్వకర్తృత్వ
మునసే సకలకార్యములు సాగుచున్నవని వాదించువారి
ప్రాక్కర్మమునుగూర్చి మన మేమనవలయు? వారివిచారము
మానుటయే యుత్తమము. ఆయుద్ధప్రయత్నమున నెల్లరు
పెండ్లికిం బోవునట్లుండిరి. వీరాలాపముల కించుకంతయుఁ
గొఱంతలేదు. ఒక్కరిమోమునన్నను దైన్యము కానరాదు.
నిరుత్సాహ మనున దెందుండునో తెలియఁదరముకాదు. సర్వా
లంకృతుల శరీరము లలరారుచుండెను. కురుక్షేత్ర మంతయుఁ

జూచు ఖేచరుల కాశ్చర్యమును గల్గించుచుండెను. మృత్యు దేవతవక్త్రబిలము తెఱచుకొనియుండెను. ఆవక్త్రకుహరమునఁ బ్రవేశింపఁ బ్రాణులు పెక్కండ్రు సిద్ధముగా నుండిరి. ఈమహా క్షోభకార్యమును జూడఁజాలక యందున్న మహాత్ము [illegible] చోటికిం బోయిరి. భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు సర్వసాక్షి గావున నించుకయు నచ్చెరువందక త్వరపడక యెల్లవారల కుల్లాసమును గల్గించుచుండెను.

కౌరవులును యుద్ధసన్నాహవిశేషముల నొనరించుచుండిరి. సర్వసేనాధిపతి భీష్ముఁడయ్యెను. తక్కినవారెల్లఁ [illegible] సేనల కధినాథులుగ నుండిరి. భీష్మద్రోణులు కృపాశ్వత్థామలు ధర్మపక్షపాతముగాని దుర్యోధనునకు హిత ముపదేశించిరి. విదురుఁడు విశేషించి దుర్యోధనునకుంగాక ధృతరా ష్ట్రునకు నుపదేశించెను గాని యాధర్మవాక్యములు విధిప్రేరితు లగుట వారి కించుకంతయు రుచింపదయ్యెను. మృత్యువు లాగుచుండఁగా నితరుల ప్రయత్నములు వారికి నడ్డుపెట్టఁగల వా? ధృతరాష్ట్రుఁడుమాత్రమే కొంతమున విదురునితో మంచి మాటలాడినను కొడుకువచ్చినపుడు వానిమాటలకే లోఁబడు చుండెను. నీతివాక్యము లట్టితరుణమున నేమాత్రము పనికిరావు. విధి యనుకూలించినపుడే హితము మంచిదిగాఁ దోఁచును. కావునఁ బ్రతిమానవుఁడు విధి బలవత్తరమని నమ్మవలయును.

కురుక్షేత్రమున యుద్ధముచేయువారుగా నిరుదెగల వార నంగీకరించి యందు శిబిరముల నిర్మించుకొనిరి. సంజ యుండు ధృతరాష్ట్రున కెన్నిరీతుల యుద్ధము మేలుగా దని నిరూపించిచెప్పెను. ధృతరాష్ట్రుఁ డందుల కించుక నిర్వే

దమెంతి కొడుకుదుర్వినయంబునకుఁ జింతించుచు సంజయుఁడు గానుమాత్రమే యుండెను. ఆసమయమునఁ ద్రికాలవేత్తయగు వ్యాసముని యరుదెంచెను. పూజితుఁడై ధృతరాష్ట్రు నుద్దేశించి,

"రాజన్ పరీతకాలాస్తే పుత్రాశ్చాన్యేచ పార్థివాః,
తేషాం సంతీవ సంగ్రామే సమాసాద్యేతరేతరమ్. ౪
తేషు కాలపరీతేషు వినశ్యత్స్వేవ భారత,
కాలచక్రం సమాజ్ఞాయ మాస్మ శోకే మనః కృథాః. ౫
యది చేచ్ఛసి సంగ్రామే ద్రష్టుమేతాన్విశాం పతే,
చక్షుర్దదామి తే పుత్ర యుద్ధం తత్ర నిశామయ. ౬

ధృతరాష్ట్రః—
న రోచయే జ్ఞాతివధం ద్రష్టుం బ్రహ్మర్షిసత్తమ,
యుద్ధమేతత్త్వశేషేణ శృణుయాం తవ తేజసా. ౭
ఏతస్మిన్నేచ్ఛతి ద్రష్టుం సంగ్రామం శ్రోతుమిచ్ఛతి,
వరాణామీశ్వరో దాతా సంజయాయ వరం దదౌ. ౮

వ్యాసః—
ఏష తే సంజయో రాజన్ యుద్ధమేతద్వదిష్యతి,
ప్రకాశం వాప్రకాశం వా దివా వా యది వా నిశి. ౯
మనసా చింతితమపి సర్వం వేత్స్యతి సంజయః,
నైనం శస్త్రాణి ఛేత్స్యంతి నైనం బాధిష్యతే శ్రమః." ౧౦

భీష్మపర్వము. ౨ అధ్యాయము.

అని మూలము. ధృతరాష్ట్రా! కాలమాసన్నమైనపుడు రాజులకాయుష్యము నిండినపుడు నీవు దుఃఖించి లాభము లేదు. ఈ

యుద్ధమును జూడఁగోరుదువేని దృష్టి నొసంగెదను. యుద్ధము తెలియఁగలదు. అని యడుగుటయు నాగ్రుష్టి రాజా మునీంద్రా! జ్ఞాతివధమును జూడఁజాలను ఈయుద్ధవార్తలనువరుసగా వినఁ గోరెదను. నీప్రభావమున నాకిట్టిలాభము కలుగుఁగాక. అని ధృతరాష్ట్రుఁడు పలుకఁగా సంజయునకు వ్యాసముని వరము లిచ్చెను. వ్యాసముని వరప్రదాతలయందు ఉత్తముఁడు. మునుల లో ముని. సృష్టికర్తలలో సృష్టికర్త. విద్వాంసులలో విద్వాం సుఁడు. కావుననే సంజయునివిషయమును దెలుపుచు రాజా! నావరప్రభావమున నీసంజయుఁడు సర్వ మెఱుంగఁగలండు. ప్రకాశమగు విషయముగాని రహస్యమగు విషయముగాని యీతఁ డెఱుంగఁజాలును. రేయింబవళ్లయందు సాగువృత్తి మీాతనికి గరతలామలక మగుచుండు. తుదకు నిసదెగలవా రిలో నెవ్వరుగాని మనస్సులలో నేమనుకొన్నను సంజయుఁడు తెలిసికొనఁగలఁడు. ఇంతియగాక యుద్ధరంగములఁ దిరుగు చున్నను శస్త్రములుగాని బ్రహ్మాస్త్రములోనగు నస్త్రవర్గములు గాని సంజయుని ఛేదింపఁజాలవు. దేహాయాసము నీతఁడు పొందఁజాలఁడు.ఇదియ నాయిచ్చువరము. దీనిచే నీతఁ డేయుద్ధ వార్తలనెల్లం దెలిసికొని చూచినవానిని మఱువకయుండి నీకుఁ దెల్పునపుడు కన్నులతోఁ జూచుచుఁ జెప్పుచున్నట్లే తెలు పును. కావున జరగినది జరగినట్లే నీవెఱుంగఁజాలుదువు. ఈతనికి దివ్యులయాలాపంబులరూపంబుల నూహలం దెలియఁజాలు నట్టి ప్రభావంబు గల్గించితి. రాజా! ఇది ప్రజాక్షయకాలము. దీని కెవ్వరును జింతించినను లాభము గలుగదు.

"న చైవ శక్యస్సంయంతుం యతో ధర్మస్తతో జయః."

దీని నాపఁజాలువారు లేకుందురా. ఏల యాపరాదు. అని యాలోచింపకు. ఎవ్వరికే నీపని యిప్పుడు శక్యముగాదు. ధర్మము జయించుననియు నధర్మము నశించుననియు నూహించి నిశ్చింత చిత్తుండవై యుండుము. నేను గురుపాండవులకీర్తిని జగంబునఁ జేటపడ విస్తరింతును. భూపాలా! కాలగతి నించుక యాలకింపుము. *ఎన్ని విధములఁ బరికించినను దుర్నిమిత్తములే

దుర్నిమిత్తములు.

*ఇహైవ చ నిమిత్తాని భయదాన్యుపలక్షయే, శ్యేనా గృధ్రాశ్చ కాకాశ్చ కంకాశ్చ సహితా బకైః. ౧౫. సంపతంతి ధ్వజాగ్రేషు సమవాయాంశ్చ కుర్వతే, అభ్యగ్రం చ ప్రపశ్యంతి యుద్ధమానందినో ద్విజాః. ౧౬. క్రవ్యాదా భక్షయిష్యంతి మాంసాని గజవాజినాం, కటాకటేతి వాశ్యంతో భైరవా భయవేదినః. ౧౭. కంకాః ప్రయాంతి మధ్యేన దక్షిణామభితో దిశం, ఉభే పూర్వాపరే సంధ్యే నిత్యం పశ్యామి భారత. ౧౮. ఉదయాస్తమనే సూర్యం కబంధైః పరివారితం, శ్వేతలోహితపర్యంతాః కృష్ణగ్రీవాస్సవిద్యుతః. ౧౯. త్రివర్ణాః పరిఘాసంధౌ భానుమంతమవారయన్, జ్వలితార్కేందునక్షత్రం నిర్విశేషదినక్షపమ్. ౨౦. అహోరాత్రం మయా దృష్టం తత్క్షయాయ భవిష్యతి, అలక్ష్యః ప్రభయా హీనః పౌర్ణమాస్యాం చ కార్తికే. ౨౧. చంద్రోఽభూదగ్నివర్ణశ్చ పద్మవర్ణే నభస్తలే, స్వప్స్యంతి నిహతా వీరా భూమిమావృత్య పార్థివాః. ౨౨. రాజానో రాజపుత్రాశ్చ శూరాః పరిఘబాహవః, అంతరిక్షే వరాహస్య వృషదంశస్య చోభయోః. ౨౩. ప్రణాదం యుధ్యతో రాత్రౌ రౌద్రం నిత్యం ప్రలక్షయే, దేవతాప్రతిమాశ్చైవ కంపంతి చ హసంతి చ. ౨౪. వమంతి రుధిరం చాస్యైస్స్విద్యంతి ప్రపతంతి చ,। అనాహతా దుందుభయః ప్రణదంతి విశాం పతే. ౨౫. అయుక్తాశ్చ ప్రవర్తంతే క్షత్రియాణాం మహా

కానంబడుచున్నవి. పశుపక్ష్యాదులచేష్టలుగూడ భయంకరములుగ నున్నవి. అవియివి యని నిర్ణయింపనేల! వినినంతన నవశకునములే. దుర్నిమిత్తములే. కావున ఘోరప్రళయము కలుగక తప్పదు. భూభారము తగ్గుకాలము వచ్చినది. కావున దానిని మనము నిలుపఁజాలము. కానున్నది కాకమానదు. దైవగతి మార్ప మనకు శక్యమా! సకలదేశములనుండును యోధులు యుద్ధముచేయ సంసిద్ధు లగుచున్నవారు. యుద్ధము భయంకరమని యెవ్వరికిని దోఁచకయున్నయది. మృత్యుపాశములం దగిలించి మృత్యువు వీరుల నీడ్చి తెచ్చుచున్నది. దాని కడ్డుపడఁజాలువా రెవ్వరు? కావున ధృతరాష్ట్రా! నిశ్చింతముగ నుండుము. సంజయునిమూలమున సకలవిషయముల నాలకింపుము. దుస్తరదుఃఖమునకుఁ జోటీయకుము. విధివశముగా సకలకార్యములు సాగునని యూహించుచుండుము. వలసినపుడు నన్నుం దలంపుము. నీదుఃఖశాంతి నొనరించెదను.

---

రథాః, కోకిలాశ్శతపత్రాశ్చ చాషాభాసాశ్శుకాస్తథా. ౨౬. సారసాశ్చ మయూరాశ్చ వాచో ముంచంతి దారుణాః, గృహీతశస్త్రాః క్రోశంతి చర్మిణో వాజిపృష్ఠగాః. ౨౭. అరుణోదయే ప్రదృశ్యంతే శతశశ్శలభవ్రజాః, ఉభే సంధ్యే ప్రకాశేతే దిశో దాహసమన్వితే. ౨౮. పర్జన్యః పాంసువర్షీ చ మాంసవర్షీ చ భారత, యా చైషా విశ్రుతా రాజంస్త్రైలోక్యే సాధుసమ్మతా. ౨౯. అరుంధతీ తయాప్యేష వసిష్ఠః పృష్ఠతః కృతః, రోహిణీం పీడయన్నేష స్థితో రాజన్ శనైశ్చరః. ౩౦. వ్యావృత్తం లక్ష్మ సోమస్య భవిష్యతి మహద్భయం, అనభ్రే చ మహాఘోరస్తనితశ్శ్రూయతే స్వనః. ౩౧. వాహానానాం చ రుదతాం నిపతంత్యశ్రుబిందవః.

భీష్మపర్వము. ౨ అధ్యా.

ఇపుడు తోఁచునిమిత్తములఁ బరికింపఁగా నీకొడుకులకు విజయము సమకూరుననితోఁపదు. కౌరవనికేతనంబులఁ బొగ లెగయుచున్నవి. ఆయుధములు మండుచున్నవి. ఇంకను పెక్కుదుర్నిమిత్తములు కానవచ్చుచున్నవి. కులక్షయమునకు నానాభూపాలనాశనంబునకు నుపేక్ష నూనియుండరాదు. నీకొడుకులు దుష్పథమునఁ బ్రవర్తించువారు. కావున వారిని నివారించి పాండురాజుపాలతనితమ్ములకిచ్చి శాంతి నెలకొల్పఁ బ్రయత్నింపుము. మానవప్రయత్నము చేయకయుండరాదు. అది ఫలించినను ఫలింపకున్నను మనదోషము కాదు. నీవీ ప్రయత్నముచేయుట మాకెల్లఁ గడుహితంబు. మావంటివారికి హితంబుగాని రాజ్యంబు నీకేటికి? అని పెక్కుతెఱంగుల సర్వమెఱింగియు లోకాచారముచొప్పున హిత ముపదేశించెను.

ధృతరాష్ట్రుఁ డాయుపదేశము నాలకించి మునీంద్రా! లోకహితమునుగోరి విశేషించి యీకురుకులాభివృద్ధింగోరి తమరుపదేశించితిరని యెఱుంగుదును. నేను నింతకుమున్నె నాకుమారునకీకార్యము మంచిదిగాదని నొక్కి పలికితిని. వాఁడు నాకు లొంగఁడు. నాశక్తిలేమి మీరెఱింగినదియే. నన్నీవిషయమునఁ దప్పులఁబట్టకుఁడు. కార్యము పాకము తప్పినది. నాకొడుకు నాపలుకుచేయక కర్ణశకునులమాటలనే యాదరించువాఁడు. నాయపరాధమిందేదియు లేదు.మహానుభావా! యుద్ధంబున జయచిహ్నములను వినఁగోరుదును. ఆనతీయుఁడీ! అన విని యాంబికేయునకు వ్యాసమహర్షి యిట్లు పలికెను. ఆంబికేయా! హోమకాలమున నగ్నులు ప్రదక్షిణార్చులు గలిగి పుణ్యగంధములుగ నుండుటయు, భేరీప్రముఖంబులు గంభీరఘోషంబు

లగుటయు, వాయువు లనుకూలగతులం దగియుంటయు నింక నిట్టి వనేకములగు నిమిత్తములు శుభచిహ్నములని యెఱుంగ వలయు. యుద్ధమున జయపరాజయములు దైవాధీనములు. వానికి వగవం బనిలేదు. ఇంక నేం బోయివచ్చెద. అని యంతర్ధానముచేసెను.

ధృతరాష్ట్రుం డంత సంజయునిదిక్కు మొగంబై సంజయా! వ్యాసమహాముని యాజ్ఞానుసారము నాకు యుద్ధప్రకారము చెప్పవలయును. ఇంక నీవు పోయిరమ్ము. వ్యాసవరప్రభావమున నీ కాసంగరమున నేబాధ లుండవు. సర్వము విదితమే యగుచుండును. పోయిరమ్ము. జరగినది జరగినట్లు చెప్పుము. అని యాజ్ఞాపింప సంజయుండరిగెను. అందుంగురుపాండవులుసమర ప్రయత్నములం గడువడిగ నొనరించిరి. అన్నియును సమకూరెను. కౌరవులపక్షమునం బదునొకం డక్షౌహిణులు చేరినవి. పాండవులపక్షమున నేం డక్షౌహిణులసైన్యము చేరెను. సేనాధిపతులు తమతమయోధులకుం బ్రోత్సాహము కలిగించుచుండిరి. వారును సమయ మెప్పుడు వచ్చునో యుద్ధమున నరివీరుల నెప్పుడు వేటాడువారమో యని వేచియుండిరి. శ్రీహరి తాను సర్వసాక్షియే కావునం గర్మబద్ధులగుజీవులయజ్ఞానమును దలంచూచుం దనయవతారఫలమును సాధింపం దలంచుచుండెను. ఒకరి నొకరు గెలువంబూనుయోధులం గాంచినప్పుడు, వారి యూహాల స్మరించినపుడు శ్రీహరి మందహాసము మోమున నాట్యమాడంజేయుచుండెను. తమరే స్వతంత్రులమని సాధింపం బూనుటకంటె నవివేకముగలదా యని యా శ్రీకృష్ణపరమాత్మ

భావము. ఆపదునెనిమి దక్షౌహిణులయం దొక్కండైనం దా నస్వతంత్రుండనని తలంచువాండు మందునకైన లేండు.

## పాండవకౌరవవీరులయుద్ధము.

మున్నే నిర్ణయించుకొనిన స్థలమునకు రెండుదెగల వారును దమతమసేనలతోం జేరిరి. సూర్యోదయము కాంగా వారెల్లం దదుచితకృత్యములందీర్చి యుద్ధోచితవేషములం దాల్చి తమతమసేనాధిపతులంగూడి వెడలి యాంచోటు చేరిరి. సర్వసేనాధిపతి భీష్ముండని కౌరవులెల్ల నిర్ణయించిరి. కాన నాతని యనుమతి ననుసరింప సేనాధిపతులు తమతమ బలములతో నాతనికడ కేగి తదనుజ్ఞంగొని వలసినచోట నిలిచిరి. పాండవులసేనలు సర్వసేనాధిపతి ధృష్టద్యుమ్నుని యాజ్ఞానుసారము నిలిచెను. ఇరుదెగలవారును గయ్యమున కాయత్తపడుచుండిరి. ధర్మరాజు ప్రతిపక్షబలములం గాంచి విషణ్ణుం డయ్యెను. అర్జునుం డాతనిం బ్రోత్సహించెను. కలంకదేఱి యాకృపామూర్తి యర్జునా! యుద్ధభారము నీదే యనియె. ఇట్లు తమ తమప్రయత్నములం దా రుండిరి.

భీష్ముండు తాను సర్వసేనాధిపతి గావున బలాధినాయకులను వీరయోధులను నియమించుటకు ముందు నిమీలితనేత్రుండై యించుక ధ్యానించి యిట్లు పలికెను.

శ్లో. "ఇదం వః క్షత్రియాద్వారం స్వర్గాయాపావృతంమహాత్,
గచ్ఛధ్వం తేన శక్రస్య బ్రహ్మణశ్చ సలోకతామ్.
ఏష వః శ్రుతిజః పంథాః పూర్వైః పూర్వతరైః కృతః,
సంభావయధ్వమాత్మానమవ్యగ్రమనసో యుధి.
నాభాగశ్చ యయాతిశ్చ మాంధాతా నహుషో నృగః,

సంసిద్ధాః పరమం స్థానం గతాః కర్మభిరీదృశైః. ౧౦
అధర్మః క్షత్రియస్యైష యద్వ్యాధిమరణం గృహే,
యదయోనిధనం యాతి సోఽస్య ధర్మస్సనాతనః." ౧౧
భీష్మపర్వము ౧౭ అధ్యా.

మ. "వినుఁడో క్షత్రియులార! క్షత్రియులకున్ విఖ్యాతధర్మం
బ ధ్యై,చను సంగ్రామ మిదెన్నఁగా వివృతమౌ స్వర్గంబు
ద్వారంబుదీ,నిని నాభాగయయాతిముఖ్యనృపతుల్ నిర్మించి
యిద్దానవే,చనిరింద్రాజముఖామరోత్తమ మహాస్థానంబులం
దుండఁగన్." (శ్రీకృష్ణభారతము.)

ఓక్షత్రియులారా! ఇదె మీకు నిర్ణయించిన స్వర్గద్వా
రము. ఇది యిపుడు తెఱవఁబడినది. చాలఁ బెద్దని ఈమార్గ
మునసే శక్రలోకమునకో బ్రహ్మలోకమునకో పోఁదగును.
ఈమార్గము మీకుంబూర్వులు వారికింబూర్వులు నిశ్చయించిన
సుప్రసిద్ధమార్గము. కలఁకబాఱని మనస్సుల మీరు కూడ
నామార్గమును గౌరవింపుఁడు. యుద్ధము చేయక యాత్రోవనఁ
బోరాదు. నాభాగుఁడు, యయాతి, మాంధాత, నహుషుఁడు,
నృగుఁడు లోనగుపూర్వరాజులు చక్కఁగా నీమార్గమునే
యాశ్రయించి పరమస్థానమును దీనిం బొందిరి. క్షత్రియుల
కింటు వ్యాధిమరణ మధర్మమని పెద్దలు వక్కాణించిరి. ఏమార్గ
మేజాతికి శుభ మొనఁగూర్చునో యామార్గము సనాతనమా
ర్గము అదియే సనాతనధర్మమని బోధించెను. వార లామాట
లాలకించి ధీరులై యామార్గమున స్వర్గద్వారమును జేరఁ
బూనిరి.

మహాశయులారా! ఇప్పట్టున నాల్గుమాటలు వ్రాయక తప్పదు. భీష్మునియుపదేశసారము చిత్తగింపుఁడు. ఎంత గంభీరార్థము గలదో పరికింపుఁడు. యుద్ధము సాగనున్నది. సకలశస్త్రాస్త్రధారులై వీరులు నిలిచియున్నవారు. ప్రాణముల నొప్పగింపఁదగుసమయ మది. సేనాధిపతి భీష్ముఁడు. సకలధర్మవేత్త. శాశ్వతబ్రహ్మచర్యనిష్ఠుఁడు. వసువు. కారణాంతరమున మానవలోకమునఁ బుట్టువుంగాంచెను. భగవద్భక్తశిరోమణి. కావున న్యాయసమ్మత మగుబోధ చేసెను. క్షత్రియులకు యుద్ధమరణము మంచిదనియు, గృహమున రోగములతోఁ జివికి మృతినొందు టనుచితమనియు,నీమార్గమునఁబూర్వపూర్వతరపూర్వతమభూపతులవలంబించిరనియు, దీన మేలుకలదనియు నాయుపదేశసారము. క్షత్రియుల కీమార్గ ముత్తమమనుచో నితరజాతుల కీమార్గము ప్రధానము కాదని స్పష్టమగును. ఒక్కొక్కజాతి కొక్కొక్కధర్మము శ్రేష్ఠమగునది కలదని విధి విధించుచున్నది. కులాచారధర్మముల మానవలయునన్న వాదము దీనికి విరుద్ధమనక తప్పదు. పూర్వులు నడచినమార్గము శుభదాయకమని భీష్మునిభావ మైనట్లు కనఁబడియెడును. దీనింబట్టిచూడఁగా భీష్మాదిభగవద్భక్తాగ్రేసరులభావముకూడఁ గులాచారధర్మముల మానరాదనియు నవియే సనాతనములనియు నయియున్నది. కులాచారములు పనికిరావను వాదము నిస్సారమనియు, దాన ఫలము కలుగదనియు స్పష్టము. కావున నుత్తమగతింగోరువారు శాస్త్రోక్తకులాచారధర్మములఁ బాఱఁదోలక వాని నాశ్రయించి మేలు పొందవలయునని కోరు టనుచితముకాదు. కులాంతరధర్మములు భీతిజనకములగునని ముందు భగవదుపదేశముచే తెలు

వును. కాన నిపు డాచర్చ యక్కఱలేనిది. తరువాతికథ నవధరింపుఁడు.

భీష్ముఁడు తనయోధుల కుపదేశించినట్లే పాండవవీరులును ధర్మరాజును, ఆతనికి నర్జునుఁడును గొంత ధైర్యము కలుగు మాటలఁ జెప్పిరి. ధర్మరాజు సైన్యసాగరమును వీక్షించి యించుక చంచలించెనుగాని యర్జునునిమాటలకుఁ గలంకి దేఱి నిశ్చలచిత్తుఁ డయ్యెను. ఇఁక యుద్ధ మారంభము కానున్నది. భగవంతుఁ డూరకుండుట కవకాశము లేదు. ఈభూభాగ మర్జునునిమూలమునఁ దీర్పనెంచిన శ్రీకృష్ణుఁ డూరకయుండిన నెట్లు! శ్రీహరి చక్కఁగా నాలోచించియే యేకార్యమునఁ జేయువాఁడు. కాని త్వరపడువాఁడు కాఁడు. కావున నేకార్య మేలాగు చేయవలయునో యాలోచించెను. అర్జునునిమూల మునఁగాని యీమహాకార్యము కాదు. నరునిచిత్తమతిమృదు వైనది. భూతదయ ప్రధానముగాఁ గలది. ఈసమయమున నది పనికిరాదు. కావున దానిని వీర్యవంతముగాఁ జేయుట ముఖ్యము. అని యాలోచించెను.

అత్తఱి నర్జునునిరథమునఁ గపిధ్వజ మలరారుచుండెను. నొగలపై శ్రీకృష్ణుఁడు కూరుచుండియుండెను. దివ్యాస్త్ర శస్త్రములు తేజోవంతములై విజయమును సూచించు చుండెను. సకలప్రయత్నములును పాండవులకు విజయమునే తెలుపుచుండెను. కావున నారథమును గాంచినంతనే గుండ్ల కను భీతి పొడమసాగెను. మృత్యుంజయుఁ డారథమునందు నిలిచియుండెను. కాని యాతనియాకృతి యితరాగోచరము. [illegible]యును ముం దెఱుంగఁదగు. అర్జునునకుఁ దోడుగాఁ బరా

ప్రమథనుండగు భీమసేనుఁ డుత్సాహమున నెపుడు యుద్ధము
సాగునా యని యువ్విళ్లూరుచుండెను. ఆతనిఁ గనినంతనే
దుర్యోధనుని సోదరులు సైనికులు తత్తఱిల్లఁజొచ్చిరి. అప్పుడు
భగవంతుఁ డర్జునునిం గాంచి ధనంజయా! అల్లదె కనుంగొ
నుము మన కెదుర భీష్ముఁ డాహవదోహలమున నున్నవాఁడు.
భీష్ముఁడు సామాన్యుఁడని తలంపరాదు. భూమండలమును,
నిరువదియొకపర్యాయములు తిరిగి భూపాలవీరుల వెదకి వెదకి
జయించినపరశురాముని నెదురునిలిచి యుద్ధముచేసి గెలిచిన
మహాశూరాగ్రేసరుఁడు. ఆలోచింపఁగా నాతనితోఁ బోరాడుట
సామాన్యముకాదు మహత్తరకార్యమది. కావున నీవు సంగ్రా
మాభిముఖముగాఁ గూరుచుండుము. పరిశుద్ధచిత్తుఁడవై శత్రు
పరాజయార్థముగా దుర్గాస్తోత్రమును జేయుము. దాన జయము
గలుగు. అని యాజ్ఞాపించెను.

### శ్రీకృష్ణుఁ డర్జునునకు దుర్గాస్తోత్రము నుపదేశించుట.

భగవదాజ్ఞను శిరసావహించి యర్జునుఁడు రథావతర
ణంబుచేసి లలాటమున నంజలి ఘటించి శ్రీకృష్ణోపదేశంబు
తెలియంగున నిట్లు దుర్గాంబను బ్రార్థించెను. పెక్కునామముల

దుర్గా స్తుతిః.

నమస్తే సిద్ధసేనాని ఆర్యే మందరవాసిని, కుమారి కాళి కాపాలి
కపిలే కృష్ణపింగళే. ౧. భద్రకాళి నమస్తుభ్యం మహాకాళి నమోఽస్తు తే,
నండి చండే నమస్తుభ్యం తారిణి వరవర్ణిని. ౨. కాత్యాయని మహాభాగే
కరాళి విజయే జయే, శిఖిపింఛధ్వజధరే నానాభరణభూషితే. ౩. అట్ట
శూలప్రహరణే ఖడ్గఖేటకధారిణి, గోపేంద్రస్యానుజే జ్యేష్ఠే నందగోప
కులోద్భవే. ౪. మహిషాసృక్ప్రియే నిత్యం కౌశికి పీతవాసిని, అట్టహాసే

నుచ్చరించి ధ్యానించెను. సకలారిష్టభంజనీ యని వినుతించెను. కరుణాస్వరూపిణివి కాన నాకు జయముగలుగ ననుగ్రహింపు మని యభ్యర్థించెను. యుద్ధకాలమున నిన్ను స్మరించిన మృత్యు బాధలు తొలఁగి జయము చేకూరునని వాంఛించెను. భయము భక్తియు నలర నామహాదేవిని బ్రార్థించెను. అర్జునుని ప్రార్థ నము నంగీకరించి మహాదేవి దుర్గాంబిక భగవంతునిసమక్షమున నిలిచి యర్జునునకు నభయం బొసంగి శ్రీకృష్ణసహాయమున విజయము గలుగును. నిన్ను శతక్రతువును జయింపఁజాలఁడు. అని వరమిచ్చి యంతర్ధానమందెను. ఆ స్తుతి సకలారిష్టములఁ బరిహరించి విజయము చేకూర్చును. అవ్వల నర్జునుండు దుర్గాంబిక వరమీయ నానందించి లేచి రథ మెక్కెను.

---

శోకముఖే నమస్తేఽస్తు రణప్రియే. ౫. ఉమే శాకంభరి శ్వేతే కృష్ణే కైటభనాశిని, హిరణ్యాక్షి విరూపాక్షి ధూమ్రాక్షి చ నమోఽస్తు తే. ౬. వేదశ్రుతిమహాపుణ్యే బ్రహ్మణ్యే జాతవేదసి, జంబూకటకచైత్యేషు నిత్యం సన్నిహితాలయే. ౭. త్వం బ్రహ్మవిద్యా విద్యానాం మహానిద్రా చ దేహినాం స్కందమాతర్భగవతి దుర్గే కాంతారవాసిని. ౮. స్వాహాకారః స్వధా చైవ కళా కాష్ఠా సరస్వతి, సావిత్రీ వేదమాతా చ తథా వేదాంత ఉచ్యతే. ౯. స్తుతాసి త్వం మహాదేవి విశుద్ధేనాంతరాత్మనా, జయో భవతు మే నిత్యం త్వత్ప్రసాదాద్రణాజిరే. ౧౦. కాంతారభయదుర్గేషు భక్తానాం చాలయేషు చ, నిత్యం వససి పాతాళే యుద్ధే జయసి దానవాన్. ౧౧. త్వం జంభనీ మోహినీ చ మాయాహ్రీః శ్రీస్తథైవ చ, సంధ్యా ప్రభావతీ చైవ సావిత్రీ జననీ తథా. ౧౨. తుష్టిః పుష్టిర్ధృతిర్దీప్తిశ్చంద్రాదిత్యవివర్ధినీ, భూతిర్భూతిమతాం సంఖ్యే వీక్ష్యసే సిద్ధచారణైః. ౧౩.

భీష్మపర్వము ౨౩ అధ్యా.

మహాశయులారా! ఈస్తుతియందు దొక రహస్యము గలదు. అది తెలిసికొనఁదగినది. శ్రీహరి తాను సర్వకర్తయై యర్జునుని గెలిపింపఁబూనినాఁడుకదా. ఏల దుర్గాస్తుతి నుపదేశించెను? దుర్గాంబికమూలమున వర మేల యిప్పించెను? ఏదో యొకమహార్థ మిందుఁ గలదనుట స్పష్టము. అదేదనఁగా నవధరింపుఁడు. శ్రీకృష్ణుఁడు సర్వసాక్షి. దుర్గాంబ మహామాయ. సకలలోకనిర్మాణ మాపరాంబికపని. భగవదిచ్ఛ ననుసరించి యెల్లలోకముల సృజించును. పోషించును. సంహరించును. బ్రహ్మావిష్ణుమహేశ్వరులఁ బుట్టించును. సకలాధికారము లాజగదంబిక యధీనములు. సృష్టికి లోబడినవారందఱు తదధీనులు. సకలబ్రహ్మాండనాయిక యాయంబయే. భగవంతుఁ డవతరింపనా మెయు నవతరించి బాసటయై యుండును. తానే సకలకార్యముల నిర్వహించును. కావున నర్జునా! దుర్గాంబను వినుతింపుమని హరి యుపదేశించెను. ఏయేదేవత లేయేకార్యములు చేయఁదగునో పరాత్పరుఁడే నిర్ణయించెను. ఆయాకార్యముల నాయాయిదేవతలఁ బ్రార్థింపవలయును. ఒక్కభగవంతునే నమ్మిన నెల్లకార్యములు కావా యనరాదు. కర్మము ననుసరించి భక్తిమార్గ్నొందును. ఎల్లర కొక్కదేవతయందే భక్తి కుదురు. కొనదు ఆయాయికార్యములసిద్ధికొఱ కాయాదేవతలఁ బ్రార్థించిన సర్వదేవతలయందును సమానభక్తి కుదురును. అంతియ కాక దేవతాద్వేషము నశించును. సమత్వ మలవడును. ఇతర దేవతాద్వేషము నశించుటయేకదా కోరఁదగినవిషయము. అది భక్తుల కలవాటు కావలయుననియే శ్రీకృష్ణమూర్తి దుర్గాస్తోత్రము నుపదేశించెను. దీనింబట్టి దేవతాద్వేషమూనక సర్వ

దేవతాస్వరూపుఁడు భగవంతుఁడని తలంచుట శ్రేయస్కరమనియే తేలెడిసారాంశము. ఈసారాంశమే తరణోపాయమును బోధించును. దుర్గ యనఁగా సామాన్యదేవత యని భావింపరాదు. పరదేవతయే యని యెఱుంగవలయును. భగవదిచ్ఛాస్వరూపిణి. సకలబ్రహ్మాండనాయిక. సకలకార్యములు నామెయే చేయును.

"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా. ౬
యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్." ౭
గీత. ౪ అ.

అను భగవదుక్తియే కలదు.

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే." ౧౦
గీత. ౯ అ.

అను నీగీతావాక్యమును బరిశీలించినఁ బ్రకృతి యెట్టిదో తెలియఁగలదు. కావున నీదుర్గాస్తుతి సర్వాపన్నాశకరమని తెలియందగు. ఇఁకఁ గథను మరలుదము.

అర్జునుం డిట్లు కృతకృత్యుఁడై రథమెక్కి నొగలపయిం గృష్ణపరబ్రహ్మము కూరుచుండియుండఁగా సమరాంగణమును బాఱఁజూచెను. అని సంజయుఁడు తెలుప ధృతరాష్ట్రుఁ డిట్లు ప్రశ్నించెను సంజయా! వ్యాసమహామునివరప్రభావమున నీకు [illegible]విషయము లవగతంబులై యుండు. భీష్మునిసమరంబులుపడిదినంబు

లెట్లు చెల్లెనో నాకు వినిపింపుమనఁగా నతఁ డిట్లు చెప్పఁబూనెను.
(౧) ధర్మక్షేత్రము కురుక్షేత్రము. అందుఁ గౌరవపాండవులు చేరిరి. వారిబలంబులెల్ల నందు నిండియుండెను. వారిసంగ్రామము నాలకింపుము ఇరుదెగలవీరులు యుద్ధమున కాయత్తపడిరి. కాని సేనాధిపతులయాజ్ఞ కావలయును. అంతియగాక యందుఁ గూడిన వారెల్లఁ బరస్పరసంబంధముగలవారు. పరస్పరదర్శనమున మనస్సెన్నివిధములనో మాఱుచుండును. చేయఁబూనునది సంగ్రామము. అది భయంకరమైనది. అందు మిత్రధర్మమును బాటింప నెవ్వరుఁ బూనరాదు. కావున సంగ్రామప్రారంభమునకు ముందే బంధుస్నేహభావముల నెఱపవలయు. ఆనియమములఁ బాటించుటకే యించుక యవకాశ మొసఁగఁబడును.

## భగవద్గీతాఘట్టము.

*ఆసమయమున సైనికులెల్ల విచ్చలవిడిగఁ దిరుగుచు స్వస్వమిత్రులబంధువులఁ జూచుచు సంభాషించుచుండురు. (౨) ఆసంధికాలమున నీకొడుకు దుర్యోధనుఁడు పాండవసేనాసముదయము సమధికోత్సాహమున రణము చేయఁ గట్టాయితంబై యుండఁగాంచి శరాసనగురుండగు ద్రోణాచార్యునికడకేగి

---

### భగవద్గీతా ప్రారంభః.

ధృతరాష్ట్ర ఉవాచ.—ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః, మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ. ౧. సంజయ ఉవాచ.—దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా, ఆచార్యముపసంగమ్య రాజా

---

*ఇది భారతము భీష్మపర్వము. ౨౫ వ యధ్యాయమునుండి పదునెనిమిదధ్యాయముల వఱకుఁ గలకథను గ్రహించి వ్రాయఁబడునని తెలియునది.

యిట్లు పలికెను. (3) ధనురాచార్యా! పాండుపుత్త్రులవశమం
దున్న యీగొప్పసేనను దిలకింపుము. బుద్ధిమంతుఁడు నీను
శిష్యుఁడు ద్రుపదపుత్త్రుఁడు నగుదృష్టద్యుమ్నునిచే నమర్పఁబడి
యున్నది. ఆతనియాధిపత్యమున నున్నది. (౪-౫-౬) వారిసైన్య
మునందును శూరాగ్రేసరులు ధనుర్ధారులలో నగ్రగ్యులు యుద్ధ
రంగమున భీమార్జునసమానులు నగువారు పెక్కండ్రు గలరు.
యుయుధానుఁడు విరాటుఁడు మహారథుండగు ద్రుపదుఁడు,
ధృష్టకేతువు, చేకితానుఁడు, వీర్యశాలియగు కాశిరాజు, పురు
జిత్తు, కుంతిభోజుఁడు, శైబ్యుఁడు, విక్రమాఢ్యుఁడగు యుధా
మన్యువు, అట్టిండగు నుత్తమౌజుఁడు, నభిమన్యుఁడు, ద్రౌపది
పుత్త్రపంచకము, ననువీరెల్ల మహారథులు (వేవురురథికులతోఁ
బోరఁగలవారు) ఇది పాండవసేనావీరవరవృత్తాంతము. (౭) ఇఁక
మనసేనయందు సమర్థులగు వారిం బేర్కొనుచున్నాఁడను. నా సే
నకు నాయకులగువారిని సంజ్ఞార్థముగాఁ దెలిపెద. ఆలకింపుము.
(౮-౯) నీవును (ద్రోణుఁడవు) భీష్మాచార్యుఁడు, కర్ణుఁడు,
కృపుఁడు, యుద్ధమందు గెలుపునొందఁగల మేటిమగం డశ్వ

---

వచనమబ్రవీత్. ౩. పశ్యైతాం పాండుపుత్త్రాణామాచార్య మహతీం
చమూం, వ్యూఢాం ద్రుపదపుత్త్రేణ తవ శిష్యేణ ధీమతా. ౪. అత్ర
శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి, యుయుధానో విరాటశ్చ
ద్రుపదశ్చ మహారథః. ౫. ధృష్టకేతుశ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్,
పురుజిత్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః. ౬. యుధామన్యుశ్చ
విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్, సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ
మహారథాః. ౭. అస్మాకంతు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ, నాయకా
మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. ౮. భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ
కృపశ్చ సమితింజయః, అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిర్జయద్రథః. ౯.

ఘ్రాసమయు, వికర్ణుఁడు సౌమదత్తియు, జయద్రథుఁడు నను వారు గలరు. వీరుగాక పెక్కండ్రుశూరులు నాకొఱకై ప్రాణముల నర్పింప సిద్ధముగ నున్నవారు గలరు. నానాశస్త్రాస్త్రధరులు, యుద్ధవిశారదులు. (౧౦) మనబలము భీష్మాభిరక్షితమయ్యును చాలకయున్నది. పాండుపుత్త్రులబలము భీమాభిరక్షితమై చాలియున్నది. (౧౧) కావున మనవ్యూహమందుఁగల యెల్లమార్గములనాక్రమించి భీష్మునే కాపాడఁబూనియుండుఁడు. మీరెల్లరీకార్యమునందు బద్ధాదరులు కావలయును. (౧౨)అని దుర్యోధనుఁడు పలుక వారలకెల్ల నుత్సాహముగలుగుపొంటెఁ గురువృద్ధుఁడగు నాపితామహుఁడు సింహనాద మొనరించి ప్రతాపద్యోతకముగా శంఖమొత్తెను. (౧౩) ఆవెంటశూరులెల్ల శంఖములఁ బూరించిరి. భేరీపణవానకగోముఖవాద్యముల సైనికులు మ్రోయఁజేసిరి. ఆశబ్దము దిగ్విదిక్కుల నెల్లయెడల వ్యాపించెను.

## అర్జునవిషాదము.

(౧౪) అప్పుడు శ్వేతాశ్వములంబూన్చిన యద్భుతరథ

---

అన్యే చ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః, నానాశస్త్రప్రహరణాస్సర్వే యుద్ధవిశారదాః. ౯. అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం, పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితం. ౧౦. అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః, భీష్మమేవాభిరక్షంతు భవంతస్సర్వ ఏవహి. ౧౧. తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః, సింహనాదం వినద్యోచ్చైశ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్. ౧౨. తతశ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః, సహసైవాభ్యహన్యంత సశబ్దస్తుములోఽభవత్. ౧౩. తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ, మాధవః పాండవశ్చైవ దివ్యౌ

ము పైఁ గూరుచుండిన మాధవార్జునులు దివ్యశంఖములనొత్తిరి. (౧౫) అందు హృషీకేశుండగు శ్రీకృష్ణుఁడు పాంచజన్యమను శంకమును బూరించెను. ధనంజయుఁడు దేవదత్తమును బూరించెను. శత్రుభయంకరవ్యాపారముగల భీమసేనుఁడు పౌండ్రక మను పేరుగల మహాశంఖమును బూరించెను. (౧౬) కుంతికిం దొలికొడుకగు యుధిష్ఠిరుఁడు ననంతవిజయ నామకశంఖము నొత్తెను. నకులసహదేవులు సుఘోషమణిపుష్పకములను శంఖముల నొత్తిరి. (౧౭-౧౮) ధనుర్ధారులలో మేటియగు కాశిరాజు మహారథుఁడగు శిఖండియు ధృష్టద్యుమ్నవిరాటులు, సంగర రంగముల నపజయ మెఱుంగని సాత్యకియు ద్రుపదుఁడు, ద్రౌపదీపుత్త్రులు మహాబాహువగు నభిమన్యుఁడు వేఱువేఱ తమతమశంఖముల నొత్తిరి. (౧౯) ఆశంఖముల మహాఘోషము ధార్తరాష్ట్రులహృదయముల భేదించుచుఁ దుములమై నభమును భూమిని నావరించెను. (౨౦) అంతఁ గపిధ్వజుఁ డగునర్జునుఁడు శస్త్రయుద్ధ మారంభింపఁ బడనుండఁగా దన

---

శంఖౌ ప్రదధ్మతుః. ౧౪. పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః, పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. ౧౫. అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః, నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ. ౧౬. కాశ్యశ్చపరమేష్వాసశ్శిఖండీ చ మహారథః, ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః. ౧౭. ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే, సౌభద్రశ్చ మహాబాహుశ్శంఖాన్ దధ్ముః పృథక్పృథక్, ౧౮. సఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్, నభశ్చ పృథివీం చైవ తుములోఽభ్యనునాదయన్. ౧౯. అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః, ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః. ౨౦.

ధనుస్సు నెక్కుపెట్టి శ్రీకృష్ణపరమాత్మం గాంచి యిట్లు పల్కెను.

(౨౨-౨౩) అచ్యుతా! ఈసంగరమందు నేనెవ్వరితోఁ బోరాడవలయునో యుద్ధము నాతో నొనరింప సన్నద్ధులై యున్నవారిని జక్కఁగాఁ జూచువఱకు నాయీరథము రెండు సేనలనడుమ నిలుపుము. దురాత్ముఁడగు దుర్యోధనునకు యుద్ధములోఁ బ్రియము నాపాదింపఁగోరి యరుదెంచి యుద్ధమొనరింపనున్నవారిని నేఁ బరికింపవలయును. (౨౪-౨౫) అని పలికిన యర్జునునిమాటలు విని హృషీకేశుఁడు తానడుపుచున్న యాదివ్యరథము నాసేనామధ్యభాగమున నిలిపి భీష్మ ద్రోణద్రోణికృపాచార్యాదులయెదుటను దక్కినరాజులసమక్షమునను నోపార్థ! వచ్చియున్న యీకౌరవులను జూడుము. (౨౬) అని భగవంతుఁడు పలికినంతనే యర్జునుఁ డుభయసేనల యందును గలతండ్రులను, తాతలను, గురువులను, మేనమామలను, సహోదరులను, పుత్త్రులను, పౌత్త్రులను, మిత్త్రులను,

హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే, అర్జున ఉవాచ.—సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత. ౨౧. యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితా౯, కైర్మయా సహ యోద్ధవ్యమస్మి౯ రణసముద్యమే. ౨౨. యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః, ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః. ౨౩. సంజయ ఉవాచ.—ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత, సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. ౨౪. భీష్మద్రోణప్రముఖతస్సర్వేషాం చ మహీక్షితాం, ఉవాచ పార్థ పశ్యైతా౯ సమవేతా౯ కురూనితి. ౨౫. తత్రాపశ్యత్స్థితా౯ పార్థః పితౄనథ పితామహా౯, ఆచార్యా౯ మాతులా౯

మామలను, సుహృదులను విలోకించెను. (౨౭) వారెల్లరు యుద్ధసన్నద్ధులై వచ్చియున్నవారే. ఎల్లరు బంధువులే. కావున వారి నందఱఁ జూడఁగనే యర్జునుని మనసు మితిమీఱిన శోకమునఁ గలఁగెను. (౨౮) దానిచే శోకవిచారము పుట్టెను. దానిచే మనస్సు వెన్న వలెం గరంగెను. కావున శ్రీకృష్ణుని గూర్చి యిట్లు భాషించెను.

(౨౯) శ్రీకృష్ణా! యుద్ధము చేయఁగోరి వచ్చియున్న యీ మాబంధుజనులఁ జూడఁగనే నాయవయవము లన్నియు విరవిరఁబోవుచున్నవి. నోరు ఎండిపోవుచున్నది. నానరములు వడంకుచున్నవి. తనువెల్ల రోమాంచితమయ్యెను. కాన [illegible]డుచున్నది (౩౦) ఇంతియ గాదు. హస్తమునుండి గాండీవము జాఱిపడి పోవుచున్నది. నాయీచర్మము మాడిపోవుచున్నది. ఇన్నియు నిట్టులుండఁగా నామనస్సు నిలుకడమాని యిట్లో యున్నది. ఇంతటి మనశ్చాంచల్యము నాకెన్నఁడును గలుగ లేదు. ఇట్టు లుండుటంబట్టి నే నిందు నిలువఁ జాలకున్నాఁడను. కేశవా! ఇట్టి విషమస్థితి నా దేహమునఁ గలుగుటయుం గాక నిట్టు. (౩౧) అమంగళమును సూచించు శకునములను జూచుచున్నాఁడను. ఇవియే విపరీతశకునములని పెద్దలందురు. యుద్ధము

---

భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా. ౨౬. శ్వశురాన్ సుహృద శ్చైవ సేనయోరుభయోరపి, తాన్ సమీక్ష్య స కౌంతేయస్సర్వాన్ బంధూనవస్థితాన్. ౨౭. కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిద మబ్రవీత్, అర్జున ఉవాచ.—దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితం. ౨౮. సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి, వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే. ౨౯. గాండీవం స్రంసతే హస్తాత్త్వక్చైవ పరిదహ్యతే, న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥ ౩౦॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ, న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా

నందు నాబంధువులు లోనగు వారిని జంపినందున నాకేమియు శ్రేయస్సు కలుగఁబోదు. (౩౨) కృష్ణా! విజయమును గోరను. రాజ్యమును గాంక్షింపను. సుఖముల నాశింపను. ఇందఱిని బంధువులను వధించినతరువాత నాకు రాజ్యమేల? భోగము లేల! జీవితముమాత్ర మేటికి (౩౩) మహానుభావా! ఎవ్వారి కొఱకు రాజ్యమును, భోగమును, సుఖములను మున్ను కావల యునని మనసున నెంచుచుంటినో వారే ప్రాణములపై నభి లాషమును మాని ద్రవ్యముల వదలిపెట్టి యుద్ధముచేయ వచ్చి యున్నారు. పోనిమ్ము. వీరేమి సామాన్యబంధువులని సమా ధానము చెప్పుకొందునా. ఆవిషయము లేదు. వారెవ్వ రెవ్వరో వచించెద. అవధరింపుము. (౩౪) కొందఱు గురువులు, కొందఱు తండ్రివరుస వారు, కొందఱు పుత్త్రులు, కొందఱు పితామహులు, కొందఱు మేనమామలు. ఇంకఁ గొందఱు మామలు. కొందఱు పౌత్త్రులు మఱికొందఱు బావమఱఁదులు. మఱియును గొందఱు బంధువులుగ నున్నారు. (౩౫) మధుసూదనా! వారు తెగించి నన్నుఁ జంపినఁ జంపనిమ్ము. మూఁడులోకముల రాజ్య ముగా నాకుఁగలిగినను నే నాకారణమున వారిం జంపఁదలం పను. ఇట్టి వృథాసంకల్పముగల నే నొకభూభాగముకొఱకై

స్వజనమాహవే॥ 3౧॥ న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ, కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా. 3.౨. యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖాని చ, త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ. 33. ఆచార్యాః పితరః పుత్రాస్తథైవ చ పితామహాః, మాతులాశ్శ్వశురాః పౌత్రాస్స్యాలాస్సంబంధినస్తథా. 3౪. ఏతాన్న హంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన, అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను

వధింపఁ దలంతునా? (౩౬) జనార్దనా! ధార్తరాష్ట్రులను జంపుటం జేసి మనకేమి ప్రీతి కలుగఁగలదు? సుఖమేమియు లేదని ప్రశ్నింతువు కాఁబోలు? నిరపరాధులమయి ధర్మమునను లోఁబడిన మనలఁ జంపఁదలంచు నీపాపాత్ముల వధించుటచే మనలను గూడ పాపమే యాశ్రయింపఁగలదు. (౩౭) మాధవా! అట్టులగుటఁ బాంధవులంగూడిన యీధార్తరాష్ట్రులను వధింప మనమర్హులము గాము. అంతియ కాదు స్వామీ! స్వజనమును వధించి మనమెట్లు సుఖపడుదుము. అదొకసుఖ మనఁదగునా? నీవ తెలిసే వారును బోవ మని యుద్ధముమానవలదా యందువేమో. వినుము (౩౮) వీరు రాజ్యధనాదులు లోభముచేఁ జెడినబుద్ధులుగలవారు. కావునఁ గులక్షయమువలనఁ గలిగెడుదోషమును, మిత్రద్రోహమువలనఁ గలుగుపాతకమును గనువారు కారు. కాఁబట్టి వారు తమ ప్రయత్నమును మానఁజాలరు. మఱొక్కయభిప్రాయము నాకుంగలదు. దానివినుము. (౩౯) జనార్దనా! మనము కులక్షయకృతమగు దోషము నెఱుఁగుదుము. కాన మనమే యీపాపములనుండి తొలఁగుటకేల ప్రయత్నింపరాదు? ఇట్టిదురాత్ములఁ జంపినదోషమేల కలుగునని ప్రశ్నింతువు కాఁబోలును? (౪౦) కులక్షయము కాఁగాఁ జిరకాలమునుండి యవిచ్ఛిన్నముగా వచ్చునట్టి కుల

---

మహీకృతే. ౩౬. నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యాజ్జనార్దన, పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః. ౩౭. తస్మాన్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్, స్వజనంహి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ. ౩౮. యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః, కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకం. ౩౯. కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుం, కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన. ౪౦. కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాస్సనాతనాః, ధర్మే నష్టే కులం కృత్స్న

ధర్మములు నశించును. అట్టిధర్మములు నశింపఁగా వంశమెల్ల నధర్మదూషితం బే యగును. (౪౧) శ్రీకృష్ణా! దాన నష్టమైయున్న అధర్మమభివృద్ధినొందుటవలనఁ గులకాంతలు భ్రష్ట లగుదురు. కులస్త్రీలు దుష్టురాండ్రు కాఁగా (౪౨) నో వార్ష్ణేయా! వర్ణసంకరమగును. ఆవర్ణసంకరము కులము నశింపఁజేసినవారలకుఁ గులమునకును నరకముకొఱకే యగును. తప్పదు. అట్లు కాఁగా వారలపితృదేవతలు పిండము లుదకక్రియలును లేనివారలై యూర్ధ్వలోకములు తొలఁగఁగా నధోగతికిం బోవుదురుగదా శ్రీహరీ! (౪౩) వర్ణసంకరములను జేయు కులపాంసనులవగు నీదోషములచే నెంతకాలమునుండియో వచ్చుచున్న జాతిధర్మములు నశించును. ఓజనార్దనా! (౪౪) పరమేశ్వరా! కులధర్మములు తుదముట్ట నశింపఁగా నున్న మానవులకు నరకమునందు నిరంతరవాసము కలుగునని వినుచున్నారము. (౪౫) అక్కటా! అయ్యో! మహాపాపమును జేయ సిద్ధులమైయున్నారమే. ఏ రాజ్యమును బడయ నాసఁబూని దానిచే బంధుజనుల వధింపఁబూనితిమి కదా. (౪౬) నీ ప్రాంతమున్న వారు నన్నుఁ బొలియింపం యందు వేమో.

కుధర్మోఽభిభవత్యుత. ౪౧. అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః, స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. ౪౨. సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ, పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. ౪౩. దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః, ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. ౪౪. ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన, నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ. ౪౫. అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయం, యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః. ౪౬. యది మామప్రతీకారమశస్త్రం శస్త్రపాణయః,

శస్త్రసన్న్యాస మొనరించి ప్రతిక్రియ చేయకయున్న నన్ను
శస్త్రపాణులై ధార్తరాష్ట్రులు యుద్ధమునఁ జంపుదురేని యది
నాకత్యంత క్షేమకరమే యగును. ధృతరాష్ట్రమహారాజా! అని
యీరీతిగాఁ బలికి యర్జునుఁడు శోకభరమున మానసము
వివశతనొందఁగా బాణము లెక్కుపెట్టియున్న కోదండమును
విడిచి యుద్ధరంగమునందు రథంబుపైఁ గూలఁబడెను. అని
సంజయుండు తెలిపెను.

ఇది మొదటియధ్యాయము.

---

మహాశయులారా! భగవద్గీతాశాస్త్రమునం దిది తొలి
యధ్యాయము. ఇది యర్జునవిషాదయోగ మనంబడును. దీని
విషయమున వ్రాయఁదగినవిశేషము లేవిగల వనరాదు. పెక్కు
విశేషములు గలవు. నాయూహాల నిందుఁ జొప్పించి వ్రాయక
వదలరాదు. వాని నించుక యవధానముతో నాలకింపుఁడు.
తొలుదొలుత శ్రీభగవద్గీతలపైఁ గలయాక్షేపములలోఁ
గొన్నింటిని వ్రాసి సమాధానము తెల్పెద.

(౧) ఇరుదెగలవారును బ్రాణములఁదీసికొనఁబూని యెపు
డెపుడు యుద్ధ మారంభింతమా యని యున్నసమయమున నీ
యుపదేశములను జేయ నందు నిన్నింటిని జేయసాధ్యమా? ఇది
విశ్వాసపాత్రమా?

---

ధార్తరాష్ట్రా రణే హన్యుస్తన్మే పరమశోభనం. ౪౬. సంజయఉవాచ.—ఏవ
ముక్త్వార్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్, విసృజ్య సశరం చాపం శోక
సంవిగ్నమానసః. ౪౭.

అర్జునవిషాదయోగః.

(౨) భగవదుపదేశము తరువాత నర్జునుఁడు యుద్ధము చేయఁబూనియుండునా? అట్లు పూనినచో నిది యుద్ధసన్నాహమునకుఁ దగునా?

(౩) శ్రీకృష్ణార్జునులు శ్లోకరూపమునఁ బ్రశ్నోత్తరములను జరిపిరా? లేక వారిమాటలను విన్న మరెవ్వరో నిట్లు ఛందోమయముగా నొనరించిరా? "అర్జున ఉవాచ శ్రీకృష్ణ ఉవాచ." అను మొదలగునవి నడుమఁ జేర్పఁడినవా? లేక వారినోటనుండియే వచ్చెనని నమ్మవచ్చునా? "ఏవముక్త్వార్జునస్సంఖ్యే" అను మొదలగునవి యెవరు చెప్పిన గ్రహింపనగును?

(౪) ఈగీతలయందే విషయమును శ్రీకృష్ణమూర్తి యుపదేశించినదికలదని మనము నిశ్చయింపవచ్చును?

(౫) మన మీగీతలనుండి కర్మభక్తివైరాగ్యమార్గములలో దేనిని ప్రధానముగా నమ్మి నేర్చుకొనవచ్చును?

అను నిత్యాదులు ప్రధానసంశయములు. వీనికి సమాధానము వ్రాయుచున్నాఁడను.

నాస్తికుల కిసమాధానములు పనికిరావు. మొండివాదము చేయఁగలవారలకును రుచింపవు. మతావేశముచే నా తెలియంగనివారికిని సమ్మతములు కావు. ఇంకెవ్వరికైనను వ్రాసిన విషయమును జక్కఁగాఁ జదివి యిందుఁగల విషయము సంగతమా యసంగతమా యని యూహించి నిష్పక్షపాతబుద్ధిచేఁ బరిశీలించి దేశకాలములను సంప్రదాయమునుబట్టి యిది వ్రాయఁ దగినదే యనితలంచునంత యోగ్యతగలిగినవారలకే పనికివచ్చును. భక్తులగు మీ రెల్ల నట్టివారే యని నానమ్మకము. కావున మోమోటమింబూనక యెవరేమనుదురో యని భయంపడక

నాకేమి నిందఁ దెలియనివిషయముగలదేమో యని యనుమా
నింపక ధైర్యమూని శ్రీకృష్ణపరమాత్మపాదారవిందములను
ధ్యానించుచు వ్రాయుచున్నాఁడను. ఎట్టి సమాధానమైనను
సర్వసమ్మతము కాదని యెల్లరెఱుంగుదురు. ఇఁక వినుఁడు.

అర్జునుఁడు కేవలపరాక్రమశాలిమాత్రమే కాఁడు. ఈశ్వ
రునిగూర్చితపస్సొనరించి యమ్మహాదేవునిదర్శించినపుణ్యాత్ముఁడు.
దేవలోకమున కేఁగివచ్చినధన్యుఁడు. నరనారాయణులాదిమ
మును లనుట స్పష్టము. జన్మముచేతను గర్మముచేతఁగూడ
సామాన్యులలోఁ జేర్పఁదగినవాఁడు కాఁడు. శ్రీకృష్ణునిసా వా
సమున మెలఁగువాఁడు. విద్వాంసుఁడు విశేషించి లోకజ్ఞాన
ముకలవాఁడు. వ్యాసాదిమునులఁ బెక్కుమాఱులు సందర్శిం
చిన సుకృతమతి. కావున సామాన్యుఁడు కాఁడు. ధర్మరాజు సంధి
ప్రయత్నముచేసినపుడు తదనుగుణముగా మాటలాడువార
లయం దగ్రగణ్యుఁ డర్జునుఁడే. కావునఁ గేవలక్రోధావిష్టమాన
సుఁడు కాఁడు. యుక్తక్రోధముగలవాఁడు. ఓర్పు మిగుల నధి
కము. ఇరుదెగలవారును సంగరరంగమున స్వప్రయత్నముల
నుండుట వాస్తవము. కాని యీకాలపుయుద్ధధర్మము
లతోఁ బోల్చి యాకాలపుయుద్ధధర్మము లిట్టివని నిర్ణయింప
వలనుపడదు. ప్రాతఃకాలకృత్యములు తీర్చి యుద్ధముచేయ
వలయునని, మధ్యాహ్నకృత్యముల కవకాశ మొసఁగఁదగు
నని సాయంకాలమున యుద్ధము నిలుపవలయుననియు నప్పటి
సాధారణనియమములు. గదాయుద్ధమున నాభిస్థానమునకుఁ
గ్రింద నొప్పింపరాదనుపద్ధతి కలదు. ఆయుధములులేని
వానిని రెండుచేతు లెత్తి నిలుచున్నవానిని, దృణము

యుపదేశము నీతిసార మైయుండును. కావున నీవిషయమున విశ్వాసపాత్రము గానంత యసంగతప్రసంగము కానఁబడదు.

(౨) ఇంక రెండవప్రశ్నమునకుఁ దగుసమాధానము నాలకింపుఁడు. శ్రీకృష్ణుఁ డిందు నర్జునునకుఁ జేయఁదగువిషయమునే తెల్పెను. కాని సన్న్యాసివి కమ్మని కాని మునివి కమ్మని గాని తెల్పలేదు. గీతాశాస్త్రమునఁ గలయుపదేశసారము మానవుఁడు కర్మప్రేరితుఁడై తాఁజేయఁదగిన కార్యమును జేయవలయునని, చేసినకార్యమునఁ గల్గుఫలమునకుఁ దాను గర్తనని యూహింపరాదనియే కాని వేఱుకాదు. అర్జునున కాసమయమునఁ దనగురువులను బంధువులను సోదరాదులను జంపరాదనియు దానఁ గలుగుసుఖము సుఖముకాక దుఃఖమే యనియుఁ దోఁచెను. వారిని వధింప నీవు కర్తవు కాదనియు నిమిత్తమాత్రముగ నీవుండ వారివారికర్మమే వారి నశింపఁ జేయుననియు నీమూలమునఁ గాఁదగినకార్యము నీవు చేయనునటకు స్వతంత్రుఁడవు కావనియు నీ వొకసాధనమే యనఁ దగుదువనియు నుపదేశించెను. ఈయుపదేశము మదినాటుటకే నడుమనడుమ విజయునిచిత్తము కలఁతనొందకుండ యోగము నుపదేశించెను. నేను గర్తనుగానని యాతనిమది దృఢపడుటకై జ్ఞానమును దెలిపెను. అంతకు నాతనిమదిఁ గలలోపము తీఱకుండునని విశ్వరూపమును జూపెను. అందు యుద్ధము చేయఁబూనినవారెల్ల మృత్యువక్త్రకుహరమునఁ జొరఁబాఱుచున్నట్లు కనఁబఱచెను. ఇన్నివిషయములఁ దెలిపినఁగాని యాతనిమదిం గలశంక నివర్తింపదయ్యెను. కావున నర్జునుఁ డుపదేశానంతరము యుద్ధమే చేయఁబూనక యజ్ఞోపవీతము దీసివైచి

నచో నది యుపదేశమే కానేరదు. దాని నెవ్వరును బఠింపఁదగియు నుండదు. మహాత్ములు దానిం బఠించుట స్వస్వకర్మములం దెలిసికొని యారీతి మెలంగుటకే కాని ప్రొద్దుపోవుటకుం గాదు. దానికింగల యుపనిషన్నామము సార్థకమే.

(౩) మూఁడవప్రశ్నమునకు సమాధానము నాలకింపుఁడు. శ్రీకృష్ణార్జునులు శ్లోకరూపమున మాటలాడలేదు. వారి సంభాషణమునే సర్వజ్ఞుఁడగు వ్యాసమహాముని ఛందోమయముగ నొనరించెను "ఏవముక్త్వార్జునస్సంఖ్యే" యనునవియు వ్యాసమునివర కల్పితములే. "అతివినయం ధూర్తలక్షణ" మ్మనునట్లు కొందఱు పండితులు శ్లోకరూపముగానే సంభాషణము సాగెననియు నందుఁగల "అర్జునఉవాచ" అను మొదలగునవియు వారివదననిర్గతములేయని గొప్పఁదనము దానికింక నారోపింపఁబూని పల్కుదురు. కాని యవి యసంగతకల్పనలు గాని వేఱుకాదు వాని నాధారముచేసికొని గీతలయందవి విశ్వాసముగలవారగుట మిగులఁ బొరపాటు. ఆశ్లోకములు శ్రీకృష్ణార్జునవదననిర్గతములు కాకయున్న సాధుఫలదములు కాకయుండునా?

"శ్రద్ధధానశ్శుభాం విద్యామాదదీతావరాదపి,
అంత్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి."

మను ౨ అ. ౨౩౮

"అంత్యశ్చాండాలస్తస్మాదపి జాతిస్మరాదేర్విహితయోగప్రకర్షాత్ దుష్కృతశేషోపభోగార్థమవాప్త చాండాలజన్మతః పరం ధర్మం మోక్షోపాయమాత్మజ్ఞానమాదదీత. తథాఅజ్ఞానమేవోపక్రమ్య మోక్షధర్మేప్రాప్యజ్ఞానంబ్రాహ్మణాత్ క్షత్రియాద్వై.

శ్యాచ్ఛూద్రా దపిన చాదభీష్టం శ్రద్ధాతవ్యం శ్రద్ధధానేననిత్యమ్, న శ్రద్ధినం ప్రతి జన్మమృత్యు విశేషతః" అనికుల్లూకభట్టు వ్రాసెను. అని మనుస్మృతి బోధించెడిని. శ్రీకృష్ణవాక్కులివి యని మహాప్రాజ్ఞులు వ్యాసులు వచింప నవి ప్రమాణములా యని శంకించుటయు నొకకర్మలోపమనియే నేభావించువాఁడను. కొంద ఱుపనిషత్తులలోఁ గలమహర్షులనామములను గాంచి బెదరి యివి పౌరుషేయము లందఱు. ఆయుపనిషదర్థము తన్మహర్షి చే లోకమున వ్యాపింపఁజేయఁబడిన ననునర్థముఁ గ్రహించి నచో నీసాధ్వసమునకవకాశమే లేదు. మలినచిత్తులకిట్టిభావుల న్నియు సందియములుగనే తోఁచును. భక్తిదీప మున్నచో నీశంకాధ్వాంతము నిలువఁజాలదు. దాని నుది పాడుకొనం జేయవలయును. ఒకరిసాయ మక్కఱలేకయే శంకలు తొలఁగి నిర్మలజ్ఞాన మంకురించుననుట కావంతయు ననుమానింపఁ దగిన విషయము కాదు.

(౪) నాల్గవప్రశ్నమునకు వివరించి సమాధానము వ్రాయవలయును కాని యీనాప్రయత్నమున నది యశక్యము. ఐన నించుక వ్రాసెదను. ఇంతకుముందే కొంత వ్రాసితిని. మరల నవతరింపుఁడు. మానవుఁడు లోకమునఁ బుట్టినది లోకాంతరములఁ దనకర్మఫల మనుభవించి మానవలోకమున ననుభవింపఁ గల తచ్ఛేషము ననుభవించుటకే కాని వేఱుకాదు. ధర్మమును పదము లోకాచారమునఁ జేయఁదగిన దనునర్థమున రూఢిగాం చెను. శ్రీకృష్ణుఁ డాసమయమునఁ గర్మసిద్ధాంతమే ప్రధానమని యుపదేశించెననక తప్పదు. అది యర్జునునకు మోక్షము నను గ్రహించుసమయము కాదు. సమయజ్ఞానము శ్రీహరి

లేదనవలయు నొండె ఆయుపదేశము నిష్ఫల మనవలయు
నొండె. అంతియగాని మోక్షశాస్త్రమే యనినచో వేఱొండు
నామము దానికిం దగదు. కర్మముననే మోక్షము కలదుగాని
నిష్కర్మునకు ముక్తియే లేదు. విధివిహితముగా నేదిచేసినను
గర్మమే యనఁబడును. కర్మసిద్ధాంతమున కంతర్వ్యాప్తము కానిది
వేఱొకఁడు లేదు. కర్మమార్గమున నెట్లు ప్రవర్తించిన ముక్తి
కప్పుడగునన్నవిషయమే గీతాశాస్త్రము తెల్పును. జ్ఞానసహి
తము కాని కర్మము సత్కర్మ మనఁబడునా? జ్ఞానము చిత్తశుద్ధి
విరహితముగాఁ గలుగునా? ఆచిత్తశుద్ధి యోగాభ్యాసము లేక
యలవడునా? ఆయోగము చంచలాత్ములకు లభించునా? ఆమన
శ్చాంచల్యము దుష్కర్మజనితమన కుండుటను వలనుపడునా?
వీనింబట్టి పరికింపఁగాఁ గర్మ మన్నింటికి మూలమనియే తేలును.
సత్కర్మముల నాచరించిన సన్మతి కల్గును. దాన యోగము
సిద్ధించు. ఆమూలమున జ్ఞానము దృఢపడును. దాన సత్కర్మ
ముల నాచరించి తత్ఫలముల భగవదర్పణము చేయుబుద్ధి
పుట్టును. దాన భగవత్కారుణ్యము ప్రాప్త మగును. దానఁ
దానభిలషింపకయే ముక్తి కలుగును. ఇందు గోచరము తొలుతఁ
బునాదివంటిది కర్మము. దీనిని గాదనరాదు. అర్జునా! నీవు కర్మ
మాచరింపుము. తత్ఫలమును గోరకుము. అని యుపదేశించు
టంజేసియే యతఁడు యుద్ధమునకుం బూనెను. భక్తిజ్ఞానవైరా
గ్యములఁ బ్రధానములుగా నుపదేశించియే యున్నచో నతఁడు
యుద్ధమునకుం బూనక గాండీవమును బాఱవైచి యడవుల కేఁగ
వలసినదే. వీనినన్నింటిని నిట్టివానింబట్టి యాలోచింపఁగాఁ
గీతాశాస్త్రమునఁ గృష్ణుఁడు కర్మసిద్ధాంతమునే తెల్పెనని మన

మూహింపక తప్పదు. ఈవిషయ మూయా యితావుల నాయా సందర్భానుసారము వ్రాయుదును. ప్రవృత్తిమార్గమును గదా కర్మసిద్ధాంతమును దెలుపునని కొందఱమతేను. ప్రవృత్తి మార్గ మిది యని తెలిపినఁగాని నివృత్తిమార్గముఁ దెలుప వలనుపడదు. కర్మసిద్ధాంతమునఁ బ్రవృత్తినివృత్తిమార్గములు కలవు. కర్మఫలమును గోరువారు నివృత్తిమార్గమున కర్హులు కాఁజాలరు. కావున విధివిహితములుగాఁ గర్మ ముల నాచరించి తత్ఫలమును బ్రహ్మార్పణము చేయవల యును. ఇదియే నిష్కామకర్మ మనఁబడును. నిష్కామకర్మ మాచరింపనివాఁడు లోకమున కుపకరింపఁడు. మహాత్ములెల్ల నిష్కామకర్మము నాచరించియే యితరులకు మార్గదర్శకు లైరి. కావున నెల్లవారు కర్మముల నాచరింపవలయునని యు, నాదు ముక్తులు కాఁదగినవారు వాని నాచరించుటద్ధగు నియును నిందు బోధింపఁబడియెనని స్పష్టమగును. ఈవిషయమును బో ధించునపుడు దీనిని దృఢపఱచుచు ననేకవిషయముల సంగ్ర హాముగ నుపదేశించెను. కావున గీతాశాస్త్రమునఁ బ్రతిపాదిం పఁబడినవిషయము కర్మసిద్ధాంతమే.

(౨) దీనికిఁ బైసమాధానమే. భక్తిజ్ఞానవైరాగ్యములు సిద్ధాంతమున నిమిడియే యున్నవి. ఇన్నియున్నఁగాని కర్మ మును జక్కఁగా నొనరించినవాఁడు కాఁడని యెఱుంగవలయును. ఇట్లు లైదుప్రశ్నములకు నతిసంగ్రహాముగ సమాధానము వ్రాసి యర్జునవిషాదయోగ మను నీయధ్యాయమునఁ గలవిశే షాంశములంగూర్చి యించుక వ్రాసెదను.

అర్జునుఁ డింత విషాదము నొందనేల యన్న రాజ్యలోభమున నింద్యము సహించినఁ గులక్షయ మగుననియు, దాన సుమహాపాపము సంభవించుననియు, దానిచే వర్ణసంకర మగుననియు, నద్దాన జాతిధర్మములు నశించుననియుఁ, గులధర్మములు తుదముట్టఁ బొలియుననియు, నవి సనాతనములు గాన నవి చెడరాదనియు నభిప్రాయము చేతనే యనవలయును. తనలాభమున నింతటియనర్థము సంభవించునని యర్జునుఁడు భీతిల్లెను. కులధర్మములు చిరకాలమునుండి విచ్ఛిన్నములు గాక వచ్చుచున్నవి కానఁ దనకారణమున నవి నశింపరాదనియు విజయునాశయము. కులధర్మములు నశించిన నేమన్న నాధర్మలోపమున వంశము దూషితంబగును. అధర్మము వృద్ధిగాఁగా ననఁగాఁ గులమర్యాదలు ధర్మములు నశింపఁగా వానిస్థానమున నమర్యాదలు నధర్మవృత్తులు పట్టుపడక మానవు. వానిచేఁ గులకాంతలు భ్రష్టలగుదురు. మర్యాద నెడఁబాసి యిష్టానుసారము ప్రవర్తింతురని యర్జునుని యభిప్రాయము. కులకాంతలు భ్రష్టలు కాఁగా నష్టసుతున్న నకారణమున వర్ణములు సంకరములగును. అనఁగాఁ గులకాంతలు స్వేచ్ఛాచారములు గలవారలై విచ్చలవిడిం దిరుగుచు హీనజాతిపురుషులం గూడుదురు గాన సద్వంశము దుర్వంశముగా మాఱునని పార్థుని తాత్పర్యము. అట్లు కాఁగా నట్లు వర్ణసంకరమునకు హేతుభూతు లగువారలకుఁ దద్వంశమునకు ననఁగాఁ దజ్జనితులకు నరకమునకే యగును. అట్టిపాపాత్ము లొనరించు పిండోదకక్రియలు తత్పితరులకెక్కవు. దాన వా రూర్ధ్వలోకచ్యుతిం గాంతురు. మనవంశమం దిట్టిపాపాత్ములు పుట్టిరని వారు దుఃఖింతురని భావము.

ఇన్నివిధముల నపకారము సద్వంశమునకుం దాను గలుగం జేయ నిష్టపడక విషాదమొందెను.

వర్ణములు ధర్మములు ననుదానింబట్టి గీతాశాస్త్రము నభిప్రాయము వర్ణధర్మములు తగుననియే తోంచునుగాని యవి కాలానుసారము మార్పునొందుననియుం దోంచినట్లెల్ల మార్పు వచ్చుననియుంగాదు. "సనాతనాః"అన్నందునసృష్టినుండి యింత వఱకు నవిచ్ఛిన్నముగా వచ్చునవియేకాని నిన్న మొన్న నెవరిచే తనో కల్పింపంబడినవి కావని స్పష్టమగును. కొందఱు కాలాను సారముగా వానిని మార్పవలయు నందురు. అది పాటింపందగ నిమాట యని నిరాఘాటముగాం జెప్పవచ్చును. కాలానుసార ముగా ధర్మమును మార్పవలయునన్న నధర్మమును వృద్ధిచేయ వలయుననియే కదా భావము. సత్యమును మార్చుట యనంగా నసత్యమును దానిస్థానమునం జేర్పవలయుననియేకదా సారము. అదిన్యాయసమ్మతమగుమాటయా? సజ్జనాంగీకారయో గ్యమా యది! తుచ్ఛము కాదనవచ్చునా? కాలానుసారముగా మార్పునొందునన్న పురాణవాక్యమున కర్థమేమని ప్రశ్నింతురు కాంబోలు. సమాధాన మాలకింపుండు. ధర్మము లనేకములు. తపోనియమములు పెక్కులు. కాని యుగానుసారము మహా ర్షులే మార్పు నొందించిరి. కలియుగమున కనుకూలముగ నుండు నట్టి సులభోపాయముల నిర్దేశించిరి. కృతయుగమున నెంత కా లము తపస్సానరింపందగునో యందు నొకింతకాలము కలియు గమునం జేసినం దత్సమానఫలము కలుగునని యాదేశించిరి. ఇంకను మార్పనంగాం దపస్సే పనికిరాదని మార్పవలయు ననుటయే. సత్కర్మానుష్ఠానము లేక భగవత్కరుణకలుగదని శ్రీకృ

> ఉత్పన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
> నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ"

అని మొఱ్ఱపెట్టుకొనియెను. ఒక్కొక్క రాజకుటుంబము తీఁగా దశకురాఁగా నందలి యోషిన్మణులు దుర్వర్ణసంకరత నిఁగతు రని యర్జునుఁ డెఱుంగకపోలేదు. పెక్కుసంగరము లాపటికే యొనరించినవాఁడు కావున నారణరంగమునఁ బడిన రాజులకుటుంబము లధోగతిపాలగుటఁ దలంచి తా నిట్లు పరితపించెను. శ్రీకృష్ణుఁడును స్త్రీలమూలమున జాతిధర్మములు నశింపవని చెప్పలేదు. అది శ్రీకృష్ణపరమాత్మకు సమ్మతమనియే మనము నిశ్చయింపవలయును. సకలధర్మములు స్త్రీలమూలమున వర్ధిల్లుటయో నశించుటయో జరగును. పురుషులమూలమున నయ్యవి యత్యభివృద్ధిని గాంచుటయు నశించుటయు సాగదా యన్న ప్రశ్న మవ్యక్తప్రలాపమువంటి దగును. కావున స్త్రీలు భ్రష్టలైన సకలధర్మములు నశించుననియు వర్ణసంకరమగుననియు నర్జునుఁడు తలంచుట సమంచిత మనవలయునే కాని వేఱుగాఁ దలంపరాదు. ధర్మము నశింపరాదన్న భావ మాకాలమున విశేషించి యుండెను. స్త్రీలను బరపురుషులసంగతి మెలంగఁజేయరాదన్న యూహ యెల్లరకు నుండెను. సదాచార మలవడఁజేసి వారిని రక్షింపవలయునన్న సాధుభావ మందఱకు నుండెను. పరపురుష సల్లాపసంగతులు వృద్ధిమూలములు గాక చెడుటకు నాధారము లగునన్న నిశ్చయ మార్యులకెల్లరకుఁ గలిగి యుండెను. శ్రుతిస్మృతులయందు నాదరమప్పటివారి నుండెననుట కిన్ని యన్ని యని యుదాహరణములు చెప్పవలను పడదు. ఎన్నియో నీయవచ్చును. అధర్మభయ మాకాలమున

సామాన్యముగా లేదనక తప్పదు. పూర్వాచారములు పనికి రావన్న వాదమే ప్రబలినది. శ్రౌతయాచారము లన్నను నిలుకడఁ గాంచుటలేదు. తలకొక్కశాస్త్రము. ఒక్కొక్కని కొక్కొక్కయాచారము. స్వేచ్ఛ యందఱును నుండవలదా యన్న నుండవలసినదే యనవలయునుగాని సర్వవిషయములయందా స్వేచ్ఛ పనికిరాదనక తప్పదు. స్వకార్యార్థము సదాచారముల నవలంబించువారు కొందఱు గలరు. తాము చేయని యాచారముల నుపదేశించువారు కొందఱు గలరు. పరుల వంచింప సదాచారముల నటించువారును గొందఱు కలరు. దుర్వృత్తులఁ గప్పిపుచ్చుటకు యోగుల వేషముల నూనువారు మఱికొందఱు గలరు. ద్రవ్యమునకై మంత్రముల నుపదేశించువారు ననేకులు కలరు. ఇన్నివిధముల నటించువారు గలరని వచింప నిర్ధారణ మొనరింప బ్రహ్మకైన నవకాశము లేదు. ఇన్ని యున్నను బూర్వశాస్త్రముల పేరులను సభాపీఠికలపై నుచ్చరించువారు మాత్రము పెక్కండ్రు గలరు. ఏలన వారిమాటలు నమ్మరని వారే యెఱుంగుదురు. ఎఱింగియు నుపదేశించుచుందురు. భగవద్గీతావాక్య ముదహరింపక యే యుపన్యాసము సాగదు. కాని దానియందు నాయుపన్యాసకులకు విశ్వాసము లేదు. తదనుగుణముగాఁ దనప్రవర్తనము మార్చుకొనకయుండుటయే యందులకు నుదాహరణము. కావునఁ గలికాలమున గీతాశాస్త్రమునకు వ్యాప్తి యుపన్యాసస్థానకాలములయందే కాని మఱియొకచోట లేదనవచ్చును. జాత్యాచారములు పనికి రావనువారే పెక్కండ్రు గలరు. వర్ణములు నిన్న మొన్న కల్పింపఁబడిన వనువారిసంఖ్య యత్యధికము. నాయూహ

యిది యని తోష్ము గ్రుద్దుకొనువారే యధికసంఖ్యాకులు. ఇట్టికట్టడికాలమున గీతాశాస్త్రమునకుఁ బ్రచారము చక్కని మార్గమున లేదనుటకన్న నిట్టూర్పులుపుచ్చుచుఁ జెప్పఁదగిన మాట వేఱేదియు లేదు.

ఇఁక భగవద్గీతాశాస్త్రము నుపదేశించిన శ్రీకృష్ణపరబ్రహ్మను దూషించువారు కలరు. శ్రీకృష్ణార్జునసంవాదమును సంగ్రహించి భారతమును రచించిన శ్రీవ్యాసమహర్షి దుష్ప్రవర్తకుఁడనువారు కొందఱున్నవారు. వారిమాటలు యుక్తియుక్తములనియు, సత్యములనియు నుద్ఘోషించువా రింకను గొందఱు కలరు. అట్టిపండితమ్మన్యులను గౌరవించువా రెందఱో కలరు. ఇట్టులుండ నిఁక భగవదుక్తికి మర్యాద యెక్కడ? శ్రీమహాభారతమునకుఁ బ్రమాణతాసిద్ధాంత మేమూల? సర్వము స్వేచ్ఛాప్రవర్తకులయధీనమున నున్నది.

"అనుష్ఠితం తు యద్దేవైర్మునిభిర్యదనుష్ఠితమ్,
నానుష్ఠేయం మనుష్యైస్తదుక్తం కర్మ సమాచరేత్."

అను స్మృతివాక్యముచొప్పున నిజతపఃప్రభావమున బ్రహ్మసృష్టికి మాఱుచేయఁగల మహర్షులలుం దివి లోపము లని వచించుటకంటె నజ్ఞానము వేఱేదియు నుండదు. సంసారమున మునుఁగఁదలఁచుకొన్నవారల కిట్టికుబుద్ధులే కలుగుచుండును. భగవత్పాదారవిందముల సేవించుతలంపుగలవారల కట్టివానిని స్మరింపఁ దలంపే గలుగదు. కావున నట్టిదురాక్షేపములుచేయక గీతాశాస్త్రమును బఠించి తదర్థమును జక్కఁగా గ్రహించి యనుకూలమున్నంతవఱకు దాని ననుసరింపఁ

బ్రయత్నింపవలయును. దానికిఁ బరమసాధనమగు గీతాశాస్త్రముసు బఠింపుఁడు. దానినే యిఁక వ్రాయఁబూనెదను.

ఈప్రథమాధ్యాయ మర్జునవిషాదయోగ మనఁబడును. దీనియం దర్జునునకుఁ గల్గినవిషాదము చెప్పఁబడినది. భగవంతుఁ డిట్లు విషాదమునొందు నర్జునుం గాంచి తాఁ జేయఁబూనుకార్యమునకు సుసాధనభూతుఁ డగునర్జునుం డిట్లు ఖేదమందెనే యని యూహించి మనోధర్మముగ నపుడున్న విషాదమును దొలఁగింపఁబూనెను. మనస్సు నిర్మలముగ నొనరింప యోగమే సాధనముగాన నద్దానిఁ జేయఁబూనెను. అదియే రెండవయధ్యాయము. దానిపేరు సాంఖ్యయోగమని. దానివిధ మెట్టిదో యెఱుంగఁదగును. సమాహితచిత్తులరై దానిసార మేదియో గ్రహింపుఁడు.

## సాంఖ్యయోగము.

౧. అర్జునువిషాదమును దెలిపి సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ దరువాతివిషయము నిట్లు చెప్పుచున్నాఁడు. అట్లు దయతోఁగూడి యశ్రుజలములఁ గలఁకనొందిన కన్నులుగలవాఁడగుచు దుఃఖించుచున్న యాయర్జునుం గాంచి శ్రీకృష్ణుఁ డిట్లు పలికెను. (౧-౩) అర్జునా! ఇది మిగుల సంకటకాలము. ఇట్టి విషమకాలమున నీమనోవ్యాకుల మేలకలిగెను? ఇది యజ్ఞానులకు నుండఁదగినది. ధర్మవిరుద్ధమైనది. అంతియకాక యప

సాంఖ్యయోగః.

సంజయఉవాచ.—తం తథా కృపయావిష్టమశ్రుపూర్ణాకులేక్షణం, విషీదంతమిదం వాక్యమువాచ మధుసూదనః. ౧. శ్రీభగవానువాచ.—కుత స్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితం, అనార్యజుష్టమస్వర్గ్యమకీర్తికరమర్జున.

కీర్తిని గల్గించునది. కావున నిది నీ కేలగలిగినది? పార్థా! భయం
పడకుము. ఈభయము నీవంటియుత్తమపురుషునకు నుండరా
నిది సుమా. నీవు శత్రువులఁ దపింపఁజేయువాఁడవు. హృదయ
దౌర్బల్యము నీచమైనది. అది నీకు నుండఁదగదు. అట్టిదానిని
విడిచి చేయఁదగుపని చేయుటకై సిద్ధపడుము. అని భగవం
తుఁడు హెచ్చరింపఁగా నర్జునుఁడుత్తర మిట్లు చెప్పెను. (౪) అరి
మర్దనుఁడవగునో మధుసూదనా! నావిన్నప మాలకింపుము. అం
దఱిలో నాకుఁ బూజార్హులు భీష్మద్రోణాచార్యులు. యుద్ధ
రంగమున నేను వారి నిరువురను నెట్టు బాణములతోఁ గొట్టఁ
గలను? వాగ్బాణములచేతను నొప్పింపరాదు. అట్లుండఁగా
నిఁక బాణములుపూని వారితో నే నెట్లు యుద్ధమొనర్తును?
నాయభిప్రాయమును జెప్పెద. ఆలకింపుము. (౫) మహాను
భావు లగుగురువులను జంపక భిక్షమెత్తికొని భుజించి జీవిం
చుటయే యీలోకమున మేలు. గురువులను బాధించి యీ
లోకమునందు రక్తసిక్తములగు నర్థకామములను భోగముల
ననుభవింతునా? ఈనాగురువు లర్థకామములకుం జిక్కి యుద్ధము
నుండి మరలక నన్నే మార్కొని రేని వారిని జంపవలసియే
వచ్చును. అట్టి ఘోరకార్యమునకు నేఁ బాలుపడఁగలనా? (౬)

---

౨. క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే, క్షుద్రం హృదయ
దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప. 3. అర్జునఉవాచ.—కథం భీష్మమహం
సంఖ్యే ద్రోణం చ మధుసూదన, ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరి
సూదన. ౪. గురూనహత్వా హి మహానుభావాన్ శ్రేయో భోక్తుం భైక్ష
మపీహ లోకే, హత్వార్థకామాంస్తు గురూనిహైవ భుంజీయ భోగాన్ రుధిర
ప్రదిగ్ధాన్. ౫. న చైతద్విద్మః కతరన్నో గరీయో యద్వా జయేమ యది వా

శ్రీహరీ! ఇంతియకాదు. యుద్ధము చేయఁగోరియున్నవారిని
మనమే వారి నోడింతుమో మనలనే వారోడింతురో. ఈ రెం
డింటియం దేది యుచితతరము కాఁగలదో తెలియఁగఁజాలము.
ఎవ్వారిని వధించి పిదప బ్రదుకఁజాలమో వారే ధార్తరా
ష్ట్రులు మనయెదుట నున్నవారు. వీరినందఱఁ జంపి యిట్లు
బ్రదుకఁగల మనుకార్పణ్యము నాకుఁ గలదు. స్వజనులయందు
వలన దోషము. ఈ రెండు నాస్వభావమును మార్చివేసినవి.
(౭) శౌర్యాదిలక్షణము లిప్పుడు నాయందగపడవు. యుద్ధము
మాని భిక్షాటనమున జీవించుట క్షత్రియునకు ధర్మమా! అధ
ర్మమా యన్నసందేహముచే నాచిత్తము చక్కఁగా లేదు. కావు
ననే నిన్నొక్కవిషయ మడుగుచున్నాఁడను. నాకుఁ గల్గిన
యీసందేహద్వయమం దేది నాకు శ్రేయస్సాధనమగునో నిశ్చ
యించి నాకుం దెలుపుము. నీవు శాసింపఁ దగినవాఁడను. కావున
నే నీశరణు వొచ్చితిని. ఇట్లే నన్ను బోధించి కృతకృత్యుం జేయు
ము. (౮) శ్రీకృష్ణా! ఈశోకము నాయింద్రియములను శోషిం
పఁజేయుచున్నది. దీనిఁ బోఁగొట్టుసాధనము నాకేమియుం గనఁ
బడ లేదు. ఈలోకమునందు నిష్కంటకమై సకలసమగ్రైశ్వర్యముల
నిండియున్న రాజ్యము, దేవలోకాధిపత్యము నీ రెండునుగూడ
నా యీశోకమును బోఁగొట్టఁజాలవు.

యానేవ హత్వా, న జిజీవిషామస్తేఽవస్థితాః ప్రముఖే
ధార్తరాష్ట్రాః. ౭. కార్పణ్యదోషోపహతస్వభావః పృచ్ఛామి త్వాం ధర్మ
సంమూఢచేతాః, యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేఽహం
శాధి మాం త్వాం ప్రపన్నమ్. ౮. న హి ప్రపశ్యామి మమాపనుద్యాద్య
చ్ఛోకముచ్ఛోషణమింద్రియాణాం, అవాప్య భూమావసపత్నమృద్ధం

(౯) అని పలికి సంజయుఁడు ధృతరాష్ట్రునితో మరల నిట్లు చెప్పెను. రాజా! వినుము. శత్రువులకు సంతాపమును గల్పించు నర్జునుఁ డీవిధముగా భగవంతునితోఁ బలికి యుద్ధము చేయఁజాలనని యూరకుండెను. (౧౦) ఓధృతరాష్ట్రా! ఇట్లు రెండు సేనలనడుమ దుఃఖించుచున్న యాయర్జునుం గాంచి ప్రసన్నముఖుఁడై నవ్వుచున్నట్లు నటించి యిట్లు పలికెను. (౧౧) నీ వెవ్వానిగూర్చి దుఃఖించుచున్నావో అభీష్మాదులనుగూర్చి దుఃఖింపఁదగవు. స్వజనమును జూచితిని. వీరెల్ల యుద్ధము చేయ సిద్ధముగ నున్నారు. అని దుఃఖించితివికదా. అట్టివారినిగురించి నీవు దుఃఖింప నవసరమే లేదు. అంతియకాక పండితులవలె మాటలాడుచున్నాఁడవు. నీవు పండితుఁడవు కావు. పండితులు మృతులగు వారినిగూర్చి కాని, బ్రదికియుండిన వారిగూర్చి కాని దుఃఖింపరు. నీవు దుఃఖించుచున్నాఁడవు కావున బండితుఁడవు కావు. పండితు లేల దుఃఖింపరని యూహింతువేమో వినుము. (౧౨) పరమేశ్వరుఁడనగు నేనొకానొకప్పుడు గాని లేనివాఁడను గాను. నీవును లేనివాఁడవు కావు. ఇందుఁగల రాజులును లేనివారు కారు. మీరెల్ల మదంశములుగానఁ బూర్వము గాని యికముందు గాని వేరనుమాట లేదు. ఎప్పటికి నుండువారలే.

---

రాజ్యం సురాణామపి చాధిపత్యం. ౮. సంజయ ఉవాచ.— ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః, న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవ హ. ౯. తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత, సేనయో రుభయోర్మధ్యే విషీదంతమిదం వచః. ౧౦. శ్రీభగవానువాచ — అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే, గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః. ౧౧. న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః,

విజయా! ఏయాత్మ యీప్రపంచమందంతట నిండియున్నదో ఆయాత్మకు నాశములేదని యెఱుంగుము. ఆత్మ యవ్యయము కనుక నీయాత్మకు నాశనము గల్గించునదేదియు లేదు. (౧౭) భారతా! సర్వదా యేకాకారమున నొప్పుచు వినాశరహితమై, ప్రత్యక్షాదిప్రమాణములకుఁ దెలియఁదరముగాని యాత్మకు దేహాదులు నాశముగలవని పల్కుదురు. కావున నింకను జింతింపక యుద్ధముచేయుము (౧౮) పాండవమధ్యమా! ఈయాత్మను జంపువానినిగాఁగాని చంపఁబడువానింగాఁగాని యెవరు తలంతురో వారిరువు రజ్ఞానులు. (౨౦) ఈయాత్మ చంపునది కాదు. చంపఁబడునదియుఁ గాదు. ఈయాత్మ యెుకప్పుడైనఁ బుట్టువు కలదికాదు. మరణముకలదియుఁ గాదు. కొంతకాల ముండిపోవునదియుఁ గాదు. ఇఁకఁ గొంతకాలమునకుఁ గలుగునదియుఁ గాదు. ఇంకెట్టిదనఁగా జననములేనిది. సర్వకాల మేక రీతిగా నుండునది. శాశ్వతము. ఆదిలేనిది. కావున శరీరము పోయినను బోవునదికాదు. (౨౧) ఓపార్థా! వృద్ధిశూన్యమై అపచయరహితమై నాశనములేనిదై పుట్టుకయు లేనిదై యుండు దానినిగ నీయాత్మ నెవ్వఁడెఱుంగునో ఆపురుషుఁడు ఎవని నెట్లు

---

సర్వమిదం తతం, వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి. ౧౭. అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః, అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత. ౧౮. య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం, ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే. ౧౯. న జాయతే మ్రియతే వా కదాచిన్నాయం భూత్వా భవితా వా న భూయః, అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే. ౨౦. వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయం, కథం స పురుషః పార్థ కం

నివియు మృతినొందుచునుండు దానినిగాఁ దలంతు వేని యా పక్షమునను నీవు శోకింప నవసరమే లేదు. ఏలయందు వేని విను. (౨౭) కలిగిన ప్రతివస్తువునకు నాశము నిశ్చయము. నశించినవస్తువులకెల్ల జననము సత్యము. కనుకఁ బరిహరింప వలనుపడని కార్యము విషయమై నీవు దుఃఖింపఁదగవు (౨౮) ప్రధానమే పూర్వరూపముగాఁగలవి శరీరములు. జన్మమరణాంతరాళస్థితి గలవియు అవ్యక్తమందే లయమునొందునవియు నగును. అర్జునా! అట్టి భూతములవిషయమై నీకు శోకింప నవసరమేమి? స్వప్నదృష్టవస్తువులయందెట్లు మోదఖేదములు లేవో యట్లు శోకమునకీవిషయమందునవకాశము లేదు (౨౯) అర్జునా! ఒకానొకఁడీయాత్మను శాస్త్రముచేతను సద్గురూపదేశముచేతనుజూచుచు నాశ్చర్యముగఁజూచుచున్నాఁడు, సర్వగతమై నిత్యజ్ఞానానందస్వభావమైనయాత్మ యలౌకికమగుటవలన నైంద్రజాలికమువలెఁ గనఁబడుదానిని గాంచినట్లు విస్మయమునఁ జూచుచున్నాఁడు. మఱియొకఁడు ఆశ్చర్యముగా నింకొక్కనితోఁ జెప్పును. అన్య యింక నొకఁడు వినును. ఇట్టులైన నీయాత్మను దెలిసికొనఁజాలఁడు. (౩౦) ఓభారతా! ఆత్మ సర్వగతము. శాశ్వతము. అవధ్యము. సకలభూతములు వధింపఁబడిన నిది వధింపఁబడదు.

---

మన్యసే మృతం తథాపి త్వం మహాబాహో నైవం శోచితుమర్హసి. ౨౬. జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ, తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి. ౨౭. అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత, అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా. ౨౮. ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః, ఆశ్చర్యవచ్చైనమన్యశ్శృణోతి శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్. ౨౯. దేహీ నిత్యమవధ్యోఽయం

కావున నీభీష్మాదుల విషయముఁగూడనే కాదు. సర్వభూతములవిష యమునందుఁగూడ నీవు శోకింపఁబనిలేదు. అని తెలిపెను.

(31) మఱి యర్జునుఁడు స్వజనమును జంపియించి యేమి శ్రేయస్సు నొందఁగలనో తెలియఁజాలకున్నాఁడనని తెలిపెను. కాన నాసంశయమును బోఁగొట్టవలయునని యెంచి మఱియు నిట్లు పలికెను. పార్థా! నీధర్మమేమియో యని దానినిగూడ నాలోచించుకొని యాత్మ నశింపనిది గనుక పీరు నశించినను నీవు చలింపఁదగదు. ఏలయనఁగా క్షత్రియులకు ధర్మమునకు విరుద్ధము కాని యుద్ధమునకంటె నింకొకటి మేలుకలదా? లేదుకదా? (32) గొప్పశ్రేయస్సు తనంతన తాను రానుండఁగా నేల భయమున వణఁకెదవని బోధింపఁబూని యర్జునా! ప్రార్థింపకయే యిట్టియుద్ధము ప్రాప్తింపఁగా స్వర్గద్వారము తెఱవఁబడును. ఇట్టిసంగరము సదృష్టవంతులగు రాజులే కాంతురు. వారికంటె సుఖవంతులు గలరా. ఈయుద్ధమున మృతినొందినవారలకొఱకు స్వర్గద్వారము తెఱవఁబడును దాని నవాయాసమున రాజులు ప్రవేశించి యందు మహానందము నొందుదురు. వారికంటె సదృష్టవంతు లెవరు? (33) విజయా! అంతియ గాక ధర్మమునకు లోఁబడిన యీయుద్ధమును జేయఁబూనవేని నీధర్మమును గీర్తిని బోఁగొట్టుకొని పాపమునే

---

జేహీ సర్వస్య భారత, తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి. 31. స్వధర్మమపి చావేక్ష్య న వికంపితుమర్హసి, ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయో న్యత్ క్షత్రియస్య విద్యతే. 32. యదృచ్ఛయా చోపపన్నం స్వర్గ ద్వారమపావృతం, సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశం. 33. అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం నకరిష్యసి, తతస్స్వధర్మం కీర్తిం

పొందుదువు. (34) స్వధర్మకీర్తులు నాశు వలదని యొక వేళ నీవందు వేమో వినుము. సమస్తభూతములు శాశ్వతమగు నీయపకీర్తినే చెప్పుచుండును. ఎల్లవారు గౌరవించుచుండఁగా జీవించువానికి నపకీర్తి కలుగునే నది మరణము నకంటె మిక్కిలి యధికమైనది. ఇంతియకాదు (35) యుద్ధము చేయవచ్చిన మహారథులందఱును నీవు తమ్ముఁగాంచి భయంపడి యుద్ధమునుండి విముఖుఁడవైతివనియే తలంతురు. ఇంతదనుక నెవ్వరిదగ్గర బహుమానము నొందుచుండువో వారలే నిన్నుఁ జులకనఁగాఁ జూతురు. (36) నీశగవారందఱు నోట వచింపరానిమాటలు నిన్నుంగూర్చి పలుకుదురు. నీసామర్థ్యమును దూషింతురు. దానికంటె నధికమగు దుఃఖము వేఱొకటి కలదా? (37) ఓకౌంతేయా! రణరంగమున మృతినొందుదువేని స్వర్గము నొందఁగలవు. శత్రువులం బోరియించి జయముంగాంతువా భూలాభసుఖము ననుభవింతువు. కావున నింక లెమ్ము. యుద్ధముచేయ సిద్ధుఁడవగుము. శత్రువులను జయింతును. లేదేని మృతినొందుదును అని నిశ్చయించుకొనుము. (38) కుంతీనందనా! సుఖదుఃఖములను లాభాలాభ

---

చ హిత్వా పాపమవాప్స్యసి. 33. అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయాం, సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే. 34. భయాద్రణాదుపరతం మన్యంతే త్వాం మహారథాః, యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవం. 35. అవాచ్యవాదాంశ్చ బహూన్వదిష్యంతి తవాహితాః, నిందంతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరన్ను కిం. 36. హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీం, తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః. 37. సుఖదుఃఖే సమే

ములను జయాపజయములను సమానములుగా భావించుకొని యివ్వేళ యుద్ధముచేయ సిద్ధపడుము. ఇట్టిపనిచే నీకుఁ బాపము కలుగదు. (౩౯) కౌంతేయా! పరమార్థవస్తుతత్త్వముఁ దెలుపుశాస్త్రము సాంఖ్యమనంబడును. ఇది తద్విషయమై నీకు బుద్ధి తెలుపఁబడినది. ఇఁక నిట్టిబుద్ధిగలవాఁడవైనచోఁ గర్మముల నాచరించి వానివలనిబంధములను బొందకుండువో అట్టి కర్మయోగవిషయకమగుబుద్ధిని జెప్పెద వినుము. (౪౦) కర్మయోగమనఁగా నిష్కామకర్మయోగ మనునర్థమును గ్రహింపుము. ఈకర్మయోగవిషయమై ప్రారంభించి నెఱవేర్పక యున్నచో నిష్ఫలత్వము లేదు. కొంతకాల మాచరించి వదలినను బాధ కలుగదు. ఆయోగానుష్ఠానము స్వల్పమే యైనను భూరితరసంసారభయమునుండి రక్షించును. (౪౧) ఓయి కురునందనా! ఈశ్వరారాధనమగు నీకర్మయోగమునందుఁ బరమేశ్వరభక్తిచేతనే నిశ్చయముగాఁ దరింపఁగలనని నిశ్చయాత్మికమగుబుద్ధి యొక్కటియే. నిశ్చయము లేనివారిబుద్ధులు సంఖ్యాతీతములు. కర్మాపేక్షననుసరించి పెక్కుశాఖలుగలవియునగును. అర్జునా! పుష్పితవృక్షమువలెఁ బ్రకాశించుచు వినుటకు రమణీయముగానుండు నీచెప్పఁబోవు వాక్కును జెప్పువా రవిద్వాం

---

కృత్వా లాభాలాభౌ జయాజయౌ తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి. ౩౮. ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి. ౩౯. నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే, స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్. ౪౦. వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన, బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినాం. ౪౧. యా-

సు లనఁబడుదురు. (౪౨) వేదములయందుఁ గొన్ని భాగములు బహ్వర్థవాదఫలసాధనములఁ బ్రకాశింపఁజేయునవి కలవు. ఆ భాగములఁగలవాక్యములను నమ్మి స్వర్గమును బశుపుత్త్రాదు లగుఫలముల నొసంగసాధనము లగుకర్మములకంటె వేఱొక పరమప్రాప్యస్థానము లేదని వాదింతురు. వారే యవిద్వాంసులు. (౪౩) కామాకులచిత్తులు. కాఁబట్టియే స్వర్గమే పరమపురుషార్థ మని పలుకుదురు. అట్టివారు జన్మమును గర్మములను వానిఫల ముల నొసంగునదియు, భోగైశ్వర్యప్రాప్తినిగూర్చి సాధన భూతములగు నేక్రియావిశేషములుగలవో వానిని విశేషించి వచించునట్టివాక్కులనే పలుకుచుందురు. ఎవ రిట్టివాక్కులను బలుకుచుందురో వారే యవిద్వాంసులు కావున వారి మాటలఁ బాటింపరాదని యెఱుంగుము (౪౪) ఓకురునందనా! భోగములయందు నైశ్వర్యములయందుఁ బ్రసక్తిగలవారలై స్వర్గాదిఫలము లుత్తమములనియు వానికన్న నితర ముత్కృష్ట ఫలము లేదనియుఁ జెప్పు నర్థవాదవాక్కుచేత మనస్సు తాఱు మాఱుకాఁగా నుండువారలకు సాంఖ్యమునందు నిష్కామ కర్మయోగమునందును బుద్ధిసమాధియందు నిలుకడఁగాంచదు. (౪౫) అర్జునా! వేదములుకర్మఫలసంబంధప్రతిపాదకములు. నీవు నిష్కాముఁడవు కమ్ము. శీతోష్ణములు సుఖదుఃఖములు లోనగుద్వంద్వములవిడిచి సర్వదా సత్త్వగుణప్రధానుఁడవై

---

మిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః, వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతి వాదినః. ౪౨. కామాత్మానస్స్వర్గపరా జన్మకర్మఫలప్రదాం, క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి. ౪౩. భోగైశ్వర్యప్రస క్తానాం తయాఽపహృతచేతసాం, వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే. ౪౪. త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున నిర్ద్వంద్వో

అప్రాప్తస్వీకార మగు యోగమును ప్రాప్తపరిపాలనమగు క్షేమ
మును మానినవాఁడవై యప్రమత్తుఁడవు కమ్ము. ఇదియ నీ కుప
దేశము. స్వధర్మమును సమాశ్రయింపుము. (౪౫) వాపీకూప
తటాకాదులయం దెంతమాత్రము స్నానపానాదిఫలము గలు
గునో జలసంభృతమగు మహాహ్రదమునందు నంతియే ఫలము
కలుగుచున్నది. పరమార్థతత్త్వ మెఱిఁగినబ్రాహ్మణున కన్నివేద
ములందు నంతియే ఫలము. (౪౬) కౌంతేయా! జ్ఞాననిష్ఠయందు
నీ కధికారము లేదు. కాని తత్త్వజ్ఞానార్థి వగుదువు. కావునఁ
గర్మమునందే నీ కధికారము గలదు. ఒకానొకప్పుడు నెట్టియవస్థ
యందును గర్మఫలములు బంధహేతువులుగాన వానియం
దధికారము నీకు లేకయుండుఁగాక. కర్మఫలతృష్ణ లేకుండుఁ
గాక ఎపుడు నీకుఁ గర్మఫలమునందుఁ దృష్ణయుండునో యపుడు
కర్మఫలప్రాప్తికి హేతువ వగుదువు. కావునఁ గర్మఫలహేతు
భూతుఁడవు గాకుము. అట్లగుదువేని జన్మమునకుఁ గారణ
మగును. కర్మఫల మభిలషింపఁగూడదు. కావున దుఃఖరూప
మగుకర్మముచే నేమిలాభమని యనుకొందువేమో. కర్మములను
జేయ మానుటయందు నీకుఁ బ్రీతి లేకయుండుఁగాక. కర్మఫల
ములను గోరి కర్మములను జేయఁగూడనిచో నింకెట్లు వానిం
జేయఁదగునందువేమో వినుము. (౪౭) ఓధనంజయా! పరమే
శ్వరైకపరత్వమే యోగ మనంబడుఁగదా. దానియందు స్థిరత

నిత్యసత్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. ౪౫. యావానర్థ ఉదపానే
సర్వతస్సంప్లుతోదకే తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. ౪౬.
కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన, మా కర్మఫలహేతుర్భూర్మాతే
సంగోఽస్త్వకర్మణి. ౪౭. యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ.

నొంది యీశ్వరార్థముగాఁ గర్మముల నాచరింపుము. నేను కర్తననునభినివేశము వదలి ముఖ్యముగా నీశ్వరు నాశ్రయించియే చేయుము. ఫలతృష్ణ మాని చేయఁబడుకర్మమునందు సత్త్వశుద్ధివలనఁ గలిగినజ్ఞానప్రాప్తి లక్షణయగుసిద్ధి గలుగు. తద్విపర్యయమే యసిద్ధి యనంబడును. అట్టి సిద్ధ్యసిద్ధ్యులయందు సమానభావముగలవాఁడవై కర్మముల నాచరింపుము. యోగ మననేమి? దేనియందు స్థిరత్వముగలిగి కర్మ మొనరింపుమంటివి? అందువేమో సిద్ధ్యసిద్ధిసమత్వమే యోగ మనంబడును. అది చిత్తసమాధానరూపము గలదని యెఱుంగుము. (౪౯) ధనంజయా! వ్యవసాయాత్మికచేఁ జేయఁబడుకర్మయోగముబుద్ధియోగ మనంబడును. దానినుండి కామ్యకర్మము దూరమగుటచే నీచమైనది. జ్ఞానమునందునాశ్రయమగుకర్మయోగమునను ష్ఠింపుము. సకామకర్మములు చేయుమానవులు దీనులు. కావున నిట్టి కర్మముల నొనరింపఁబూనకుము. సమత్వబుద్ధియుక్తుఁడవై స్వధర్మము ననుష్ఠించుచు నేఫలమునొందుదువో దానిని జెప్పెద. ఆలకింపుము. (౫౦) సుకృత మనఁగా స్వర్గాదిఫలములఁ గల్గించునది. దుష్కృతమనఁగా నరకమునుగల్పించునది. ఈలోకమున సుకృతదుష్కృతరూపకర్మముల రెండింటినిసమత్వవిషయమగుబుద్ధిచేఁ గూడినవాఁడు వదలఁగలఁడు కావున నట్టిబుద్ధియోగముకొఱకుఁ బ్రయత్నింపుము. (౫౧) కర్మములయందుఁ గుశలత్వ

---

సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. ౪౮. దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ, బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. ౪౯. బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే, తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం. ౫౦. కర్మజం బుద్ధియుక్తా

మనఁగా బంధస్వభావము లగుకర్మములయందు సమత్వముగా నుండి వానికి లోఁబడకయుండుటయే యని యెఱుంగుము. ఇష్టానిష్టదేహప్రాప్తియే కర్మజమగుఫలంబగు. దానిని విడిచి యీశ్వరారాధనార్థమే కర్మముల నాచరించుససమత్వబుద్ధిగల వారలై జ్ఞానముకలవారలై జన్మరూపమగు బంధమునుండి విని ర్ముక్తులై సర్వోపద్రవరహితమగు మోక్షపదము నొందు చున్నారు.

(౫౨) యోగానుష్ఠానజనితమై సత్త్వశుద్ధిగలబుద్ధి నా కెప్పుడు కలుగునని ప్రశ్నింతువేమో వినుము. ఏకాలమునందు మోహాత్మకమగు నవివేకరూపమగు కాలుష్యమును నీబుద్ధి వ్యతిక్రమింపఁగలదో అతిశుద్ధభావమును బొందఁగలదో, అప్పుడు వైరాగ్యము నొందఁగలవు. శ్రోతవ్యము శ్రుతము నిష్ఫలముగాఁ దోఁచును (౫౩) మోహకలిలాత్యయద్వారమున వివేకప్రజ్ఞనుబొంది నేనెప్పుడు కర్మయోగజఫలం బగుపరమా ర్థయోగమును బొందఁగలనందువేమో వినుము. అనేకవిధము లగుసాధ్యసాధనసంబంధములను ప్రకాశింపఁజేయునర్థములను వినుటచేత విక్షిప్తమైనదగుచు నీబుద్ధి యెప్పుడు స్థిరీభూత మగునో విక్షేపచలనములు లేనిదై సమాధియందు నిశ్చలతం గాంచునో అప్పుడు యోగము ననఁగా వివేకప్రజ్ఞయగుసమా ధిని బొందఁగలవు.

---

హి ఫలం త్యక్త్వా మనీషిణః జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయం. ౫౨. యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి, తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ. ౫౩. శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా, సమాధావచలాబుద్ధిస్తదా యోగమవాప్స్యసి. ౫౪. అర్జునఉవాచ-

(౫౪) అని శ్రీకృష్ణుఁ డుపదేశింపఁగా నర్జునుఁడు శంకలు నశింపఁ జేసికొనుకోర్కితో నిట్లు ప్రశ్నించెను. ఓకేశవా! సమాధియందుండు స్థితప్రజ్ఞునకు లక్షణమేది? స్థితప్రజ్ఞుఁ డెట్లు పలుకును? ఎట్లు కూరుచుండును? ఎట్లు ప్రవర్తించును? అని ప్రశ్నింపఁగా భగవంతుఁడు శ్రీకృష్ణుఁ డిట్లు సమాధానము చెప్పుచున్నాఁడు. (౫౫) ఏకాలమున మనస్సునఁ గలసకలవాంఛలను వదలుచున్నాఁడో ప్రత్యగాత్మయందే స్వాత్మచేత బాహ్యలాభనిరపేక్షుఁడై పరమార్థదర్శనామృతరసలాభమునఁ దుష్టుఁడై యుండునో అప్పుడు స్థితప్రజ్ఞుఁ డనఁబడును. ఇంతియ కాదు. (౫౬) ఆధ్యాత్మికాదిదుఃఖములు ప్రాప్తింపఁగా క్షుభితమనస్కుఁడు గాక సుఖములు కలుగఁగా విగతస్పృహుండై విగతరాగభయక్రోధుఁడై యుండు మననశీలుఁడు స్థితప్రజ్ఞుఁ డనంబడును. అని పలికి "స్థితప్రజ్ఞస్య కా భాషా" యన్న ప్రశ్నమునకు బదులు చెప్పఁబూని యిట్లు పలికెను. (౫౭) ఎవ్వఁడు దేహజీవితాదులయందు స్నేహవర్జితుఁడై శుభము లభింపఁగాఁ బ్రశంసింపఁడో ప్రతికూలఫలము గలుగ నిందింపఁడో కేవలము దాసీనుఁడుగ నుండునో యతని ప్రజ్ఞ ప్రతిష్ఠిత యనఁబడును. స్థిరబుద్ధి యనఁబడును. ఇంతియగాదు. (౫౮) ఏకాలమున నప్ట

---

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ, స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్. ౫౪. శ్రీభగవానువాచ.—ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్, ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే. ౫౫. దుఃఖేష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః, వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే. ౫౬. యస్సర్వత్రానభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభం, నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౫౭. యదా సంహరతే చాయం

యోగి సర్వవిషయములనుండి యింద్రియములను కూర్మము తనయవయవములను లోనికీడ్చుకొనునట్లు మరలించుకొనునో యాతని ప్రజ్ఞ ప్రతిష్ఠిత యనంబడును. ఇంద్రియములనుండి విషయగ్రహణముచేయని దేహాభిమానముగల యజ్ఞునకు విషయములు నివర్తించును. అనఁగాఁ దదనుభవము నివర్తించునని సారము. అభిలాషము నివర్తింపదు. ఆ రాగము పరమాత్మను గాంచిన యీ స్థితప్రజ్ఞునకుఁ దనకుఁదానే నివర్తించును. అనఁగా నశించునని యెఱుంగుము. (౫౯-౬౦) కౌంతేయా! సమ్యగ్దర్శనాత్మిక యగు ప్రజ్ఞకు స్థైర్యమును గల్పింపుము. ఓకౌంతేయా! మోక్షమునకుఁ బోవ యత్నించుచు వివేకియు నగుపురుషుని మనస్సు నింద్రియములు బలాత్కారముగా హరించుచున్నవి. ఏలయనఁగా నింద్రియములు ప్రక్షోభకరములుగదా. (౬౧)అట్టి యింద్రియముల వశీకరణముచేసికొని సమాహితుఁడై మత్పరుఁడై అనఁగా వాసుదేవుఁడనగునన్నుఁబరదేవతగా భావించుకొనవలయు. ఎవ్వని స్వాధీనమునందుండునో యాతని ప్రజ్ఞ ప్రతిష్ఠిత యనంబడును. స్థిరముగా నుండునని యెఱుంగుము. (౬౨-౬౩) గుణబుద్ధిచే శబ్దాదివిషయములఁ జింతించుపురుషునకు వానియందాసక్తి కలుగును ఆవిషయసంగమువలన నధికకామము గల్గును.

---

కూర్మోంగానీవ సర్వశః, ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౫౯. విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః, రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. ౬౦. యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః, ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః. ౬౧. తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీతమత్పరః, వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౬౨. ధ్యాయతో విషయాన్ పుంసస్సంగస్తేషూ

దానివలన నాకానాకప్రతిహతవలనఁ (కోరిక నెఱవేఱమిచే) క్రోధము కల్గును ఆక్రోధమువలనఁ గార్యాకార్యవివేకాభావమగు సమ్మోహము గలుగును. ఆసమ్మోహముచేత శాస్త్రముచేత నాచార్యునిచేత నుపదిష్టమగునర్థస్మృతికి భంగము (చలనము) కలుగును. ఆస్మృతిభ్రంశమువలన బుద్ధినాశము కలుగును. కార్యాకార్యవిషయవివేకాయోగ్యతయే బుద్ధికి నాశమని యెఱుంగుము. ఆబుద్ధినాశమువలన మృతతుల్యుఁడగును. పురుషార్థాయోగ్యుఁడే మృతతుల్యుఁడని గ్రహింపఁదగును. (౬౪) రాగద్వేషములవదలిన స్వాధీనేంద్రియములచే నిషిద్ధవిషయముల ననుభవించుచున్నను వశవర్తియగుమనస్సుగలవాఁడు శాంతిని బొందుచున్నాఁడు. (౬౫) ప్రసాదము గలిగినంతనే యతనికి సర్వదుఃఖములు నశించును. ప్రసన్నచేతస్కునకు వేగమే బుద్ధి ప్రతిష్ఠిత యగును. (౬౬) అవశీకృతేంద్రియునకు శాస్త్రాచార్యోపదేశములవలన నాత్మవిషయముగల బుద్ధియే కలుగదు. అయుక్తునకు ధ్యానముకలుగదు. ధ్యానముచేయనివానికి శాంతి యెక్కడిది? అశాంతునకు మోక్షానంద మెట్లు కలుగును? మఱియొక్కమాట వినుము. (౬౭) ఇంద్రియములు శబ్దాదివిషయములందుఁ బ్రవర్తించునప్పన

---

పజాయతే, సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే. ౬౩. క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః, స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి. ౬౪. రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్, ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి. ౬౫. ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే, ప్రసన్నచేతసోఽహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే. ౬౬. నాస్తి బుద్ధిరయుక్తస్య నచాయుక్తస్య భావనా, న చాభావయతశ్శాంతిరశాంతస్య కుతస్సుఖమ్. ౬౭. ఇన్ద్రియాణాం హి చరతాం

మనస్సును నిరోధింపఁజాలక పోవనిచ్చినయెడల నామనస్సు నీటియందు నొకను చక్కఁగాఁ బోవనీయక సాంయాత్రికుల మార్గమునుండి యున్మార్గమునకు వాయువు త్రిప్పునట్లు ఆత్మ విషయప్రజ్ఞను హరించును.

(౬౮) అని యింద్రియనిరోధము ప్రధానమని బహువిధముల బోధించి దానిని వదలి మఱొకయర్థమును నిర్వచింపఁ బూని యుపసంహరించుచు శ్రీకృష్ణమూర్తి యిట్లనియె. కావున నోమహాబాహూ! సకలవిధప్రయత్నములచేతనే పురుషునింద్రియములు శబ్దాదివిషయములనుండి మరలించి స్వవశమున నునుచుకొనఁబడునో యాపురుషునిబుద్ధి స్థిరతం గాంచును అని నమ్ముము. లోకమున నిదురించువాఁడువలె దర్శనాదివ్యాపారశూన్యుఁడై సర్వప్రకారములచేత వశీకృతేంద్రియజాలుఁడై లోకమున నొక్కఁడును గనఁబడఁడు. కావున నీలక్షణ మసంభావితమని యాశంకించుకొని యా శంకను గలుగకయుండఁజేయఁగోరి యిట్లు పల్కెను. (౬౯) ఓయర్జునా! సకలభూతములకు (నాత్మాజ్ఞానధ్వాంతసంవృతమతు లగువారికి) నేది నిశయో యట్టినిశయందు దర్శనాది వ్యాపారములు లేనందున నిగృహీతేంద్రియుఁ డగుయోగి మేల్కొనుచున్నాఁడు. విషయబుద్ధిచేత భూతములు మేలుకొని యుండువేళ నాత్మతత్త్వమును జూచుచున్న (ఆలోచించుచున్న) ముని యప్పుడు నిదురించును. ఆకాలమామునికి

యన్మనో౽నువిధీయతే, తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి. ౬౮. తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః, ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౬౯. యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ, యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో

నిశయనుసారమును గ్రహింపుము. పగటివేళ గ్రుడ్డివిగా నుండు గూబలు లోనగువానికి రాత్రియందే చూపు గలదు. పగటివేళ చూపు కలుగదు. అట్లే బ్రహ్మ పగ మాత్మతత్త్వమును బరికించుయోగి నేత్రములు తెఱచుకొని యున్నను, బ్రహ్మమునందే చూపుగలుగును. అంతియకాని విషయములయందుఁ గలుగదు. (౭౦)అర్జునా! అట్టులైన విష యములయందు దృష్టియుండదు గాన నాతఁ డెట్లు వాని నను భవించునని శంకింతువేమో వినుము. బహువిధనదులచే నిండిం పఁబడుచున్నను మర్యాద నతిక్రమింపక యున్నసముద్రము నుదకములు తమయంతన ప్రవేశించునట్లు కామములు (విషయ ములు) అంతర్దృష్టి గలిగి, భోగములచే వికారమును బొందిం పఁబడకయున్న నేపురుషశ్రేష్ఠుని బ్రారబ్ధకర్మములచేఁ బ్రోత్స హింపఁబడి ప్రవేశించునో యాముని కైవల్యంబు నొందును. అంతియకాని భోగముల ననుభవించువాఁడు కాఁడు. కాఁబట్టి తమంతన లభించినకామముల నుపేక్షించి లభింపనికామముల యందు నిస్పృహుఁడై (వానిఁగోరక) ఆత్మసంభావనావిము ఖుఁడై యిది నాదియనునభినివేశము లేనివాఁడై యెవఁడు సంచ రించునో యతఁడు ప్రారబ్ధవశమున భోగముల ననుభవించుచు న్నను సర్వసంసారదుఃఖనివృత్తిలక్షణముగలశాంతినిబొందును. (౭౧-౭౨) ఓయర్జునా! ఇదియే బ్రహ్మజ్ఞాననిష్ఠ. ఈపూర్వోక్త

---

మునేః. ౬౯. ఆపూర్యమాణమచలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశంతి యద్వత్, తద్వత్కామాయం ప్రవిశంతి సర్వే స శాంతిమాప్నోతిన కామ కామీ. ౭౦. విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః, నిర్మమో నిరహంకారస్స శాంతిమధిగచ్ఛతి. ౭౧. ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ

లక్షణములుగలది. పరమేశ్వరారాధనము చేత శుద్ధాంతఃకరణుడగుపురుషుఁడు దీనినిబొంది విమోహమును (సంసారమోహమును) బొందఁడు. ఈబ్రాహ్మీస్థితియం దంత్యకాలమున నుండువాఁడు మోక్షమును బొందును.

ఇది సాంఖ్యయోగము.

---

మహామనీషులారా! అర్జునుఁడు విషాదమునొందుట పూర్వాధ్యాయమునఁ దెలియనయ్యెను. ఆపార్థునివిషాద మునునయించి యుద్ధోన్ముఖునిగా నొనరించుటకు భగవంతుఁడు ప్రయత్నించి యీసాంఖ్యయోగము నుపదేశించెను. సాంఖ్యబుద్ధియనియు యోగబుద్ధియనియు రెండువిధములుగా బుద్ధుల నిర్దేశించెను.

శ్లో. "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి." 39

అను వాక్యముచేత బుద్ధిద్వయము బోధించెనని తెలియందగును. ప్రకృతబోధనమందు సారమేమి? భగవంతునభిప్రాయమేమి? అనునదియే యిట విచారింపఁదగియున్నది. తాను భూభారహరణార్థ మవతరించెను. ఆపని కర్జునుఁడు సాధనము కాఁదగినవాఁడు. ఈయుద్ధముననే ఆపని కావలయును. అర్జునుని వదలిన నీపని కుపయోగించుమానిసి యొక్కఁడు లేఁడని భగవంతునకుఁ దెలియుట చిత్రమనరాదు. అస్మదాదులకుం గూడఁ దెలియఁగలదు. అట్టి యర్జునుఁడు శరశరాసనములు

---

నైనాం ప్రాప్య విముహ్యతి, స్థిత్వాస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. 72.

సాంఖ్యయోగస్సంపూర్ణః.

పాఱవైచి మోహము విన్నఁదనము వహింప నాకీయుద్ధ మేల యని చేతులు త్రిప్పెను. భిక్షాటనమే మేలనియె. మత ధర్మములు పాడగుననియె. స్త్రీలు భ్రష్టలగుదురని భయపడి యెను. దాన వర్ణసంకరమగునని వెఱఁజెందెను. ఉత్తమసంతతి కలుగదని తత్తఱపాటొందెను. ఇన్ని దుష్కార్యములకుఁ దానేల కారణభూతుఁడను గావలయుననియే యాపార్థు నభిప్రాయమని యంగీకరింపక తప్పదు. యుద్ధము సంసిద్ధముగ నున్నది. కొలఁదిగడియలలో నారంభింప నంత ఉద్యుక్తు లగుచున్నవారు. ఇట్టికాలమున నర్జునుఁడు పెదవి విఱువఁగా శ్రీహరి యేమిచేయవలయును? తాను యుద్ధముచేయననియే కదా సారథ్యమున కంగీకరించెను? ఇప్పు డేమిచేసిన కృష్ణుని యభిప్రాయము నెఱవేఱును? వేఱొకనియందుఁ దనశక్తి నారోపించి యాతనిమూలమునఁ గార్యముసాధింపరాదాయని కొందఱందురు. అది పొసఁగనిపని. నరనారాయణుల కవి నాభావసంబంధము గలదు. అర్జునునియందే ధైర్యశక్తి నావహింపఁజేసి విషాదమునే పొందకుండఁ జేయరాదా యని మఱికొందఱు ప్రశ్నింతురు. ఇదియు నంత మంచి ప్రశ్నము కాదు. ఏలయనఁగా, ఈవిషాదము నపనయింప భగ వంతుఁ డుపదేశింప నాయుపదేశమును బ్రమాణముగా నెల్లరు గ్రహించి కృతార్థులగుదురు. విషాదమే కలుగకున్న నుపదేశింప వలనుపడదు. కారణములేక కార్యము పుట్టదు. ఈవిషాదము కలుగనితఱి శ్రీహరియే యుపదేశించియుండిననప్రస్తుతప్రశంస యని యెల్లరు హరియుపదేశమే కాదని యుందురు. భగవచ్ఛా స్త్రమున కెన్నియో యుపయోగము లుండును. నిరర్థకముగా

సర్వజ్ఞుఁ డొక్కకార్యముకూడఁ జేయఁడనుట సత్యము కొన్నికార్యము లనవసరములుగాఁ జేసినట్లు మన కగపడినను వానివలనిఫల మిట్టిదని మన మెఱుంగఁజాలకపోతిమని పరితాపము నొందవలయునేగాని వేఱొకమాట పలుకరాదు. కావున భగవంతుఁడు శ్రీకృష్ణమూర్తి యర్జునువిషాదమును దిలకించి యీతని కిత్తరుణమున నేను గర్తనన్నయహంకారమును దొలఁగించినగాని కార్యము నెఱవేఱదని తలంచెను. సంశయ మొక్కమాటచేఁ దొలఁగవచ్చునుగాని మరల శంక కలుగకుండునా యొక్కమాట చేయంజాలదు. ప్రతిదినము శంకనొంది యర్జునుఁడు శరాసనము నేల వైచుచుండుట మరల శ్రీకృష్ణుఁ డుపదేశించుచుండుట. ఆదిన మెట్లో యుద్ధముసాగుట మరల నిశ్చేయగుట యనునివి చక్కనిమార్గములు కావు. కలిగినసంశయమును సుంతయే మిగులకయుండఁ దొలఁగించినఁగాని కార్యము చక్కఁగా సాగి భూభారము తొలఁగదని నిశ్చయించి యీసాంఖ్యయోగము నుపదేశించెను.

అర్జునున కిపుడు కలుగఁదగిన దేది? అహంకారశూన్యత్వము. నేను గర్తను నామూలమున నిందలు మృతినొందుదురు. దాన నిన్నిచిక్కులు గలుగును. ఇన్నింటికి నాధారభూతుఁడను నేను. అను నీమొదలగుదురూహలు తొలఁగవలయును. సత్కర్మముల నాచరింపవలయును. కాని వానిఫలములను గోరరాదు. మానవుఁ డస్వతంత్రుఁడు. విధివిహితకర్మముల నాచరింపకయుండుట దోషము. అంతియగాక భగవదాజ్ఞను మీఱినట్లగును. మానవుఁడు నిమిత్తమాత్రమే

కాని కర్తకాఁడు అను నీలోనగుసూహలు తొలఁచవలయును. అవి దృఢపడవలయును. అట్టులైనఁ గార్యము సాగును. ఇందులకు భగవంతుఁ డేమిచేయవలయును? తొలుత నర్జును నకుఁ గలయహంకారము తొలఁగవలయును. అందులకే సాంఖ్యయోగము నుపదేశించెను. దేనిచేతఁ బరమార్థాత్మ తత్త్వనిరూపణము చేయఁబడునో యది సాంఖ్యమనంబడు. తద్విషయకబుద్ధి సాంఖ్యబుద్ధి యనంబడును. ఆత్మకు జన్మాదిష డ్విధక్రియాభావమువలన నకర్త యాత్మ యని ప్రకరణమునఁ గల యర్థనిరూపణమువలన నేబుద్ధి జనించునో యది సాంఖ్య బుద్ధియని భావము. ఏజ్ఞానుల కాబుద్ధి యుచిత మగుచున్నదో వారే సాంఖ్యు లనంబడుదురు. జన్మమునకంటె ముం దాత్మకు దేహాదివ్యతిరిక్తకర్తృత్వభోక్తృత్వాద్యపేక్ష గలిగి ధర్మాధర్మ వివేకపూర్వకమై మోక్షసాధనానుష్ఠానలక్షణ మగునది యోగమనంబడును. తద్విషయకబుద్ధియే యోగబుద్ధి యనం బడును. అది యెవరి కుచితమో వారే యోగు లనంబడు దురు. సాంఖ్యబుద్ధి యని యోగబుద్ధి యను నీరెండుబుద్ధుల నాశ్రయించి రెండునిష్ఠలు భగవంతుఁ డుపపాదించెను. ఈగీతాశాస్త్రమునం దించుకంతయు శ్రౌతస్మార్తకర్మము లాచ రించిన ముక్తి కలుగునని చెప్ప నవకాశము లేదని యార్యుల యభిప్రాయ మనవలయు. ఆ కర్మములు జ్ఞానయుక్తముగాఁ జేయఁబడి ప్రతిఫలమును గోరనివైననే కర్త కుపకరించి ముక్తి సాధనములగునని తేలెడిని. పురుషుఁడు తాఁజేయఁదగునని శాస్త్రము విధించినకర్మములను జాతిధర్మముల ననుసరించి చేయవలయుననియు వానివలన లాభముగాని నష్టముగాని

కలిగినచో శిక్ష నొందఁదగుననియు దానఁ బాపము గాదనియు
స్పష్టమగును.

శ్లో. "సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి." 38

అనునుపదేశ మీవిషయమును దృఢపఱిచెడిని. మఱియు నపకీర్తిని భరించి జీవించుటకంటె మరణ ముత్తమమని హరి యుపదేశించెను. క్షత్రియజాతికి ధర్మహిత మగుయుద్ధము నొనరింపక యున్నచో స్వధర్మమును గీర్తిని బోఁగొట్టుకొని పాపము నొందఁగలవని హెచ్చరించెను. పెక్కండ్రు నీవు యుద్ధము మానఁగా భయంపడి సంగరమును మానె నందురు. దాన నీమర్యాదపోయి లాఘవముగలుగును జుమీ యనియు హరి తేటపఱిచెను. నీశత్రువులందఱు నిన్ననరానిమాట లందురు. నీశక్తిని నిందింతురు. అంతకంటె మిక్కిలి దుఃఖ మొక్కఁడు కలదా? యుద్ధమునఁ బడితివేని వీరస్వర్గము దొరకును. జయించితివేని రాజ్యసంపద లలవడును. కావున లేచి యుద్ధముచేయ నిశ్చయించుకొమ్మా యని హితము గఱపెను. దుఃఖింపఁదగని విషయమున దుఃఖించుచున్నావు. పండితులు చెప్పఁదగినమాటల నపండితుఁడవగు నీవు పలుకుచున్నాఁడవు. నేను బండితుఁడను గానాయందు వేమో. పండితులు చచ్చినవారి కొఱకుఁ జావనివారికొఱకు దుఃఖింపరని బెదరించెను. ఇందుఁ జచ్చువాఁ డెవ్వఁడు? ఆత్మకు నాశనములేదు. దేహములు స్థిరముగా నుండునవికావు. దేహము లాత్మకుఁ బ్రాతవస్త్రములవంటివి. వానిని వదలినవా రెవ్వరు దుఃఖించినట్లు నీ వెఱుఁగుదువా? అట్లే తమంతన నశించు దేహముల నాశనము

కొఱకు దుఃఖించెదవే? ఏల యని చీవాట్లు పెట్టెను. యుద్ధము చేయమానుటకుఁ గలకారణము నీకుఁ గలయజ్ఞానమే కాని వేఱుగాదని బోధించెను. ఇట్లు పలుభంగుల నర్జునునకుఁ గల సంశయములఁ దొలఁగింపఁ బెక్కువిధముల బోధించెను. వేదములు సత్త్వరజస్తమోగుణములఁ దెలుపుకర్మములఁ జేయువారలకుఁ దదనురూపఫలములను బ్రతిపాదించుచున్నవి. నీవు నిష్కాముఁడవు కమ్ము. అనఁగా శ్రుతిసిద్ధకర్మములను జేయకుండుమని కాదు. సకామకర్మముల నాచరింపక నిష్కాముఁడవై లోకసంగ్రహార్థము కర్మముల నాచరించి యితరులకు మార్గదర్శకుఁడవు కమ్మని మనసున కెక్కం బలికెను. స్వధర్మము ననుష్ఠింపకుండకుమని మరలమరలఁ దెలిపెను.

శ్లో. "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మాతే సంగోఽస్త్వకర్మణి. ౪౭
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. ౪౮
దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ,
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః." ౪౯

అను మొదలగునవి పైవిషయములను బోధించును.

ఈయధ్యాయము నుపదేశించుటవలన నేర్పుకొనఁదగు సార మేమనఁగా మానవుఁడు జాతిధర్మముల వీడక యాచరించుచు ఫలములఁగోరక సత్కర్మములను హింసాశూన్యముగ జేయుచుఁ దనయందుఁ గర్తృత్వ మారోపించుకొనక తన కృత్య మిది యని యెఱింగి యితరులకు మార్గముచూపుటకై చేయుచు సుఖదుఃఖములు, జయాపజయములు, లాభాలాభ

ములను వానియందు సమత్వము గలిగి వర్తించుచుండవలయు
ననియుఁ, గర్మమునందే మానవున కధికారముకాని ఫలములు
గోరుటయం దధికారము లేదనియుఁ దాను గర్మఫలహేతువు
కారాదనియు, సత్కర్మముల విడువరాదనియుఁ, దా జేయఁ
బూనిన సత్కర్మములు సిద్ధించినను సిద్ధింపకయున్నను సముఁడై
యుండవలయుననియు, ఫలములు కోరుకర్మములు నీచము
లనియు వానియం దాదృతి గలిగియుండరాదనియు నేర్చు
కొనవలయు. మఱియు సర్వజ్ఞత్వము నారోపించుకొని పండి
తులవలె సంభాషింపరాదు. లోకాపవాదమునకు భయంపడ
వలయు. లోకులు నిందించునట్లు కార్యములు చేయరాదు.
లోకాపవాదమునొంది బ్రదుకుటకంటె మరణమే మేలు.
యోగమునందు బుద్ధి నాసక్తిగలదానినిగాఁ జేయవలయును.
భగవంతుని శరణమని నమ్మియుండవలయును. ధర్మనిర్ణయము
నందు నధికారముకలవాఁడు కాఁబడదు. తెలియనివిషయమును
దెలిసినట్లు నటించుచుఁ జెప్పరాదు. కామములను వదలి నిస్పృ
హుఁడై నిరహంకారుఁడై యుండువాఁడు శాంతిరూపమగు
ముక్తి నొందును. నిష్కామస్థితి మోహ మొందఁడు. ఒకా
నొకప్పుడుగాక యంత్యకాలమునందు నీస్థితి యుండవలయును.
దాననే ముక్తి కలుగును అను నీమొదలగువిషయము లిందు
ముఖ్యములు. నేను గర్తననునహంకారమును మాని క్షత్రియ
జాతిధర్మమగుసంగరము నొనర్చుచు నాయుద్ధమునఁ గలుగు
లాభాలాభములయెడ మనస్సునుపక యుండుమని యర్జునునకు
బోధించినమాటలంగలసారము. ఈసాంఖ్యయోగము నుప
దేశించుటవలన నర్జునునకుఁ దాను నిమిత్తమాత్రుఁడనేకాని

సర్వమునకుఁ గర్త వేఱొకఁడని తోఁచెను. ప్రధానముగా జాతిధర్మము నాచరించుటవలనఁ బాపము లేదనుభావము స్పష్టమయ్యెను. తాను మాటలాడినమాటలంబట్టి శ్రీహరిబుద్ధి నించుక తనపైని ప్రీతికలిగెననియుఁ బొడకట్టెను. తనమనస్సు సంశయాక్రాంత మయ్యెనని హరి యెఱింగె ననుభయము గలిగెను. ఈవిషయము నీక్రిందియర్జునునిప్రశ్నముస్పష్టీకరించెడిని.

శ్లో. "కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః,
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్." ౭

ఈప్రశ్నమును విని శ్రీహరి పక్కున నవ్వెను. అనఁగా జ్ఞానహీనుఁడై యర్జునుఁడు ప్రశ్నించుచున్నాఁడని హరిభావము. ఏలయనఁగా నింతమాత్రము వివేక మర్జునునకు లేదని యిప్పుడే తెలిసికొంటినని హరియూహ యని మన మెఱుంగవలయును. తత్త్వమెఱుంగక యందేదో దోషము గలదని గొనవ్వరును నిశ్చయింపఁగూడదనియే దీనిభావము. ఇట్టు లీయధ్యాయము కర్మసిద్ధాంతమును జక్కఁగాఁ దెలిపెను. సాంఖ్యయోగమును వివరించెను. ఇఁకఁ దరువాతివిషయమునకుఁ బోవుదము. అది కర్మయోగ మనంబడు. అద్దాని శ్రద్ధమై నాలకింపుఁడు.

## కర్మయోగము.

(౧) ఇట్లు భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు సాంఖ్యయోగము నుపదేశింపఁగా నర్జునుఁడు దానిసారము నొకరీతి గ్రహించి

---

◆ కర్మయోగః. ◆

అర్జునఉవాచ.—జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన,

కర్మమునకన్న జ్ఞానమే శ్రేష్ఠమని శ్రీహరితాత్పర్యమని యెఱింగి యిట్లు ప్రశ్నించెను. శిష్యుఁడు గురువుచెప్పినవిషయమునందుఁ దాగ్రహింపఁగలిగినవిషయమును గ్రహించి యందుఁ దోఁచిన ప్రశ్నముల నడుగుట విహితమే. దానికి సద్గురువు ఆగ్రహింపరాదు. ఆసంశయము లడంగ నుత్తరము పలుకవలయును. ఆమర్యాద యీగీతాశాస్త్రమున స్పష్టపడునని పాఠకులు గ్రహింపవలయును. మఱియు శిష్యుఁడు తనకుఁ దెలిసినవిషయమును దెలియనట్లు నటింపరాదు. అది కపటమును దెలుపును. దాన శిష్యున కిసుమంతయు లాభము లేకపోవుటయే గాక గొప్పనష్టముకూడఁ గలదు. అట్లు ప్రశ్నించువాఁడు సచ్ఛిష్యుఁ డనఁబడుఁడు. శిష్యునిప్రశ్నము సత్యమైన నద్దానికిఁ దగినయుత్తర మీయఁగయుండువాఁడు సద్గురు వనంబడుఁడు. ఈమర్యాద శ్రీకృష్ణార్జునసంవాదమున స్పష్టమగును. ఇఁక విషయము నాలకింపుఁడు.

(౨) శ్రీకృష్ణా! కర్మముకంటె జ్ఞానమే యుత్తమోత్తమం బని నీయభిప్రాయమైనయట్లు నీయుపదేశమునుండి నే గ్రహించితిని. ఈ నాయభిప్రాయమే నీకు సమ్మతమగు పక్షమున నన్నీకర్మమునం దేల నియోగించెదవు? ఇది హింసాత్మకం బగుట ఘోరమనఁదగును యుద్ధమున హింసేతరకార్య మేమి గలదు? నీకు శిష్యుఁడనని మునుపే విన్నవించితిని గదా. (శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. అని) ఏమియు నెఱుంగని నన్ను సర్వమెఱింగిన నీవు మహాదారుణమగు కార్యమున నియోగించుట తగునా? ఏల నియోగించితివి?

తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ. ౧. వ్యామిశ్రేణైవ

దీనికింగల కారణముం దెలుపుము. కేశవా! క్షత్రియునకు యుద్ధమునకంటె ధర్మహితమగు కార్యము లేదని మున్నే తెలిపితివిగదా. దానిచేఁ గర్మమునకుఁగూడ శ్రేష్ఠత్వమును బ్రతిపాదించితివే మరల నిట్లేల ప్రశ్నించెదవని యడుగుదు వేమో. వినుము. నీవాక్య మొకచోఁ గర్మమును బ్రశంసించును వేఱొకచో జ్ఞానముఁ బ్రశంసించును. కావున సందేహము నుత్పాదించుచున్నది. దానిచే నాబుద్ధి యుయ్యేల వలె నూఁగులాడుచున్నది. ఇట్లు పలుకుట నన్ను మోహము గలవానిగఁ జేయునట్లున్నది. నీవు సర్వదా స్పష్టముగానే పలుకువాడవు కాని సంశయముగలుగఁ బలుకువాఁడవు కావు. పరమకారుణికునకుఁ గపట మెక్కడిది? నాకేమో భ్రాంతిచే నిట్లు తోఁచుచున్నది కావున మహానుభావా! ఈ రెంటింటియం దేది శుభమో యొక్కదానిని నిశ్చయించి పలుకుము. దేని నవలంబించిన నేను శ్రేయస్సు నొందుదునో దాని నీవే యాలోచించి పలుకుము. ఒక్కమార్గమునే తెలుపుము./ దాని నాశ్రయించి శ్రేయస్సు నొందుదును. అని సంశయాకుల మానసుఁడై యర్జునుఁడు ప్రశ్నింపఁగా నా ప్రశ్నమునకు సదుత్తరం బొసంగఁదలంచి భగవంతుఁ డిట్లు పలికెను.

(3) పాపరహితుఁడా! అర్జునా! సృష్ట్యాదియందు సర్వ మెఱింగినవాఁడ నగు నేను సర్వేశ్వరుఁడను గావున భూత గణమును బుట్టించి యందు మానవులకు నభ్యుదయము నిశ్శ్రే

---

వాక్యేన బుద్ధిం మోహయసీవ మే, తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్. ౨. శ్రీభగవానువాచ.—లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా

యస్సును గలుగుటకై వేదమార్గములఁ దెలుపు నవసరమందు ద్వివిధనిష్ఠలు చెప్పితిని. అందు సాంఖ్యులకు జ్ఞాననిష్ఠను దెలిపితిని. కర్మయోగులకుఁ గర్మనిష్ఠను దెల్పితిని. నేను బరస్పర నిరపేక్షముగా ముక్తిసాధనమని కర్మజ్ఞాననిష్ఠలను వచించి యున్నయెడల నా రెండింటిలో నేది యుత్తమమని నీకుఁ దోఁచునో దానిని మాత్రమే తెల్పుమని నీ వడిగినఁ జక్కఁగా నుండును అట్లు నేను జెప్పనే లేదు. ఏమి చెప్పితివందువా? రెండిటిచేతను బ్రహ్మనిష్ఠ నొక్కదానినే తెల్పితిని. ఆ రెండును గుణప్రధాన భూతములు. ప్రత్యేకించి వానికి స్వాతంత్ర్య ముపపన్నముగాదు. కావుననే ఒక్కనిష్ఠకే యధికారభేదమును బట్టి రీతిభేదము కలదని నిర్వచనము చేసితిని. శుద్ధాంతఃకరణులై జ్ఞానభూమిక నారోహించిన సాంఖ్యులకు జ్ఞానపరిపాకము నిమిత్తము జ్ఞానయోగముచేత ననఁగా ధ్యానము లోనగువానిచేత బ్రహ్మపరత్వము చెప్పితిని సాంఖ్యభూమిక నారోహింపఁ గోరువారలకుఁగా నంతఃకరణశుద్ధి మూలమున సాంఖ్యభూమిక సిద్ధించు నిమిత్తము యోగులకనఁగా దాని కుపాయభూతమగు కర్మయోగమునం దధికారులగు వారికిఁ గర్మయోగమున బ్రహ్మపరత్వము చెప్పితిని. చిత్తశుద్ధియుఁ జిత్తాశుద్ధియు ననునవస్థల మార్పుచేత నిష్ఠ రెండు విధములని చెప్పవలసి వచ్చెను. అంతియకాని నీవు ప్రశ్నించినట్లు చెప్పలేదు.

(౪) అని యుత్తరముచెప్పి చిత్తశుద్ధికలిగి జ్ఞానము చక్కఁగా నుదయించునంతదనుక వర్ణములకు నాశ్రమములకు

---

శ్లో॥ శ్లో ॥ మయానఘ, జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్.

3. న కర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే, న చ సన్న్యసనా

నుచితములగు సత్కర్మముల నాచరింపవలయును. అట్లా లాచరింపకయుండినఁ జిత్తశుద్ధి కలుగదు కావున జ్ఞానము లభింపదని యర్జునునకుం దెలుపఁబూని యిట్లు పలికెను. పార్థా! సత్కర్మములను జక్కఁగా నాచరించినంగాని నైష్కర్మ్య మనఁబడు జ్ఞానయోగనిష్ఠయే సిద్ధింపదు. అట్టి చక్కని జ్ఞానములేక కర్మములను జేయక వదలుటచేత జ్ఞానయోగనిష్ఠ లభింపదు. సన్న్యాసముననే ముక్తి సిద్ధించునని శ్రుతి యనువదించుచున్నది. కాన నిఁక గర్మము లెందులకు? అని ప్రశ్నింతువేమో. చిత్తశుద్ధిలేక చేయబడు కర్మత్యాగమువలన జ్ఞానము శూన్యమగును గాన మోక్షసిద్ధి లభింపదు. కావున ముక్తికి సాధనము జ్ఞానమేయైనను నది సత్కర్మాచరణమున జనించు చిత్తశుద్ధిమూలకము గానఁ గర్మత్యాగము సుసంగతము కాదు.

(౫) అదేలయందువేమో వినుము. జ్ఞానహీనుఁ డెవ్వఁడైనను ధనజన్మమధ్యమున రవంతసేపైనను గర్మము చేయక యుండఁజాలఁడు. ఏల యుండఁజాలఁడందువా లోకమున నజ్ఞులెల్లఁ బ్రకృతిసిద్ధములగు సత్త్వరజస్తమోగుణములచేత స్వేచ్ఛలేక యున్నప్పటికిని బరవశులే యగుచుఁ గర్మము చేయునట్లు చేయఁబడుదురు. పార్థా! కర్మసన్న్యాస మనఁగా నేమని యూహించితివో ముందు నేఁజెప్పినట్లు వానియం దాసక్తిలేకయుండుటయే కాని వానిని వదలుట కాదు. అది యశక్యమగు కార్యమనియు నమ్ముము. ప్రతిమానవునకు స్వభావమున రాగద్వేషాదులు కలుగును. అవి గుణత్రయజనితములు కావున నవియే వీనిచేఁ గర్మములు చేయించును. వానికి లోఁబడి యజ్ఞుఁడు

సన్నాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి. ౫. న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్య

సర్వదా కర్మముచేయుచుండునే కాని క్షణకాలమైన నూరక యుండఁజాలఁడు.

(౬) కౌంతేయా ! ఏపురుషుఁడు తన యంతఃకరణము శుద్ధము కాకపోఁగాఁ గర్మేంద్రియములను నిరోధించి చిత్తము పరిశుద్ధముగామిచేనాచిత్తము నిరోధింపఁజాలక విషయములను స్మరించుచుండునో అట్టివానియాచారము చిత్తవృత్తికి విరుద్ధము నిరర్థకము నగుసుగాన నాపురుషుఁడు మిథ్యాచారుఁడని పెద్దలచేఁ జెప్పంబడును. కర్మత్యాగి యజ్ఞుఁడని యెఱుంగుము. వానిని బ్రశంసింపరాదు. వాక్పాణిపాదాదులు కర్మేంద్రియములని చెప్పంబడును భగవద్ధ్యానమను నెపముచేత నింద్రియార్థములను స్మరించుచు, మన స్సపరిశుద్ధమగుటచే నాత్మయందు నిలువకపోవును గాన నతఁడే దాంభికుఁ డనం బడును. అట్టివారు లోకమున నెంతటో యుందురు.

(౭) ఓయర్జునా! అజ్ఞాని కావునఁ గర్మమునందధికృతుఁడగు నేవాఁడు మనస్సుచేత జ్ఞానేంద్రియములను నిగ్రహించి (నిరోధించి) నిష్కాముఁడై కర్మేంద్రియములచేతఁ గర్మయోగమును సల్పునో వాఁడు మిక్కిలి శ్రేష్ఠుఁ డగుచున్నాఁడు. మిథ్యాచారునికంటె నధికతరుఁడని యెఱుంగుము. మున్ను చెప్పిన కపటాచారమునకంటె విరుద్ధమగునాచారముగలవాఁ డుత్తముఁ డెవ్వఁడనఁగా నిగ్రహించి యనఁగా నీశ్వరాసక్తముగా నొన

ర్మకృత్, కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః. ౫. కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్, ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే. ౬. య స్త్వింద్రియాణి మనసా నియమ్యారభ

రించి యని గ్రహింపుము. ఈతఁడు చిత్తశుద్ధిగలవాఁడు కావునఁ బూర్వము చెప్పినవానికంటె నధికుఁడే యనఁబడును.

(౮) కౌంతేయా! అట్లుగావున నెట్టికర్మము నీకు శాస్త్రముచే విహితమగుచున్నదో ఫలముగోరి విధింపఁబడియుండదో యట్టి నిత్యకర్మమును నీ వాచరింపుము. ఫలయందు ఏమో కర్మానుష్ఠానము తత్త్యాగమునకంటె మిగుల మంచిది. కర్మము నాచరింపవేని శరీరయాత్ర కూడ సిద్ధింపదు. నిత్యమనఁగా సంధ్యోపాసనాదికర్మమని యెఱుంగఁదగు. చేయకయున్నఁ బ్రత్యవాయము దేనఁగలుగునో యది నిత్యకర్మ మనంబడును. సర్వకర్మశూన్యునకు శరీరయాత్ర కూడఁ గొనసాగదు.

(౯) కుంతీనందనా ! ఫలములనుగోరి చేయుకర్మమే కర్తకు బంధమును గలిగించునదియగును. అంతియగాని ఫలముల నాశింపక యీశ్వరార్పణమగుఁగాక యనునభిప్రాయమున జేయునిత్యనైమిత్తికకర్మము బంధజనకము కానేరదు. కాఁబట్టి నీవు కర్మములయం దాసక్తి వదలి భగవదర్పణముగాఁ గర్మము నాచరింపుము. సాంఖ్యులు సర్వవిధకర్మములును బంధజనకంబు గావునఁ జేయఁదగదందురు. దాని నిరాకరించుపద్ధతి వినుము. ఎప్పుడుగాని భగవదర్పణముగాఁ జేయుకర్మము బంధకము

---

తేఽర్జున, కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే. ౭. నియతం కురు కర్మత్వం కర్మ జ్యాయో హ్యకర్మణః, శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః. ౮. యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః,

గానేరదు. కావున నిట్టికర్మమునే యాచరింపుము. నిష్కాముం డవే యైనచో నీవు కర్మముల వదలక యాచరింపవలయును.

(౧౦) విజయా! ఈచెప్పంబోవు కారణములచేఁగూడఁ గర్మముచేయవలయును జుమీ. తొలుత సృష్టిచేయుకాలమునందు బ్రహ్మ ప్రజలను యజ్ఞములతోడఁ బుట్టించి యిట్లు పలికెను. ఈయజ్ఞముల నాచరించి మీరు ప్రజలారా! వృద్ధినొందుఁడు. దీనివలన మీరు కోరినఫలముల నొందఁగలరు అనునీప్రజాపతి వాక్యమువలనఁగూడఁ గర్మము ననుష్ఠించువాఁడుత్కృష్టుఁ డగును. యజ్ఞముల నాచరించుకొలఁదిని మీకు నుత్తరోత్తరాభివృద్ధి కలుగును. యజ్ఞమనఁగా నావశ్యకకర్మజాలమని గ్రహింపుము. కామ్యకర్మము లేల కాఁదని ప్రశ్నింతువా. ఈప్రకరణమున నవి నిందింపఁబడినవికదా. కావున నసంగతమే యాయర్థమగునుగాని సుసంగతము కానేరదు. సామాన్యముగా నకర్మమునకంటెఁ గర్మము శ్రేష్ఠమనుట యిటఁగల సారము. ఇంతియకాదు. ఇంకను బ్రహ్మవాక్యములు గలవు. వినుము. మీ రీయజ్ఞముల నాచరించి యింద్రాదిదేవతలను హవిర్భాగము లొసంగుటచేఁ దృప్తినొందింపుఁడు. ఆదేవతలు మీయందుఁ గృతజ్ఞులై వర్షాదులచే నన్నాదులను గల్పించి మిమ్ము సంతృప్తులను గావింతురు. ఇట్లు మీరొకరినొకరు సంతృప్తులనుగా నొనరించుచుండుటవలన మీకు జ్ఞానముగలిగి ముక్తికూడ లభించును. స్వర్గలాభము చెప్పనేల? ఇష్టకామములను యజ్ఞము

తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ స్సమాచర. ౯. సహయజ్ఞాః ప్రజా

పిదుకునని యెఱుంగవలయు. (౧౨) మీరు యజ్ఞములమూలమున దేవతల సంతుష్టులనుగాఁ జేయుదురేని వారు మీకిష్టములగు భోగముల ననఁగా స్త్రీపశుపుత్త్రాదులఁ గల్గింతురు. అట్లు దేవత లొసంగినవానిని వారి కర్పింపకయే యేమానవుఁ డనుభవించునో వాఁడు దొంగయే యనంబడును. అనఁగా నుపకారమునుబొంది మరల నుపకారము చేయకున్న దొంగ యనంబడుననియే యిచ్చటఁ గలసారము. (౧౩) దేవయజ్ఞాదులు నెఱవేర్చి మిగిలినయన్నమును భుజించువారు పంచసూనములనఁబడుదోషములనుండి విముక్తులగుదురు. అట్లుచేయక శరీరపోషణమునిమిత్తమై యెవరు పాకముచేయుదురో వారు పాపులగుదురు మఱియుఁ బాపమునే భుజించువా రగుదురు. (౧౪) కుంతీనందనా! ఈచెప్పఁబోవు కారణమునుబట్టియూడఁ గర్మము చేయవలయునని యేర్పడుంజుమీ. భక్షింపఁబడి శుక్రశోణితరూపముగా మాఱినయన్నమువలనఁ బ్రజలు పుట్టుచున్నారు కదా. ఆయన్నము పర్జన్యునినుండి కలుగుచున్నది. ఆవర్షమో యజ్ఞముమూలమునఁ గలుగును. ఆయజ్ఞమున్ననో ఋత్విజులు యజమానుఁడు లోనగువారు కలిసి చేయువ్యాపార మనంబడు కర్మమునుండి యేర్పడుచున్నది. జగచ్చక్రప్రవృత్తిహేతువగు

సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః, అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్టకామధుక్. ౧౦. దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః, పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ. ౧౧. ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః, తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః. ౧౨. యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః, తే త్వఘం భుంజతే పాపాః యే పచంత్యాత్మకారణాత్. ౧౩. అన్నాద్భవంతి భూతాని

టఁగూడఁ కర్మమాచరింపవలసినదేయని దీనినుండి తెలియఁబడు
చున్నదికదా. (౧౫) అట్టికర్మము వేదబోధిత మగుచున్నది. ఆ
వేదమో పరమాత్మనుండి పురుషనిశ్వాసమువలెఁ గలిగినది. ఈ
రీతిగాఁ బరమాత్మవలనఁ బురుషనిశ్వాసరూపమున జగదుపకార
ముకొఱకు వేదము ప్రవర్తిలచును గావున నావేదము సర్వార్థ
ములను దెలుపునదయ్యును యజ్ఞము జగచ్చక్రప్రవృత్తికిఁ
గారణము గావున యజ్ఞవిధానమునందు ముఖ్యాభిప్రాయము
గలదిగ నున్నదని యెఱుంగుము.

(౧౬) పార్థా! ఈప్రకారము వేదములను యజ్ఞము
లను బ్రవర్తింపఁజేసి పరమేశ్వరుఁడు నియమించిన యీజగ
చ్చక్రము నెవ్వఁడీలోకమునందు ననుసరించి సాగింపఁడో వాఁ
డింద్రియపరవశుఁడు. కావున నతనిజీవితము పాపభూయిష్ఠము
వ్యర్థము అగును. పరమేశ్వరవాక్యభూతమగు వేదాఖ్యమైన
బ్రహ్మమునుండి మానవులకుఁ గర్మమునందుఁ బ్రవృత్తి దాని
నుండి యజ్ఞసంభవము. దానివలనఁ బర్జన్యనియుత్పత్తి. తస్మాల
మున నన్నముగలుగుట దానివలన భూతములు వానికి మరల
నాకర్మమునందుఁ బ్రవృత్తి యిట్లు వదలనిసంబంధమునఁ బ్రవ
ర్తించుచక్రము ననుసరింపనివాఁడు పాపరూపమగు నాయుస్సు
గలవాఁ డగును. ఇంద్రియములమూలమున విషయములయం
దేయే కారణమున నాసక్తుఁడగునో యీశ్వరారాధనార్థమగు

---

పర్జన్యా దన్నసంభవః, యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః. ౧౪.
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవం, తస్మాత్సర్వగతం బ్రహ్మ
నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం. ౧౫. ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ

కర్మమునందు నిష్టనుకలవాఁడు కాఁడో, ఆ కారణమువలన వ్యర్థముగా నతఁడు జీవించువాఁ డగునని గ్రహింపుము.

(౧౭) ఇఁకఁ గర్మయోగము నెట్టివార లనుసరింప నక్కఱలేదో చెప్పెద వినుము. ఆత్మవేత్త యగుసన్న్యాసి యెవ్వఁడు ఆత్మయందే రతిగలిగి యాత్మచేతనే తృప్తినొందు వాఁడగుచు నాత్మచేతనే సంతోషించువాఁడగుచు సకలవిష యములయందు మిక్కిలి విరక్తుఁడై యుండునో అట్టిజ్ఞానికి మాత్ర మేమియు నాచరింపఁదగినది లేదు. (౧౮) మఱియు నాత్మరతిగలబ్రహ్మవేత్తకుఁ గర్మముచేయుటవలనఁ బ్రయోజన మేమియు లేదు. చేయకుండుటచేత ననర్థముకూడఁ గలుగదు. మఱియు నాయాత్మవేత్తకు బ్రహ్మాదిస్థావరాంతము లగుభూత ములలో దేనినిగాని యాశ్రయించి సాధింపఁదగిన ప్రయోజన మేదియు లేదు. కాఁబట్టి యట్టి మహాత్మునకుఁ గర్మము కలుగదు. నీవు నట్టిసమ్యగ్దర్శనము కలవాఁడవు కావు. (౧౯) కావున నీవు నిత్యనైమిత్తికకర్మములను ఫలాభిలాషములేక చక్కఁగా నాచరింపుము. ఫలము నపేక్షింపక కర్మము నాచరించు వాఁడు చిత్తశుద్ధినొంది దానిమూలమున ముక్తినొందు చున్నాఁడు. ఎందువలన జ్ఞానికిమాత్రమే కర్మము చేయనక్కఱ లేదో తదితరులకుఁ గర్మ మావశ్యకమో దానికిం గలకారణ మిదియే యని నిశ్చయించుకొనుము. అట్టియోగ్యత నీకున్నదో

---

యః, అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి. ౧౭. యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః, ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే. ౧౮. నైవ తస్య కృతే నార్థో నాకృతేనేహ కశ్చన, న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః. ౧౯. తస్మాదసక్తస్సతతం

ఆలోచించుకొనుము. నీవు కర్మముచేయవలసినందుల కింక నొకకారణము కలదు. దానివినుము.

(౨౦) జనకాదులు సత్కర్మముల నాచరించియేకదా ముక్తినొందిరి. దానికింగల కారణమేదో యాకారణమును బట్టియే నీవును గర్మము నాచరింపవలయును. అంతియగాక లోకులు దుష్టమార్గములఁ బ్రవర్తింపఁగా దానిని వారించుట కైనను నీవు నిష్కామకర్మముల నాచరింపవలయును. ఈసదాచారమును బ్రమాణముగాఁ గైకొని జనకాదుల నుదాహరణభూతులని తలంచి నీవు కర్మముల నాచరింపుము. నిన్నుఁ గాంచి మఱియుఁ గొందఱు చేయుదురు. లేకున్నఁ గొందఱు నీవలెనే మానుదురు. నీవలన లోకమునందుఁ గర్మమార్గమునకు హాని కలుగరాదు. కావున నీవు కర్మమును జేయుటకే తగుదువుగాని కర్మత్యాగమునకు నర్హుఁడవు కావు. (౨౧) లోకసంగ్రహమునకై యేల కర్మముల నాచరింపవలయునందువేమో ఉత్తమమానవుఁ డేయే కర్మము నాచరించునో దానినే తదితరులుగూడ నాచరింతురు. అంతియగాదు. ఆయుత్తమపూరుషుఁడు దేనిని బ్రమాణమని గ్రహించునో తక్కుంగలవారెల్ల దానినే ప్రమాణముగాఁ బరిగ్రహింతురు. ఇతరులనఁగాఁ బ్రాకృతజనులని యర్థము నెఱుంగుము.

కార్యం కర్మ సమాచర, అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః. ౧౯. కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః, లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి. ౨౦. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే. ౨౧. న మే పార్థా

(౨౨) ఇందులకు నేనే దృష్టాంతమని తెలియుము. వినుము నావిషయమును వివరించెదను. పార్థా! మూఁడుజగములయందును నాకుఁ జేయవలసినకర్మ మేదియు లేదు. లభింపని వస్తువు లభింపవలయుననికదా కర్మము నాచరించుట. సర్వకామములు నాకు లభించియుండుట నాకేదియు లభించవలసిన దేలేదు. అట్లుండియు నేను లోకసంగ్రహమునకే కర్మము నాచరించుచున్నాఁడను. (౨౩) కుంతీతనయా! ఇంక నుత్తమోత్తముఁడనగు నేనే యెత్తరుణముననైనను గర్మమును జక్కఁగాఁ జేయక యూరకుందునే నపుడు మానవులందఱు సర్వవిధముల నన్నే యనుసరించి కర్మానుష్ఠానవిముఖులగుదురు. దానిచే లోకనాశంబే ఫలమగును. కావుననే లోకసంగ్రహార్థమై నే నాచరించుచున్నాఁడనని తెలిసికొనుము (౨౪) అర్జునా! నేను గర్మముచేయకపదలితినా జనులెల్ల నామార్గము ననుసరించి కర్మత్యాగముచేసి వినాశమునొందుదురు. మఱియుఁ గర్మత్యాగమువలన వర్ణసంకరమగుటకుఁ గారణము నేనగుదును. లోకుల ననుగ్రహమునఁ గాపాడ నవతరించిననేనందులకువిరుద్ధముగాఁ బ్రవర్తించి ప్రజలకు నాశముకల్గించినవాఁడ నగుదును.

(౨౫) భారతా! నావలె నీవును గృతార్థమతివి. ఆత్మవిదుఁడవు కూడ నగుదువేని నీవలెనే వేఱొకఁడుఁగూడ నగు

---

స్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన, నానవాప్త మవాప్తవ్యం వర్తఏవ చ కర్మణి. ౨౩. యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః, మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౨౪. ఉత్సీదేయు రిమే లోకా నకుర్యాం కర్మ చేదహం, సంకరస్యచ కర్తాస్యా ముపహన్యామిమాః ప్రజాః. ౨౫. సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత, కుర్యా ద్విద్వాం

నేని అట్టితరుణమునఁగూడఁ గర్తవ్యము మీఁకు లేకయున్న నితరుల ననుగ్రహించుపొంటెఁ గర్మకర్తవ్యమే యగునని నామతము. వినుము. విద్వాంసులు కానివారు కొందఱు కర్మ ఫలముల నపేక్షించి యెట్లు శాస్త్రమునఁ జెప్పఁబడిన యట్లు కర్మముల నాచరించుచున్నారో ఆత్మజ్ఞుఁడగు యోగి కర్మఫలా పేక్ష లేనివాఁడయియుఁ గర్తృత్వాద్యభిమానము లేక యారీతి గానే శాస్త్రము ననుసరించియే కర్మము చేయును. కావున విద్వాంసుఁడు నవిద్వాంసుఁడుకూడఁ గర్మములఁ జేయవలయు నని దీనిసారమని గ్రహింపుము. మఱొక్కవిషయము నాలకిం పుము (౨౬) కర్తనని భోక్తనని బుద్ధిగలవారై ఫలాపేక్ష చేతఁ గర్మము నొనరించునజ్ఞులకు "మీరు కర్తలుగారు. భోక్త లుగారు" అనులోనగు వాక్యములచేత బుద్ధిభేదమును గల్గింపఁ గూడదు. అంతియగాక తాను బూనికతోఁ గర్మములను జేయుచు వారలచేతంగూడ సమస్తకర్మములను యథావిధిఁ జేయింపవలయును. కరుణచేతఁ దత్త్వజ్ఞానోపదేశము చేయఁ దగునందువా. అట్లు గాదు. అజ్ఞులు కర్మముల నాచరించుచుండ వారిబుద్ధులఁ జలింపఁజేసినచోఁ గర్మమునందుఁ గలశ్రద్ధ నశిం చుటయు జ్ఞానముదయింపదుగాన వారు భ్రష్టులగుటయు జర గునుగాన నాపని చేయరాదని నిశ్చయింపుము.

(౨౭) విద్వాంసుఁడు కానివాఁ డెట్లు కర్మాసక్తుఁ డగు చున్నవాఁడో వినుము. కర్మములన్నియును సర్వవిధములచే

---

స్తథా౽సక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్. ౨౬. నబుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం, జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్. ౨౭. ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః, అహంకారవిమూ

తాను సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థయగు ప్రకృతి కార్యకరణరూపములగు వికారములచేతఁ జేయఁబడుచున్నవి. కాఁబట్టి దానిచే వివేకము నశింపఁజేయఁబడఁగాఁ గార్యకరణముల నాత్మగాఁ దలంచును. వానిధర్మముల నాత్మధర్మములనుగా భావించును. ఆకర్మములను దాఁజేసినట్లు తలంచుచున్నాఁడు. దీనిచేతనే విద్వాంసునకు నవిద్వాంసునకుఁ గల భేదము నెఱుంగుము. ఇదియే యిందుఁగలవిశేషము (౨౮) అర్జునా! మహాబాహూ! గుణవిభాగకర్మవిభాగములయొక్క తత్త్వమెఱింగిన విద్వాంసుఁడన్నవో కరణములు స్వస్వవిషయములయందుఁ బ్రవర్తించి సమస్తకర్మములు చేయుచున్నవని తెలిసికొని యాకర్మములయందుఁ గర్తృత్వాభిమానమును బొందకయుండును. గుణవిభాగమనఁగా నేను గుణాత్మకుఁడను గానని గుణములనుండి యాత్మకు విభాగము. నాకుఁగర్మములు లేవని కర్మములనుండియు నాత్మకు విభాగము. ఈ రెండువిభాగములయందలి తత్త్వము నెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు మాత్రము కర్తృత్వాభినివేశము నొందఁడు. ఏలయనఁగా నింద్రియములే గుణములయందు (విషయములయందు) వర్తించుచున్నవి కాని నేను గాదని తలంచుచుండుట. ఇదియ యిందలి సారమని తలంపుము.

(౨౯) మఱియుఁ బ్రకృతివికారములగు దేహాదులచే సమ్మోహితులై యవ్వియే యాత్మయని తలంచి జ్ఞానహీనులు లా దేహాదులకర్మములను దమరే చేసినట్లును వానిఫలములను

---

ఢాత్మా కర్తాహమితి మన్యతే. ౨౮. తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః, గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే. ౨౯. ప్రకృతే

దమరే పొందుచున్నట్లు నభిమానమును బూనుచుందురు. అట్టివా రనాత్మజ్ఞులు మందమతులు నగుదురు. కావున వారి కాత్మజ్ఞుఁడగువాఁడు బుద్ధిభేదమును గల్గింపరాదు. కావునఁ దత్త్వజ్ఞులుగూడఁ గర్మము చేయవలయును. నీవన్న నింకను దత్త్వవిదుఁడవు గావు కావునఁ గర్మము చేయవలయునని యెఱుంగుము. (30) ఈశ్వరార్థము కర్మము చేయుచున్నాఁడనని యూహించుచు వివేకమహిమముచే సర్వాత్మకుఁడను వాసుదేవుఁడనగు నాయందు సర్వకర్మములు సమర్పించి ఫలమునం దభిలాషముమాని మమకారము నుజ్జగించి శోకము నొందక యుద్ధముచేయుము. (31—32) కౌంతేయా! ఈనా మతమును (కర్మమును నిష్కాముఁడవై చేయవలయునన్నది) మానవు లెవ్వారు శ్రద్ధగలవారలై నాయం దసూయలేక సర్వదా యనుసరింతురో వారుగూడఁ గర్మములనుండి విముక్తు లగుదురు. ఇఁక నీ కుపదేశించిన యీనామతమును దూషించుచు ననుసరింపరో వారు సర్వవిషయములయందును దత్త్వ మెఱుంగు జ్ఞానములేక మూఢులై వివేకహీనులై నశింతురు (33) నిన్ను ద్వేషించుచు నీమతము నాచరింపక యుండువారుకలరా యని యడుగుదువేమో

ర్గుణసమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు, తా నకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్. ౨౯. మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా, నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. ౩౦. యే మే మతమిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః, శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః. ౩౧. యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతం, సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః. ౩౨. సదృశం

వినుము. ముందుజన్మములయందుఁ జేసినధర్మాధర్మములు లోన గువాని సంస్కార మీజన్మాదులయందు నభివ్యక్తమగును. అదియే ప్రకృతియనంబడును. ప్రకృతి యెట్టిదిగానుండునో వానిప్రవృత్తియు నట్టిదిగనే యుండును. ఇది జ్ఞానికిం గూడ సమానమే. ఇంక మూఢునిమాట చెప్పనేల? అందువలన సర్వప్రాణులును స్వస్వప్రకృతి ననుసరించి ప్రవర్తింతురు. నేనుగాని మఱొకఁడుగాని యట్లు ప్రవర్తింపరాదని నివారించుటవలన లాభములేదు ప్రకృతి బలవత్తమమని యెఱుంగుము.

(33) ఇంద్రియవిషయము లనఁబడుశబ్దాదులయందొక్కొక్కదానియందు నిష్టమగుదానియందు రాగము, అనిష్టమునందు ద్వేషమును వ్యవస్థితములై యుండును ఈరాగద్వేషములను బుట్టించి వీనియాలముననే పూర్వవాస నారూపమగుప్రకృతి స్వవిషయమునందుఁ బురుషునిం బ్రవర్తింపఁజేయును. వీనిని గ్రహించినయెడలఁ బురుషుఁడు ప్రకృతికి లోఁబడఁడు. శాస్త్రవిహితముగ నాచరింపఁజాలియుండును. ఇట్టి రాగద్వేషములే మానవునకు శ్రేయోమార్గమునందుఁ దోవయందు దొంగలరీతిగా శత్రువులగును. కాఁబట్టి పురుషుఁడు వీనికి లోఁబడక వివేకజ్ఞానముచేత వీని నడఁపవలయును. దీనిం బట్టి పురుషునిప్రవృత్తి ప్రకృతికి లోఁబడియే యుండునన్న విధినిషేధములకు వ్యర్థత గలుగునుగదా యన్నశంక తొలంగును. విషయస్మరణము లోనగువానిచేత రాగద్వేషముల నొందించి వివేకములేనిమానవుని ననర్థమునందుఁ బ్రకృతి బలవంతముగఁ

---

చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి, ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33. ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవ

ప్రవర్తించునట్లు చేయుననియు, శాస్త్రమనునది యెందులకు మనుపే విషయములయందు రాగద్వేషములుకల్గుటకుఁ బ్రతిబంధక రూపమగు భగవదారాధనమునందుఁ బ్రవర్తిల్లఁజేయుననియు, దానిచే గంభీరప్రవాహమునఁ బడుటకుఁబూర్వమే యోడ నధిష్ఠించువానివలె ననర్థమునొందఁడనియు గ్రహింపుము.

(౩౫) కౌంతేయా సాంగముగాకపోయినను యథాశక్తి ననుష్ఠితమైనస్వధర్మము సాంగముగా ననుష్ఠింపఁబడిన పరధర్మమునకంటె నుత్తమము. పరధర్మమునందుండి జీవించుటకంటె స్వధర్మము నాచరించుచు మృతినొందుటయైనను లాభమే. ఏలయందువేని పరధర్మాశ్రయణమున నరకప్రాప్తి లోనగు ననర్థము లెన్నియో సంభవించును. కావున నది భయావహమగును. ఇంతకుముందు స్వాభావికమగుపశ్వాది సాధారణప్రకృతిని బరిత్యజించి స్వధర్మమునందుఁ బ్రవర్తింపవలయునని చెప్పితిని. అప్పుడు స్వధర్మమైనయుద్ధాదికము దుఃఖరూపమగుటంజేసి యథాన్యాయముగఁజేయుట యసాధ్యమగుటవలనను బరమధర్మమగు నహింసాదికము సుకరంబగుట ధర్మమేయగుటవలనను, దానియందుఁ బ్రవర్తింపఁగోరువానింగూర్చియే యీ న్యాయ ముపదేశింపఁబడియెనని తెలిసికొనుము. అని శ్రీహరి బోధించెను.

(౩౬) రాగద్వేషములకు లోఁబడరాదని శ్రీకృష్ణుఁడు తెలుపఁగా నది యశక్యమని యర్జునునిమదికిం దోఁచెను.

---

స్థితౌ, తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ. ౩౪. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్, స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. ౩౫. అర్జున ఉవాచ.—అథ కేన ప్రయుక్తోఽయం పాపం

కావున శ్రీహరిం దిలకించి వార్ష్ణేయా! ఈపురుషుఁడు తా నిచ్ఛయింపకయున్నను బలాత్కారమున రాజుచే నాజ్ఞాపింపఁబడిన సేవకునివలె దేనిచేఁ బురికొల్పఁబడి పాపము చేయుచున్నాడు? దాని నాకుఁ దెలుపుమని ప్రశ్నించెను. అర్జునుని ప్రశ్నము విని యతనికింగలిగినసందియము నడంపంబూని యిట్లుపలికెను. (32) కౌంతేయా దేని నీవు ప్రశ్నించితివో సర్వానర్థములకుం బ్రధానకారణమైన యాశత్రువు కామమని తలంపుము. ఈకామమే ప్రతిహతమగునేని క్రోధమగును. ఇయ్యది సర్వకార్యప్రవర్తక మనఁబడు రజోగుణజనితమగును. ఇది బహువిషయం బగుట మహాశనము. సర్వపాపనిమిత్తమ్మగుట మహాపాపము. కావున నీసంసారమునం దీకామమే శత్రువనియు బలవత్తరమనియు నెఱుంగుము. అనఁగాఁ గామము వేఱు క్రోధము వేఱు. అని తలంపకుము. క్రోధముకూడఁ గామమే. ఎట్లందువా? కామము దేనిచేనైనఁ బ్రతిహతమగునెడలఁ గ్రోధరూపమునఁ బరిణమించును. కామజయమే క్రోధజయమగును. ఆకామమునకు జనని రజోగుణము. సత్త్వవృద్ధిచే రజస్సు క్షయమునొందించినయెడలఁ గామముగూడ క్షయించునని తెలిసికొనుము. ఈమోక్షమార్గమునం దీకామము శత్రువని యెఱుంగఁదగు. దీనిని వధించు టెట్లనఁగా ముందుఁ దెలిపెదను ఇప్పుడు కామము ప్రబలశత్రువని నిశ్చయించి యావల వినుము. దీనిజయించు పద్ధతి బోధమగును. ఇది వైరియగుపద్ధతి. సోదాహరణముగా

---

చరతి పూరుషః, అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః. 36. శ్రీభగవానువాచ.—కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః, మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్. 37. ధూమేనావ్రియతే వహ్ని

నింకను జెప్పెద వినుము. (౩౮) ఏవిధముగా సహజమగుధూ మముచేత నగ్ని యావరింపబడియుండునో, ఏరీతిగా మలపదా ర్థముచే నద్దమావృతమైయుండునో, ఎట్లు మావియనుపదార్థ ముచే గర్భము గప్పఁబడియుండునో అట్లే యాకామముచే నిది కప్పఁబడియుండును. ఇది యనఁగా జ్ఞానము. (౩౯) జ్ఞానికి నిత్యశత్రు వీకామమే. ఈకామము పూరింపనలవికానిది. అనఁగా నేకార్యముచేతను దానికిఁ దృప్తికలుగదు. పర్యాప్తి లేనిది. ఇట్టికామముచేతనే జ్ఞాన మావరింపఁబడియుండునని యెఱుంగుము. సర్వప్రాణులకు శత్రువయి జ్ఞానావరణంబగు నాకామమున కధిష్ఠానం బేది? అని ప్రశ్నింతువేమో! వినుము. ఇంద్రియములు మనోబుద్ధులు. ఈకామమున కాశ్రయములు కామ మీయింద్రియములు లోనగువాని నధిష్ఠించియుండి వివేకజ్ఞానము నావరించి (కప్పి) ప్రాణి ననేకప్రకారముల మోహము నొందఁజేయుచున్నది. విషయదర్శనశ్రవణాదుల చేతను, సంకల్పాధ్యవసాయములచేతను గామము పుట్టును గాన నింద్రియమనోబుద్ధులు కామమున కాధిష్ఠానయులని చెప్పంబడును. ఓభరతకులాభరణమా! ఈయింద్రియాదులు కామాధిష్ఠానములగుటవలన నీవు తొలుదొలుత నింద్రియ ములలోఁబఱచుకొని జ్ఞానవిజ్ఞానముల నశింపఁజేయుచు మహా పాపరూపమగు నీకామమనుశత్రువును నీయొద్దనుండి తొలఁ

---

ధూమేనావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ, యథోల్బేనావృతో గర్భ స్తథా తే నేద మావృతమ్. ౩౮. ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా, కామరూ పేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ. ౩౯. ఇంద్రియాణి మనోబుద్ధిర స్యాధిష్ఠానముచ్యతే, ఏతై ర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్.

గించుకొనుము. జ్ఞానమాత్మవిషయము. విజ్ఞానము శాస్త్రీయము అనియు దెలిసికొనుము.

(४२) కామమును దేనినాశ్రయించి తొలగింపవలయు నని ప్రశ్నింతువేమో. దేహము స్థూలము బాహ్యము పరిచ్ఛిన్నము నగును గావున దానికంటె సూక్ష్మత్వము అంతస్థత్వము, వ్యాపకత్వము మొదలగునవి కలవి గావున శ్రోత్రాదులగు నింద్రియముల నుత్కృష్టములని పెద్దలు చెప్పుదురు. ఆయింద్రియములకంటె సంకల్పాత్మికమగు మనస్సును బ్రకృష్టమందురు. (४३) ఆమనస్సునకంటె నిశ్చయాత్మిక యగుబుద్ధి యుత్కృష్టయని నిర్దేశింతురు. అట్లే యెవ్వఁడు బుద్ధిపర్యంతము లగుసర్వదృశ్యములకు నంతరుఁడై ద్రష్టయైనవాఁడు పరమాత్మయని తెలియుము. ఓమహాబాహూ! ఇట్లు బుద్ధికంటెఁ బరుఁడై సర్వాంతరుఁడగువానినిగా నాత్మను దెలిసికొని పరిశుద్ధమై సంస్కృతము నైనమనస్సుచేత మనస్సునేకాగ్రనుగా నిలిపి దురాసదంబగు కామరూపశత్రువును వధింపుము. అని శ్రీహరి బోధించెను.

ఇది కర్మయోగ మనఁబడు మూఁడవయధ్యాయము.

४१. తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ, పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్. ४०. ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః, మనసస్తు పరాబుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః. ४२. ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా, జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్. ४३.

ఇతి కర్మయోగః.

ఉత్తమచిత్తులారా! గీతాశాస్త్రమునం దిదియే హృదయమువంటిదని యెఱుంగందగినది. భగవంతుండీయధ్యాయమునం దర్జునునకు జన్మమధ్యమున జేయఁగలకార్యములఁ దెల్పెను. ఈబోధము మనస్సునఁ జక్కఁగా నాటుటకే తక్కిన యధ్యాయగతవిషయములబోధించె ననవచ్చును. దీనిసారమించుక వ్రాయఁదగియున్నయది. దాని నవధరింపుఁడు. నా యీ వ్రాఁత మీయభిప్రాయమునకు విరుద్ధముగా నుండవచ్చును. అంతమాత్రమునఁ దూలనాడక చదివి యుందేమేని సత్యమున్నదా యని పరికింపుఁడు. అదియగదా మీవంటిపెద్దల లక్షణము. సాంఖ్యయోగము వినినంతనే యర్జునకు సంశయమొక్కరీతిగా నుదయించెను. సత్కర్మాచరణమునకన్న జ్ఞానమే శ్రేష్ఠమని హరి యుపదేశించెనని తలంచి శంకఁదొలఁగించుకొనఁ గోరి జ్ఞానమే శ్రేష్ఠమైయుండఁగా నీఘోరకర్మమునందేల నియోగించితివని ప్రశ్నించెను. నాబుద్ధి నేల మోహింపఁ జేయుచున్నారనియు నడిగెను. నాకు దేని శ్రేయస్సుగలుగునో నిశ్చయించి పల్కుమా యని ప్రార్థించెను. ఈప్రశ్నమునం దొకవిచిత్రమగు నర్థముగలదు. కృష్ణా! శ్రేయస్సుగలిగించుమార్గము లనేకము లుండవచ్చును. అన్నిమార్గములలో నాకు నేమార్గము నాశ్రయించిన శ్రేయస్సుగలుగునో చక్కఁ నాలోచించి పల్కుమా యనియేఁగదా. ఏయేకర్మములుచేసినవారి కేయేమార్గము నవలంబించిన శ్రేయస్సుగలదో నీ వెఱుంగుదువు. అందు నే నేకర్మము నొనరించితినో దాని కేమార్గము నాశ్రయింపఁదగునో ఆమార్గము నాలోచించి యుపదేశింపుమనియేఁగదా. "తదేకం వదనిశ్చిత్య"

అనఁగా భావమేమి? ఎన్నియోమార్గముల నాకు శ్రేయస్సు గలుగవచ్చును. అందిత్తరుణమున నొక్కమార్గమే పలుకుము యుద్ధముమాని మునిగుట యొండె. యుద్ధమొనరించుట యొండె. ఈరెండుమార్గము లిపుడు కలవు. ఇందేది నాకు శ్రేయస్సు నొసంగునో తెలుపుము. సాంఖ్యయోగమును విన్నంతనే నాకేదో కలవర ముదయించెను. అగోడవ నాకేల? ఒక్కత్రోవ చూపుము. దాని నాశ్రయించెదను. నామేలు నీయధీనము. అనికదా యీప్రశ్నసారము. దీనింబట్టి చక్కఁగా నూహింపఁగా సాంఖ్యయోగానంతర మర్జునునిచిత్తము విషాదమునుండి మరలినదనియుఁ గర్మమార్గమునందు నిలుకడఁగాంచక యూగులాడుచున్నదనియు దానిఁ దొలఁగించుకొనుటకు శాస్త్రములఁజూడ నవసరములేదనియు నీవొకమార్గమునుజూపిన దాని నాశ్రయించి కృతార్థుఁడ నగుదుననియు నర్జునుభావమైనట్టు కనుపట్టునుగదా. దీనిచే గురుశిష్యభావము కృష్ణార్జునులయందుఁ గనుపట్టెడిని.

"శిష్యస్తేఽహంశాధిమాంత్వాంప్రపన్నమ్"

అన్నశ్లోక మీభావమున కాధార మగునుగదా. సద్గురువుకడ కరిగి శిష్యుఁడు గురూత్తమా! నానొక్కమార్గమును గనఁబఱుపుము. దానినే యాశ్రయించి కృతార్థుఁడనగుదును. శాస్త్రము లనేకములు. వానియంతరార్థము లసంఖ్యాకములు. వాని నాచరించుమార్గము లనంతములు. అగోడవలో నన్నుదింపక యేదే నొక్కమార్గము నన్నుద్ధరించుదాని నాలోచించి నిర్ణయించిన దాని నాశ్రయింతునని ప్రశ్నించుట సాంప్రదాయసిద్ధము.

అర్జునుని ప్రశ్నమునఁ గలయభిప్రాయమును హరి యోజిం గెను. ఇంచుకవిషాదము తొలఁగినది. కాని యింకను గర్మ యోగసారమును దెలిపిన నాచాంచల్యము తొలఁగుననని యా లోచించి కర్మయోగము నుపదేశించెను. దా నర్జునుమూలము నఁ జేయింపఁదలంచుకొన్న కార్యమున కీసిద్ధాంతమే మంచిది. ఈకర్మసిద్ధాంతము దృఢపడుటకే యోగము నుపదేశింపఁద గును. దానిచేతఁగాని మనశ్చాంచల్యము నిర్మూలము కాదని యాలోచించెను. కావుననే యర్జునా! నీవుపొరపడితివి. రెండు మార్గములు పరస్పరనిరపేక్షములుగా నేఁజెప్పినట్లు భావించి తివి. రెండుమార్గము లట్టివిగా నేఁ జెప్పియుండినయెడల నందేది నాకర్తవ్యమో యోజించి తెలుపుమని నీవడిగినచోఁ జక్కఁగనుం డును. ఆరెండింటిచేతను బ్రహ్మనిష్ఠ నొక్కదానినే తెల్పితిని. చిత్తశుద్ధ్యశుద్ధులను నవస్థలమార్పుచేత నిష్ఠ రెండువిధములం టిని.అంతియేకాని నీప్రశ్న కవకాశముగలుగునట్లు చెప్పలేదు. సమాధానమును వినుము. విధివిహితకర్మములు చేయక యూరక యున్నందున జ్ఞానయోగజనితనిష్ఠఁ బొందఁడు. కర్మసన్న్యాస మువలన నైష్కర్మ్యరూపజ్ఞాననిష్ఠ వానికింగలుగదు. కావునఁ గర్మములను జేయకయుండఁ రాదు. ఈశ్వరార్పణబుద్ధిం జేసి కర్మ ముల నాచరించుచుండిన జ్ఞానము తనంతన లభించును. ఫలము కాలము రాఁగానే క్రియలు లేకయే పండునుగదా. అట్లే భగ వదనుగ్రహము నిష్కామకర్మముల నాచరించుటఁ దనకుఁదానే లభించునని యెఱుంగుము. కౌంతేయా! నీవు కర్మములవదలు నాశయముకలవాఁడవని తోఁచెడిని. లోకమున నెవ్వఁడుగాని కర్మముల నాచరింపకయే క్షణకాలమైన నుండఁజాలఁడు. ప్రకృతి

గుణములకు లోఁబడి యెల్లరును గర్మముల నాచరించుచునే యుందురు. పరిపక్వాంతఃకరణుఁడు తానువశుఁడుగాక స్వతంత్రతఁగర్మముల నాచరించును. ఈయిరుదెగలవారికిని భేద మింతియే యని యెఱుంగుము. కావునఁ గర్మమును మానుటయా మానుము అది శక్యమగుకార్యముకాదు. లోకమున మిథ్యాచారులు కొందఱు గలరు. వారును జ్ఞానులవలె నటింతురు. యోగులవలె గనఁబడుదురు. కపటసన్న్యాసులని వారినెఱుంగుదగు గాని వారిచెంతకుఁబోరాదు. ఏలయందువా? వారు మనస్సునఁ బరిశుద్ధులుగారు. వారిమనస్సు విషయలోలతం గాంచునది. కావున వారియాచరణము కపటత వహించును. కనుకనే వారు లోకవంచకులు. సాధువులవలె నటించి లోకమును మోహింపఁజేయుదురు కాని దాన వారికి మేలులేకుండుటేకాదు స్వమనశ్శోరులు గానఁ దమనిశ్శ్రేయసమునే తమరు పాడుచేసికొందురు. కావుననే వారిచెంతఁ జేరరాదని నొక్కి చెప్పితిని. మనస్సుచే నింద్రియముల నిగ్రహించి కర్మేంద్రియములచేఁ గర్మము నాచరించువాఁడు త్యక్తకర్మ ఫలాసక్తుఁడు. కాఁడని తెలిసికొనుము. దీనిచేఁ నియతములగుకర్మముల నాచరింపవలయుననియుఁ గర్మముల వదలుటకంటె వానినిజేయువాఁడుత్తముఁ డనఁబరఁగుననియు గ్రహింపుము. కర్మము చేయుపద్ధతి నించుక వినుము. ఈశ్వరార్పణముగాఁ జేయుకర్మములకంటె నితరకర్మముల నెవరుచేయుదురో వారు కర్మబంధనుకలవార లగుదురు. కావుననే ఫలాసక్తుఁడవై వాని నొనరింపుమంటిని. ఈశ్వరార్పణముగాఁ జేయుకర్మ స్వరూప మెట్టి దందువేని వినుము

బ్రహ్మ ప్రజల సృజించి వారితోడ యజ్ఞముల సృజించును. ప్రాణికోటిని బుట్టించునపుడే వానికర్మములఁ బుట్టింపవలయుఁగదా. జననముగాంచఁగనే క్షుద్బాధకలిగినట్లు నటించు శిశువున కాహారము పుట్టింపఁబడియే యుండును. యజ్ఞములు స్వోపకారకపూర్వక దేవతాసంతృప్తికరములని యెఱుంగుము. ప్రజలు యజ్ఞరూపకర్మమున దేవతల నారాధింపవలయును. దానిచేఁ దృప్తినొందిన దేవతలు వీరికి నుపకారమును గల్గింతురు. దాన నన్నము గలుగు. దానిచేఁ బ్రజలు వృద్ధినొందుదురు. ఎవ్వరు భగవదాజ్ఞకు వ్యతిరిక్తు లగుదురో వారు సర్వకిల్బిషముల నొందుదురు. ఏవాఁ డేకర్మము చేయవలయునని భగవదాజ్ఞయో వాఁడు దానిని జేయవలయును. చేయకున్నఁ బాపము ననుభవించును. నీవు భగవదనుజ్ఞను శిరసావహింపక తప్పదు. ఇది యొకచక్రము. దానియం దొకదాని కింకొకదానితో సంబంధముండును. ఆసంబంధము నియతము. దాని విడఁదీయఁదలంచుట భగవదాజ్ఞకుమాఱు చేయఁబూనినట్లె యగును అట్లు దానిచేయఁ దలంపకుము. అసక్తుండవై కర్మము నాచరింపుము. దానిచే సత్త్వశుద్ధిగలుగు. అయ్యది ముక్తిదాయకమగును. ఈహితోపదేశము నా కొక్కనికి మాత్రమా యని సంశయింపకుము. జనకాదులు రాజర్షిసత్తములు. వారెల్ల నీమార్గమునే యనుసరించిరి. లోకసంగ్రహార్థము కర్మముల నాచరించి యితరులకు మార్గదర్శకులైరి. లోకులు సామాన్యదృష్టిం బరికింపఁ బామరులు. బుద్ధిమంతు లాచరించున ట్లాచరింపఁ దలంపుగొనియుందురు. వారి నుద్ధరించుట బుద్ధిమల్లక్షణము వారిజోలి మనకేల యని విరమింపఁ బూనరాదు. అది

మిగులఁ బొరపాటు. నన్నుదాహరణముగా గ్రహింపుము. నాకుఁ గర్మాచరణాసక్తియేల? నేఁ జేయఁదగుకర్మ మేదియును లేదు. ఏఫలము నాకుం గలుగఁదగినది కలదు? ఏదియు లేనపుడు నేనేలచేయవలయును? నేనొనరింపకయున్న నన్నుం గాంచి కొందఱు కర్మముల మానుదురు. వారిం గాంచి మఱికొందఱు. వారింగాంచి యింకనుం గొందఱు. ఇట్లు పరంపరా న్యాయము ననుసరించి యెల్లరు మానుదురు. నామూలమున లోకమెల్లఁ జెడిపోవును. సంకరమగుటకుఁ గర్తను నే నగుదును. కావుననే లోకసంగ్రహార్థమసక్తుఁడనై కర్మముల నాచరించుచున్నాఁడను. అట్లే నీవు లోకమునఁ బ్రఖ్యాతిఁగాంచిన శూరోత్తముఁడవు. అట్టి నీవే యుద్ధము మానిన నిఁక నెవ్వరును జేయకయుందురు. క్షత్రధర్మము నశింపఁజేసినవాఁడ వగుదువు. దాన లోకమునకు హాని గల్గును. దుష్టులు చెలరేఁగుదురు. వారి నడంచువా రుండరు. ధర్మమును సాధువులను హింసింతురు. దాని నాపువా రెవ్వరు? కాఁబట్టియే విధివిహితకర్మమును జేయక మానరాదని వచించితిని. అని భగవంతుఁడాదేశించెను.

కొందఱు పామరాచారములని వాని నాచరించు వారి నాక్షేపింతురు. అది పొరపాటని భగవంతుఁడు వచించెను. చక్కనిజ్ఞానము లేకున్నను గర్మాచరణ మొనరించువారిబుద్ధిని భేదింపఁబూనరాదు. దాన వారు కర్మమునే మానుదురు. జ్ఞానములేక కర్మముల నాచరించిన లాభమేమని ప్రశ్నింపరాదు. ఫలాపేక్షచేఁగూడఁ గర్మ మాచరించినను గొంతకాల మాకర్మము వానిని నిష్కామకర్మాచరణాసక్తునిగ మార్చును.

దానిమహత్త్వ మట్టిది. కాఁబట్టి పామరులు ఫలాపేక్షఁ బూని కర్మమాచరించినను జూచుచుఁ దాను నిష్కాముఁడై కర్మ మాచరించుచు సాధు ఉండవలయును. వీనింగాంచి కొంతకాలమున కాపామరుఁడు నిష్కామకర్మాచరణ శీలము కలవాఁడై భగవదనుగ్రహపాత్రుఁ డగును. అని యీయుపదేశ సారమని యెఱుంగవలయు.

మహాశయులారా! ఈరీతిగా నీకర్మయోగాధ్యాయమే గీతాహృదయమని యెఱుంగవలయును. భగవంతుని కీకర్మ యోగమునం దభిమాన మెక్కుడని స్పష్టమగుట కొక యుదాహరణమును జిత్తగింపుఁడు. ఈయధ్యాయముననే ౩౧-౩౨ శ్లోకములయందలిభావమును బరికింపుఁడు. నే నుపదేశించిన యీమతము నెవ్వరు శ్రద్ధగలవారలై యసూయాపరవశులు గాక నిత్యము నవలంబింతురో వారు కర్మముక్తు లగుదురు. ఎవ్వ రట్లుగాక యనుసరింపకుందురో సర్వజ్ఞానవిమూఢులై చెడుదురు. అని హరి పలికెను. ఇది శాపముకాదా. అనఁగా నీమతమే నాకు మిగుల సమ్మతమైనది. దీని ననుసరించి కర్మబంధములఁ దగులుకొనక జ్ఞానులగుదురు. అనుసరింపనివా రజ్ఞులగుదురు. అనఁగాఁ గర్మము నామతమును నమ్మి యాచరించిన జ్ఞానము తనంతన లభించును. లేనిచో జ్ఞానము లభింపదు. ఇంతకంటె గీతాశాస్త్రమునందు నాభావ మిదియని యధికముగాఁ జెప్పినవిషయ మెందునుగలదా ఇదియే భగవత్ప్రియతమమత మనక తప్పదుకదా. దీనింబట్టియే యర్జునునకుఁ గర్మాచరణమునందు బుద్ధి వ్యాపింపఁజేసెననుట సిద్ధాంతము కాక పోవునా? కావున సాధువులు కాఁదగినవారెల్ల ఫలాపేక్ష లేక

స్కృతకర్మముల నాచరించి. వానిమూలమున జ్ఞానము లభింపఁగా దాన ముక్తులుకావలయునని యీయధ్యాయమునుండి తెలిసి కొనఁదగినసారము. ఇంకఁ దరువాతియుపదేశము నాలకింపుఁడు.

---

### జ్ఞా న యో గ ము.

(౧) ఇట్లు రెండధ్యాయములచేఁ జెప్పఁబడినదియు నవ్యయ ముక్తిఫలముగలదియు నగుకర్మయోగసాధ్య మగుజ్ఞానయోగ మును జెప్పఁబూని హరి యిట్లు తెల్పెను. అర్జునా! ఈయోగ మును మున్ను నేను సూర్యున కుపదేశించితిని. ఆభాస్కరుఁడు తనకుమారుఁడగు వైవస్వతునకుఁ జెప్పెను ఆమనువు తనపుత్త్రుఁ డగు నిక్ష్వాకునకు బోధించెను. (౨) శత్రువు లదరునట్లు విక్ర మించునర్జునుఁడా! ఈరీతిగా క్షత్త్రియపరంపరచే వచ్చుచున్న యీయోగమును రాజర్షు లెఱింగియుండిరి కాలము విశే షించి జరిగినందున దానిసంప్రదాయము విచ్ఛిన్నమైనది. (౩) బలహీనులు నవశీకృతేంద్రియులు నగువారివలన నీయోగము నష్టముకాఁగా లోకము పురుషార్థము పొందనేరకయుండుట యెఱిఁగి పురాతనమగు నాయోగమునే నేను నీకిప్పుడు తెలిపితిని. నీవు నాకు మిక్కిలి భక్తుఁడవు, చెలికాఁడవుకూడ నైతివి. కనుకనే యీయోగము రహస్యము శ్రేష్ఠము నగునని

---

జ్ఞా న యో ౪౩.

శ్లో. ఇమంవివస్వతేయోగం ప్రోక్తవానహ మవ్యయమ్, వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్. ౧. ఏవంపరంపరాప్రాప్త మిమంరాజర్షయో విదుః, సకాలేనేహ మహతా యోగోనష్టఃపరంతప. ౨. సఏవాయంమయా తేఽద్యయోగః ప్రోక్తః పురాతనః, భక్తోఽసిమేసఖాచేతి రహస్యం హ్యేత

యెఱుంగుము. ఇతరుల కిద్ది యుపదేశింపను. దీనింబట్టి నీయం దెంతవాత్సల్యము నాకుఁగలదో నీమేలు నే నెంతకోరినవాఁడనో యూహించుకొనుము.

(ర) అని శ్రీకృష్ణుఁడు తెలుపఁగా నర్జునుఁ డిట్లు ప్రశ్నించెను. ఇపు డర్జునుచిత్తము సంశయగ్రస్తమై యున్నది. శ్రీకృష్ణా! నీజన్మము తరువాతిది. సూర్యునియుత్పత్తి మునుపే యైనది. కావున నీవు సూర్యునకుఁ దరువాతివాఁడవు. అట్టి నీవీయోగమును సూర్యున కుపదేశించితినని నాకెఱిఁగించితివి. నే నేరీతి నిది చక్కనిదే యని సంశయమొందక నమ్ముదును? ఇం దర్జునునిసంశయ మేదనఁగా. ఈరూపమునను్న నీవు మఱొక దేహమున నున్నపు డాదిత్యున కుపదేశించితివా? ఈ రూపముననే రవి కుపదేశించితివా? మొదటిమాట సరియేయందువా. అది న్యాయవిరుద్ధము. జన్మాంతరానుభూతవిషయము స్మరింప శక్యము కానిది. శక్యమగునందువా. నాకేల యాజన్మ విషయము స్మరింప శక్యము కాలేదు. మనమిరువురము మానవులము కావున నసర్వజ్ఞత్వము మనకు సమానముకదా. ఇంక రెండవమాటయు సరికాదు. సర్గాదియందు నిప్పటి దేహము లేదుకదా అదియుండినఁగదా యామాట సరియనఁదగును. ఈరీతిగా మఱొక దేహముచే సృష్ట్యాదియందుండుట యుపపన్నమైనను, ఇప్పుడది స్మృతికివచ్చుట మాత్ర మసంగతము. ఈదేహమున నదికలిగినను సర్గాదియందిదియుండెననుట యెంత మాత్రము సంగతము కానేరదు. అను నీరెండుసందియము లర్జునునిమదినుండెనని యీప్రశ్నమే తెలుపుచున్నది.

దుత్తమమ్. 3. అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః, కథమేతద్విజానీ

(౫) అర్జునునకుంలసంశయములను దీర్పనెంచి భగవంతుండు శ్రీకృష్ణుం డిట్లు బదులుచెప్పెను. అర్జునా! నీసంశయముల నెఱింగితిని. వానిం దీర్చెద. శ్రద్ధగా నాలకింపుము. నాకుం బెక్కుజన్మములు గడచినవి. నీకు నట్లే గడచెను. అయిన నేను నిరావరణజ్ఞానశక్తిగలవాండనౌట దానినన్నింటి నెఱింగియే యున్నాండను. పరంతపా! నీవావరణసహితజ్ఞానశక్తికలవాండవుకాన వాని నెఱుంగంజాలకయున్నాండవు (౬) నేను జన్మరహితుండనైనను అక్షయ మగుజ్ఞానశక్తిస్వభావము కలవాండనైనను బ్రహ్మమొదలు స్తంబపర్యంతముగలభూతముల కీశ్వరుండనైనను త్రిగుణాత్మకయగు నామాయ నంగీకరించి తన్మాయావశమున దేహముగలవానివలెను, జన్మించినట్లును దోంచుచున్నాండను. (ఇటజన్మమనంగా నపూర్వదేహేంద్రియాదులను గ్రహించుటయని యర్థము. వ్యయమనంగాం బూర్వముగ్రహించినదేహేంద్రియాదులవియోగమనియర్థము.) స్వాంప్రకృతిమ్ అనంగానాకు నుపాధిభూతమైనది. అఘటనాఘటనశక్తిగలది. యని భావము. అధిష్ఠాయ=అనంగా చిదాభాసరూపమున స్వాధీనము చేసికొని అని సారము. నాకుపాధిభూతమగుచు సర్వకాలము నుండునదికావున నిత్య మనందగి జగత్కారణత్వ సంపాదకమై. మఱియునాయిచ్ఛచేతనే ప్రవర్తించుస్వభావముకలదియునైన యాయనాదిమాయయే విశుద్ధసత్వమయంబుగ నగుట నామూర్తి యగును. దానింగూడిన నాకు బుట్టుకలేమియు

---

యాం త్వమాదౌ ప్రోక్తవానితి. ౪. శ్రీభగవానువాచ. బహూని మే వ్యతీతాని జన్మాని తవచార్జున, తాన్యహం వేదసర్వాణి నత్వం వేత్థపరంతప. ౫. అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపిసన్, ప్రకృతిం స్వామ

నాశములేకుండుటయు సర్వేశ్వరత్వము సంగతములేకాని యసంగతములుకావు. కావుననే నిత్యమగు నీదేహముచేతనే సూర్యునకు నీకునుంగూడ నీయోగము నుపదేశించితినని నేఁ జెప్పు టుచితమే. నామాయచేతనే నాయందు మానవత్వాదులు తోఁచుచుండును. అవి లోకానుగ్రహార్థమేకాని వేఱుకాదు. (అయిన నవి సత్యములుగావని తాత్పర్యము). (౭) భరతకులవర్ధనా! : ధర్మము నశించుకాలమునందును. అధర్మము వ్యాపించునప్పుడును నేను మాయచే జన్మము నొందుచున్నాఁడను. (౮) సత్కర్మముల నాచరించువారిని రక్షించుటకొఱకు దుష్కార్యముల నాచరించువారిని నశింపఁజేయుటకును, ధర్మమును జక్కఁగా భూలోకమున స్థిరముగ నుండఁ జేయుటకును నేను బ్రతియుగమునందును జన్మముగలవాఁడ నగుదును. (౯) ఎవ్వఁడీనాజన్మమును సాధురక్షణాదికర్మమును వాస్తవముగ నంతయు నెఱుఁగుచున్నాఁడో యతఁడీదేహమును వదలినపిమ్మట మరల జన్మమునొందఁడు. నన్నే పొందును. (౧౦) ఈముక్తిసూర్గ మీనాఁడు కల్గినదికాదు. పూర్వమునందుఁగూడ నుండినదే. రాగము భయము క్రోధము వదలినవారును, బ్రహ్మవేత్తలును (ఈశ్వరాభేదము చూచినవారు)

ధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా. ౭. యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత, అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్. ౭. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. ౮. జన్మకర్మ చ మేదివ్య మేవం యో వేత్తి తత్త్వతః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతిమామేతి సోఽర్జున. ౯. వీతరాగభయక్రోధాః మన్మయా మాముపాశ్రితాః బహవో జ్ఞానతపసా

నన్నే (పరమేశ్వరుని) యాశ్రయించి జ్ఞాననిష్ఠులగు వారు నగు పెక్కండ్రు ఆత్మజ్ఞానమనుతపస్సుచే బరమశుద్ధినొంది నావారగుట ముక్తినొందిరి. (౧౧) పరమేశ్వరా! రాగద్వేషములు నీకుం గలవు. కనుకనే కొందఱకుమాత్రమే యాత్మభావము నొసంగెదవు. అందఱకు నొసంగవు. అని యందువేమో. సమాధానము వినుము. ఎవ్వ రేఫలమునుగోరి నన్నాశ్రయించుచున్నారో నేను వారలకు నాఫలము నొసంగి యనుగ్రహింతును. పార్థా! ఎవ్వరేఫలమున గోరి తదర్థము ప్రయత్నించినను వారలందఱు జ్ఞానకర్మరూపమున నామార్గమునే యన్నివిధముల ననుసరించుచున్నారు. ఈ కారణమునుబట్టి నాకు వైషమ్యము లేదని యెఱుంగుము. ఎవ్వరు సకాములై నన్ను మాని యింద్రాదిదేవతల నారాధింతురో వారి నుపేక్షింతునని తలంపరా దు. ఎల్లరు ననుఁగా నితరదేవతలసేవించువారు గూడ నామార్గమునే యనుసరింతురు. ఇంద్రాదిరూపముల నుండువాడను నేనేకదా. (౧౨) కృష్ణా! ఈశ్వరుఁడవగు నీకు రాగాదిదోషము లుండరాదు. సర్వప్రాణులయందు ననుగ్రహేచ్ఛ సమానమై యుండఁదగును; నీవు సర్వఫలప్రదాతవు. ఇట్లుండఁగా సర్వం వాసుదేవమయ మ్మను జ్ఞానముచేత నెల్లరు మోక్షేచ్ఛగలవారలై నీశరణుఁజొరరని యడుగుదువేమో. విను మాసం దేహవిమోచనమార్గము. కర్మఫలసిద్ధినిగోరి యీలోకమునందు మనుష్యులు పెకండ్రు దేవతలను సేవింతురు ఎందులకందువా?

---

పూతా మద్భావమాగతాః. ౧౦. యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం, మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౧౧. కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః, క్షిప్రం హి

కర్మఫలసిద్ధి మానవలోకమునఁ ద్వరగాఁ గలుగునన్న యాశయముచేతనే యని యెఱుంగుము. అజ్ఞానప్రతిహతులగుటఁ గొందఱు ఇంద్రాగ్నిప్రభృతిదేవతల నాశ్రయింతురు. నిష్కాములై భగవంతుని నన్నాశ్రయింపరు. ఎందులకన్న వారి నారాధించువారలకు శీఘ్రమే తత్ఫలము గలుగు. మోక్షవిముఖులై యితరనిర్జరుల నారాధించుచున్నారో అందువలననే ముముక్షువులవలె వాసుదేవుని నన్ను శరణుచొరరు (౧౩) శరీరమునకుఁ గారణములగు గుణముల వైషమ్యమువలనఁ గూడ నెల్లరు సమానస్వభావులుకారు. ఈమనుష్యలోకమునందే వర్ణాశ్రమాది కర్మాధికారము. కాని యితరలోకముల నయ్యది లేదనునియమ మేల? వర్ణాశ్రమాదివిభాగముతోఁ గూడినమానవులు నామార్గమునే యనుసరించుచు సర్వవిధముల నన్నే యాశ్రయింతురు. ఏల? ఇతరమార్గము ననుసరింపరు? అని ప్రశ్నించినచో సమాధాన మిట్లని గ్రహింపుము. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రు లనఁబడునాలుగువర్ణములును, వారివారిగుణములంబట్టి తత్తత్కర్మములను విభాగించి నేనే సృజించితిని. అయిన నాసృష్టిరూపకరముచకు నేను మాయాసంబంధమునఁ గర్తనగుదుంగాని పరమార్థమునఁ గర్తను గానని యెఱుంగుము. నిత్యేశ్వరుఁడననియుఁ దలంపుము. విషమస్వభావమగు చాతుర్వర్ణ్యమును సృజించితివి కాన వైషమ్యము వారింప నీకు శక్యమగునా యందువేమో యనియే పరమార్థ

మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా.౧౨. చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః, తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్.౧౩. న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా, ఇతి మాం యోఽభిజానాతి కర

దృష్టిచేఁ గర్తను గాదని వచించితిని. సాత్త్వికుఁడు బ్రాహ్మణుఁడు. సాత్త్వికరాజసుఁడు క్షత్త్రియుఁడు రాజసతామసుఁడు వైశ్యుఁడు. తామసుఁడు శూద్రుఁడు అని గుణవిభాగమని యెఱుంగుము. కర్మవిభాగము ముందు వచింతును.

(౧౪) నేను గర్త ననునభిమానము లేకుండుటను, కర్మఫలమందు నిస్పృహుఁడ నగుటను నన్నుఁ గర్మము లంటవు. కర్మము లంటని యిట్టి నన్నాత్మగా నెవ్వఁడు చక్కఁగా నెఱింగి కర్తృత్వాభిమానముగాని కర్మఫలమునం దిచ్ఛగాని లేకయుండునో యట్టిసాధువునుగూడ నన్నువలెఁ గర్మము లంటకుండును. కర్మములు దేహజనకము లగుట బంధింపవనిసారము. (౧౫) అర్జునా! కర్త యనునభిమానము ఫలాభిలాషము తనకు లేవని తెలిసికొని పూర్వకాలమునందలి ముముక్షువులుగూడఁ గర్మముల నాచరించిరి. అందువలన నీవును గర్మముల నొనరింపుము. ఈకర్మమును వారికంటె ముందటివారగుజనకాదులు కూడఁ జేసిరి. అంతియగాక వారికంటెఁ బూర్వకాలమునుండి వరుసగా ననుష్ఠింపఁబడుచువచ్చినదియే కాని యిప్పుడు క్రొత్తగా వచ్చినదికాదు. ఈయుగమునందును బూర్వయుగములందును బూర్వులచేతను వారికంటెఁ బూర్వులచేతను జేయఁబడినదియే కావున నీవును వదలక చేయవలయును. కర్మసన్న్యాసము నీకర్హమేకాదు. (౧౬) పార్థా! కర్మమనఁగా నేమి? అకర్మమనగా నేమి? అను నీవిషయమునందు బుద్ధిమంతులుగూడఁ దెలియఁజాలక మోహమునొందిరి. దేనిని దెలిసిన నీవు సంసారముక్తుఁడ

విభిర్న లిప్యతే. ౧౪. ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః, కురు కర్మైవతస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. ౧౫. కిం కర్మ కిమకర్మేతి కవయో

వగుదువో యట్టికర్మాకర్మములఁ జక్కఁగా నీకుఁ దెలిపెదను. నీవు తత్త్వవేత్తల నడిగి తెలిసికొని చేయవలయునే కాని తోఁచి నట్లు చేయరాదు. మోహితులగుట స్వభావము. కావునఁ బెద్దల శుశ్రూషించి తెలిసికొనిన మోహమొందు నవకాశము లేదు. కాఁబట్టి నీవునట్లే చేయుము. (౧౭)కర్మమనఁగా దేహాది వ్యాపారరూపము. అకర్మమనఁగా దేహాదివ్యాపారము లేక యుండుట. కవులుకూడ మోహ మొందుదురని యేలచెప్పి తివి? ఇందుఁ జెప్పఁదగిన దేమియున్నది? అని ప్రశ్నింతువేమో వినుము సమాధానము. పార్థా! శాస్త్రవిహితకర్మతత్త్వము తెలి యఁదగియుండును. శాస్త్రవిహితముకాక నిషిద్ధముకూడ నగు వికర్మతత్త్వముకూడఁ దెలియఁదగినదే. కర్మాభావతత్త్వముకూడ నెఱుంగవలసినది. ఎందులకందు వేమో యీకర్మాకర్మవికర్మముల తత్త్వము తెలియుట మిక్కిలి కష్టము. తెలిసిన ట్లగపడుఁగాని చక్కఁగా నెఱుంగుట యసాధ్యము. (౧౮) కుంతీనందనా! ఎందుఁ గర్మముకలదని మానవులు సాధారణముగా నూహిం చుచున్నారో అందుఁ గర్మము లేదనియు,నెందుఁ గర్మము లేదని యూహించుచున్నారో అందును గర్మము గలదనియు నెవ్వఁడు తెలిసికొనునో యతఁడు జ్ఞానియు, యోగియు సర్వకర్మముల యథావిధి నాచరించినవాఁడు నగు. కర్మాదులతత్త్వ మెట్టిదని ప్రశ్నింతువనియే యీయుత్తరము చెప్పితిని. ఓడలోఁ గూరు చుండువాఁ డొడ్డునందున్నవృక్షములు లోనగువానియం

---

ఽప్యత్ర మోహితాః, తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ౧౬.కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః, అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. ౧౭.కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణిచ కర్మ యః, స బుద్ధి

దారోపింపఁబడుకదలికవలెనే, దేహేంద్రియాదివ్యాపారము
నందు విహితమునందు నిషిద్ధమునందుంగూడ నేనొనరించు
చున్నాఁడ ననుధర్మాధ్యాసముచేత నాత్మయం దారోపితమగు
విషయమునందు, అకర్తయగు నాత్మతత్త్వ మూహించుటచేఁ
గర్మాధ్యాసము నెవఁడు చూచుచున్నాఁడో, అట్లే దేహేంద్రి
యాదులు త్రిగుణాత్మికయగు మాయాపరిణామము లగుట
చేత నెల్లప్పుడు వ్యాపారసహితము లయియుండఁగా నిర్వ్యా
పారుఁడనై సుఖముగా నున్నాఁడ ననునభిమానమున దూర
మునసుండి కనులకుదగ్గరనుండు పూరుషులయందు నడచువారి
యందు గమనాభావమువలెనే యారోపింపఁబడిన వ్యాపారో
పరతియందు సవ్యాపారములగు దేహేంద్రియాదులస్వరూప
మును, నివృత్తిప్రయత్నరూపమైన వ్యాపారము నేపురుషుఁడు
చూచుచున్నాఁడో, ఔదాసీన్యావస్థయందు నుదాసీనుఁడనై
యున్నాఁడ ననునభిమానమే కర్మమనంబడునుగాన నిట్టి పర
మార్థదర్శియగుపురుషుఁడు బుద్ధిమత్త్వయోగయుక్తత్వకృత్స్న
కర్మకర్తృత్వములను మూఁడుధర్మములచేతను స్తుతింపఁబడు
చున్నాఁడు. పార్థా! కర్మశబ్దము విహితనిషిద్ధకర్మముల బోధిం
చున దగునుగనుక నిందుఁ బ్రథమవాక్యముచేఁ గర్మవికర్మ
తత్త్వము కనఁబఱుపఁబడినది. ద్వితీయవాక్యముచేత నకర్మ
తత్త్వము తెలుపఁబడినది. కర్మము బంధహేతు వగుటవలన నూ
రకయే నేను సుఖముగానుండవలయునని నీవు తలంతువేమో.
యది న్యాయసమ్మతము కాదు. కర్మత్వాభిమానము లేనియెడలఁ
గర్మము విహితముకాని ప్రతిషిద్ధముకాని కాదు. బంధహే
తువు కాకపోవుటవలన నని యెఱుంగుము. కర్తృత్వాభి

మానముకలదేని యూరకయే నేనున్నాఁడ ననునౌదాసీన్య
రూప మగునభిమానాత్మకమగుకర్మముగూడ బంధహేతువే
యగును. ఏలయనఁగా వస్తుతత్త్వ మిది యని తెలియకపోవుట
వలన నని యెఱుంగుము. కావునఁ గర్మవికర్మాకర్మములతత్త్వ
మిదికదా యని యెఱింగి యందు వికర్మాకర్మముల వదలిపెట్టి
కర్తృత్వాభిమానముగాని ఫలాపేక్షగాని లేక, విహితకర్మము
నే చేయుమని యీయుపదేశసారమని తెలిసికొమ్ము. ఇంతగా
విస్తరించి దీని నుపదేశించుట కర్మాదులతత్త్వము తెలిసికొనుట
మిగులఁ గష్టమనుభావముచేతనేగాని వేఱుకాదు. పరమేశ్వ
రారాధనరూపమగుకర్మము విషయమునఁ గర్మమిదికాదని
(అది జ్ఞానహేతువగుటచే బంధక మెంతమాత్రము కాదని)
యెవ్వఁ డెఱుంగునో, విహితమును జేయకుండుటయందు నది
ప్రత్యవాయజనకమగుటవలన బంధహేతువని యెవ్వఁడెఱుం
గునో యాతఁడు కర్మము నాచరించువారియందు వ్యవసాయా
త్మక బుద్ధికలవాఁడగుట నుత్తముఁడు. దీనియందుఁగలసారత
రార్థమిట్లు మదియం దుంచుకొనుము. ఆరురుక్షువునకుఁగూడ
నెపుడు కర్మము బంధకముకాదో యప్పు డారూఢున కెట్లు బం
ధకంబగును? ఇంతమాత్ర మెఱింగినవాఁడే బుద్ధిమంతుఁడు.
ఆతఁడే యోగియు నగును.

(౧౯) ఈరీతి నెఱింగినవాఁ డెవ్వఁడో, ఎవ్వఁ డొన
రించుకర్మములు కామసంకల్పప్రయుక్తయులు గాక నిష్ఫల
వ్యాపారములుగా సాగుచుండునో, కర్మము లోనగువాని
యందు నకర్మాదిదృష్టియనేజ్ఞానముచే దగ్ధములగుసకలకర్మములు

మా॥ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. ౧౮. యస్య సర్వేషు సమా

గలయాపురుషుని బరమార్థపండితుఁడని బ్రహ్మవేత్తలు పలుకు దురు. కామ మనఁగా ఫలాభిలాషము. సంకల్ప మనఁగా నేను జేయుచున్నానన్న కర్తృత్వాభిమానము. కర్మము లీరెండిం టిచే విడువఁబడినకర్మము లెవ్వనివో, లోకసంగ్రహార్థము కాని, బ్రదుకునకై కాని ప్రారబ్ధకర్మప్రోత్సాహవశమున వ్యర్థచేష్టా రూపముగాఁ బరిణమించుచున్నవో, అతఁడు జ్ఞానాగ్నిదగ్ధ కర్ముఁడగుట నతనిఁ బండితుఁడని పెద్దలందురని నమ్ముము. (౨౦) కర్మమునందుఁ గర్తృత్వాభిమానమును దానిఫలమునం దాస క్తిని వదలిపెట్టి యింతకుముందుఁ జెప్పఁబడిన జ్ఞానముచేత నిత్యతృప్తుఁడయి దృష్టాదృష్టవిషయములందును దానిసాధించు నుపకరణములయందు నభిసంధిలేనివాఁడగుచుఁ గర్మము చేసి నను, ఆతఁడు లోకసామాన్యదృష్టిచేఁ జేయుచున్నాఁడే కాని తనదృష్టిచే నించుకయైనను జేయువాఁడు కాఁడు. ఆసంగమనఁ గా భోగాభిలాషము. నిత్యతృప్తుఁడనఁగాఁ బరమానందస్వ రూపలాభముచే సర్వత్ర అపేక్షలేనివాఁడు. నిరాశ్రయుఁ డనఁగా నద్వైతదర్శనముచే దేహేంద్రియాదిక మెవ్వనినుండి తొలఁగినదో యట్టివాఁడు. కర్మమనఁగా వైదికలౌకికకర్మము. అని గ్రహింపుము.(౨౧) కౌంతేయా! ఆశలు వదలిపెట్టి మనో దేహముల నిగ్రహించుచు విషయవ్యూహమును బరిత్యజించి యుండుమహాత్ముఁడు శరీరరక్షణార్థమయి యే చేయఁదగుకర్మము నభిమానశూన్యముగాఁ జేయుచుండును. దాన ధర్మాధర్మరూప

---

రంభాః కామసంకల్పవర్జితాః, జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః. ౧౯. త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః, కర్మణ్యభి ప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః. ౨౦. నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వ

పాపమునుగాని సంసారమునుగాని యించుకయైనను బొందఁడు. జ్యోతిష్టోమాదికము మిక్కిలి విక్షేపహేతువగునది యే చక్కని జ్ఞానవశమున నయ్యదియు ఫలజనక మెప్పుడు కాకయుండునో యప్పుడు విక్షేపమును గల్గింపఁజాలక శరీరస్థితిమాత్ర నిమిత్తమయిన భిక్షాటనాదికకర్మము బంధహేతువని తలంపకుము. మనోదేహముల నిగ్రహించుట యనఁగాఁ ప్రత్యాహారము చేత నిగ్రహింపఁబడిన యంతఃకరణబాహ్యేంద్రియసహిత దేహములు అని యర్థము. ఆశలనఁగా మీఁదమీఁదఁ గ్రమ్ము నూహాలు. కోరికలనియుఁ జెప్పవచ్చును. (౨౨) తాను బ్రయత్నింపక తనయంతన లభించిన యాహారాదికముచేఁ దృప్తినొందుచు శీతోష్ణసుఖదుఃఖాదు లగుద్వంద్వములు (ఒకదాని వెనుక నొకటిగాఁ దప్పక కలుగునవి.) పీడించుచున్నను మనశ్శాంతి నెడఁబాయక సర్వభూతములయందును బగలేక తానే కార్యముకొఱకు యత్న మొనరింపక యప్రయత్నముగా లభించు నట్టి దొకానొకప్పుడు లభించినను లభింపకపోయినను మోదఖేదములఁ బొందక యట్లే తా నకర్తయని తెలిసికొని యించుకయైనఁ గర్తృత్వాభిమానము లేనివాఁడగుచు భిక్షాటనాదికర్మమును శరీరస్థితినిమిత్తము చేసినను, అతఁడు బంధము నొందఁడు. సర్వపరిగ్రహములను వదలిన నియతవ్రతునకు శరీరము నిలుచుటకుమాత్రము ప్రయోజనమగుకర్మము తగునని పెద్ద లనుమతి నొసంగిరి. అందు నన్నము వస్త్రము లేక శరీరము నిలువదు. కావున యాచించి స్వప్రయత్నముచేతఁ

పరిగ్రహః, శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం. ౨౧. యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః, సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న ని

గూడ సన్నవస్త్రములను సంపాదించుకొనఁదగునా యని సందియము కలుగునేమో యనియే యీవిషయముఁ దెలిపితిని. యదృచ్ఛ యనఁగా శాస్త్రసిద్ధముకాని ప్రయత్నములేకుండుట యని భావము. యదృచ్ఛాలాభ మనఁగా శాస్త్రమనుమతినొసంగిన యన్నవస్త్రాదికలాభ మేదియో యదియని తాత్పర్యము. సంతుష్టుఁ డనఁగా దానికంటె నెక్కువ కావలయునను తృష్ణలేనివాఁడని యర్థము. కావున నపేక్షింపక కలిగినలాభముచేఁ దృప్తినొంది యుండవలయునని యెఱుంగుము. ఈనియమము ననుసరించి వర్తించువాఁడు యతచిత్తాత్ముఁ డనఁబడును (౨౩) కనఁబడుచున్నసర్వప్రపంచమునందు నాసక్తిలేక ధర్మాధర్మాదికమగుబంధమునుండి విముక్తుఁడై మనస్సు జ్ఞానమునందే నిలిపియుండువాఁడు భగవత్ప్రీతికొఱకుఁ గర్మము నాచరించిన నట్టివాఁడు చేయుకర్మము ఫలముతోఁగూడ నశించును. బ్రహ్మవేత్తలగుజనకాదులకు యజ్ఞాదిరూపకర్మము బంధజనకముకాదా యని శంకింతువేమో యనియే యీసమాధానము చెప్పఁబడినది. ఫలాసక్తిలేనివాఁడు గతసంగుఁ డనఁబడును. కర్తృత్వభోక్తృత్వప్రభృత్యధ్యాసములేనివాఁడు ముక్తుఁ డనఁబడును.

(౨౪) ఒనరించినకర్మము తనకార్యమగుఫలమును గల్గింపకయే సమగ్రముగా నశించుననుదువేమో వినుము. బ్రహ్మవేత్త యజ్ఞాదికర్మము నాచరించునపుడు హోమమునకు సాధనములగు స్రుక్స్రువాదులను బ్రహ్మముగనే భావించును. హోమ

బధ్యతే. ౨౩. గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః, యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. ౨౪. బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా

నుచేయుహవిస్సు వానికి బ్రహ్మముగనే కనఁబడును. అగ్నియు బ్రహ్మముగనే తోఁచును. హోమము చేయువాఁడును బ్రహ్మముగనే యగపడును. హోమక్రియయుఁ దత్ఫలముకూడ బ్రహ్మముగనే కనఁబడును. సర్వమును బ్రహ్మముగనే భావించునని యెఱుంగునది. యజ్ఞాదిక్రియ యనేక కారకసాధ్యము. దేవత నుద్దేశించి ద్రవ్యమును విడుచుట యజ్ఞము. హోమమనఁగా నగ్నియందాపదార్థమును వదలుట, అందు దుద్దేశ్యమగు దేవత సంప్రదాన కారకము. విడువంబడుచున్న హవిరాత్మకపదార్థము ధాత్వర్థమునకు సాక్షాత్తు కర్మము. దానికి ఫలమగుస్వర్గాదికమన్ననో వ్యవహితమగుటచే భావనాకర్మము. హవిస్సును దాఁ జేతనుంచుకొని హుతవహునందు వేల్చుటకు నత్యంతసాధనమగుటచే జుహూ వనునది మొదలగుపరికరములు కరణములు. ప్రకాశకము కావున మంత్రాదికముకూడఁ గరణమే. ఇవ్విధమునఁ గారకము జ్ఞాపకము నను భేదముచేతఁ గరణముకూడ రెండువిధములుగా నగును. ఇట్లు త్యాగమును, అగ్నియందునుచుటయును రెండుక్రియలు. అందుఁ దొలుతటిదాని యందు యజమానుఁడు కర్తయగు వేల్చుటయందనఁగాఁ బ్రక్షేపమునందు యజమాననియుక్తుఁడగు నధ్వర్యువు కర్త. ప్రక్షేపమునకు నధికరణ మగ్ని. ఈరీతి దేశకాలాదికముకూడ సర్వక్రియాసాధారణమయిన యధికరణమని యెఱుంగఁదగు. ఇట్టిక్రియాకారకాదివ్యవహారాదులు బ్రహ్మజ్ఞానకల్పితము లగుటంజేసి బ్రహ్మతత్త్వజ్ఞానమున బాధితములు కాఁగా బాధితానువృత్తిచేఁ గ్రియాకారకాదివ్యవహారాభాసము కనఁబడుచున్నను దగ్ధపటన్యాయమున ఫలము కల్గింపఁజాలదు. బ్రహ్మవేత్తకు

సర్వము బ్రహ్మముగనే తోఁచునుగాని యితరవిధముగాఁ గనఁ బడదు. మఱియుఁ బరమేశ్వరారాధనరూపమగు యజ్ఞార్థకర్మము జ్ఞానహేతువగుట బంధకము కాఁజాలదు. కావున కర్మమే యగును. (౨౫) లోకమునఁ గొందఱు కర్మనిష్ఠు లింద్రాదిదేవతల నుద్దేశించి చేయుయాగములనే చేయుచున్నారు. ఇతరులగు బ్రహ్మవేత్తలు బ్రహ్మాత్మైక్యము నెఱింగినట్టి కర్మసన్న్యాసులు నుపాధిసహితుఁ డగునాత్మ నుపాధిరహితశుద్ధస్వభావమున బ్రహ్మాగ్నియందు హోమము చేయుచున్నారు. ఉపాధులను వేఱుచేసి యాత్మయే బ్రహ్మమని యెఱుంగుచున్నారు. కర్మయజ్ఞమును ముందే చెప్పితిని. చిత్తశుద్ధిమూలమున దానికి ఫలభూతమగుజ్ఞానయజ్ఞము నిపుడు చెప్పితినని తెలియుము. ఇవన్నియు నధికారభేదమునఁ జేయబడుచుండును.

(౨౬) యోగులు కొందఱు శ్రోత్రాదీంద్రియనిగ్రహమనే యగ్నియందు హోమము చేయుచున్నారు. ఇంకఁ గొందఱు శబ్దాదివిషయములను ఇంద్రియములను నగ్నులయందు హోమముచేయుచున్నారు. కౌంతేయా! ఇఁకఁ గొందఱినఁగాఁ బ్రత్యాహారపరులని యెఱుంగుము. ధారణధ్యానసమాధులను నీమూఁడు నేకవిషయమైె సంయమాగ్ని శబ్దముచేఁ జెప్పఁబడును. అందు హృదయపుండరీకము లోనగుతావుల మనస్సు చాలకాల మునుచుట (నిలుపుట) ధారణ యనంబడు. ఒక్కతావున నిలుపఁబడు చిత్తముయొక్క భగవదాకారవృత్తి ప్రవాహ

---

హుతం, బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా. ౨౫. దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే, బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి. ౨౬. శ్రోత్రాదీనింద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి, శబ్దాదీన్ విష

మప్పుడప్పుడు ఇతరాకారవృత్తిచే వ్యవహితమైనది ధ్యానమనం
బడును. ఇంచుకయైనను విజాతీయప్రత్యయముచే నవ్యవహిత
మగు సజాతీయప్రత్యయప్రవాహము సమాధి. ఆసమాధి చిత్త
భూమిభేదముచేత రెండువిధములుగ నగు. సంప్రజ్ఞాతము అసం
ప్రజ్ఞాతము అని వానిపేరులు చిత్తమునకు భూమిక లయిదు
గలవు. క్షిప్తమని, మూఢమని, విక్షిప్తమని, ఏకాగ్రమని,
నిరుద్ధమని వానిపేరులు క్షిప్తమనఁగా రాగద్వేషాదివశమువలన
విషయములం దభినివేశముగలుగుట నిద్రాదికమునకు లోనై
నది మూఢ మనంబడును. ఎల్లప్పుడు విషయాసక్తమయ్యు
నొకప్పుడు ధ్యాననిష్ఠమగునది విక్షిప్త మనఁబడును. అందు
క్షిప్తమూఢములకు సమాధి కవకాశమే లేదు. విక్షిప్తచిత్తము
నందు నొకానొకకాలమందుఁ గలుగుసమాధి విక్షేపప్రాధాన్య
మున యోగపక్షమునం జేరఁజాలదు. దీపము పెద్దగాలికిఁ జల్లా
ఱునట్లు తనంతనే నశించును. ఇంక నేకాగ్రమనఁగా నేకవిష
యకధారావృత్తికి సమర్థమై సత్త్వోద్రేకముచేఁ దమోగుణము
నంగలుగు నిద్రాదిరూపమగులయము లేకపోవుటవలన నాత్మా
కారమగువృత్తి యగుచున్నది. అది రజోగుణముచేఁ గలుగు
చాంచల్యరూపవిక్షేపము లేకపోవుటంజేసి యేకవిషయమే
యగును. ఈరీతిగా సత్త్వము శుద్ధమైననే చిత్త మేకాగ్ర
మగును. ఈభూమియందు సంప్రజ్ఞాతసమాధి యగును. ఆసమా
ధియందు ధ్యేయాకారమగువృత్తికూడఁ బ్రకాశించును.
దానింగూడ నిరోధించినప్పుడు నిరుద్ధమగుచిత్తము అసంప్రజ్ఞాత
భూమియగును. ఇదియే తదాదిగా విరక్తుఁడై సమాధిఫలభూత
సుఖముగూడ నాశింపనియోగికి దృఢభూమియై ధర్మమేఘం

బనంబడును. ధారణాధ్యానసమాధులు సిద్ధించుటకై సర్వేం ద్రియములను దత్తద్విషయములనుండి ప్రత్యాహరించుచున్నా నిర తాత్పర్యము. విషయములనుండి నిగ్రహింపఁబడినయిం ద్రియములు చిత్తరూపములే యగుచున్నవి. దాన విక్షేపము లేకపోవునుగాన చిత్తము ధారణాదికముచేయ సమర్థమగునని యెఱుంగవలయును. ఇందుఁ బ్రత్యాహారము ధారణాధ్యాన సమాధులు యోగాంగములు నాలుగు చెప్పఁబడినవి. ఇట్లు సమాధ్యవస్థయందు సర్వేంద్రియవృత్తి నిరోధము యజ్ఞ ముగాఁ జెప్పఁబడును. ఇప్పుడు సమాధినుండి లేచినపుడు రాగ ద్వేషములులేక విషయభోగ మేదికలదో యదియు మఱొక యజ్ఞముగా నెఱుంగఁదగును. విషయభోగసమయమందును గృహస్థులు ఆసక్తిలేక యగ్నులని తలంపఁబడినయింద్రియముల యందు హవిస్సుగా భావింపఁబడుశబ్దాదులను హోమము చేయు చున్నారని అది జ్ఞానహేతువగుననియు నిందుఁగలసారము.

(౨౭) కొందఱు సమస్తేంద్రియకర్మములను బ్రాణకర్మము లను వివేకజ్ఞానముచేతఁ బ్రజ్వలించునట్లు చేయంబడునాత్మ సంయమయోగాగ్నియందు హోమముచేయుచున్నారు. ధ్యే యవిషయమగుజ్ఞానముచేతఁ బ్రజ్వలితమగుదానియందు ధ్యే యమును జక్కఁగా నెఱింగి దానియందు మనస్సును సంయ మనముచేసి యాకర్మములనన్నింటి నుపరతినొందించుచున్నా రని దీనిసారము. (౨౮) కుంతీనందనా! కొందఱు తీర్థాదుల

---

యాన న్యేౕ పీంద్రియాగ్నిషు జుహ్వాతి. ౨౭. సర్వాణీంద్రియకర్మాణి ప్రాణ కర్మాణిచాపరే, ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వాతి జ్ఞానదీపితే. ౨౮. ద్రవ్య యజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాపరే, స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యత

యందు ద్రవ్యము వినియోగించుటయే యజ్ఞముగా భావించి దాని నాచరింతురు. కొందఱు కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సునే యజ్ఞముగా నాచరింతురు. మఱియును గొందఱు యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణాసమాధులనఁబడు నెనిమిదియంగములు గలయోగమునే యజ్ఞముగా నాచరింతురు. ఇఁకఁ గొందఱు విధివిహితప్రకారము వేదపారాయణము చేయుటయే యజ్ఞముగా నుపాసింతురు. మఱియు నొక్కకొందఱు శాస్త్రార్థపరిజ్ఞానమునే యజ్ఞముగా గ్రహించి దానినే యనుసరింతురు. ఇతరులు గొందఱు నిరంతరప్రయత్నముచేయువారలు దృఢమహావ్రతమునే యజ్ఞముగా నిశ్చయించి దాని నాచరింతురు. ఈయాఱును యజ్ఞము లనియే తలంపఁబడును. ద్రవ్యయజ్ఞము చేయువారనఁగాఁ బూర్తము దత్తము అనుపేరుగల స్మార్తకర్మములుచేయువారని యర్థము. తపోయజ్ఞు లనఁగాఁ గృచ్ఛ్రచాంద్రాయణాదికతపస్సే యజ్ఞమని నమ్మువారని యర్థము. యోగమనఁగాఁ జిత్తవృత్తినిరోధము. యోగాంగములగు నెనిమిదింటిలోఁ బ్రత్యాహారధారణాధ్యానసమాధులను మున్నే చెప్పితిని. యమనియమాసనములిపుడు చెప్పుచున్నాఁడను. యమము లనఁగా నహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అని యైదుభేదములు. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము అనుభేదములుగలవి నియమములు. స్థిరసుఖమైనది యాసనమనంబడును. ఆసనములు పద్మకస్వస్తికాది నామంబుల ననేకవిధములుగా నుండును. హింస యనఁగా

---

యస్సంశితవ్రతాః. ౨౮. అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథా

శాస్త్రవిహితముకాని ప్రాణివధము. అది కృతము, కారితము, అనుమోదితము. అని మూఁడువిధములు గలవగును. ఇవ్విధమున నయథార్థభాషణము అవధ్యప్రాణిహింసాసంబంధియగు యథార్థభాషణము అనృతము శాస్త్రవిరుద్ధ మార్గంబునఁ బరులద్రవ్యము గ్రహించుట స్తేయము. అశాస్త్రీయమగు స్త్రీపురుషసంగమము మైథునము, శాస్త్రనిషిద్ధముకాని మార్గంబున దేహయాత్రకుఁ గావలసినంతకంటె నధికముగా భోగసాధనముల గ్రహించుట పరిగ్రహము. వీని నివర్తింపఁజేయులక్షణములగునుపరమములు యమము లనంబడును. శౌచముగూడ రెండువిధములుగలది. బాహ్యమని, అభ్యంతరమని వాని పేరులు. జలమృత్తికాదులచే దేహమును గడుగుట బాహ్యశౌచము. మైత్రిముదితలోనగువానిచే మదము మానములోనగుచిత్తమలములఁ గడుగుట యాభ్యంతరశౌచ మనంబడును. సంతోషమనఁగా దొరకినభోగసాధనములకంటె నధికములు వలదనుచిత్తవృత్తియే. తపస్సనఁగా క్షుత్పిపాసలు శీతోష్ణాది ద్వంద్వముల నోర్చుకొనుటయుఁ, గాష్ఠమౌనము, ఆకారమౌనము లోనగువ్రతంబులే యని యెఱుంగందగును. ఇంగితముచేతఁగూడ స్వాభిప్రాయమును దెలుపకుండుట కాష్ఠమౌన మనంబడును మాటలాడకుండుటమాత్రము ఆకారమౌన మనఁబడును. అని మౌనభేదములు. మోక్షశాస్త్రాధ్యయనముగాని, ప్రణవజపముగాని స్వాధ్యాయ మనంబడును. ఈశ్వరప్రణిధాన మనఁగా సర్వకర్మములను, బరమగురువగు నీశ్వరునియందు ఫలాపేక్షలేక యర్పించుట. ఇవి విధిరూపములని తెలియం

---

పరే, ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః. గీ. అ౪శ్లో ౨౯

దగును. ఇట్టి యమనియమాదుల నభ్యసించువారు యోగ యజ్ఞు లనంబడుదురు. న్యాయముచేత వేదార్థము నిశ్చయించుటయం దాసక్తులు జ్ఞానయజ్ఞు లనంబడుదురు. అతిదృఢము లగు వ్రతములుగలవారు వ్రతయజ్ఞు లను ఖ్యాతిం గాంతురు. ఇట్టివారు పెక్కండ్రు గలరనియు నెఱుంగుము. వీరందఱు మోక్షమునొందఁ బ్రయత్నించువారలే.

(౨౯,౩౦) అర్జునా! ప్రాణాయామపరులై కొందఱు పూరకము చేయుచున్నారు. కొందఱు రేచకము చేయుచున్నారు. మఱికొందఱు ప్రాణాపానగతులను నిరోధించి కుంభకము నాచరించుచున్నవారు. ఇంకఁగొందఱు నియతాహారమును గ్రహించుచు నొక్కొక్కవాయువును జయించి దానియం దితర వాయువులను బ్రవేశపెట్టి జయించుచున్నారు. ఈయజ్ఞములు చేయువారెల్లరు యజ్ఞకర్మానుష్ఠానముచేతఁ బాపక్షయము నొందుదురు.

(౩౧) ఈరీతిగా యజ్ఞముల నాచరించి యందు మిగిలిన కాలమునం దమృత మను పేరుగల యన్నమును భుజించువారు క్రమముగా సనాతనమగు బ్రహ్మము నొందుదురు. అట్టివారికి సత్త్వశుద్ధిగలిగి జ్ఞానము ప్రాప్తింపఁగా నిత్యమగు బ్రహ్మము నొందుదురు. ఈయజ్ఞములలో నొకటినైన నాచరింపనివానికి సకలజంతుసామాన్యమునకు సహజమగు నీలోకముకూడ లేదు. ఇంక శాస్త్రోక్తసాధనములచే సాధింపవలసిన పరలోకము

---

యతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి, సర్వేప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః. ౩౧. యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనం, నాయం

లేదని విశేషించి చెప్పవలయునా. (౩-౨) ఈవిధమున ననేకవిధ యజ్ఞములు వేదమూలమునఁ దెలియఁదగియున్నవి. అవన్నియు గర్మజములే (కాయికవాచికమానసకర్మజనితములే) కాని యాత్మజములు గావు. నీవిట్లు ఇవి దేహాదివ్యాపారములే కాని నేను నిర్వ్యాపారుఁడనౌట నీయజ్ఞములు నావ్యాపారములు కావని యెఱుంగఁజాలుదువేని సంసారమునుండి ముక్తుఁడ వగుదువు. అర్జునా! ఇవి నాబుద్ధిచేఁ గల్పించిచెప్పినట్లు భావింతువేమో వేదమునఁ జెప్పఁబడినవనియే నమ్ముము. దీనిచేత జ్ఞానయజ్ఞ ముత్తమోత్తమమని యెఱుంగఁదగు. దీని నెఱింగితివేని సంసారబంధములు నిన్నంటఁజాలవు. ఇట్లనుటచేఁ దక్కుంగల యజ్ఞములు నిష్ఫలములని కాదు అవియు జ్ఞానసాధనములే యగు. వానిమూలమునఁ గలుగుజ్ఞానమునొంది పిదప నిట్లు చేయుదువేని ముక్తి దొరకునని గ్రహింపుము. (౩౩) పరంతపా! అర్జునా! ద్రవ్యసాధ్యమగు యజ్ఞమునకంటె జ్ఞానయజ్ఞ ముత్తమోత్తమము. ఎందుల కందువేమో సకలకర్మములును జ్ఞానమునం దంతర్భావము నొందును. కావున జ్ఞానయజ్ఞ మతునత్తమమగును. యజ్ఞములన్నియు సమానములని భావించినచోఁ గర్మమునకు జ్ఞానమునకుసామ్యము ప్రాప్తించును. కావుననే జ్ఞానయజ్ఞమత్యుత్తమమంటిని. జ్ఞానము కర్మమునకు సాధనము కాదు. కర్మము జ్ఞానమునకు సాధనమగును. కాఁబట్టి జ్ఞానమే ప్రధానమని

లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ. ౩౧. ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే, కర్మజాన్ విద్ధి తాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. ౩౨. శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప, సర్వం కర్మా

యెఱుంగుము. (౩౪) ఈయత్యుత్తమజ్ఞాన మెట్లు పొందఁదగు
నని యూహింతువేమో వినుము. సద్గురువులకడకుం బోయి
వారికి నమస్కారము చేసి బంధమోక్షవిద్యావిద్యలస్వరూప
మెట్టిదని సంశయములు తొలఁగునట్లు వారిం బ్రశ్నించి
వారికి శుశ్రూషచేయుట లోనగునుపాయములతో నాజ్ఞా
నముం బడయుము. తత్త్వమును సాక్షాత్కారమున నెఱింగిన
జ్ఞానులు నీకట్టిజ్ఞానము నుపదేశింతురు. జ్ఞానులనఁగాఁ బద
వాక్యనామాదులగుశాస్త్రములయందు నిష్ణాతులని యర్థము.
పెక్కండ్రుజ్ఞానులకడ కరుగుమని యూహింపకుము జ్ఞానులను
బహువచనము మర్యాదను దెలుపునదియే. పూజ్యులవిషయ
మున బహువచనము సాంప్రదాయసిద్ధమని తెలిసికొనుము.
(౩౫) అట్టిజ్ఞానమును బడయుదువేని నీవు మరల నిట్లు
మోహము నొందకుందువు. ఆజ్ఞానముచేతనే నీవు సర్వభూత
ములు నీప్రత్యగాత్మయందే యుండుటఁ దిలకింతువు.నాయందు
నుండుటయుం జూతువు. శ్రమంపడి జ్ఞానము సంపాదించు
కొనఁగా నగుఫల మిదియే యని యూహింపుము. (౩౬) అర్జు
నా! లోకమునందుఁ బాపములు చేసినవా రెందఱో కలరు.
నీవు వారందఱికంటె నెక్కుడుపాపములు చేసిన నవియున్నియు
నీకీజ్ఞానముచేతనే తుదముట్టి నశించునని నమ్ముము. నీవంటటి
పాపాత్ముఁడ వని నాభావము కాదు. జ్ఞానాగ్ని సర్వపాపేంధన

---

ఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే. ౩౩. "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా, ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః. ౩౪. యజ్జ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాండవ, యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి. ౩౫. అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః,

ములఁ భస్మముచేయునని నీకుఁ దెలుపుటకై యిట్లు చెప్పితిని. దుస్తరపాపవారాశిని జ్ఞానప్లవముచేతనే దాటవలయును. వేఱొకసాధనము దానికిఁ బనికిరాదు. కావున నీవు సద్జ్ఞానము నార్జించి తత్సహాయమున నీమోహవారాశిని దరింపవలయును. (37) ఓయర్జునా! చక్కఁగా మండుచున్న యగ్ని దారువుల భస్మముగా నెట్లుచేయునో యట్లే జ్ఞానము సర్వకర్మములను నిర్బీజములుగాఁ జేయును. సముద్రమువలె నుండుపాపమును దాఁటవచ్చుంగాని దానిని నశింపఁజేయ శక్యమా యని భ్రాంతి నొందుదువేమోయనియే యీవిషయము నొక్కి చెప్పుచున్నాఁడను. (38) పార్థా! జ్ఞానమువంటి పవిత్రవస్తు వెందును లేదు. కాఁబట్టి కర్మయోగమును సమాధియోగమును జిరకాలము సాగించుటచేతఁ జిత్తశుద్ధినొంది యధికారియగు ముముక్షువు ఆజ్ఞానము నంతఃకరణమునందుఁ బొందుచున్నాఁడు. కావున జ్ఞాన ముత్తమోత్తమమని నిశ్చయింపుము. (39) ఏకాంతంబున దీనిచే జ్ఞానప్రాప్తియగునో ఆయుపాయము నాలకింపుము శ్రద్ధగలవాఁడును, గురూపాసనము, శ్రవణము లోనగువాని యందుఁ బట్టుదలగలవాఁడును, ఇంద్రియనిగ్రహముగలవాఁడునుదప్పక జ్ఞానము నొందుచున్నాఁడు. జ్ఞానమునొందినయెడల నచిరకాలమునందె ముక్తినొందును. శ్రద్ధయనఁగా గురువాక్యమునందును, వేదాంతవాక్యమునందును, ఇది యిట్లే సత్యమను

---

సర్వంజ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి. 37. యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున, జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. 38. నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే, తత్స్వయంయోగసంసిద్ధః కాలేనాత్మని విందతి. 39. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రి

నాస్తిక్యబుద్ధి యని యర్థము. శ్రద్ధయుఁ, దత్పరత్వము, జితేంద్రియత్వము నను నీమూఁడునుగలవాఁడు జ్ఞానవంతుఁ డగునని భావము. ఈమూఁడింటిలో నేదియూయొక్కటియున్న, జాలదా యనకుము. చాలదనియే నమ్ముము. దీపము వెలుఁగఁగనే యంధకారము పటాపంచలగునో యట్లే జ్ఞానము కలిగినంతనే యజ్ఞానము తొలఁగిపోవును. శ్రద్ధాదిసంపత్తిచే జ్ఞానము నొందుటకు ముందే కర్మయోగమే శుద్ధినిమిత్త మనుష్ఠింపఁదగినది. జ్ఞానము నొందినతర్వాతఁ బరార్థముయియేతప్ప నాచరింపఁదగిన దేదియు నుండదని యెఱుంగుము. లోకసంగ్రహార్థము జ్ఞానియుఁ గర్మమునాచరింపవలయునని మున్నే తెల్పితినిగదా.

(౪౦) సంశయము పాపిష్ఠముగాన దాని నొందరాదని యెఱుంగుము. అజ్ఞానియు, శ్రద్ధావిరహితుఁడును, సంశయాత్ముఁడును నాశమొందుదురు. వారియందు సంశయాత్మునకెల్ల విషయములందును సంశయములుండుటవలన నిహలోకముగాని పరలోకముగాని లేదు. ఎందును సుఖముకలుగఁబోవదని నిశ్చయింపుము. అజ్ఞానియనఁగా శాస్త్రాధ్యయనము చేయనివాఁడు గావున నాత్మజ్ఞానము లేనివాఁడని యర్థము. శ్రద్ధావిరహితుఁ డనఁగా, గురువాక్య వేదాంతవాక్యముల యర్థమునం దిది యిట్లు కానే కాదని విపరీతజ్ఞానరూపకమైన నాస్తిక్యబుద్ధిగలవాఁ డనియర్థము. సంశయాత్ముఁడనఁగా ఇది యిట్లగునా కాదా యని యెల్లవిషయములందును సంశయాక్రాంత చిత్తముకలవాఁడని యర్థము. ఈముగ్గురిలో మొదటి యిర్వురకంటె మూఁడవవాఁడగు

యః, జ్ఞానం లబ్ధ్వా పరాంశాంతిమచిరేణాధిగచ్ఛతి. ౩౯. అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి, నాయం లోకోఽస్తి నపరో నసుఖం

సంశయాత్ముఁడు పాపిష్ఠుఁడగును. అజ్ఞునకు నశ్రద్ధధానునకుఁ బర లోకమునూత్రము లేదు. ఇహలోకమున భోజనాదిసుఖములు గలవు. మూఁడవవాని కవియును లేవు. (౪౧) ధనంజయా! జీవేశ్వరైకత్వజ్ఞానముచే సంశయములెల్ల వీడినవాఁడగుచుఁ బరమార్థజ్ఞాననిష్ఠనొంది ధర్మాధర్మాఖ్యములగు సర్వకర్మములను సన్న్యసించి యించుకయైనను బ్రమాదము లేకయుండు పురుషుని వాని దేహేంద్రియాదులు చేయుకర్మములు బంధింపవు. (౪౨) భారతా! ఆకారణమువలన నజ్ఞానజనితమైనదియును, హృదయమునఁ బాదుకొన్నదియునగు నీయాత్మవిషయక సంశయమును నే నుపదేశించిన యాత్మతత్త్వనిశ్చయరూప ఖడ్గముచే ఛేదించి యాత్మజ్ఞానమున కుపాయమగు విహితకర్మానుష్ఠానముచేయుము. యుద్ధముచేయ లెమ్ము.

జ్ఞానయోగ మనఁబడు నాల్గవయధ్యాయము సంపూర్ణము.

సుస్థిరమనీషులారా! ఇది భగవద్గీతా శాస్త్రమునందు నాల్గవయధ్యాయము. జ్ఞానయోగమని ప్రసిద్ధిగాంచినది. జ్ఞానకర్మసన్న్యాసయోగ మనియు వాడఁబడును. భగవంతుఁ డీయోగము నుపదేశించుటలోఁ గల సారమేమి? శ్రీహరి తాత్పర్యమేమి? అని విచారించు టుచితము. కర్మయోగమును జదివితిరి. ఇది జ్ఞానయోగము. కావున దీనినుండి తేలెడుసారాం

---

సంశయాత్మనః. ౪౦. యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయం, ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ. ౪౧. తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః, ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత. ౪౨.

జ్ఞానయోగో నామ చతుర్థోఽధ్యాయః.

శేమేమని చర్చించుట మంచి కార్యము. జ్ఞానులు కర్మసన్న్యాసులను ప్రథ గలదు కదా. అనఁగా జ్ఞానులు కర్మము నాచరింప నవసరములేదని కొంద ఱూహింతురు. అది న్యాయమా. ఆ యూహ కీయోగమున నవకాశ మిసుంమంతయేని కలదా యనునదియే ప్రధానము. శ్రీహరి తాను బరమేశ్వరుండయ్యు నర్జునునకుఁ దొలుత సాంఖ్యయోగము నుపదేశించి పిదప గర్మయోగమును దెలిపి ఆవల జ్ఞానయోగము నుపదేశించుటంజేసి నిశ్శ్రేణికాన్యాయము ననుసరించి యొకదానికన్న వేఱొక్కటి మిన్నయని యెన్నఁదగునని కొందఱు పండితమ్మన్యు లూహింతురు. కాని యది కేవలము పొరపాటు. సకలకర్మములనుమాని జ్ఞానివి కమ్మనియే యుపదేశించినచో నీయధ్యాయాంతమున

"యోగమాతిష్ఠోత్తిష్ఠభారత."

అని యుపదేశించుట సర్వథా యసంగత మనక తప్పదు. జ్ఞానయోగమును దెలిపి కర్మముల నొనరింపుము. యుద్ధము చేయు మెమ్మని హెచ్చరించు టుచితమని తలంచువా రున్నత్తులు కాకుందురు. యుద్ధముచేయుట కనుగ్రమి చ్చుపద మిందు లేదు గాన నందులకుఁ బ్రయత్నింపుమని భగవంతుఁ డుపదేశించెనని యిట్లు నిశ్చయింపఁదగునని కొంద ఱనవచ్చును. కాని గీతాశాస్త్రమునంతయు నుపదేశించి యాయర్జునునిచే భగవంతుఁడు చేయించినపని యేమి ? యుద్ధమేకదా. కావున సహజకర్మము నొనరింపుము. క్షత్రియజాత్యుచితమగు యుద్ధముచేయ సిద్ధపడుమని హరి యాజ్ఞాపించి నట్లే నిశ్చయింప నవకాశముకలదు. కావున జ్ఞానయోగము నేటి కుపదేశించె నని మనము తర్కింప వలసియున్నది.

తొలుఁదొలుత శ్రీకృష్ణపరమాత్మ జ్ఞానయోగము నా రంభించుచు నర్జునా! యీకర్మయోగము నేను కల్పించినది కాదు. సృష్ట్యాదిని నేనే భానున కుపదేశించితిని. ఆసూర్యుఁడు మనువునకుఁ దెలిపెను. ఆతఁ డిక్ష్వాకువునకుఁ దేటపఱిచెను. ఇట్లు పరంపరాప్రాప్తమగు దీనిని రాజర్షు లెఱుంగుదురు. అట్టి సనాతనమగు నీకర్మయోగము చాలకాలము క్రిందటనే నశించి నది. ఆవిషయమే యిపుడు నీ కుపదేశింపుచున్నాఁడ ననిరెు. కర్మ మనాదియని యెఱుంగు మను భావమునే తెలిపెను. రాజర్షు లెఱుంగుదురనుచో నొకవిశేషము కలదు. ఈగీతా శాస్త్రోపదిష్టమార్గము రాజులకే. అందును రాజర్షులకే. అనఁగా వారి కత్యంతోపయుక్తమనియు నితరజాతులకుఁగూడ గ్రాహ్య మగుఁగాని ముఖ్యము కాదనియుఁ గొందఱు వాదింతురు. అది యించుమించుగా నాస్తికులవాదమువంటి దగు ననపలయును. భగవదుపదేశము సర్వప్రాణుల కుపయుక్తము కావలయును గదా. అట్లు తెలుపు టేటి కనఁగా నీమార్గ మనాది యని యెఱుం గఁదగుననియు నీకంటె జ్ఞానధనులగు పెద్దలందఱు దీని నవలం బించిరనియుఁ దెలుపుటకే యని యెఱుంగఁదగు. నీ వల్పజ్ఞుఁ డవు. నీ విట్టిసనాతనమార్గము నెదుర్కొనుట కధికారి వగు దువా యని హెచ్చరించుటకే కదా? నీవు నాకు భక్తుఁడవు నగుదువు. కావున నీమేలుగోరి యీకర్మయోగముం దెలిపితి ననియే దీనిసారము. ఈమార్గమును వదలిన నీకు వేఱుత్రోవ మేలుగల్గించునది లేదని రహస్యము. ఈసనాతనమార్గము నా క్షే పింప నీవెంతటివాడ వనునది పరమార్థము. ఈకర్మయోగము రహస్యము. ఉత్తమము నగును. అనఁగా నెల్లరకుఁ దెలుపఁద

గదు. యోగ్యుఁడగు శిష్యునకే యుపదేశింపవలయునని శ్రీహరి భావసారము. నాస్తికుల కుపదేశించినను లాభము లేదనియుఁ గావున శ్రద్ధాభక్తులుగల వారలకే యుపదేశింపఁ దగుననియు మన మీభాగమునుండి గ్రహింపవలయును. గురువాక్యములందును శాస్త్రములందును విశ్వాసములేనివాఁడు నాస్తికతుల్యుఁ డగును. అట్టివాని కేమాత్ర మీయోగము నుపదేశింపరాదు అనియే శ్రీహరి భావమనుట సత్యము.

ఇట్లుపలుకఁగా నర్జునుఁడు చిత్ర మిది యని భావించెను. కర్మయోగమునందే శ్రీహరి నేను జేయఁదగిన కర్మములుగాని పొందఁదగిన ఫలములుగాని లేవనియు లోకసంగ్రహార్థమే చేయుచున్నాననియుఁ దెలిపి తాను భగవంతుఁడననియుఁ దేటపఱచెను. కాని యర్జునుని కాసమయమున నజ్ఞాన మావరించి యుండుటంబట్టియు బహుసంశయాకులచిత్తుఁ డగుటంబట్టియు నీయోగము నుపదేశించినపద్ధతి విని శ్రీకృష్ణా! సూర్యుఁడు నీకంటె ముందు జన్మించినవాఁడుకదా. తరువాత నెంతకాలమునకో పుట్టిన నీ వెట్లు సూర్యున కుపదేశించితివని ప్రశ్నించెను. దీనింబట్టియే యర్జునునకు సంపూర్ణజ్ఞానము లేదనియు, సాంఖ్యకర్మయోగముల నుపదేశింపఁగా వానియందు దృఢవిశ్వాసము కలుగక యేమిచేయుటకుఁ దోఁచకయున్నవాఁడనియుఁ దేటపడియెడిని. కాబట్టియే యాతనిమనస్సునఁ గర్మయోగసిద్ధాంతము చక్కఁగాఁ బాదుకొని తనకృత్యము నొనరింపఁ బూనునట్లు చేయవలయునని హరి తలంచి కర్మసిద్ధాంతసారము మనస్సునకుఁ బట్టుటకే యీజ్ఞానయోగము నుపదేశించెననియు నింకను గలసంశయములఁ దీర్పఁ దక్కినవిషయముల నుపదే

శించెననియుఁ దోఁచెడిని. శ్రీకృష్ణు నభిప్రాయ మర్జునునిమూలమున నీరణయజ్ఞము సాగునట్లు చేయవలయుననియే కదా. దానికై జ్ఞానయోగమును దెలిపి సన్న్యాసియగునట్లు చేయఁ బూనునా యనియు బుద్ధిమంతు లూహింపవలంతురు. జ్ఞానము పొడుకొనినఁగాని తాను గర్త నన్న యహంకారము తొలఁగ దనియుఁ దాను నిమిత్తమాత్రమే యనుభావము పొడుకొన దనియు హరితాత్పర్యము. కావుననే యీజ్ఞానయోగము నుపదేశించెను. దీనిచే నర్జునునకుం గల్గినలాభ మేమి? అనునది యే యిటఁ జేయఁదగుప్రశ్నము.

భగవంతుఁ డాయర్జునుని ప్రశ్నము విని యోహో! యింకను వీని కీభ్రాంతివదలలేదని తలంచి యాతనిమూలమునఁ బామరులకెల్లఁ దవయవతారతత్త్వమును దెలుపఁబూని యిట్లనియె. నేను బుట్టుకలేనివాఁడనైనను సకలభూతములకధిపతినైనను నాయిచ్ఛాశక్తి నాశ్రయించి పుట్టుచుందును. పుట్టుక కేమిఫలమందువేమో ధర్మగ్లాని యేకాలమున సంభవించునో యపుడొకయవతారము నెత్తుదును. అధర్మనాశనపూర్వకధర్మస్థాపనమే నాయవతారఫలమని గ్రహింపుము. వేఱుఫలమునుగోరి కాదనియుఁ దెలిసికొనుము. కౌంతేయా! దివ్యములనఁగాఁ బరమపావనములగు నాజన్మకర్మములతత్త్వము దెలిసికొనినవాఁ డీదేహమును వదలినపిదప మరల జన్మింపఁ డనియె. అనఁగా భగవంతుఁ డేల యవతరించును? దానివలన మానవులకుఁ గలుగు ఫలమేమి? అని యోచించి ధర్మమును గాపాడుటకు నధర్మము నడంచుటకుఁ గదా యని తెలిసికొని ధర్మరక్షణమే భగవత్ప్రీతికరము. దాని నాచరించుట ప్రతిప్రాణికి విధి.

దాన నాపరమేశ్వరుఁడు తృప్తుఁడగునని నిశ్చయించి తనధర్మమును దాఁజేయఁబూనవలయుననియే దీనిసారము. అర్జునుని భావము తోఁచిన యుద్ధము చేయుమనియేకదా శ్రీహరి యీమాటను జెప్పెను. ఏకర్మములు నన్నంటవు. నాకుఁ గర్మఫలమునందు వాంఛ లేదు. అని యెవఁ డెఱుంగునో యతనికిఁ గర్మబంధము తొలఁగునను హరివాక్యమున కర్థమేమి? అనసక్తుఁడై కర్మముల నాచరింపవలయుననియు దాన నొదవుఫలములను గోరఁడనియుఁ గదా. ఇంతియగాక యర్జునా ముక్తిని గోరు పూర్వులుకూడ నీకర్మముల నాచరించిరి. ఎప్పటినుండియో యీకర్మ మాచరింపబడుచునే యున్నది. వారెల్ల నీకంటె నుత్కృష్టులు. నీవును వారిమార్గము ననుసరింపుము. దాన మేలుకలుగునని హరి చెప్పినవాక్యములను జక్కఁగాఁ మననముచేయవలయును. అప్పు డీగీతాశాస్త్ర మెందుల కుపదేశించెనో బోధపడును.

కర్మమార్గ మెఱుంగఁదరముకాదు. కాని కర్మమునందకర్మమును, అకర్మమునందుఁ గర్మము నెవఁడు చూచుచున్నాఁడో వాఁడే. మనుష్యులలో బుద్ధిమంతుఁడగును. సమస్తకర్మములు చేసినవాఁడే వాఁడు యోగియే. ఎవ్వనిసంకల్పములు కామసంకల్పములేనివో జ్ఞానాగ్నిచేఁ గర్మములను దహించినవానినే పండితుఁడని తత్త్వవేత్తలు పలుకుదురు. అను శ్రీహరి యుపదేశమునఁ గలభావ మూహింపుఁడు. పార్థుఁ డీవఱకు నన్నీఘోరకర్మమును జేయుమని యేల నియోగించెదవని ప్రశ్నించెను. ఆప్రశ్నమునకే పెక్కునాయులు పెక్కురీతుల సమాధానము చెప్పఁబడినది. అనఁగాఁ దాను జేయుకర్మము

నందుఁ గర్తృత్వము నారోపించుకొనరాదనియు భగవదాజ్ఞ యని కర్మమును జేయుచు నుండవలయుననియు దానిచే దత్ఫలమునందు వాంఛ పొడమకుండుననియు నిట్టివాఁ డాచరించుకర్మము సత్కర్మముగనే యుండుననియు దాని నితరులు కూడ నాచరింతురనియుఁ తన్మూలమున సత్కర్మము వృద్ధిగాంచుననియు నట్టితఱి నధర్మము తలయెత్తకుండ నడంగుననియు భగవంతు నభిప్రాయమని యూహింపవలసినవిషయము. యజ్ఞములను వర్ణించుచు నన్నింటికంటె జ్ఞానయజ్ఞ ము శ్రేష్ఠోత్తమమని శ్రీహరి యాదేశించెను. జ్ఞానమున సర్వకర్మములు విలీనములగునుగాన నది యుత్తమము కాకుండునా.

ఈరీతిగా నీయోగము తెలుపఁబడినది. కర్మము చేయక యుండరాదు. తత్ఫలమును గోరరాదు. కర్తృత్వము నారోపించుకొనరాదు. ధర్మమునుబుద్ధి నాశ్రయించి కర్మమును జేయుచుండవలయును. అల్పజ్ఞానమునఁ గర్మతత్త్వ మెఱుంగఁవరమని పలుకరాదు. అదియెంతవారికే దురూహము. తెలిసినట్లు నటింపరాదు. అది దుర్గతికి మూలము. పెద్దల నాశ్రయించి శాస్త్రములను బరిశీలించి కర్మతత్త్వము నెఱుంగవలయును. కర్మము జ్ఞానసాధనము. దానిమానిన జ్ఞానము వేలుపూర్ణమున నలవడదు. అలవడుననుట కల్ల. కర్మము అకర్మము, వికర్మము ననువాని నెఱింగి చేయవలయును. సర్వకర్మములు బ్రహ్మార్పణమనుబుద్ధితోఁ జేయవలయును. అతఁడు పరిశుద్ధుఁ డగుఁబడును. అనువిషయములే యిందు గ్రహింపఁదగినవి. ఈపద్ధతి నీజ్ఞానయోగము నుపదేశించి శ్రీకృష్ణపరమాత్మ యర్జునుని మదిఁగల సంశయములఁ గొన్నింటిని దీర్చెను. కాని యర్జునునకు మఱి

కొన్ని శంకలు గలిగెను. ఐనను గర్మసిద్ధాంతతత్త్వము రవంత తెలియనయ్యెను. కావున నే చేయంబోవు ప్రశ్నములు విలక్షణ ములుగనున్న యవి. వానిం బరికింతము. దానికై ప్రయత్నింతము.

## కర్మసన్న్యాసయోగము.

భగవంతునియుపదేశమును విని యర్జునుఁ డిట్లు మరలఁ బ్రశ్నించెను. (అజ్ఞానసంభూత మగుసంశయమును జ్ఞానరూప ఖడ్గముచే ఛేదించి కర్మయోగము నాశ్రయింపు మనుహరి వాక్యమునందుఁ గలపూర్వాపరవిరోధము గలుగుటయే యతని ప్రశ్నమున కవకాశము) శ్రీకృష్ణా! కర్మసన్న్యాసము చేయు మనియుఁ గర్మానుష్ఠానముచేయుమా యనియుఁ జెప్పుచున్నావు కదా ఈ రెండు నొక్కకాలమున నొక్కఁడుచేయ శక్యము గునా. కాదుకదా. అట్లు కావున నీ రెండింటిలో నా కేది శ్రేయమో దానిని జక్కఁగా నిశ్చయించి నాకుఁ జెప్పుము. విరుద్ధ స్వభావములగు రెండు నొకఁడే సరిగా నొక్క కాలమున శక్యము కాదు కావున నీభావమేమో తెలియక యడుగుచున్నాఁడను. దానిసిద్ధాంతమంతయును నాకుఁ దెలియఁజేయు వలసునది యున్నను నా కీ రెండింటిలో నేది శ్రేయస్కరమో దాని నాలోచించి వచింపుము. ఆరీతిగా నాచరించి కృతార్థుఁడ నయ్యెదను. (౨) అర్జునునిసంశయము నెఱింగి శ్రీకృష్ణపరమాత్మ యిట్లు బదులు చెప్పెను. కర్మసన్న్యాసము కర్మయోగము నీరెండును

కర్మసన్న్యాసయోగః.

సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి, యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్. ౧. సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రే

జ్ఞానోత్పత్తిహేతువులగుట మోక్షము నొసంగునని యే యగును. అట్లయినను వానిరెండింటిలోఁ గర్మసన్న్యాసము కంటెఁ గర్మయోగమే యుత్తమమని యెఱుంగుము. అర్జునా! వేదాంతవేద్యమగు నాత్మతత్త్వము నెఱింగినవానికిఁగా గర్మయోగము నేను జెప్పలేదు. అట్లు చెప్పియుండినయెడలఁ బూర్వోక్తకర్మసన్న్యాసముతోటి విరోధము సిద్ధించును. నా భావ మేమనఁగా దేహాత్మాభిమానివగు నీకు బంధువధాది నిమిత్తమగు శోకమోహాదు లేవిగలవో వానిచేఁగలిగిన బుద్ధిసంశయమును దేహాత్మవివేకజ్ఞానఖడ్గముచేత భేదించి పరమాత్మజ్ఞానోపాయమగు కర్మయోగము నాశ్రయింపుమనియే. కర్మయోగము చిత్తశుద్ధికరమగుట నది లభించినవానికి నాత్మతత్త్వజ్ఞానము కలిగినపిదప దానిపరిపాకముకొఱకు జ్ఞాననిష్ఠాంగముగా సన్న్యాసమును మున్ను వివరించితిని. కావున నంగప్రధానములకు వికల్పము సంభవింపమి సన్న్యాసమును గర్మయోగమును నీరెండును భూమికాభేదము ననుసరించి నిశ్శ్రేయసమును సాధించుచున్నవి. ఐనను వానియందుఁ గర్మసన్న్యాసమునకంటెఁ గర్మయోగ ముత్తమ మగుచున్నది. (3) కర్మసన్న్యాసికంటెఁ గర్మయోగి యేల యుత్కృష్టుఁ డందువేమో వినుము దుఃఖమును ద్వేషము, సుఖమునందుఁ గాంక్షయు లేనివాఁడయి కర్మయోగము ననుష్ఠించువాఁడు నిత్యసన్న్యాసి యనఁబడును కారణ మేమనఁగా రాగద్వేషాదిద్వంద్వములు

---

యసకరావుభౌ, తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే. 3. జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యోన ద్వేష్టి న కాంక్షతి, నిర్ద్వంద్వోహి మహాబాహో సుఖం బంధాత్ప్రముచ్యతే. 3. సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతిన

విడిచినవాఁడు సుఖముగా సంసారబంధమునుండి విముక్తుఁడయి ముక్తిఁబొందును. బంధమనఁగా నంతఃకరణదోషరూపమగు జ్ఞాన ప్రతిబంధమునియు గ్రహింపుము. (౪) అర్జునా! కర్మసన్న్యాసరూపమగుసాంఖ్యమున గర్మయోగమును భిన్నఫలములు గలవానినిగా నజ్ఞానులు చెప్పుదురు. పండితులుమాత్రము రెండింటికిని మోక్ష మొక్కటియే ఫలమని పలుకుదురు. ఎందుకనఁగా నీరెండింటిలో నేదైన నొక్కటి చక్కఁగా ననుష్ఠించినను రెండింటిఫలమునుగూడఁ బొందుచున్నాఁడు అనఁగా గర్మయోగమును జక్కఁగా ననుష్ఠించి శుద్ధచిత్తుఁడై జ్ఞానమూలమున రెండింటిఫలమగు మోక్షమును బొందుచున్నాఁడు. కర్మసన్న్యాసమును జక్కఁగా ననుష్ఠించినవాఁడు తాను మున్ననుష్ఠించినకర్మయోగమునకుఁ బరంపరాఫలమగు జ్ఞానమూలమున రెండింటిఫలమగు మోక్షమును బొందుచున్నాఁడు. కావున నివిరెండును విరుద్ధఫలములుగావని గ్రహింపవలయును. (౫) జ్ఞాననిష్ఠగలకర్మసన్న్యాసులే మోక్షమును బొందుదురో ఫలాభిసంధిలేక కర్మము ననుష్ఠించుకర్మయోగులుగూడఁ బరమార్థజ్ఞానమార్గమున నా మోక్షమును బొందుదురు. కావున సాంఖ్యము కర్మయోగము నొక్కఫలమే కలవని యెవ్వరందురో వారు చక్కనితత్త్వవేత్త లనఁబడుదురు అనఁగా నెట్టివారికి సన్న్యాసపూర్వకజ్ఞాననిష్ఠ కనఁబడుచున్నదో, వారికాహేతువుచేతనే ప్రాగ్జన్మములయందు బరమేశ్వరార్పితకర్మనిష్ఠ యుండియుండునని యూహింపఁబడుచున్నది. ఎవ్వరికిఁ

---

పండితాః, ఏకమప్యాస్థితస్సమ్యగుభయో ర్విందతే ఫలం. ౪. యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే, ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి

బరమేశ్వరార్పితకర్మనిష్ఠ కనఁబడుచున్నదో వారి కాహేతువు
కలుగఁబోవుసన్న్యాసపూర్వకజ్ఞాననిష్ఠ యనుమానింపఁబడు
చున్నది. అజ్ఞుఁడగు ముముక్షు వంతఃకరణశుద్ధికొఱకు మొదటఁ
గర్మయోగము ననుష్ఠింపవలయును. అంతియకాని కర్మసన్న్యా
సము ననుష్ఠింపఁగూడదు. ఆసన్న్యాసము తీవ్రవైరాగ్యము
గలుగునపుడు తనయంతనే కాఁగలదు (౬) మహాబాహూ!
ఓయర్జునా! కర్మయోగమే లేనియెడలఁ బరమార్థసన్న్యాసము
నొందుట యశక్యము. పరమేశ్వరార్పణబుద్ధితో ఫలాపేక్షలేక
కర్మయోగము ననుష్ఠించుచు నీశ్వరాకారమును మననము
చేయుచుండుపురుషుఁడు పరమాత్మజ్ఞాననిష్ఠారూపమయి యొ
ప్పుచున్న పరమార్థసన్న్యాసమును ద్వరగాఁ బొందఁగలఁడు.
సన్న్యాసము జ్ఞాననిష్ఠాహేతువు కావున నపరిశుద్ధచిత్తుఁడు
గూడఁ గర్మసన్న్యాసమును దొలుదొల్తనే యేల చేయఁగూడ
దు? అది ముఖ్యముకదా. అని ప్రశ్నింతువేమో యనియే యీ
విషయము చెప్పుచున్నాఁడను. కావునఁ గర్మయోగికిఁ గూడ
నంతమునందుఁ గర్మసన్న్యాసముచేతనే జ్ఞాననిష్ఠ యావశ్యకము.
అందువలననే కదా చిత్తశుద్ధికలుగుటకుఁ గర్మయోగమే తొలు
తఁ గర్మసన్న్యాసమునకంటె నుత్తమమగునని ముందే చెప్పి
తిని. (౭) కౌంతేయా! ముముక్షువగుపూరుషుఁడు కర్మయోగ
మునఁ బ్రవర్తించుచుండి యద్దానిమూలము పరిశుద్ధాంతః
కరణుఁడై దేహేంద్రియములఁ దనవశమున నుండునట్లు చేసి
కొని సర్వభూతములకును దానే యాత్మయను చక్కని

---

సపశ్యతి. ౬. సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః, యోగ
యుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి. ౭. యోగయుక్తో విశుద్ధాత్మా విజి

జ్ఞానముగలిగి యట్టిజ్ఞాననిష్ఠయందు వర్తించుచు లోకసంగ్ర
హముకొఱకుఁ గర్మముచేయుచున్నను వాని నాకర్మములు
బంధింపఁజాలవు. కర్మము బంధహేతువు కావున యోగయు
క్తుఁడు ముక్తినొందు నన్న యుపదేశము సరిపడకుండునని
శంకింతువేమో యని యూహించియే పరమేశ్వరార్పణము
ఫలాభిసంధిరహితము లోనగు గుణములతోఁ గూడినశాస్త్రీయ
కర్మము యోగమని చెప్పితిని. పరిశుద్ధాంతఃకరణముగలవాని
నిగాఁ జేసినకర్మ మాతనికి బంధకము కాదని గ్రహింపుము.(౭-౯)
పరమార్థదర్శియగు పురుషుఁడు తాఁ జూచునపుడు కాని విను
నపుడుగాని స్పృశించునపుడు కాని మూర్కొనునపుడుగాని
భుజించునపుడుగాని నడచునపుడుగాని నిద్రించునపుడు కాని
శ్వాసమును విడుచునపుడుగాని మాటాడునపుడుగాని విస
ర్జించునపుడుగాని గ్రహించునపుడుగాని కన్నులు దెఱచునపు
డుగాని వానిని మూయునపుడుగాని యాయాయింద్రియ
ములు తమతమవిషయను(కార్యము)లయందుఁ బ్రవర్తించుచు
న్నవి కాని తా నించుకయు నేకార్యమును జేయలేదని సమా
హితచిత్తుఁడై యెఱింగియున్నాఁడు. అర్జునా! పాదములకు గమ
నము, వాక్కునకుఁ బ్రలాపము, పాయూపస్థలకు విసర్గము, హస్త
ములకు గ్రహణము, కాఁబట్టి కర్మేంద్రియములకు నైదింటికి వ్యా
పారములని యెఱుంగవలయు. ఏకారణమువలన సర్వవ్యాపార
ములయందును దాన కర్త యని చూచుచున్నాఁడో యాతా

---

తాత్మా జితేంద్రియః, సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి నలిప్యతే. ౭.
నైవకించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్, పశ్యన్ శృణ్వన్ స్పృ
శన్ జిఘ్రన్ నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్. ౮. ప్రలపన్ విసృజన్ గృహ్ణ

రణమువలననే కర్మము నాచరించుచున్నను బంధింపఁబడఁడని చెప్పితిని (౧౦) తత్త్వము నెఱుంగనివాఁడైనను గర్మయోగ మునఁ బ్రవర్తించి (అనుష్ఠానముచేయుచు)తాఁ జేయుచుండు కర్మముల నీశ్వరునకు సమర్పించి యేఫలములను గోరక సర్వ కర్మముల విధివిహితముగా నాచరించునో వాఁడు కర్మముచే యుచున్నను దామరాకు జలములనున్నను దత్సంబంధములేని యట్లు (వాని నంటనట్లు) వాని నంటఁడని యెఱుంగందగు. అవిద్వాంసుఁడు కర్తృత్వాభిమానము కలవాఁడగుటంజేసి బద్ధుఁడే యగునుగదా. ఎట్టిఁక నతనికిఁ గర్మసన్న్యాసపూర్వ కజ్ఞాననిష్ఠ సిద్ధించునని సంశయింతువని యెఱింగియే యీవి షయ ముపదేశించితిని లోకమునం దెట్టివారికిఁ దాను జేయు చున్నానను నభిమానముకలదో యట్టివానికిఁ గర్మలేపము దుర్నివారము. ఆతనికిఁ జిత్తశుద్ధిలేదు కావునఁ గర్మసన్న్యా సము సిద్ధింపదు. కాబట్టి యట్టివానికి దుస్తరసంకటము సంభ వించు ననుశంకను వదలుము. (౧౧) మమత్వబుద్ధి వదలి పెట్టి దేహముచేతను, మనస్సుచేతను, బుద్ధిచేతను నింద్రియ ములచేతను గర్మయోగనిష్ఠులు ఫలాసక్తిలేక సత్త్వశుద్ధిలభించు టకొఱకు గర్మము నాచరించుచున్నారు.ఆకారణమువలననే యట్లు చేయుకర్మమునకు సత్త్వశుద్ధియే ఫలమనియు నిశ్చయింపం దగును. దీనిచేతఁ గర్మము బంధహేతువు కాకుండుటయే

---

న్నన్నిమన్నిమిషన్నపి, ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతిధారయన్. ౯. బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగంత్యక్త్వా కరోతియః, లిప్యతే నసపాపేన పద్మపత్ర మివాంభసా. ౧౦. కాయేన మనసాబుద్ధ్యా కేవలై రింద్రియైరపి, యోగినః కర్మకుర్వంతిసంగం త్యక్త్వాఽత్మశుద్ధయే. ౧౧. యుక్తఃకర్మ ఫలం

గాక మోక్షహేతువు కూడ నగునని నిశ్చయింపుము. ఇదియే సదాచారము. (౧౨)భగవత్ప్రీత్యర్థము కర్మ మాచరించుచున్నాఁడనుగాని నాకొఱకుఁ గాదనునిశ్చయముకలవాఁడై ఫలాభిసంధిమాని కర్మముచేయుటవలన సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి సర్వకర్మసన్న్యాసపూర్వకముగా జ్ఞాననిష్ఠనొంది ముక్తినొందును. అట్టినిశ్చయములేనివాఁడుమాత్రము కామము తన్నుబురికొలుపఁగా ఫలాభిసంధిగలిగి బద్ధుఁడగును. కర్తృత్వాభిమానము సమానముగాఁ గలయిరువురలో నొకఁడు ముక్తుఁడగునని యొక్కఁడు బద్ధుఁడగునని చెప్పుటచేత నిట్టివైషమ్యమున కేమికారణమని శంకనొందకుము. భేదము దేనననినాచెప్పినదానియందు వెదకుము. చక్కఁగా బోధమగును. (౧౩) ఇంద్రియనిగ్రహము గలదేహి సకలకర్మములను వివేకబుద్ధిచేత (కర్మాదికమునం దకర్మదృష్టిచేత) సన్న్యసించి తొమ్మిదిద్వారములుగలిగి తాఁ బ్రభువుగాఁ గలదగుచు నింద్రియాదిపౌరులతోఁగూడి పురమువలె నున్నదేహమునందుఁ దాఁజేయకయు నింద్రియాదులచేతఁ జేయింపకయు బాహ్యాపేక్ష లేవియు లేకయు నుండువాఁడగుట సుఖముగా నున్నాఁడు. కుంతీనందనా! చిత్తశుద్ధిలేనివానికిఁ గేవలసన్న్యాసముకంటెఁ గర్మయోగమే సముచితమని చెప్పియుంటిని. ఇపుడు చిత్తశుద్ధి గలవానికి సర్వకర్మసన్న్యాసమే శ్రేయంబని చెప్పితినని గ్రహింపుము. ఈ రెండువిషయములకు విరోధము కలదని శంకింపకుము. సకలకర్మము లనఁగా నిత్యనైమిత్తికకామ్యప్రతిషిద్ధ

---

త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీం, అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే. ౧౨. సర్వకర్మాణి మనసా।సన్న్యస్యాస్తే సుఖం వశీ, నవద్వారే పురేదేహీ నైవ

కర్మములని యర్థము. ద్వారములు తొమ్మిదనఁగా శ్రోత్రములు రెండు. నేత్రములు రెండు. నాసికలు రెండు. వాక్కొక్కటి. అను శిరస్సునఁగలయింద్రియము లేదు. అథఃకాయమునందు పాయూపస్థలు రెండు. కలిసి తొమ్మిదిద్వారము లగును. దేహి యనఁగా నితరగృహమునందుఁ బరునివలె నాదేహమును గౌరవించినను బరిభవించినను హర్షవిషాదముల నొందక అహంకార మమకారములు వదలియుండువాఁడని యర్థము. దేహాభిన్నుఁడు ఆత్మ యని యెఱిఁగినవాఁడు. దీనిచేఁ జిత్తశుద్ధిలేనివ్యనకు సన్న్యాసనుకంటెఁ గర్మయోగ ముత్తమంబని విస్తరింపఁబడిన దనియుఁ జిత్తశుద్ధిగలవానికిఁ గర్మసన్న్యాసమే శ్రేష్ఠమనియు సారమని తలంపుము. (౧౪) పరమేశ్వరుఁ డెవ్వరిచేత నేమియుఁ జేయింపఁడు. తాఁజేయఁడు. చేసిన కర్మములకు ఫలముల నిచ్చువాఁడును గాఁడు. అవిద్యాలక్షణ మగు ప్రకృతియే సర్వ కార్యములను జేయించుచున్నది. ఆత్మకుఁ గర్తృత్వకారయితృత్వములు స్వగతములుగానే యుండి కర్మసన్న్యాసము చేయఁగా నవిలేకపోవునా, లేక యాకాశమునందుఁ దలమలినత్వాదులం బోలి వస్తువృత్తిచేతనే కర్తృత్వము కారయితృత్వము ననునివి లేకపోవునా యని సందేహింతువేమో యని యీవిషయము నుపదేశించితిని. అనాద్యవిద్యాకామవశమువలనఁ బ్రవృత్తి స్వభావముగల జీవలోకము నీశ్వరుఁడు కర్మములందు నియోగించుచున్నాఁడుకాని తానే కర్తృత్వాదికమును గల్పింపఁడని యెఱుంగుము. (౧౫) అర్జునా! పరమార్థమున భగవంతుఁడు

---

కుర్వన్న కారయన్. ౧౩. న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః, న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే. ౧౪. నాదత్తే కస్యచిత్పాపం నచైవ

కూడ నెవ్వనివి యగుపుణ్యపాపములను గ్రహింపఁడు. అజ్ఞాన ముచేత జ్ఞాన మావరింపఁబడియుండుట వలన నవివేకులగుసంసారులు మోహపరవశులై తమ రీశ్వరు నారాధించుచున్నామనియు, భగవంతుఁ డనుగ్రహించుచున్నాఁడనియుఁ దలంచుచున్నారు. జీవేశ్వరులు కర్తృత్వకారయితృత్వములును భోక్తృత్వభోజయితృత్వములును గలవారగుటచే వారికిఁ బుణ్యపాపలేపము సంభవించుటవలన స్వభావము ప్రవర్తించుచున్నదని యెట్లు నిర్ణయింపవచ్చునని సంశయింతువేమో యని యూహించియే యీసమాధానమును జెప్పితిని జీవేశ్వరజగద్భేదభ్రమమున కధిష్ఠానభూతము, నిత్యము, స్వప్రకాశము, సచ్చిదానందరూపము అద్వితీయము నగుపరమార్థసత్యమ స్వరూపావరణముచేత మోహమొందుచున్నారు. అజ్ఞానమనఁగా నిగ్రహముకూడ దండరూపమగు ననుగ్రహమేయని తెలియకుండుట యని యిట గ్రహింపుము. దీనిచేతనే భగవంతునందే వైషమ్యమును దలంచుచున్నారని నిశ్చయించుకొనుము. (౧౬) అట్టి యాత్మాజ్ఞాన మెవ్వరికి జ్ఞానముచే నశించునో వారికిమాత్రము సూర్యుఁడు సర్వప్రపంచమును బ్రకాశింపఁజేయునట్లు లాజ్ఞానము పరమార్థతత్త్వము సర్వమును బ్రకాశింపఁజేయుచున్నది. జ్ఞానులుమాత్రము మోహమునొందరని యీయుపదేశమువలన నెఱుంగుము. (౧౭) కౌంతేయా! అట్టి జ్ఞానముచేఁ బ్రకాశింపఁజేయఁబడు పరబ్రహ్మమునందే బుద్ధిగలవారలై యాపరబ్ర

---

సుకృతం విభుః, అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః. ౧౬. జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః, తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. ౧౭. తద్బుద్ధయస్తదాత్మాన స్తన్నిష్ఠాస్తత్పరాయణాః, గచ్ఛంత్య

హ్మామే తారగుచు నాపరబ్రహ్మామందే యాసక్తులై యాత్మ తత్త్వమే పరమగతి యనునిశ్చయముగలవార లయియుండు మహాత్ములు జ్ఞానముచే సంసారకారణమగుకర్మము నాశనము కాఁగా మరల జన్మము నొందరు. ఇదియే యీశ్వరోపాసనకు ఫలమని తలంపుము. (౧౮) అర్జునా! ఎట్టివారికి జ్ఞానముచే నాత్మాజ్ఞానము నాశితమగునో యట్టిమహాత్ము లెట్లు తత్త్వమును బరికింతురని శంకింతువేమో వినుము. జ్ఞానవంతులయినపండితులు విద్యావినయసమృద్ధిగలబ్రాహ్మణునియందును, గోవునందును, గజశునకశ్వపచులయందును గేవల బ్రహ్మదృష్టియే గలిగియుందురు. కావున సమదర్శనులని చెప్పఁబడుదురు. ప్రారబ్ధకర్మవశమున దేహముండినను జీవన్ముక్తిరూపమగుజ్ఞానఫలమును పండితులు పొందుదురని దీనిసారము. విద్య యనఁగా వేదార్థపరిజ్ఞానము. బ్రహ్మవిద్యయన్ననిదియే. వేదార్థపరిజ్ఞానము లేక బ్రహ్మవిద్య యలవడదుగదా. వినయమనఁగా నిరహంకారత్వము. మిట్టిపాటు లేకుండుట యని భావము. ఇవి రెండును గలబ్రాహ్మణునియందును, సంస్కారములచే సంస్కృతముగాక రజోగుణము ప్రధానముగాఁగల మధ్యమావస్థ యంబునఁ దనరు గోవునందును, మిక్కిలి తమోగుణముగలిగి సర్వాధమము లనందగు గజశునకశ్వపచజాతియందును, సత్త్వాదిగుణములచేతఁగాని, తజ్జన్యములగు సంస్కారములచే తను స్పృశింపఁబడకయే యుండునట్టిపరమాత్మను దర్శించు

---

పునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. ౧౭. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని, శుని చైవ శ్వపాకేచ పండితాస్సమదర్శినః. ౧౮. ఇహైవ తైర్జిత స్సర్గో యేషాంసామ్యేస్థితంమనః, నిర్దోషం హిసమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి

స్వభావముగలవారు (సమదర్శనులు) గంగానదీపావననిర్మల జలమునందును, తటాకమునఁ గలయుదకమునందును, ఆసవము నందును మూత్రమునందును ప్రతిఫలించుసూర్యునకుఁ దద్గుణ దోషములసంబంధ మేలాగు లేదో యట్లే చిదాభాసద్వార మునఁ బ్రతిబింబితమగు బ్రహ్మమునకుంగూడ నుపాధుల యందుఁ గలగుణదోషసంబంధము లేదని చక్కఁగా విమర్శించుచు సమానమగుదృష్టిచేత రాగద్వేషములు లేనివారలయి పరమానందస్ఫురణముచేత జీవన్ముక్తి ననుభవించుచున్నారు. ఎవ్వ రిట్టివారుగ నుందురో వారే సమదర్శను లని యెఱుంగుము. (౧౯) అర్జునా! ఎవ్వరిమనస్సు సర్వభూతముల యందు సమభావమున నుండునో వార లీదేహమును ధరించియే జన్మమును జయించిరి. ఎందులకనఁగా బ్రహ్మము నిర్దోషమును, ఒక్కటియు నగు వా రట్టిబ్రహ్మమునం దున్నవారు. కావున వారు జన్మమును జయించినవారే. అట్టిమహాత్ములను దోషము లేవియు నంటవు.

(౨౦) ఇట్టి బ్రహ్మవేత్త ప్రియమునొందినపుడు హర్షము నొందఁడు. అప్రియము నొందినపుడు విషాదము నొందఁడు. తాను సర్వభూతములయందును సమదృష్టిగలవాఁడగుచు హర్షవిషాదహేతువగు సమ్మోహము లేక బ్రహ్మరూపుఁడయియే యుండును. బ్రహ్మము నెఱింగినవానిలక్షణము లివ్వియే యని యెఱుంగుము. నివృత్తమోహముగలవాఁడే బ్రహ్మవేత్తయని తలంపుము. (౨౧). బ్రహ్మనిష్ఠుఁడు బాహ్యవిషయములందుఁ

---

శ్లో॥ ౧౯. న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియం,
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణిస్థితః. ౨౦. బాహ్యస్పర్శేష్వసక్తాత్మా

ప్రీతిలేనివాఁడు కావున నాత్మానందమును బొందుచున్నాఁడు. అట్లతండు బ్రహ్మానందే సమాధిచేయుచు నక్షయమగు స్వస్వరూపానందము ననుభవించుచున్నాఁడు. బాహ్యవిషయ ప్రీతి యనేకజన్మములనుండి యనుభవింపఁబడినది. కావున నది మిక్కిలి ప్రబలమయినదగును. అట్టిదానియం దాసక్త మగుచిత్తముగలవానికి నీరీతిగాఁ దృష్టసుఖరహితము, అలౌకికమునగు బ్రహ్మానందనం దునికిసంభవించును? పరమానందరూపముకాననియన్నచో నదియుక్తముకాదు. పలయనఁగా నాయానంద మింతకుముందే యనుభవింపఁబడినది కాకుండుటచేతఁ జిత్తస్థితికి హేతువు కాఁజాలదు. అని ప్రశ్నింతువేమో యని యీవిషయమును జెప్పితిని దీనిం జక్కఁగాఁ గ్రహించిన నీసంశయము కలుగదు ఇయ్యది మోహనివృత్తిచే బుద్ధిస్థిరం బగుటకుఁ దగినహేతువని తెలిసికొనుము. (౨౨) కౌంతేయా! విషయేంద్రియసంయోగమువలనఁ గలుగుభోగము ఇహలోకమునఁగాని పరలోకమునఁగాని దుఃఖమునే కలిగించును. మఱియు నవి యాదియు నంతము కలవగుటంజేసి యనిత్యములుకూడ నగును. కావున బుధుఁ డట్టిభోగములయందుఁ బ్రీతిగలవాఁడయి యుండఁడు. బాహ్యవిషయప్రీతినివృత్తియే కలిగినయెడల నాత్మయం దక్షయసుఖానుభవము కలుగును. అది కలిగినయెడఁ దానిప్రసాదముననే బాహ్యవిషయప్రీతి నివృత్తియుఁ గలుగును. ఇట్లిచ్చట నన్యోన్యాశ్రయము లగుటం జేసి యొక్కటియు సిద్ధింపదని శంకింతువేమో. విషయముల

---

విందత్యాత్మని యత్సుఖం, స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే.
౨౨. యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే, ఆద్యంతవంతః కౌంతేయ

యందు దోషదర్శనాభ్యాసముచేతనే తత్ప్రనివృత్తి కలుగు
చున్న దనుసమాధానమున నిశ్శంకుడవు కమ్ము.(౨౩) అర్జునా!
ఎవ్వాఁడు తాను జీవించియున్నప్పుడే యనుకూలవిషయము
లందుఁ గలకామముచేతఁ గలుగువేగమును బ్రతికూలవిషయ
మందలి ద్వేషముచేఁ గలుగువేగమును మరణపర్యంతము
జయించి వానికి లోఁబడకయుండునో అతఁడే యోగి యనం
బడును. అనుమానీయుఁడే యీప్రపంచమున సుఖముకలవాఁడు
నగు. సర్వానర్థప్రాప్తికి హేతువును, నివారింప శక్యముకాని
దియు, శ్రేయోమార్గప్రతిపక్షమునయి, యత్యంతకష్టమగు
నీదోషమును మహాప్రయత్న మొనరించి ముముక్షువు నివా
రించుకొనఁదగునని దీనిసారము. కామ మనఁగా. తన కనుకూల
ములు, సుఖహేతువు లగువిషయములు కనఁబడినను వినఁబడి
నను స్మరింపఁబడినను వానియందు గుణము ననుసంధించు
నభ్యాసముచే రత్యాత్మకమైనగర్ధము, అభిలాషము, తృష్ణ
లోభము గలది యని యర్థము. అర్జునా! స్త్రీపురుషుల పరస్పర
విషయమగు నభిలాషమునం దత్యంతరూఢము కామశబ్దము.
ధనతృష్ణ లోభమనియు, స్త్రీవిషయతృష్ణ కామమనియుఁ జెప్పఁ
బడినదికదా. ఇచ్చోటనన్నఁ దృష్ణాసామాన్యాభిప్రాయమునఁ
గామశబ్దము ప్రయోగింపఁబడినది. కాన లోభము వేఱుగాఁ
జెప్పనైతిని. ఈరీతిగాఁ దనకు ననుకూలములుగానివి దుఃఖ
హేతువులు నగువిషయములు కనఁబడుట వినఁబడుట స్మరింపఁ
బడుట యనునివికలిగినను వానియందలిదోషము ననుసంధించు
నభ్యాసముచే నేయది ప్రజ్వలనాత్మకమగు ద్వేషము నున్యవు

---

య న తేషు రమతే బుధః. ౨౨. శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్ష

గలదో యదియే క్రోధమగును. ఈకామక్రోధముల యుత్క టావస్థ లోకవేదవిరోధమై యనుసంధింపఁ బ్రతిబంధనమునయి లోకవేదవిరుద్ధవిషయములందుఁ బ్రవర్తించుట కున్ముఖస్వరూప మయినది నదీవేగసామ్యముచేత వేగమని చెప్పఁబడును. నదీ వేగము వర్షర్తువునం దతిశయమై లోకవేదవిరోధము నను సంధించుటంజేసి యిచ్ఛయింపనివానినిఁగూడ సుడిలోఁ బడఁ ద్రోసి ముంచి క్రిందికిం గొనిపోవుచున్నదో ఆలాగున గామ క్రోధములవేగముకూడ వర్షాకాలస్థానీయమగు విషయాభి ధ్యానాభ్యాసముచే నతిప్రబలమై లోకవేదవిరోధానుసంధాన మున నిచ్ఛయింపనివానిం గూడ విషయం బనుసుడియందుఁ బడవైచి సంసారసాగరమునముంచి క్రిందికి మహానరకమునకుఁ గొనిపోవు నని వేగపదమున సూచింపఁబడినది. వానిని సహిం చువాఁడే మోక్షము నొందనర్హుఁడని యిట సారమని తలం పుము. (౨౪) ఏవాఁ డాత్మయందే యానందించుచు నాత్మ యందే క్రీడించుచు నాత్మప్రకాశమునే యనుభవించుచు నుండునో యోగియగు నాపురుషుఁడు బ్రహ్మభూతుఁడై బ్రహ్మ మునందే నిర్వృతిరూపమగు ముక్తిని బ్రదికియుండినపుడే పొందును కామక్రోధవేగమును సహించుటచేతనే మోక్షము నొందుననునది న్యాయముకాదు. ఇంకేమనఁగా నీరీతిగా నెవ్వని ప్రవృత్తియుండునో వాఁడు ముక్తుఁడని గ్రహింపుము. కామ క్రోధవేగమునుమాత్రము సహించియుండి యాత్మయందే యానందింపకయెవ్వఁ డుండునో వాఁడాజన్మమునముక్తిఁగాంచఁ

---

ణాత్, కామక్రోధోద్భవం వేగం సయుక్తస్స సుఖీ నరః. ౨౩. యోఽన్తస్సు ఖోఽన్తరారామ స్తథా న్తర్జ్యోతి రేవ యః, స యోగీ బ్రహ్మ నిర్వాణం బ్రహ్మ

జాలఁడు. ఆయభ్యాసము కలుగునంతదనుక ముక్తికి బ్రయత్నించుచుండుననియు నెఱుంగుము. (౨౫) ఇంకొకసాధనము ముక్తికి లేదా యని ప్రశ్నింతువేమో కలదు. దానిం దెల్పెద. యజ్ఞాదినిత్యకర్మానము నొనరించి దానిచేతఁ బాపములెల్ల క్షయము నొందఁగా శ్రవణాదులచే సకలసంశయములు తొలఁగఁగా నింద్రియనిగ్రహము గలిగి భూతహింస వదలి చక్కనిజ్ఞానము నొందియున్న ఋషులు ముక్తినొందుచున్నవారు. ఋషులనఁగా సూక్ష్మవస్తువివేదనాసమర్థులు. వారినే కర్మసన్న్యాసులనియు నందురు ఇదియే మార్గాంతరము. ఈ రెండుమార్గములు సమానములనియే భావింపుము. యజ్ఞాదికర్మానుష్ఠానమునఁ బాపములు తొలఁగి యంతఃకరణము పరిశుద్ధమగును. క్షీణకల్మషులు కాకున్న నంతఃకరణశుద్ధి యేనాఁటికిని సంభవింపదని యెఱుంగుము. నిష్కామకర్మములు చేయక యుండరాదని యీవఱకే యుపదేశించితినిగదా. (౨౬) అర్జునా! యింతకుఁబూర్వము కామక్రోధవేగమును సహింపవలయునని చెప్పితినిగదా. ఇపుడు వానిని వదలవలయుననియు దానఁగాని ముక్తి రాదనియు నీకుఁ దెలుపఁ బోవుచున్నాను. ఎట్లనఁగాఁ గామక్రోధముల వదలి యాత్మజ్ఞానము కలవారలై మనస్సు నిగ్రహించి సమ్యగ్దర్శనము నొందిన మహాత్ములకు జీవన్ముక్తియు, మృతిఁబొందినపుడు విదేహముక్తియు నీరెండుఁ గతులను ముక్తి కలుగును. అనఁగాఁ గామక్రోధములను బుట్టక యుండనే చేయవలయును. అట్టివారికి

---

భూతోఽధిగచ్ఛతి. ౨౫. లభంతే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః, ఛిన్నద్వైధా యతాత్మానస్సర్వభూతహితే రతాః. ౨౬. కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసాం, అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితా

దేహాంతమునందే ముక్తికాదు జీవించియున్నను వారికిఁ గల దని యెఱుంగుము. (౨౭,౨౮) అర్జునా! దీనివివరించెద నాకర్ణింపుము. బాహ్యములగుశబ్దాదివిషయములను మనస్సునఁ బ్రవేశింపనీయక బాహ్యముననే యుండునట్లొనరించి కనుబొమల యంతరమునందు (భ్రూమధ్యస్థానమున) దృష్టిని స్థిరముగా నిలుచునట్లుచేసి నాసాభ్యంతరమునఁ జరించుచున్నప్రాణాపాన వాయువులను గుంభకముచే సమముగా నుండునట్లు నిరోధించి యింద్రియములను మనస్సును బుద్ధిని నిగ్రహించి మోక్షమున నత్యంతాసక్తిగలిగి యిచ్ఛాభయక్రోధములు లేక యేమహాత్ముఁ డుండునో యాతఁడు సర్వదా ముక్తుఁడుగనే యుండును. ఈశ్వరార్పితస్వభావునకుఁ గర్మయోగానుష్ఠానముచే నంతఃకరణశుద్ధియు, దానివలన సర్వకర్మసన్న్యాసమును, అద్దానివలన శ్రవణాదితత్పరత్వము గలుగుననియు దానినుండి ముక్తికి సాధన మగుతత్త్వజ్ఞానము పొడసూపునని చెప్పితినిగదా. బ్రహ్మనిర్వాణమ్మని చెప్పినతావున ధ్యానయోగము సూచింపఁబడియె. అది సమ్యగ్దర్శనమున కంతరంగసాధన మగును. దానినే యిపుడు విస్తరించితిని శబ్దాదివిషయము వెలుపలఁ గలుగునవి. అట్టివానిని శ్రోత్రాదులమార్గమున నాయాయియంతఃకరణవృత్తులచే లోపలఁ బ్రవేశింపఁజేసి వానిని మరల వెలుపలనే యుంచవలయును. పరమవైరాగ్యవశమునఁ దత్తదాకారవృత్తిని బుట్టింపక యని దానిభావము ఈశబ్దాదివిషయములే యాంతరము లయినచో నప్పుడు సహస్రోపాయములచేతను

---

త్మనాం. ౨౬. స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్ చక్షుశ్చైవాన్తరే భ్రువోః ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ. ౨౭. యతేంద్రియమనో

వానిని బాహ్యములుగా నుండఁజేయుట దుర్ఘటమని సారము. స్వభావభంగము ప్రసక్తించుటవలన నవి బాహ్యము లైనయెడల రాగవశంబున నంతఃప్రవిష్టములగు వానిని వైరాగ్యబలంబున వెలిపుచ్చుట సంభవించును. ఇఁక నభ్యాస మెట్లనఁగా నేత్రములను నిమీలించినయెడల నిద్రానామముగల లయాత్మకవృత్తి కలుగును. నేత్రములను దెఱచినయెడలఁ బ్రమాణము, విపర్యయము, వికల్పము, స్మృతి యనువిక్షేపాత్మకవృత్తులు నాలుగును గలుగును. ఈయైదువృత్తులను లయాఖ్యము ప్రమాణవిపర్యయవికల్పస్మృతు లను వానిని నిరోధింపవలయునని భ్రూమధ్యస్థానమున నర్ధము నేత్రముల నిమీలించుట యనుమాటచేఁ దెలియఁబడును. ఆరీతిగాఁ బ్రాణాపానములనువాయువులయూర్ధ్వాధోగతుల నిరోధించుట యనఁగాఁ గుంభకము చేయుట యని యర్థము. దీనిచేత నింద్రియమనోబుద్ధుల నిరోధించుశక్తి కలుగునని యెఱుంగుము. సర్వవిషయవిరక్తియే మోక్షపరాయణత్వమని గ్రహింపఁదగును. మననశీలుఁడు కావలయును. ఇట్టి యభ్యాసాదులుకలవాఁ డెవ్వఁడో యామహాత్ముఁడు సర్వదా ముక్తుఁడే యగును. కన్నులుమూసినయెడల మనస్సు నిద్రచే లయించును. తెఱచినయెడల మనస్సు బాహ్యముగా వ్యాపించును. ఈ రెండుదోషములను దొలఁగించుటకై యర్ధనిమీలనముచే భ్రూమధ్యమున దృష్టి నిలుపవలయును. ప్రాణాపానవాయువులు రెండును నుచ్ఛ్వాసనిశ్వాసరూపమున నాసాభ్యంతరమునఁ దిరుగుచున్నవి. వానిని నూర్ధ్వాధోగతి నిరోధముచేత సమానముగాఁ జేయవలయును.

---

బుద్ధిర్మునిర్మోక్షపరాయణః, విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః.

అని మది నిలుపుము. (౨౯)కౌంతేయా! యజ్ఞతపస్సులను గర్తృదేవతారూపుఁడై భుజించువాఁడనియు, సర్వలోకము లకు మహేశ్వరుఁడనియు, సర్వప్రాణులకును బ్రత్యుపకార మపేక్షింపక యుపకారము చేయువాఁడనియు నన్ను నారా యణమూర్తి నని యెవ్వఁ డెఱుంగునో వాఁడు ముక్తుఁ డగును అర్జునా! సమస్తయాగతపస్సులను గర్తృదేవతారూపమున నేనే యనుభవించుచున్నాఁడను. ఇంద్రియాదుల నియమించి నంతనే ముక్తుఁడు కాఁజాలఁడు. జ్ఞానద్వారముననే ముక్తుఁ డగుచున్నాఁడని యెఱుంగందగును

ఇది కర్మసన్న్యాసయోగము.

మహానుభావులారా! కర్మసన్న్యాసయోగము బఠించి తిరి. దీనంగలవిశేషములఁ బరికింపుఁడు. కర్మసన్న్యాస మనఁగాఁ గర్మములవదలుట అని యర్థము సామాన్యముగా వచింతురు. సావధానముగాఁ బరికించిన దానఁ గలుగుమేలు కీడును బొడ కట్టక మానవు. కర్మయోగ ముత్తమమని బోధించి దాని దృఢ పఱచుటకై జ్ఞానయోగము నుపదేశించి యావెంటనే కర్మ సన్న్యాసయోగము నుపదేశించిన శ్రీకృష్ణమూర్తిభావ మీవిష యమున నేమని యోజింపక మానరాదు. జ్ఞానయోగాంతము నందు శ్రీకృష్ణమూర్తి

"యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంచ్ఛిన్నసంశయం
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ."

---

౨౯. భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరం, సుహృదం సర్వభూ తానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి-౨౯.

ఇతి కర్మసన్న్యాసయోగః.

యని యుపదేశించెను. ఆవెంటనే జ్ఞానఖడ్గమున సంశ
యములను ఛేదించి కర్మ మొనరింప లెమ్మని హెచ్చ
రించెను. దానిచే నర్జునున కొక్కసందియ మంకురించెను.
శ్రీహరీ ! కర్మసన్న్యాసము మంచిదంటివి. కర్మయోగము
నాచరింప లెమ్మని యాజ్ఞాపించితివి. ఇవి పరస్పరవిరుద్ధములు.
ఇవ్వానిలో నేది నాకు శ్రేయస్కరము? దానిఁజక్కఁగా నాలో
చించి చెప్పుము. ఆమార్గము నవలంబింతునని ప్రశ్నించెను.
ఈప్రశ్నసార మేమని హరి చింతించెను. ఒక్కకాలమున
నొక్కఁడీరెండింటి ననుష్ఠింప వలనుపడదు. కావున నీరెండింటి
లో నేది యుత్తమము? నా కేది యఖిలశ్రేయస్సుల నొడఁ
గూర్చును? దానినిమాత్రమే నాకుఁ దెలుపుమని కదాయని
యూహించి యిట్లు పలికెను. కౌంతేయా! కర్మసన్న్యాసము
కర్మయోగము ననునీ రెండును నిశ్శ్రేయసము నొసంగునవియే.
కాని యవ్వానిలోఁ గర్మసన్న్యాసమునకంటెఁ గర్మయో
గము మంచిది అనియె దీనిభావ మేమి? అర్జునుఁడు కర్మయోగము
నాచరింపవలయును. కర్మసన్న్యాసమున కీతఁ డర్హుఁడు కాఁడు.
కావునఁ గర్మయోగమున బద్ధాదరుఁ డగునట్లు చేయవలయును
అదెట్లు కలుగును ? కర్తృత్వాభిమానము వదలింపవలయును
దానికి ననుగుణముగాఁ దెలుపఁదగినవిషయములం దెలిపి బుద్ధి
నిస్సంశయముగ నొనరించినఁగాని కర్మాచరణమున సమర్థుఁడు కాఁ
డనియూహించెను. కావుననే కర్మసన్న్యాసమునకంటెఁ గర్మ
యోగముత్తమమని యుపదేశించెను. ఎవ్వాఁడు ద్వేషింపఁడో
వాంఛలు ఫలింపవలయుననికోరఁడో, నిర్ద్వంద్వుఁడగునో వాఁడు
నిత్యసన్న్యాసి యనఁబడును. అట్టివానిని సంసారబంధము బా

ధింపఁజాలదని తెలిపెను. దీనిసారమేమి? ఎవ్వానికి ద్వేషభావము వదలునో, ఫలాభిసంధి నశించునో శీతోష్ణాదిద్వంద్వములు సులభములుగా జయింప శక్యములగునో వాఁడు కర్మసన్న్యాసము చేయ నధికారి యగునని యేకదా. సాంఖ్యము యోగము సమానము. సాంఖ్యులేస్థానము నొందుదురో కర్మయోగులనఁగా ఫలాభిలాషములేక కర్మముల నాచరించువారు నాస్థానమునే పొందుదురు. ఎవ్వరీరెండుమార్గములు సమానఫలప్రదములని భావింతురో వారే తత్త్వవేత్తలగుదురు. అని చక్కఁగా బోధించుట పైభావము దృఢపడుటకేకదా! దీనిపై నీయధ్యాయ మాధారపడినదని నమ్మవలయును. జ్ఞానప్రధానులు సాంఖ్యులు. కర్మప్రధానులు యోగులు. వీరిరువురకు ఫలము సమానము. ఎవ్వరు దేని నవలంబింప నర్హులో వారు దాని ననుష్ఠింపవలయును. కర్మసన్న్యాసముచేయునధికారమిట్టిది? అని యిట్లుబోధించుటేల యనఁగాఁ గర్మసన్న్యాసమున కధికారము నీకు లేదనియుఁ గర్మాచరణమునకు నీ కధికారము కలదనియు, దానిఫలమును గోరకఁ యాచరింపుమనియు నీకు దాన నుత్తమగతిగలుగకపోదనియుఁ దెలుపుటకేకదా! ఈయుపదేశము కర్మయోగమును దృఢపఱచెడిని. కర్మయోగము తత్సన్న్యాసమునకంటె నుత్తమమని స్పష్టముగాఁ జెప్పెనుకదా. ఇంతకంటె స్పష్టపఱచు టెట్లు?

లోకమునఁ గర్మాచరణపరాయణు లుండవలయును. కర్మసన్న్యాసు లుండవలయును. ఈయిరుతెగలవారివలన లోకమున కుపకారము కలదు. కర్మసన్న్యాస మభ్యసించుటకుఁ దగుమార్గములు కలవు. నిర్ద్వంద్వాదిలక్షణములే యామార్గ

ములు. కర్మాచరణములేక కర్మసన్న్యాసము సాగదు. కర్మాచరణము జ్ఞానయుక్తము కావలయును. అదిలేనిచోఁ గర్మయోగము ఫలవంతము కాఁజాలదు అనఁగా జ్ఞానియగుకర్మయోగి ఫలాభిసంధిరహితుఁ డగును. అప్పు డాకర్మయోగము కర్మసన్న్యాసమువలన నేఫలముకలుగునో దానిని గలిగింప సమర్థమగును. జ్ఞానియగుకర్మయోగియుఁ గర్మసన్న్యాసియు సమానులే యగుదు రని సారము. జితేంద్రియత్వాదులు సాధారణములే యగునుగాని యీయిరువురగలవారిలో నొకరికిఁ బ్రధానములు వేఱొకరికి ప్రధానములుకావు. అవి లేనిచో జ్ఞానికాఁజాలఁడు. జ్ఞానరహితుఁ డగుకర్మయోగి కేవలనామధారకుఁ డగును. లోకవంచకుఁడుకూడ నగును. కావున జ్ఞానియై ఫలాభిసంధిరహితుఁ డై కర్మయోగి స్వకీయకర్మానుష్ఠానము చేయఁదగునని యేకదా దీనిఫలితము.

యోగి యై కర్మఫలమును వాంఛింపనివాఁడు శాంతి నొందును. యోగికానివాఁడు కర్మఫలముల నాశించి చేసిన బంధమును (సంసారసంసక్తిని) బొందుచున్నాఁడని శ్రీహరి యుపదేశించెను. ఫలమునుగోరి చేయుకర్మము లేల బంధములు కావలయు ? అన్నచో ఫలాభిసంధి యహంకారమును గల్గించును.దాన స్వార్థపరత్వము వృద్ధియగును. దానిచేఁ బరహింసాపాదనమున జంకుగలుగదు. అదియే పాపహేతువగు. అట్టివానికి శాంతి యెట్లుదొరకును. స్వార్థపరత్వ మశాంతికి హేతువని యీయుపదేశము బోధించెడిని. మనశ్శాంతి సుఖహేతువనియుఁ జెప్పెడిని. మఱి యీకర్మయోగ మేటికన్న జ్ఞానమొదవించుటకు లోకసంగ్రహమునకు నుపకరించును. దీనిసార

మేమనఁగాఁ దాఁజేయుకర్మములు లోకులను గర్మాసక్తులనుగాఁ జేయుచుండవలయుననియుఁ దన కాశాపిశాచికను గల్పింపక దాని నిర్మూలింప సమర్థముగ నుండవలయుననియు నట్టు లాచరించినవాని కాత్మసుఖము దొరకుననియు నగును. ఆత్మ శాంతి లేక ప్రతిక్షణ మాగ్రహపరవశులగువారు చేయుకర్మములు స్వప్రయోజనార్థములనియే మన మెఱుంగఁదగును. శాంత సముద్రమువలెఁ గర్మయోగిమానసము శాంతసంపూర్ణమై యుండును. ఆతఁడే నిజమైనకర్మయోగి. తక్కినవాఁడు జగద్ద్రోహియని మనము నిశ్చయించుకొనవచ్చును. దీనింబట్టి మన మూహించినచో శ్రీకృష్ణుఁ డర్జునునకు నీజాతిధర్మమగు యుద్ధమును జేయుము. ఇతరులకు మార్గదర్శకుఁడవు కమ్ము. యుద్ధమును జేయుటకుఁ గర్తను నేనని యూహింపకుము. ఫలమును గోరకుము. అని శ్రీహరి యుపదేశించెనని పొడకట్టును. కావున గీతాశాస్త్రమంతయుఁ గర్మయోగమును బోధించునదియే కాని వైరాగ్యమును బోధించునది కాదు. ఇందుఁగల జ్ఞానమార్గము కర్మయోగానుష్ఠానార్థమయియే యనియు మనము నమ్మవచ్చును. వైరాగ్యమునే దెలుపునదియైన నర్జునుఁడు యుద్ధము చేయఁ బూన నవకాశము లేదు. భగవదుపదేశము నిష్ఫలమనియుఁ జెప్ప నవకాశము కలుగును. అట్లుగాక కర్మయోగమునే బోధించునది యనియు నయ్యది జ్ఞానసాధనమగుటకుఁ దగినమార్గములు తెలుపఁబడియెననియు మనము నిశ్చయించుకొనిన నే బాధలు నుండవు. కొంద ఱర్జునున కుపదేశించుచు నితరులకుంగూడఁ బనికివచ్చు సకలవిషయములను దెలిపెనని పలుకుదురు. అది యించుకయేఁ బాటింపఁదగనిమాట ఏలయనఁగా. నయ్యది సమ

యము కాదు. సమయోచితజ్ఞానము తక్కువయని శ్రీకృష్ణునియం దారోపించినట్లగును. కావున నిట్టి స్వల్పవిషయములఁ బట్టుపట్టక గీతాశాస్త్రము ముఖ్యముగాఁ గర్మయోగమునే తెలుపునదియని యుందవనుగూలకములుగ నితరవిషయములు కలవనియు నెఱుంగుట సమంజసము.

పండితలక్షణమును శ్రీహరి తేటపఱచెను. విద్యావినయసంపన్నుఁడగు బ్రాహ్మణునియందును గోవునందు నేనుఁగునందును శునకమునందును జండాలునియందును సమముగా భగవంతునిం జూచువారనునదియే యాలక్షణము. దీనిచేతఁ గొందఱు నెల్లరు సమానులనియే భగవంతునిభావమని యుద్ఘోషింతురు. కాని యది యసంగతాధికప్రసంగ మనక తప్పదు. జాతిమతముల కిట సంబంధమే కానరాదు. సర్వాంతర్యామియగు భగవంతునిదేహసంబంధముచేత నుచ్చనీచభావములచేఁ జూడక సమానముగాఁ జూచువారు పండితులని దీని సారము. దీనిచేత సద్బ్రాహ్మణుని శ్వపచుని సమానగౌరవమునఁ జూడవలయునని కాదు. భగవంతుఁడందు సమానముగ నున్నను గర్మముచేత నుచ్చనీచభావము లాజీవునియందు లేక పోలేదు ఆసమదర్శనత్వము ప్రపంచాతీతము. అనఁగా లోకవ్యవహారమునకుఁ గాదు. అట్టివారు కొలఁదిసంఖ్యాకులే యుందురు. కాని యెల్లరు నట్టివారుగ నుండరు. అట్టిమహాత్ములకు నేభేదము లుండవు. కాంచనమృత్పిండములయందు సమదృష్టి వారికి నుండును. అట్టివారియందుఁ జెల్లఁదగుధర్మము లితరులకుం జెల్లునా? ఏనాఁడును జెల్లవు. కావున నిట్టివిషయముల నాధార

ములుగాఁ జేసికొని తోఁచినసిద్ధాంతములను జేయరాదు. అది భగవద్గీతాపఠనమునకు ఫలము కానేరదు.

సర్వఫలభోక్తగా నన్ను భావింపవలయు. సర్వభూత సుహృదునిగా నెన్నవలయును. నన్నిట్టివానినిగాఁ దలంచు వాఁడు శాంతిని (ముక్తిని) బొందునని కృష్ణపరమాత్మ యుపదేశించెను. దీనిభావ మేమి? సర్వఫలభోక్తను నేనే. నీవాక యుపకరణమవు. నీకీవిషయములయందు భాగము లేదు.అనఁగా నిందఱను బంధుజ్ఞాతిసుహృద్గురువుల వధించినఁ గలుగు రాజ్య లాభమును బాపమును నేననుభవింపఁగలనా యని భీతిల్లకుము. ఆఫలముల ననుభవించువాఁడవు నీవు కావు. నేను. నేనును బాండవపక్షపాతినని తలంచుచున్నావేమో? అది పొరపాటు. సర్వభూతసముఁడను. కర్మఫలముల నాయాయిజంతువు లనుభవించుచుండఁ జూచుచుండ సర్వసాక్షిని నిర్లిప్తుఁడను. సర్వభూతముల నుద్ధరించునూహ కలవాఁడను. ఎవ్వఁ డిట్టి నన్ను నెఱుంగునో వాఁడు ముక్తుఁ డగునను నీభగవదుపదేశమునఁ గలసార మపూర్వము నద్భుతావహము నగును. దీనిచే నర్జునా! కర్తృత్వఫలభోక్తృత్వములు నీవికావని నమ్మి నీధర్మము చేయుమని శాసించిన ట్లేర్పడుచున్నది. అనఁగా నీచింతాజ్వరము నిర్హేతుకము గావున నావిచారము మాని కర్మ మొనరింపుమని శ్రీహరిభావ మగునుగదా. ఈరీతిగాఁ గర్మాచరణమున నర్జునుం బురికొల్పెనని యీయధ్యాయమునుండి గ్రహింపవలయును. ఇఁకఁ దరువాతియుపదేశ మెట్టిదో యించుక పరికింతము. అదియుఁ గర్మయోగమునే ప్రతిపాదించును.

## ఆత్మసంయమయోగము.

(౧) కర్మాంగములగు నగ్నిహోత్రములు లేనివాఁడును, దపోదానాదిక్రియలు లేనివాఁడును, వీరిరువురు మాత్రమే సన్న్యాసియు యోగియును గారు. ఎవ్వఁడు సకలకర్మఫలముల నపేక్షింపక తప్పక చేయవలసిన నిత్యనైమిత్తికకర్మములను జేయుచున్నాఁడో అట్టి కర్మనిష్ఠుఁడుకూడ సన్న్యాసి యగును. యోగియునగును. సర్వకర్మత్యాగమున యోగము విధింపఁబడి యెనని యెఱుంగుము. దీనిచేఁ గర్మయోగము త్యాజ్యమగుట హీనమే కదాయని యాశంకింతువేమో యది మంచిదిగాదు. (౨) పాండునందనా! ఎట్టిపరమార్థసన్న్యాసమును సన్న్యాస మని చెప్పుదురో యోగముకూడ నాసన్న్యాసమే యగునని తెలిసికొనుము. ఫలాభిసంధిని వదలనివాఁడు యోగి కాఁ జాలఁడు కదా. పరమార్థసన్న్యాసి సర్వకర్మములును వాని ఫలములను వదలుచున్నాఁడు. కర్మయోగియుఁ గర్మము లను జేయుచున్నను దత్ఫలములఁ ద్యజించుచున్నవాఁడు. కనుకనే యీసాదృశ్యముచేతఁ గర్మయోగము కూడ సన్న్యాసమే యగుచున్నది. కౌంతేయా! చిత్తవృత్తి నిరోధము యోగము. ప్రమాణవిపర్యయవికల్ప నిద్రాస్మృతులని చిత్తవృత్తులైదు విధములు. అందుఁ బ్రత్యక్షము, అనుమానము, శాస్త్రము, ఉప మానము, అర్థాపత్తి, అనుపలబ్ధి యనుప్రమాణము లాఱని

---

ఆత్మసంయమయోగః.

శ్రీభగవానువాచ:—అనాశ్రితః కర్మఫలం కార్యంకర్మ కరోతియః, స సన్న్యాసీచ యోగీచ । నిరగ్నిర్నచాక్రియః. ౧. యం సన్న్యాసమితి

వైదికులనువదింతురు. ప్రత్యక్షానుమానాగమములు మూఁడని యోగులు వచింతురు. వీనిసారమునుబట్టి యూహించిన యోగము సన్న్యాసము సమమే కాని రెండింటికి విరోధము లేదు. ఫలసంకల్పత్యాగసామ్యమువలన సన్న్యాసి యగును ఫలసంకల్పత్యాగమువలననే చిత్తవిక్షేపము లేమింజేసి యోగి యగును. ఇది సారతరార్థము (3) కర్మఫలములను సన్న్యసించి ధ్యానయోగము నారోహింపఁగోరువానికి నట్టిజ్ఞానయోగారోహణసంకల్పము గలుగుటకుఁ గర్మానుష్ఠానమే సాధనము. యోగారోహణేచ్ఛ కలిగినపిమ్మట యోగారూఢుం డగుటకుఁ గర్మనివృత్తియే సాధనమగును. కర్మయోగము ప్రశస్తము కావున యావజ్జీవ మనుష్ఠింపవలయునా యని యాశంకింతువేమో యది తొలఁగుటకే యీయుపదేశమును జేసితిని. (౪) యోగారూఢుఁ డగు టెప్పుడని ప్రశ్నింతువేమో వినుము. సమాధి నభ్యసించుయోగి యేసమయమునందు శబ్దాదివిషయములందును నిత్యనైమిత్తికాదికర్మములయందుఁ గొంచెమైన ననుషంగము నొందఁడో యట్లు సర్వసంకల్పములను విడుచునో యప్పు డాతఁడు యోగారూఢుఁడని చెప్పఁబడును. ఇది నేను జేయవలయును. ఈఫలముల ననుభవింపవలయును. అనుమనోవృత్తివిశేషములనఁబడు సమస్తసంకల్పములను దద్విషయములయినకామములను, వానికి సాధనములగుకర్మములను ద్యజించుటయే స్వభావముగాఁగలవాఁ డెప్పుడగునో యప్పుడు

---

ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ, న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన. ౨. ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే; యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే. 3. యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే,

యోగారూఢుఁ డగును. (౫) కుంతీనందనా! సంసారసాగ
రమునుండి తన్నుఁదానే యుద్ధరించుకొనఁదగును. అంతియ
కాని సంసారసాగరాంతరమునఁ దన్నుఁ దానేఁ పడఁద్రోసికొన
రాదు. ఎందుకనఁగాఁ దనకుఁదానే యుద్ధారకుఁ డగుబంధువు.
తానే పడ ద్రోయునట్టిశత్రువు. కనుకనే తన్నుఁదా నుద్ధరించు
కొనవలయును. విషయాసక్తి వదలినయెడల మోక్షము, అవిష
యాసక్తి యుండినయెడల బంధనముకలుగునుగాన నట్టి రాగా
దిస్వభావములను వదలవలయుననియే యిటఁగలసారమని
గ్రహింపందగును (౬) ఏపురుషుఁడు తాను గార్యకరణసంఘా
తమును వశీకరించుకొని యింద్రియముల జయించి యొప్పునో
యాపురుషుఁడు తనకు బంధువగుచున్నాఁడు. నిర్జితేంద్రియుఁడు
కానివాఁడో తనకుదానే శత్రువగుచున్నాఁడు. అనఁగాఁ దన
కపకారము చేసికొనువాఁ డగుచున్నాఁడు. బాహ్యశత్రువువలె
స్వేచ్ఛఁగాఁ బ్రవర్తించుటచేఁ దనకుఁ దానే యపకారము
చేసికొనుటవలన శత్రువే యగునని గ్రహింపుము.

(౭) దేహేంద్రియాదులజయించి(స్వాధీనమున నునుచు
కొని) ప్రసన్నాంతఃకరణము గలిగి యుండుకర్మసన్న్యాసికిఁ
బరమాత్మ సదా ఆత్మభావమున ననువర్తించుచుండును. ఇంతియ
గాక యాతనికి శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వములయందును
మానావమానములయందును సమబుద్ధిగలిగియుండును. ఇంద్రి

సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే. ౪. ఉద్ధరేదాత్మనాత్మానం
నాత్మానమవసాదయేత్, ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః. ౫.
బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః, అనాత్మనస్తు శత్రుత్వే
వర్తేతాత్మైవ శత్రువత్. ౬. జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః.

యనిగ్రహము గలపురుషునకు బంధువు వేఱొకఁడు లేఁడు. తానే బంధువు. అనఁగా సంసారోత్తారణరూపోపకారి యని సారము. శీతోష్ణాదులగుజంట లాతనికి భేదముగాఁ గానరాక సమములుగా నుండునని యెఱుంగుము. (౮) కౌంతేయా! శాస్త్ర జన్యమగు పరోక్షజ్ఞానముచేత ననుభవరూపమగు నపరోక్ష జ్ఞానముచేతఁ దృప్తినొందిన మనస్సుగలిగి రాగద్వేషాదులకు నించుకయేఁ జలింపక జితేంద్రియుఁడై సమలోష్టాశ్మకాంచనుఁడై యుండుకర్మయోగి యోగసిద్ధిగలవాఁడని యుదాహరింపఁబడును. జ్ఞానమనఁగా శాస్త్రోక్తములగుపదార్థముల యుపదేశమువలనఁ గలిగినది. శాస్త్రాద్యప్రామాణ్యశంకానిరాకరణఫలమగు విచారముచేతను ఆరీతిగా వానిని స్వానుభవమున నపరోక్షముగాఁ జేసికొనుట విజ్ఞాన మనంబడునది. విషయసాన్నిధ్యమందు వికారరహితుఁడు కూటస్థుఁ డనంబడును. పైఁజెప్పిన లక్షణములుగలవాఁడే యోగారూఢుఁ డని యెఱుంగుము.

(౯) యోగారూఢుఁడు శ్రేష్ఠుఁడని వివరించితిని. ఇఁక యోగమునకు మఱియొకయంగము కలదు. దాని నాలకింపుము. సుహృదుఁడు, మిత్త్రుడు, శత్రువు, ఉదాసీనుఁడు, మధ్యస్థుఁడు, ద్వేష్యుఁడు, బంధువు ననువీరియందును, బుణ్యకర్మము లొనరించినసాధువులయందును, బాపకర్మములను జేసినయసాధువుల యందును సమబుద్ధిగలపూరుషుఁడు యోగారూఢు లందఱిలో

శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః. ౭. జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః, యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః, ౮. సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబంధుషు, సాధుష్వపి చ పాపేషు

నుత్తముఁ డనంబడును. సుహృదుఁడనఁగాఁ బ్రత్యుపకారమును గోరక పూర్వస్నేహముగాని సంబంధముగాని లేకయే యుపకారముచేయువాఁడు. మిత్రుఁ డనఁగా స్నేహముచే నుపకారముచేయువాఁడు. అరి యనఁగాఁ దాఁజేసినయపకారము నపేక్షింపకయే సహజక్రౌర్యమునఁ దిన కపకారము చేయువాఁడు. ఉదాసీనుఁ డనఁగా రెండుపక్షములు వివాదపడుచుండఁగా నారెండుపక్షముల నుపేక్షించువాఁడు. మధ్యస్థుఁ డనఁగా వివాదపడు రెండుపక్షములకు హితముగోరువాఁడు. ద్వేష్యుఁడనఁగాఁ దాఁజేసినయుపకారమునకై తన కపకారము చేయువాఁడు. బంధువనఁగా సంబంధముచేత నుపకారము చేయువాఁడు. వీరందఱియందును సమబుద్ధిగలయోగియే శ్రేష్ఠుఁడని యెఱుంగుము. (౧౦) యోగాభ్యాసముచేయువాఁడు సన్న్యసించి పర్వతగుహాలు మొదలగు రహస్యస్థలములయందు నేకాకియై యంతఃకరణములను శరీరమును నిగ్రహించి నిష్కాముఁడై కౌపీనాచ్ఛాదనాదుల గ్రహించువిషయమునందుఁగూడ నాసక్తి లేక సర్వదా యంతఃకరణమును సమాధియందు నుపవలయును. ఇదియే యోగికి సాంగమైన విధి యని తెలియందగును. ఇఁకఁ జెప్పఁబోవునది యోగవిధియనియుఁ దెలిసికొనుము.

## యోగసాధనములు.

(౧౧) పవిత్రస్థానమునందుఁ గదలక మిక్కిలి పొడవుగాక పొట్టిదియుఁ గాక యుండునట్లు క్రింద దర్భాస్తరణము,

---

సమబుద్ధిర్విశిష్యతే. ౧౦. యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః, ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః. ౧౧. శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన

దానిమీఁద [illegible]కచర్మము, దానిపైన వస్త్రమును బఱువఁబడి యున్న తనయాసనమును స్థాపింపవలయును. ఇది యాసననియమము. (౧౨) అర్జునా! అట్టి యాసనమునందుఁ గూర్చుండి చిత్తముయొక్కయు నింద్రియములయొక్కయు వ్యాపారములనుసాగనీయక నిరోధించి మనస్సు నేకాగ్రము గావించి చిత్తశుద్ధికొఱకు యోగము నభ్యసింపవలయును. ఏకాగ్రమనఁగా రాజసతామసవ్యుత్థానములనే పూర్వోక్తములైన మూఁడు భూములను వదలి యేకవిషయకములగు ధారావాహికములగు ననేకవృత్తులతోఁగూడి సత్త్వోద్రేకము గలది యని భావము. యోగ మభ్యసింపవలయుననఁగా సంప్రజ్ఞాతసమాధి నభ్యసింపవలయు నని యర్థము. అదియే నిదిధ్యాసనమను పేరుగల బ్రహ్మాకారమనోవృత్తిప్రవాహమే యగును. (౧౩) బాహ్యమగు నాసనవిధిని జెప్పితిని ఇఁక శరీరధారణవిధి నెఱింగించెద. దేహమధ్యభాగమును,శిరస్సును, గంఠమును జక్కఁగా నిలుచునట్లుచేసి కదలకయుండ నిల్పి సిద్ధుఁడై స్వకీయనాసికాగ్రమునే చూచునట్లు నేత్రములను నియమించి యవి విషయప్రవృత్తి లేక యంతస్సుఖములుగా నుండునట్లుచేసి యపుడపుడు దిక్కుల చూడకయుండ నియమింపవలయు. దిక్కుల దృష్టి వ్యాపింపఁజేయుట యోగప్రతిబంధక మగును. ఇది చిత్తైకాగ్రత కుపయోగించుశరీరధారణపద్ధతి యనంబడును.(౧౪)కుంతీ

---

మాత్మనః నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరం. ౧౧.తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః, ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే. ౧౨. సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః, సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్. ౧౩. ప్రశాంతా

నందనా? ప్రశాంతమగు నంతఃకరణముకలవాఁడై నిర్భయుఁడై (ఏవిషయమునందును సంశయములు లేనివాఁడై) బ్రహ్మచర్యము ననుష్ఠించుచు మనోవృత్తుల నన్నింటిని నిగ్రహించి నాయందుఁ జిత్తము నిలుచునట్లుచేసి నాయందే యాసక్తి గలిగి సమాధి చేయుచు నుండవలయును. ఇచ్చట శాంతమనఁగా హేతునివృత్తిరూపప్రకర్షమని యర్థము. రాగాదిదోషరహితమగునది యాత్మ. ఇవ్వి రెండును గలవాఁడుగా నుండవలయు. ఇట్టివాఁడు ప్రశాంతాత్ముఁ డనంబడును. భయ మనఁగా సర్వకర్మపరిత్యాగముచేసినవాఁడను, యోగి నగుదునో కానో యనుశంక యని యర్థము. బ్రహ్మచర్యవ్రత మనఁగా గురుశుశ్రూషా భిక్షాన్నభోజనాదినియమము కలది. నాయందుఁ జిత్తముచేర్చి యనఁగాఁ బ్రత్యక్చైతన్యమందు సగుణమందుఁగాని నిర్గుణమందుఁగాని చిత్తముచేర్చినవాఁడని భావము. (౧౪) ఇఁక యోగఫలమును దెలిపెద. ఈరీతిగా యోగాభ్యాసము చేయువాఁడు సర్వదా నియమితమనస్సుగలవాఁడయి మనస్సును సమాహితముగా నుండఁజేయుచు నా స్వరూపమే యయి మోక్షరూపమగుశాంతిని బొందుచున్నాఁడు. ఇది సంప్రజ్ఞాతసమాధితోఁ గూరుచుండినవాని కగు ఫలమని యెఱుంగుము. అట్టియోగి సాంసారికములగునైశ్వర్యములను, అనాత్మవిషయసమాధిఫలములను బొందఁడు. ఏలయనఁగా నట్టిఫలములు మోక్షోపయోగి యగుసమాధికి భంగకరములు కావున నని భావము. ఇదియే యోగాభ్యాసఫలమని

---

త్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః, మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. ౧౪. యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః, శాంతిం

సారము గ్రహింపుము.(౧౬)ఇఁక యోగికి ముఖ్యముగా నుండఁ
దగినయాహారాదినియమముల వినుము. తన కనురూపమగు
పరిమాణమునకంటె నెక్కువ యగునన్నము తినువానికిని, దాని
కన్న నల్పాహారమును గొనువానికిని,ఆహారమునే మానినవాని
కిని, ప్రమాణాధికముగా నిద్రించుచుండువానికి, నధికముగా
మేలుకొనియుండువానికిని యోగము సంభవింపదు. అట్టి
వాఁడు యోగము నభ్యసింప నధికారి కాఁడు. అనురూపప్ర
మాణమగు నన్నమనఁగా నేది భక్షింపఁబడి జీర్ణమగునో
కార్యములయందు శరీరమునకు సామర్థ్యమును గలిగించునో
యది యని యర్థము. దానిని మీఱి యధికముగా నన్నము
దినువాఁడు యోగాభ్యాసార్హుఁడు కాఁడు. అజీర్ణదోషము
వ్యాధిపీడయు దానఁ గల్గునుగాన యోగి కాఁజాలఁడని
సారము. అల్పాహారము గొనువాఁడు శరీరము కృశింపఁగా
నసమర్థుఁ డగును. అతఁడును యోగి కాఁజాలఁడు. ఇందుఁ
జేర్కొనఁబడినవన్నియు సమానములుగా నుండవలయునని
నిశ్చయించుకొనుము. (౧౭) ఇఁక నెట్టియాహారాదినియమ
ములుగలవానికి యోగము సిద్ధించునని శంకింతువేని వినుము.
నియమితపరిమాణముగల యాహారవిహారములు గలిగి కర్మము
లందు నియమితవ్యాపారము గలిగి నియమితకాలములగు
స్వప్నజాగరములు గలిగియుండుయోగికి సకలసాంసారికదుః
ఖములు నశించును. యోగము ఫలించును. కర్మములయందు

---

నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి. ౧౫. నాత్యశ్నతస్తు యోగోఽస్తి
న చైకాంతమనశ్నతః, న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున. ౧౬.
యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు, యుక్తస్వప్నావబోధస్య

నియమితవ్యాపారమనఁగా వాగాదిచాపల్యమును వదలుట. రాత్రిప్రమాణమును మూఁడుగా విభజించి మొదటిభాగమున నంత్యభాగమున జాగరణముచేయుచు రెండవభాగమునందు నిద్రించుచుండవలయునని యర్థము. ఇదియే స్వప్నావబోధ నియతి. విహారమనఁగా గమనముచేయుట యనియే యర్థము. వడివడిగా నడవరాదని సారము. (౧౮) ఏసమయమున నట్టివానిచిత్తమేకాగ్రతనుబొంది యాత్మయందే నిలుచునో సర్వకామములనుండియుఁ దృష్ణవదలునో యట్టియోగి యాసమయమునందుసమాధిగలవాఁడగును. ఇంతకుముందేకాగ్రభూమియందు సంప్రజ్ఞాతసమాధి చెప్పఁబడినదికదా. ఇపుడు నిరోధభూమియందసంప్రజ్ఞాతసమాధి చెప్పఁబడియెనని గ్రహింపుము. పరవైరాగ్యవశమువలన సర్వవృత్తిశూన్యత్వమును బొందింపఁబడి రజస్తమములవిడినాడినయంతఃకరణసత్త్వము నిర్మలంబగుటవలన సర్వవిషయాకారముల గ్రహింపసమర్థమైననుసకలమునుండియు నిరుద్ధవృత్తిగల దగుటచేత ననాత్మానుపరక్తమైన ప్రత్యక్చితియందువృత్తిరహితంబైనను స్వతస్సిద్ధమైన యాత్మాకారమును వారింప నశక్యమగుటచేతఁ జితియే ప్రధానముగాఁ దానుతిరోహితమై నిశ్చలమగును. ఏకాలముననిట్లగునో యాసమయమున సమాహితుఁడని చెప్పంబడునని పరిగ్రహింపుము. (౧౯) అట్టి సమాహితచిత్త మేలాగున నుండునో వినుము. అర్జునా! చిత్తము నిరోధించి యాత్మసమాధిచేయునట్టి యోగి చిత్త

---

యోగో భవతి దుఃఖహా. ౧౭. యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే, నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. ౧౮. యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా, యోగినో యతచిత్తస్య యుంజతో

స్థైర్యమునకు వాయుసంచారము లేనిప్రదేశమున నుండునటుం జేసి కదలకయుండుదీపమే యుపమానముగాఁ జెప్పఁబడినది. (౨౦) కుంతీపుత్త్రా! ఇట్లు సమాధి నభ్యసించుచుండఁగా నెప్పుడు యోగానుష్ఠాననిరుద్ధమైన యతనిచిత్తము మిక్కిలి యుపరతి నొందునో, మఱియు నేతరుణమున నిట్టియోగి సమాధిచేతఁ బరిశుద్ధమగు నంతఃకరణముచేతఁ బరమాత్మను దానే యని సాక్షాత్కార మొనరించుకొని సర్వకాలము పరమానందమునొందునో యత్తరుణమున యోగము సిద్ధించె నని తెలియవలయును. ప్రత్యక్చైతన్యమును బరమాత్మాభిన్న ముగను, సచ్చిదానందఘనముగను, అనంతముగను, అద్వితీయ ముగను వేదాంతప్రమాణజన్యవృత్తిచే సాక్షాత్కరించుచుఁ బరమానందసాంద్రమగు నాత్మయందే తృప్తినొందునపుడు యోగసిద్ధి యైనట్లు తెలియవలయునని సారము. సమాధికే స్వరూపముచేతను ఫలముచేతను లక్షణమును నిర్ణయించుచు నదియే ముఖ్యయోగంబని తెలిపితినని మది నిల్పుము. (౨౧) అంతములేనిదియు బుద్ధిచేతనే తెలిసికొనఁదగినదియు, విషయ జన్యముకానిదియు నగుసుఖము నే సమయమున ననుభవించు చున్నాఁడో, యింతియగాక యాత్మస్వరూపమున నున్నవాఁ డయి యెప్పుడు నందుండి రవంతయేని చలనము నొందఁడో యప్పుడు యోగసిద్ధి యయ్యెనని యెఱుంగందగు. ఇదియే యాత్మయందు సంతోషము గలుగుటకు హేతువగును. (౨౨)

యోగమాత్మనః.౧౯.యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా, యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి.౨౦. సుఖమాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియం, వేత్తి యత్ర నచైవాయం స్థితశ్చలతి తత్త్వతః.

అర్జునా! ఎట్టి యాత్మలాభము నొంది మరల దానికంటెఁ బురుషార్థము వేఱొకం డున్నదని తలంపఁడో, ఎట్టియాత్మ తత్త్వమున నున్న వాఁడు శస్త్రపాతాదిదుఃఖము నెంతయధికముగాఁ గలిగినను జలింపకయుండునో యది యోగమనఁబడును. దీనిచే యోగమున కచలత్వము నుపపాదించితినని తెలియవలయును. (౨౩) సర్వదుఃఖసంబంధాభావము యోగంబని యెఱుంగఁ దగును. అట్టియోగము నీజన్మమునఁ గాకున్నను జన్మాంతరముననైన సిద్ధించునన్న నిశ్చయముతో, నిర్వేదరహితమగు చిత్తముతోడను సాధింపవలయును. నిర్వేదరహితచిత్తమనఁగా నింతకాలము శ్రమించి యభ్యసించితిని సిద్ధించినది కాదు. ఇంతకంటె నధికశ్రమదాయక మేదియుండును? అనునను తాపమే నిర్వేదమనంబడును అది లేనిచిత్తముచేత ననఁగా నీజన్మమునఁగాని మఱొకజన్మమునఁగాని సిద్ధింపఁగలదు. త్వరపడిన లాభమేమి? అని ధైర్యముతోఁగూడినమనస్సుచేత నని యర్థము. యోగము శాస్త్రాచార్యోపదేశజనితమగు నిశ్చయముచేత నభ్యసింపం దగును. (౨౪) మఱియు నాలకింపఁదగినవిశేష మిందుఁ గలదు. సంకల్పమువలనఁ గలుగు కామముల నన్నింటిని వానిసంస్కారముగూడ లేకయుండునట్లు వదలిపెట్టి వివేకయుక్తమగు మనస్సుచేత నింద్రియముల నన్నింటిని సర్వవిషయములనుండియు నిగ్రహింపవలయును. సంకల్పమనఁగా విషయములు దుష్టములే యైనను వానియందశోభనత్వము చూడకుండుటచే

౨౧. యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః, యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే. ౨౨. తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్, స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. ౨౩. సంకల్ప

శోభనాధ్యాసమని యర్థము. అట్టిసంకల్పమువలన నీవస్తువు నాకుండిన మేలు. అనులక్షణముగలకామములు గల్గుచుండును. ఆలాటి శోభనాధ్యాసప్రభవములగు విషయాభిలాషలను, కనఁబడుచుండు స్రక్చందనవనితాదులయందును, కనఁబడని స్వర్గలోకకల్పద్రుమాప్సరసప్రభృతులయందును, శునకము వెడలఁగ్రక్కిన పాయసమునందుంబోలె విచారమువలనఁ గలుగు నశోభనత్వనిశ్చయముచేత శోభనాధ్యాసము బాధితమగును. గాఁబట్టి తనయంతనే సకలలోకములఁ బొందునాశను వదలవలయును. ఇంద్రియప్రవృత్తి కామపూర్వకము కావున నట్టి కామము నశించుటచేతఁ జక్షురాదీంద్రియముల సకలవిషయములనుండి మరలింపవలయునని దీనిసారము. (౨౫) మెల్లమెల్లఁగా ధైర్యయుక్తమగుబుద్ధితో విషయములనుండి విరమింపవలయును. మనస్సును ఆత్మనిష్ఠము గావించి యేమియుఁ జింతింపక యుండవలయును. ఎప్పుడైన నొకప్పుడు తప్పక యియ్యది సిద్ధింపఁగలదను నిర్విచారముచేత మెల్లమెల్లఁగా గురూపదిష్టమార్గంబున మనస్సును నిరోధింపవలయును. ప్రాక్తనకర్మసంస్కారముచేత మనస్సు చలించునే నప్పుడు ధారణచే దానిని స్థిరముగా నిలుపవలయుననియే దీనిభావము. (౨౬) కుంతీనందనా! చంచలము. అస్థిరము నగు మన స్సేవిషయము ప్రక్కకుఁ జలించునో యావిషయమందు దోషదృష్టిచేతను, వైరాగ్యసంపదచేతను దానినుండి మరలించి

---

ప్రభవాన్కామాంస్త్యక్త్వా సర్వానశేషతః, మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. ౨౪. శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా, ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. ౨౫. యతో యతో నిశ్చరతి

మనస్సు నాత్మసంస్థమును గావింపవలయును. రజోగుణ వశమున మనస్సు చలించునే నప్పుడు మరలఁ బ్రత్యాహారముచేత దానిని వశీకరించుకొనవలయునని యెఱుంగం దగును. (౨౭) అర్జునా! యీరీతిగా ప్రశాంతమగు మనస్సుగల వాఁడు, మోహాదిక్లేశములు లేనివాఁడు, బ్రహ్మమే సర్వము ననునిశ్చయముగలిగి జీవన్ముక్తుఁడగువాఁడు, ధర్మాధర్మాదివర్జితుఁడునగు నీయోగికి నిరతిశయసుఖము సిద్ధించును. ప్రత్యాహారాదులచేత మాటిమాటికి మనస్సును స్వాధీనపఱచుకొనువానికి రజోగుణము నశించినంతనే యోగసుఖము గల్గుననిభావము. (౨౮) ఈరీతిగా నుక్తక్రమంబున నంతరాయములులేక యెల్లప్పుడు యోగము నభ్యసించుచున్నయెడల బుణ్యపాపము... వదలి నిరాయాసముగా బ్రహ్మాభిన్నమగు నిరతిశయసుఖము నొందును. ఇదియే యోగాభ్యాసమునఁ గలుగుసుఖమని యెఱుంగుము. (౨౯) పార్థా! యోగమునకు ఫలము సర్వసంసారవిచ్ఛేదకారణంబగు బ్రహ్మైకత్వదర్శనమును వివరించెద. ఇట్లు సమాధిచేయువాఁడు సాధులచేత విషమములుగాఁ దోఁచునట్టి సర్వభూతములయందును నిర్విశేషమైన బ్రహ్మైక్యదృష్టిగలవాఁడై తనను సర్వభూతస్థునిగాను, సర్వభూతములును దనయందే యున్నవానినిగాను జూచును. ఇదియే

---

మనశ్చంచలమస్థిరం, తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్. ౨౬. ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్, ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషం.౨౭. యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః, సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యంతం సుఖమశ్నుతే. ౨౮. సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని, ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.౨౯.

బ్రహ్మసాక్షాత్కారలక్షణము. (30) ఓయర్జునా! ఎవ్వఁడు నన్ను సర్వాత్మునుగా వాసుదేవునిగా సర్వభూతములయందును గాంచుచున్నాఁడో, సకలప్రాణులను నాయందుఁ జూచుచున్నాఁడో ఆతనికి నే నెప్పుడును బ్రత్యక్షమయియే యుందును. వాఁడు నాకెప్పుడును గనఁబడుచునే యుండును. ఆత్మజ్ఞానమునకు సర్వభూతాత్మకునిగా న న్నుపాసించుటయే ముఖ్యకారణమని యెఱుంగుము. (31) సర్వభూతములయందు నేకాకారముననున్న నన్నెవ్వఁడు తాను నాయట్లు సర్వభూతములయందు నేకాకారుఁడై నాతో నభేదమునఁ బొందుచున్నాఁడో యాయోగి యెట్టి యాచారముగలవాఁడైనను నాయందే నిత్యముక్తుఁడై యుండును. ఇట్టివాఁడు విధికి వశ్యుఁడు కాఁడని యెఱుంగవలయును. కర్మసన్న్యాసి యైయుండినను నాయందే యుండునుగాన నిట్టియోగి ముక్తుఁడగును గాని భ్రంశము నొందఁడని నిశ్చయింపుము (32) అర్జునా! ఎవ్వఁడు తనకేదిసుఖమో యది సర్వప్రాణులకును సుఖమనియుఁ, దనకేదిదుఃఖమో యదియే సర్వప్రాణులకు దుఃఖమనియుఁ దననే యుపమానముగా గ్రహించి తెలిసికొని సర్వప్రాణులకు సుఖము నేచేయుచు హింసచేయక యుండునో ఆతఁడు యోగులలో నుత్తముఁడు. తత్త్వజ్ఞానమనోనాశవాసనాక్షయముల నేకకాలమున నలవఱచుకొనుకొఱకు మహాప్రయత్నము చేయవలయునని యర్థము. అందీద్వైతజాతంబంతయు నద్వై

యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి, తస్యాహం న ప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి. 30. సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః, సర్వథా వర్తమానోఽపి సయోగీ మయి వర్తతే. 31. ఆత్మౌపమ్యేన సర్వత్ర

తీయుండగు చిదానందాత్మయందు మాయాకల్పితంబు గావున మిథ్యయే యని తెలియందగు. ఆత్మయొక్కండనే సచ్చిదానందాద్వయుండను నేనను జ్ఞానము తత్త్వజ్ఞానము. దీపజ్వాల సంతానమువలె వృత్తిసంతానరూపమునఁ బరిణమించుచున్నట్టి యంతఃకరణద్రవ్యము మనసాత్మకమగుటంబట్టి మనస్సని చెప్పఁబడుచున్నది. అట్టిమనస్సునకు నాశమనఁగా వృత్తిరూపపరిణామమును వదలి సర్వవృత్తివిరోధియగు నిరోధాకారమునఁ బరిణామము పూర్వాపరపరామర్శము లేకయే హఠాత్తుగాఁ బుట్టుచున్న క్రోధాదివృత్తివిశేషమునకు హేతువగు చిత్తగతమగు సంస్కారవిశేషమే వాసన. పూర్వపూర్వాభ్యాసముచేతఁ జిత్తమునందు వాసింపఁబడునుగాన వాసన యను పేరుగలిగెను. అట్టివాసనకు క్షయమనఁగా వివేకజన్యమగుచిత్తప్రశమవాసనదృఢమగుటం జేసి బాహ్యహేతువున్నను, క్రోధాదులు పుట్టకుండుట యని భావము. అందుఁ దత్త్వజ్ఞానము కలుగఁగా మిథ్యాభూతమగు జగమునందు మనుష్యశృంగాదికమునందువలె బుద్ధివృత్తి యుదయింపకుండుటచేత నాత్మయు దృష్టుండగుటచే మరల వృత్తికి నుపయోగము లేకుండుట వలన నింధనరహితాగ్నిపగిద్దిదినుపవలె మనస్సు నశించును. మనస్సు నశింపఁగా సంస్కారోద్బోధకమగు బాహ్యనిమిత్తము తోఁపకుండును గాన వాసన క్షయించుచున్నది. వాసనాక్షయముకాఁగా హేతువులేమిఁ గ్రోధాదివృత్తి యుదయింపదు గాన మనస్సు నశించును. అది నశింపఁగా శమదమాదిసంపత్తిచే దత్త్వజ్ఞాన ముదయించును. ఇట్లు తత్త్వజ్ఞానోదయముచేత

శమం పశ్యతి యోఽర్జున, సుఖంవా యదివాదుఃఖం సయోగీ పరమోమతః॥

రాగద్వేషాదిరూప మగువాసన నశించును. అది నశింపఁగాఁ బ్రతిబంధము లేకపోవుటవలనఁ దత్త్వజ్ఞాన ముదయించును. ఈరీతిఁ బరస్పర కారణంబులని తెలియందగును. ఇదియే యిందు ముఖ్యవిషయము. ఇట్లు నన్ను భజించుయోగులు పెక్కండ్రుందురు కాని వారిలో సర్వభూతదయాళు వగుయోగియే యుత్కృష్టుఁడని సారము. (౩౨) అని పరమాత్ముఁ డుపదేశింపఁగా నర్జునుఁ డిట్లు ప్రశ్నించెను. శ్రీకృష్ణా! సమదృష్టింగూడిన యోగమును దేనిని నీ వుపదేశించితివో మనస్సు చంచల మగుటంజేసి యట్టియోగము స్థిరముగా నిలువఁజాలదని యూహించుచున్నాఁడను. (౩౪) శ్రీకృష్ణా! మనస్సు మిగులఁ జంచలమైనది. శరీరేంద్రియములను క్షోభపఱుచునది. ప్రబలము. కావున దానిని వారింప శక్యముకాదు. అంతియకాక ఛేదింప శక్యముకానిది. కావున వాయువును నిగ్రహించుట యెట్లు శక్యముకానికార్యమో దానికంటె మనస్సు నిగ్రహించుట యసాధ్యమగుకార్య మని తలంచుచున్నాఁడను. తత్త్వజ్ఞానముకలిగినను బ్రారబ్ధకర్మభోగముపర్యంతము జీవించియున్నవానికిఁ గర్తృత్వభోక్తృత్వసుఖదుఃఖ రాగద్వేషాదిరూప మగుచిత్తధర్మము క్లేశహేతువగుటంజేసి బాధితానువృత్తిచేఁ గూడ బంధమగుచున్నది. చిత్తవృత్తినిరోధరూపము యోగము గావున నద్దానిచే నది నివారింపఁబడుటంజేసి జీవన్ముక్తియని చెప్పఁబడుచున్నది దానిని సంపాదించుటచేతనే యోగి యు

---

౩౩. అర్జున ఉవాచ.—యోఽయం యోగ స్త్వయాప్రోక్తస్సామ్యేన మధుసూదన, ఏతస్యాహం నపశ్యామి చంచలత్వా త్స్థితిం స్థిరాం. ౩౪. చంచలం హిమనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం, తస్యాహం నిగ్రహంమన్యే వాయో

త్కృష్టుఁడని చెప్పితిని. అర్జునా! బంధము సాక్షినుండి నివారింపఁబడుచున్నదా. లేక చిత్తమునుండియా? అని ప్రశ్నింపఁబడవచ్చును. అందుఁ బ్రథమపక్షము సరి కాదు. తత్త్వజ్ఞానము వలననే సాక్షినుండి బంధము నివారింపఁబడును. కావున నది సరి కానవలయును. ద్వితీయపక్షముకూడ యుక్తము గాదు. స్వభావము నివారింప శక్యము కాదు. విరోధి (ప్రారబ్ధకర్మము) యుండుటవలన శక్యమే కాదు జలమునుండి చల్లఁదనమును, అగ్నినుండి వేఁడిని నివారింపఁగలుగుదుమా? చిత్తము ప్రతిక్షణపరిణామస్వభావంబగుటవలన నను కారణమునఁ బైయాక్షేపము సరి కాదు. ప్రారబ్ధభోగకర్మ మవిద్యాతత్కార్యముల నశింపఁజేయుటకుఁ బ్రవృత్తమగుతత్త్వజ్ఞానమునకుఁ బ్రతిబంధముగ భావించి సఫలగ్రహణనిమిత్తము దేహేంద్రియాదికమును స్థాపించుచున్నది. ఆకర్మమునకును స్వఫలదుఃఖాదిభోగము చిత్తవృత్తులచేతనే తప్ప సంపాదింప నశక్యము. ఆ కారణమున నొకప్పుడు స్వాభావికములగు చిత్తపరిణామంబులనుం గూడ నెట్లును యోగముచే నభిభవము చేయ శక్యమైనను, అప్పుడు కూడఁ దత్త్వజ్ఞానముకన్నను యోగముకంటెను బ్రారబ్ధఫలమగుకర్మము ప్రబలము కాఁబట్టి చిత్తచాంచల్య మావశ్యము కలుగకమానదు కావుననే యోగముచేఁ దన్నివారణ మశక్యమని నేను స్వాజ్ఞానమువలననే తలంచుచున్నాను. ఆ కారణమునఁ దనయుపమానముచేత సర్వత్ర సమదర్శియగువాఁడు పరమయోగి యనుమాట యనుపపన్నమని నాభావము.

(33) అర్జునునిసంశయమును దాని కాతఁ డుపన్యసిం

శివసుదుష్కరం. 3ర. శ్రీభగవానువాచ.—అసంశయం మహాబాహో మనో

చినహేతువును విని భగవంతుఁ డిట్లు పలికెను. మహాబాహూ! కౌంతేయా! మనస్సు చంచలము, నిగ్రహింపఁ దరముకానిది, అనుభావము నిశ్చయము. సంశయమే లేదు. అయినను యోగాభ్యాసముచేతను, వైరాగ్యముచేతను దాని నిగ్రహింప నవకాశము కలదు. నీవు చిత్తవృత్తితత్త్వము చక్కఁగాఁ దెలిసికొంటివి కావున నాయుపదేశముచేత దానిని గ్రహింపఁ జాలుదువని తోఁచెను. కాఁబట్టి సంతోషించుచున్నాఁడను. అసంయతాత్మునకుఁ బ్రారబ్ధకర్మము ప్రాబల్యము కాఁబట్టి యెంతశ్రమ పడినను మనస్సు నిగ్రహింపఁ దరముకాకయుండును. సమాధమాత్రోపాయుఁ డగుయోగి సంయతాత్ముఁ డగునుగావున నభ్యాసవైరాగ్యములచేసర్వవృత్తిశూన్యముగా మనస్సుచేయఁ బడుచున్నది. నిగ్రహింపఁజాలని యసంయతాత్మునికన్న సంయతాత్ముఁడగు నిగ్రహీతకుఁ గలవిశేష మిదియే. మనోనిగ్రహమునకు మార్గములు రెండు. హఠము క్రమము అనునివియే యారెండు. ఆరెండింటిలోఁ జక్షుశ్శ్రోత్రాదిజ్ఞానేంద్రియములు వాక్పాణిపాదాదికర్మేంద్రియములు తద్గోళకములనుమాత్రము నిరోధించుటంజేసిహఠమున నిగ్రహింపఁబడుచున్నది. ఆదృష్టాంతముచేతనే మనస్సునుగూడ హఠమున నిగ్రహింపఁగలమని మూఢులకు భ్రమకలుగును. ఆమార్గమున నామనస్సునిగ్రహింప శక్యముకానేకాదని యెఱుంగుము. తద్గోళకమగుహృదయకమలము నిరోధింప శక్యముకాదు. కాఁబట్టి క్రమనిగ్రహమే యుక్తము. అనువిషయమే యీయుపదేశసారమనితలంపుము. క్రమనిగ్రహమునందనిన అధ్యాత్మవిద్యాధిగమ మొక్కఁటియేయుపా

---

దుర్నిగ్రహం చలం, అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే.

యము. అది దృశ్యము మిథ్య యని బోధించును. దృగ్వస్తువు పరమార్థసత్యపరమానందప్రకాశమని తెల్పును. అట్లయినపుడు తనకు గోచరములగు దృశ్యములు మిథ్య యగుటంజేసి వాని యందుఁ బ్రయోజనము లేదనియుఁ, బ్రయోజనవంతమగు పరమార్థసత్యపరమానందస్వరూపమైన దృగ్వస్తువు స్వప్రకాశమగుటంజేసి తన కగోచరమనియుఁ దెలిసి చిత్తము దారువులు లేని యగ్నివలెఁ దనయంతనే యుపశాంత మగుచున్నది. ఇం కెవ్వరు బోధింపఁబడినను దత్త్వమును దెలియంజాలరో యెవ్వఁడు మఱచునో వారలకు సాధుసహవాసమే యుపాయము గాని వేఱొక్కటి లేదు. సాధువులగువారు పలుమాఱు బోధింతురు. మఱువకుండఁ జేయుదురు కదా. ఇంక నెవ్వఁడు విద్యామదాదిదుర్వాసనచేతఁ బీడింపఁబడి సాధువుల ననుసరింప నిష్టపడఁడో వానికిఁ బూర్వోక్తవివేకముచేత వాసనాపరిత్యాగమే యుపాయము. మఱియు నెవ్వఁడు వాసన లతిప్రబలములగుటవలన వానిని విడువఁజాలకయుండునో వానికిఁ బ్రాణస్పందనిరోధమే యుపాయము. ప్రాణస్పందమును వాసనయుఁ జిత్తప్రేరకములు గావున వానిని నిరోధించినయెడలఁ జిత్తశాంతి యుపపన్నమగును. ఇందుఁగలసార మిదియనియెఱుంగుము. ఇదియే మనోనిగ్రహోపాయము. ఈయుపాయముతప్ప వేఱొండుపాయముచేత నది సాధ్యము కాదు. చంచలమగు దాని నీయుపాయముచేతనే నిగ్రహింపవచ్చునని నిశ్చయించుకొనుము.

(౩౬) మనోనిగ్రహము లేనివానికి యోగము సిద్ధింప

---

౩౬. అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః, వశ్యాత్మనా తు

దని నాయభిప్రాయము. మనస్సును నిగ్రహించి వెండియు-
బ్రయత్నముచేయువానికి మాత్రము పూర్వము చెప్పినయు
పాయమువలన యోగము సాధింప శక్యమగును. తత్త్వజ్ఞాన
ముకంటెఁ బ్రబలమైన ప్రారబ్ధభోగమగుకర్మముచే స్వఫలగ్ర
హణార్థము మనోవృత్తులు పుట్టింపఁబడుచుండఁగా నెట్లు వాని
నిరోధింప సాధ్యమగునని ప్రశ్నింతువేమో యని యీయు
పాయమును దెల్పితిని. ఇదియే యీవిషయమున సిద్ధాంతము.

(౩౭) అని యిట్లు భగవంతుఁ డుపదేశింపఁగా విని
యర్జునుఁడు శ్రీకృష్ణా! అనేకవిఘ్నములవలన దృఢప్రయత్న
ములేనివాఁడయి శ్రద్ధతోడ యోగము ననుష్ఠించుచుండి
మరణకాలమున నింద్రియవ్యాకులతచేత యోగమునందు
స్మృతితప్పినవాఁడు యోగఫలమును బొందనేరఁడుకదా. అట్టి
వానికి నేగతి గలుగును? చెప్పుము. (౩౮)ఇట్లాశ్రయము లేక
బ్రహ్మప్రాప్తిమార్గమునందు సిద్ధినొందనివాఁడయి కర్మమార్గ
మునుండియు, యోగమార్గమునుండియు భ్రష్టుఁడై పెనుగా
లికిఁ జెదరినమేఘమువలె నశించునా? ఓమహాబాహూ! నశిం
పఁడా; నాకుం దెలియఁజెప్పుము. (౩౯) శ్రీకృష్ణా! నా కీసందే
హమునిశ్శేషముగాఁదీర్పవలయును. నీవుదక్కనీసంశయమును

---

యతతా శక్యోఽవాప్తు ముపాయతః. ౩౬. అర్జున ఉవాచ.—అయతి శ్శ్రద్ధయో
పేతో యోగాచ్చలితమానసః, అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ
గచ్ఛతి. ౩౭. కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి, అప్రతిష్ఠో
మహాబాహో విమూఢో బ్రహ్మణఃపథి. ౩౮. ఏతన్మే సంశయంకృష్ణ ఛేత్తు
మర్హస్యశేషతః, త్వదన్యస్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే. ౩౯.

దీర్చువాఁడు నాకు మఱెవ్వఁడును లేఁడు. సర్వజ్ఞుఁడవగు నీవే నాయీసంశయమును దీర్పవలయును.

(౪౦) అని ప్రశ్నింపఁగా నర్జునునకు సదుత్తర మీయం దలంచి భగవంతుఁ డిట్లనియెను. పార్థ! అట్టియోగభ్రష్టున కీలోకమునందు వినాశము లేదు. అట్లు పరలోకమునందును వినాశము లేదు. వత్సా! శుభకర్మమును జేయువాఁ డెప్పుడును దుర్గతిని బొందఁడు. (౪౧) కర్మసన్న్యాసియై యోగమార్గము నందుఁ బ్రవర్తించి యోగమునుండి భ్రష్టుఁడగువాఁడు హయమేధాదిమహాయజ్ఞములు చేసినవారికిఁ గలుగుపుణ్యలోకముల నుబొంది యచ్చట బ్రహ్మమానముచేతఁ బెక్కువత్సరములు భోగము లనుభవించి యీమీఁద యథాశాస్త్రానుష్ఠాతలగు శ్రీమంతులయిన మహాపురుషులగృహమునందు జన్మించును. (౪౨) లేక దరిద్రులయి బ్రహ్మవిద్యావంతులగు యోగులకులమునందే యీ యోగభ్రష్టుఁ డుదయించును. లోకమునం దిట్లు యోగికులమునందు జన్మము మిక్కిలి దుర్లభమని తెలియుము. (౪౩) కురునందనా! యోగివంశమున జన్మించి పూర్వజన్మకృత మగునాత్మవిషయబుద్ధిని బొందుచున్నాఁడు. ఆసంస్కారము వలన మునుపటికంటె నధికముగా నది సిద్ధించునిమిత్తము

---

శ్రీభగవానువాచ.— పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే, నహి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి. ౪౦. ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః, శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. ౪౧. అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం, ఏతద్ధిదుర్లభతరం లోకే జన్మ యదీదృశం. ౪౨. తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం, యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునందన. ౪౩. పూర్వాభ్యాసేన తేనైవ

యత్నముచేయును. (౪౪) పూర్వజన్మమునందుఁ జేసినయోగాభ్యాసముచేతనే యతఁడు ఇచ్ఛలేనివాఁడైనను మరల యోగాభ్యాసమునకు నాకర్షింపఁబడుచున్నాఁడు. అక్కారణముచేత యోగము నెఱుంగఁగోరి దానియందుఁ బ్రవర్తించినవాఁడుఁ గూడఁ గర్మానుష్ఠానఫలమునకన్న నధికఫలమును బొందుచున్నాఁడు (౪౫) అధికప్రయత్నము చేయునట్టియోగియో చిత్తశుద్ధిగలవాఁ డగుచు ననేకజన్మములయందు యోగాభ్యాసము చేయుటవలన వృద్ధినొందిన సంస్కారబలమువలన సమ్యగ్దర్శనమునొంది పరమగతి నొందుచున్నాఁడు. (౪౬) అర్జునా! యోగి తపస్వులకన్నను, శాస్త్రజ్ఞులకంటెఁ, గర్మానుష్ఠానపరులకంటెను మిగుల నధికుఁడు. అందువలన నీవు యోగి వగుము. (౪౭) యోగులలో నానాదేవతోపాసనము చేయువారలలో నాయందే యంతఃకరణమును సమాహితము గావించి యెవ్వఁడు శ్రద్ధతో నన్నే సేవించుచున్నాఁడో యతఁడు యోగిశ్రేష్ఠుఁడని నాభావము.

ఆత్మసంయమయోగము, సంపూర్ణము.

---

హ్రియతే హ్యవశోఽపి సః, జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. ౪౪. ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః, అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిం. ౪౫. తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః, కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున. ౪౬. యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా, శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః. ౪౭.

ఆత్మసంయమయోగః.

భక్తులారా! ఆత్మసంయమయోగమను నాఱవయధ్యా యమును బఠించితిరి. ఈయధ్యాయ ముపదేశించుటలో భగవంతునితాత్పర్య మేమని మనకు సర్వేశ్వరుఁ డొసంగినబుద్ధి బలమున నించుక యరయుదము. ఈయధ్యాయముతోఁ గర్మ కాండము ముగిసెనని కొందఱందురు. అది మిగుల సాహసము. ఏలయనఁగా సీగీతాశాస్త్రమంతయు నట్టునకుఁ గర్మసిద్ధాంత మును దెలుపునుగాని యితరము కాదనియు దానికనుగుణ ములుగా నితరవిషయము లుండుననియు నున్నే వ్రాసియుంటిని. ఆవిషయమునఁ జర్చింప ననవసరము ఈయాత్మసంయమ యోగసారమును జిత్తగింపుఁడు. తొలుదొల్త శ్రీకృష్ణుఁడే యర్జునుని ప్రశ్న మక్కఱలేకయే కర్మసిద్ధాంతమును బ్రశంసించెను కర్మమున కంగములు అగ్నిపూజయుఁ దపోదానాది క్రియలు. అవిలేనివాఁడుమాత్రమే సన్న్యాసి కాఁడు. యోగి యుఁగాఁడు. ఇంక నెవ్వరనఁగా ఏమానవుఁడు కర్మముల నాచ రించుచు వానిఫలములను గోరక నిత్యనైమిత్తికక్రియలు చేయునో అట్టికర్మనిరతుఁడు సన్న్యాసియు, యోగియు నగును. అనఁగా భావ మేమి? నిత్యనైమిత్తికక్రియలు విధివిహితము లుగా నాచరింపవలయునేకాని తత్ఫలానుభవము నాశింప రాదనియు నట్టివాఁడు సన్న్యాసియు యోగియు ననియేకదా. కర్మముల నాచరింపనిశుకప్రభృతులు యోగులు కారా? అన్న ప్రశ్నము రావచ్చును. సమాధాన మేమనఁగాఁ బ్రాగ్జన్మమున సత్కర్మముల నాచరించి జన్మాంతరమునఁ దత్ఫలభూతమగు సన్న్యాసము నొందును. యోగము నభ్యసించును. ఎవ్వాఁడు గాని కర్మాచరణము మాని యున్నతాధికారము నొందఁజాలఁ

డనుట నిరంకుశసిద్ధాంతము. కాఁబట్టియే కర్మమున కనాదిత్వము చెప్పఁబడినది. కర్మముల కనాదిత్వ మంగీకరింపనున్న వేదాంత మవ్వాల నొక్కయడుగైన సాగదు. కర్మముల నంగీకరింపనున్నఁ బ్రారబ్ధమనునదియే లేకపోవును. మూలచ్ఛేదకమమగు నాసిద్ధాంతము నాస్తికులుతప్ప నెవ్వ రంగీకరింపరు. శుకాదు లేమికర్మముల నాచరించి జన్మమునుండి యోగులైరయ్యా యని యడుగ రాదు. ప్రాక్కర్మనిరతిఫలమే యది యని యెఱుంగఁదగు. నిన్న నాహారమును గొనకయున్న నేఁ డుదయమునఁ దనువు బలవంతము కానేరదు. నేఁటియారోగ్యము నిన్నటి యాహారఫలభూతమే యగును. కావుననే కర్మసిద్ధాంత మప్రతిహత మగును. ఆవిషయమును గుంతీనందనునకుఁ దెలుపుటకే శ్రీహరి ప్రయత్నించెను కర్మఫలములను గోరకయుండుటచే మనస్సు పరిపక్వమగును. అనఁగా భగవదనుగ్రహపాత్ర మగును. సన్న్యాసమనఁగా నదియేకదా. కాషాయదండధారణమునమాత్రమే కాదుకదా. సంసారమును ద్యజించుట సర్వత్ర పరమేశ్వరునిగాంచుట యనునవియే సన్న్యాసమునకు లక్షణములు. అట్టివాఁడే సన్న్యాసి. యోగియు నతఁడే. ఎన్ని శాస్త్రములు చదివినను మనసు పరిశుద్ధము కాదు. యోగము నభ్యసించిననే యది పావనమగును. అనఁగా ఫలముల నాశింపడు. శాస్త్రము పఠించినవాఁ డొకఁడు. యోగము నభ్యసించువాఁ డొకఁడు. ఈయిరువురిలో యోగాభ్యాసరతుఁడు తరించును. శాస్త్రపాఠము గావించువాఁడు తరింపఁజాలఁడు. శాస్త్రపఠనఫలమే యోగము. దాని కర్మఁడయ్యు నాచరింపని వాఁడు తరించుననుట మూర్ఖవాదము. ఆచరణము ముఖ్య,

మనియు, విషయపరిజ్ఞానము వానికి సాధనమగుననియుఁ బెద్దల
మతము. పెద్దలనఁగా స్వానుభవమున విషయము నెఱుంగు
వారని భావము. శాస్త్రజ్ఞానము వ్యర్థమూ యనరాదు.
అయ్యది కర్మపరిపాకావస్థయందు ఫలించును. కావున భగవం
తుఁడు కర్మయోగికి సన్న్యాసికి భేదములేదని స్థాపించెను.
ఈవిషయ మీయధ్యాయమున రెండవశ్లోకము తేటపఱ
చును. అసన్న్యస్తసంకల్పుఁడు యోగి యెక్కుడును గాఁ
జాలఁడనఁగా భావమేమి? కరతలామలకమేకదా. మూఁడవ
శ్లోకము మఱింత చక్కఁగా నీవిషయమును బోధించును.
కర్మమే కారణమగునని శ్రీహరి స్పష్టముగా బోధించెను.
"నహి కారణం వినా కార్యస్యోత్పత్తిః" అని పెద్దలు నిరూపిం
చిరికదా. భగవంతుఁడు లేక జగత్తు కలుగనేరదు. అట్లే కర్మ
ములేక యోగము సిద్ధింపదు. కర్మయోగి ఫలాభిసంధిగలవాఁ
డగునేని కర్మయోగి యనఁబడఁడు. కర్మసిద్ధాంతమును దుర్విని
యోగము చేసినవాఁ డగును

యోగారూఢుఁ డనఁగా సర్వసంకల్పసన్న్యాసి యని
శ్రీభగవంతుఁడు శాసించెను. సత్కర్మానుష్ఠానఫలము సంకల్ప
రాహిత్యమే యని స్పష్టమయ్యెఁ గదా. ఎప్పు డాకార్యము
సాగునో యప్పు డాకర్మయోగి యోగారూఢుఁ డనంబడును.
పరిపక్వమానసుఁ డగునని సారము. దీనిచేత నర్జునా! కర్మముల
నాచరింపుము. తత్కర్మఫలములను గోరకుము. దాన భగవం
తుఁడనగు నేను ప్రీతుఁడ నగుదును. అపుడు తరింతువు.
ఈయుద్ధకర్మము దారుణము. పాపఫలదమను నిరర్థకఫలాలో
చనము మానుము. కర్మాచరణపరాయణుఁడవు కాకయున్న

నధగపతితుఁడవగుదువని బోధించెనని మనము గ్రహింపవల యును. ఈయుపదేశమువలన నాతనిమనస్సు పక్వమగునది కాదని యెంచి యింకొక్కవిషయమును దెల్పెను. సంసారము ఘోరరూపము. సాగరమునకంటె దుస్తరమైనది. దీనిని దాఁటు టకు నౌక వేఱొక్కటి కానగాదు. తన్నుఁదా నుద్ధరించుకొ నఁదగు. అనఁగా భగవదనుగ్రహమునకుఁబాత్రుఁడుకావలయు. అపుడు సాగర మింకిపోవును. అట్లుగాకున్న నది యనంత మగును. అట్టి సంసారసాగరమునుండి తన్నుద్ధరించుకొనక యందులోఁ బడిపోవునట్లు చేసికొనువానికంటె మూర్ఖుఁడు కలఁడా. అనఁగాఁ గర్మరూపుఁడ నగుననన్ను న్యాయమార్గమున నుపాసింపకయుండుటే మూర్ఖత్వము. ఫలాభిసంధిరహితుఁడై కర్మముల నాచరించువాఁడు తన్నుఁదా నుద్ధరించుకొనఁగలఁడు. అపుడు తనకు బంధు వెవ్వఁడు? తానే. అట్లు చేయనిచోఁ దనకు శత్రు వెవ్వఁడు? తానే. అర్జునా! ఆలోచించుకొనుము. ఏదియు కిమో? అని భగవంతుఁడు హెచ్చరించెనుగదా. కర్మ మాచరించుట ముఖ్యతమమని తెల్పుట యింతకంటె నెట్లు?

ఇంద్రియనిగ్రహము ప్రధానమనియు నది లేకున్నఁ గర్మ ఫలత్యాగము శక్యము కాదనియు నాకార్యము చేసికొనినఁ దనకుఁ దానే బంధువగుననియు నది లేకున్నఁ దనకుఁదానే శత్రువగుననియు స్వామి యుపదేశించెను. ఇంద్రియముల వశీక రించుకొని ప్రశాంతుఁడై యుండువానికిఁ బరమాత్మ యాత్మ యందే కనఁబడుచుండును. అదియే యానందము. దాని నను భవించుటయే ముక్తి. ఆయానందము కలిగినదా లేదా యన్నం

దులకుఁ బరీక్ష శీతోష్ణాదిద్వంద్వములయందు సమబుద్ధి కుదుర
టయే యని హరి తెల్పెను. బంగారమునకు సానఱాయి
యెట్టిదో తరించుపూరుషునకు ద్వంద్వసమబుద్ధి యట్టిది. అని
కదా దీనిభావము. కౌంతేయా! జయాపజయములయందు సమ
బుద్ధి నుంపుము. మానావమానములయందు నట్లే మది నుం
చుము. అనఁగాఁ గర్తృత్వాభిమానమును వదలుమనియే
యీయుపదేశసారము. ఏకాంతముగనుండి చిత్తమును దేహ
మును సంయతము లగునట్లుచేసి యాశమాని పరిగ్రహమును
మానియుండవలయునని మఱియుఁ జెప్పెను. మనస్సు సమా
హితముగా నుండునట్లు చేసికొనుమనియు జయింపవలయు
ననుతృష్ణ యుండఁగాదనియు రాజ్యము దొరకుననునని మంచి
యూహ కాదనియు నివిలేనిచో నీయంతఃకరణము పావన
ముగా నుండఁజాలదనియుఁ బరమాత్మభావము. మన స్సేకా
గ్రముగా నిలిచియుండుటకే ధ్యానయోగము నుపదేశించెను.
యోగమునకుఁ దగుసాధనములఁ గొన్నింటిని దెలిపెను.
అట్లేల? అని ప్రశ్నింపరాదు. అర్జునునకు యోగశాస్త్రమును
పాఠముచెప్ప హరి పూనలేదు. మనస్సంశయములను దొలఁ
గించి కర్తృత్వాభిమానము కలుగకుండ నొనరించి యుద్ధము
చేయఁ బురికొలుపుటకే యీయుపదేశము. శరచాపములు
పాఱవైచి సన్న్యసింపుమని చెప్పుటకు హరిపూనెనా? లేదు.
మనోదౌర్బల్యము కలదని యెఱింగి దానిం దొలఁగించినఁగాని
యీతని కీకార్యముచేయు నుత్కంఠ జనింపదని నిశ్చయించి
దానికిఁ దగుసాధనములఁ దెలుపనే పూనెను యోగి కావలయు
ననఁగా నదియే భావము

ఇంతదూరము శ్రీహరి యుపదేశింపఁగా విని యర్జునుఁడు స్వామీ! సమత్వము నభ్యసింపుమని నీవుపదేశించిన యోగము ఫలింపదని తలంతు. మనస్సు చంచలముకదా. దానిని జయించినఁగాని యోగ మలవడదు. యోగ మలవడినఁగాని యాచాంచల్యము వీడదు. ఈయన్యోన్యాశ్రయదోషము దుర్నివారమని ప్రశ్నించెను ఓహో! నాయుపదేశము నీతఁడు గ్రహింపఁజాలకున్నాఁడని హరి తలంచి గొప్పనిని నీని సంశయము తీర్పఁదగునని యూహించి కౌంతేయా! నీవిఁకఁ దరింతువు. ఏలయనఁగా మనస్సు చంచలమని గ్రహించితివి. అది దుర్నిగ్రహమనియు నెఱింగితివి. వాయువును మూటగట్టుటవంటిదనియు గ్రహించితివి. కాన దాని నిగ్రహించుమార్గము గ్రహింపఁగలవు. అని పొగిడి అభ్యాసవైరాగ్యములచే దాని నిగ్రహింపవచ్చునని పలికెను. అజ్ఞానున కుపదేశించుట సామాన్యముకాదు. ఆతనిమార్గము ననుసరించి మెల్ల మెల్లఁగా నుదాహరణములఁ జూపుచు నెఱిఁగింపవలయును. ఆమార్గము నే శ్రీహరి యవలంబించెను. ఈయుపదేశమున నర్జునుని చిత్తమించుక మార్పునొంది యింకొకశంకను గల్గింపఁజాలెను. యోగము నభ్యసించి యది ఫలింపకమున్నే మరణించినవాని గతి యేమనునదియే యాసందేహము. ఈశంకను దొలఁగించిన నీతనికి స్థైర్యము కలుగునని యూహించి హరి యిట్లుబోధించెను. యోగభ్రష్టున కీలోకమునందు నాశనము లేదనుటయే కాదు. పరలోకమునందు నాశనము లేదు. మంచికార్యములు చేయువానికి దుర్గతియే లేదు. ఫలమేమనఁగా సకలపుణ్యకార్యములు చేసినవాని కేపుణ్యలోకములు గల్గునో యాపుణ్యలోకములు

గల్గును. చాలాసంవత్సరములుండి పరిశుద్ధులగు శ్రీమంతుల యింట జన్మించును అని. దీనిభావమేమి? కర్మఫల మనుభవించుటకే జన్మమని కాదా. కర్మఫలత్యాగికిఁ బునర్జన్మము లేదని కాదా. ఇట్లు చంచలమగుమనస్సు చిరకాలయోగాభ్యాసమున నిశ్చలమగునట్లుచేసి పరమగతినొందును. తపస్సుచేయువారికంటెను, జ్ఞానులకంటెను, కర్మముల నాచరించువారికంటెను యోగి యుత్కృష్టుఁడు. కావున నర్జునా! నీవు యోగివి కమ్ము. అని భగవంతుఁ డుపదేశించెను. ఇందుఁగల భగవంతుని తాత్పర్య మేమి? అన్నింటికంటె యోగముత్కృష్టమగును. దాన యోగి యుత్తమోత్తముఁడనియేకదా. తపస్సునకు జ్ఞానమునకుఁ గర్మమునకు యోగము ప్రధానము. యోగాభ్యాసమునఁగాని మనస్సు పరిశుద్ధము అచంచలము కాదు. అవిగల్గినఁగాని చేయఁబూనుతపస్సు సఫలము కాదు. అది యైనంగాని జ్ఞానము కుదురదు జ్ఞానముతోఁ గూడి చేసినఁ గాని కర్మములు విధివంతములు కావు. కావున యోగము సకలకార్యములకు మూలాధారము. స్థూణానిఖననన్యాయము ననుసరించి యోగము పరమమైనది.

ఇప్పట్టునఁ గొందఱలసులు యోగాభ్యాసము గారడివిద్యవంటిదనియు, జ్ఞానము ప్రధానమని యందురు. పాపము! వారికి మనోనిరోధమునకు యోగముతప్ప వేఱుమార్గము లేదని తెలియదు. వైరాగ్యముకూడఁ గలదు. అది యలవడు టెట్లు! సర్వమునకు మూలాధారము మనోనిగ్రహము. అది యోగాధీనము. కావుననే యోగి సర్వోత్కృష్టుఁడని శ్రీహరి పలికెను. గృహమునకు స్తంభ మాధారము. తత్పతనమున

నదియుఁ బడును. అట్లు యోగాధారమగు మనోనిగ్రహము తదభ్యాసాభావమున నిలువనేరదు. అలసులుకానివా రద్దాని నాక్షేపింపరు. అలసులకు యోగాభ్యాస మసాధ్యము. అది మిగులఁ గష్టసాధ్యము. గురుసేవాలభ్యము. ఆ శ్రమమున కోర్వఁజాలక జ్ఞానులమని నాలుగుమాటలునేర్చుకొని యెల్ల రకు నుపదేశించుచుందురు. ఆమాటలు నమ్మి కొందఱు మోస పోవుదురు. అట్టివారినోరు మూయించుటకే పరాత్పరుఁ డీ మాటఁ జెప్పెను. కావున యోగాభ్యాసము ప్రధానమని నమ్మ వలయు.

మహాశయులారా! కర్మయోగమున కుపకరణములగు నాఅధ్యాయములు పూర్ణములయ్యెను. ఈయధ్యాయము నందు బుద్ధిశుద్ధిహేతువగు కర్మయోగమున కవధిని గనఁ బఱచి యంత సర్వకర్మసన్న్యాసము నొనర్చినవానికి సాంగమగు యోగమును వివరించి మనోనిగ్రహమునకు నుపాయము నుప దేశించి యోగభ్రష్టునకుఁ బురుషార్థములేదన్న యనుమాన మును దొలఁగించి భగవంతుఁడు కర్మతత్త్వమును నిరూపిం చెను కావునఁ గర్మము ఫలాభిసంధిరహితముగా నొనరించిన భగవత్ప్రీతికిఁ బాత్రుఁ డగును. గీతాశాస్త్రమున నీకర్మసిద్ధాం తమే చేయఁబడినది. అర్జునుని సన్న్యాసినిఁగాఁ జేయఁబూని పరమాత్మ యుపదేశింపలేదు. యుద్ధముచేయ నుత్సాహవం తునిగాఁ జేయఁబూనెను. కర్మసిద్ధాంతమును బోధించి కర్తృ త్వాభిమానమును దొలఁగించి యతనిమనస్సు స్థైర్యయుక్త ముగాఁ జేయఁబూనెను. కావున లోకసంగ్రహమునకై యోగులుకూడఁ గర్మము నాచరింతురు. అస్మదాదులమాట

విశేషించి చెప్పనేల? ఇంకఁ బైభాగమున నేమి యుపదేశించెనో యని పరికింతము.

## జ్ఞానవిజ్ఞానయోగము.

(౧)ఇట్లు శ్రీహరి యర్జునునకు బోధించి యాతని మనస్సు సంశయరహితముగఁ జేయందలంచి మఱియు నిట్లు చెప్పెను. అర్జునా! యోగము నభ్యసించుచు నేనే యాశ్రయముగాఁ గలిగి నాయందే యాసక్తిగలవాఁడ వగుచు నన్ను సర్వలక్షణములతో నిస్సంశయముగా నెట్లు తెలిసికొనఁగలవో యాపద్ధతిని చెప్పెద. ఆలకింపుము. (౨) ఎద్దానిఁ దెలిపినయెడల నీక నేదియుఁ దెలియవలసినది యుండదో యట్టి మద్విషయజ్ఞానమును స్వానుభవయుక్తముగా నీకుఁ గొదువలేకయుండఁదెల్పెదను. (౩)మానవులలోఁ బెక్కండ్రలో నొక్కఁడూ సిద్ధికొఱకుఁ బ్రయత్నించును. ఆరీతిగాఁ బ్రయత్నించుమహాపురుషులలో నొకానొకఁడు నన్నుఁ జక్కఁగాఁ దెలియుచున్నాఁడు. మహాఫలప్రదమగు నీజ్ఞానము నాయనుగ్రహము లేనిచో లభింపఁజాలదు. నాయనుగ్రహముభక్తిలేనివానికి లభింపదు. కావున నాయం దత్యంతభక్తిగల నీకు వివరించుచున్నాఁడను. (౪) పృథ్వీతన్మాత్ర మగుగంధము, జలతన్మాత్ర మగురసము అగ్ని

మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదాశ్రయః, అసంశయం సమగ్రంమాం యథాజ్ఞాస్యసి తచ్ఛృణు. ౧. జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః, యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే. ౨. మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే, యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః. ౩. భూమిరాపోఽనలో వాయుః

తన్మాత్రమగురూపము, వాయుతన్మాత్రమగు స్పర్శము, ఆకాశ తన్మాత్రమగుశబ్దము,అహంకారము,మహత్తత్త్వము,అవ్యక్తము నను భేదంబుల నా ప్రకృతి యెనిమిదివిధములుగా భిన్నమయి యున్నది. ప్రకృతిద్వారమున సృష్ట్యాదికర్తయని ప్రతిజ్ఞాతమగు నీశ్వరతత్త్వము నిరూపింపవలయును. అందులకై పరాపరభేదం బునఁబ్రకృతిద్వయమును వివరించుటకే యీవిషయమును దెల్పి తినని గ్రహింపుము. (౫) ఇపుడు చెప్పినది యపరప్రకృతి. ఈయ పరప్రకృతికంటె వేఱైనదియుఁ బరిశుద్ధమయి, నా కాత్మభూత మైనదానిని, జీవభూతమగుచు నీజగమునెల్ల ధరించుచున్న దానిని, నాపరప్రకృతి యని యెఱుంగుము. (౬) సర్వభూత ములకు నా యీ రెండుప్రకృతులే కారణములని తెలియుము. అందువలన నేను సమస్తజగత్తునకు నుత్పత్తినాశములకుఁ గారణం బగుదును. ఈప్రకృతిద్వయమునందును గార్యలింగ కానుమానము ప్రమాణమని తెల్పితిని దానిమూలమున జగ త్సృష్ట్యాదికారణుండ నని తెల్పితిని. ఈవిషయమును జక్కఁగా నెఱుంగుము(౭)ధనంజయా! నాకంటె నితరమైన స్వతంత్రకార ణమేదియు లేదు. అందువలన నాయందు నీజగత్తు సమస్తమును సూత్రమునందు మణులుంబోలె నిలిచియున్నవి. (౮) నేను

---

ఖం మనో బుద్ధిరేవచ, అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా. ౪. అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం, జీవభూతాం మహా బాహో యయేదం ధార్యతే జగత్. ౫. ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ, అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా. ౬. మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ, మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. ౭. రసోఽహ మప్సు కౌంతేయ ప్రభాస్మి శశి

జలమునందు రసరూపుఁడనై యున్నవాఁడను. చంద్రసూర్యుల యందుఁ బ్రకాశరూపుఁడను. సర్వవేదములయందుఁ బ్రణవ రూపుఁడను. ఆకాశమందు శబ్దరూపుఁడను. పురుషులయందుఁ బౌరుషరూపమున నుండువాఁడను. ఇట్లనుటచే జగత్తునకు స్థితిహేతువు నేనని యెఱుంగుము. (౯) భూమియందు సురభి గంధముగ నున్నాఁడను. అగ్నియందు దీప్తిరూపుఁడ నై యున్నాఁడను. సర్వభూతములయందును జీవరూపుఁడ నై యున్నాఁడను. తపస్వులయందుఁ దపస్సు నై యున్నాఁడను. (౧౦) పార్థా! సర్వభూతములకును సనాతనమగుబీజము నేనని యెఱుంగుము. మఱియు బుద్ధిమంతులలో బుద్ధిని నేను. తేజ స్వులలోఁ దేజస్సు నేనే. (౧౧) ఓభరతర్షభా! బలవంతుల యొడఁ గామరాగములు లేనిబల మేదియో నేను. మఱియు ధర్మమునకు విరుద్ధముకాని కామము నేనే యని తెలిసి కొనుము. కామమనఁగా నప్రాప్తమగువస్తువునం దభిలాషము రాజసము. రాగమనఁగాఁ గోరినవస్తువుప్రాప్తమయినను వెండియు నధికమునందుఁ జిత్తరంజనాత్మకమైన తృష్ణయను పేరుగలది తామసము. వానిచే వర్జింపఁబడిన బలవంతులబలము నేనే. సాత్త్వికమగు స్వధర్మానుష్ఠానసామర్థ్యము నేనని సారము. స్వధ ర్మముతో నవిరుద్ధమైనది స్వభార్యయందుఁ బుత్త్రోత్పత్తి మాత్ర

---

సూర్యయోః, ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషంనృషు. ౯. పుణ్యోగంధః పృథివ్యాంచ తేజశ్చాస్మి విభావసౌ, జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తప స్విషు. ౧౦. బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనం, బుద్ధిర్బుద్ధి మతామస్మి తేజస్తేజస్వినామహమ్. ౧౧. బలం బలవతాం చాహం కామ

మున కుపయోగి యగునట్టి కామము నేనే యని పరిగ్రహిం
చుము. (౧౨) మఱియు సత్త్వగుణముచేఁ గలుగునవికాని
రజోగుణముచేఁ గలుగునవికాని తమోగుణముచేఁ గలుగునవి
గాని భావము లేవిగలవో యవి యన్నియు నావలననే పుట్టు
నవిగా నెఱుంగుము. ఐన నవి నాయధీనములే కాని నేనుమా
త్రము వానియధీనుఁడను గాను. (౧౩) సత్త్వరజస్తమోగుణ
వికారములైన రాగద్వేషమోహాదులచే మోహింపఁజేయఁ
బడినవా రగుటవలనఁ బ్రాణులు, ఈగుణములకు విలక్షణుఁ
డను సర్వవికారశూన్యుఁడ నగున న్నెఱుంగరు (౧౪) త్రిగు
ణమయమైన మాయయు నీశ్వరుఁడనగు నాయదియే. దీని నతి
క్రమించుట కష్టము. కావునఁ గర్మాదుల నన్నింటిని విడిచి
నన్నే యెవ్వరు శరణుపొందుచున్నారో వా రీమాయను దాఁ
టఁగలరని తెలియుము. ఈచెప్పినయనాదిసిద్ధమగు మాయా
సంబంధమగుగుణత్రయముచే నిబద్ధమగుజగత్తునకు స్వాతం
త్ర్యము లేదుగావున దానిని వదలించుకొనుటకు సామర్థ్యము
లేకపోవుటచే నొకానొకసమయమందును, వస్తువివేకమునం
దసామర్థ్యమునకు హేతువు సదాయుండుటచే మాయాతి
క్రమణము సిద్ధింపదని యనుమానింతువేని భగవదేకశరణుం
డగువానికిఁ దత్త్వజ్ఞానద్వారమున మాయాతిక్రమణము లభిం
చుననియే యిటఁగలసార మని నిశ్చయించి సందేహమును వద

---

రాగవివర్జితమ్, ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ. ౧౧.
యేచైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే, మత్త ఏవేతి తాన్విద్ధి
న త్వహం తేషు తే మయి. ౧౨. త్రిభిర్గుణమయైర్భావైరేభిస్సర్వమిదం
జగత్, మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయం. ౧౩. దైవీ
హ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా, మామేవయే ప్రపద్యంతే

లుము. (౧౫) కౌంతేయా! పరమేశ్వరుఁడ నగునన్ను మిక్కిలి పాపముల నొనరించినవారును, నరాధములు భజింపరు. వారు తమకుండుజ్ఞానము మాయచే నపహరింపఁబడుటంజేసి హింసానృతాదిరూపమగు నాసురభావము నాశ్రయింతురు. కావున నన్ను భజింపఁజాలరు. మఱియు వారు బహుజన్మార్జితదురితప్రతిబంధమువలన నట్టిభావముగలవా రగుదురని యెఱుంగుము. దానిచేతనే మాయాప్రతిబంధనివృత్తికొఱకు నన్ను భజింపఁజాలరని నిశ్చయింపుము. (౧౬) అర్జునా! పుణ్యవంతులగు మానవులు నన్ను నాల్గుతెగలవారు భజింతురు. చోరరోగవ్యాఘ్రాదిభయమువలన నాపదలపాలగువారును, భగవత్తత్త్వ మిట్టిదని తెలియఁ గోరువారును, ధనమును గాంక్షించువారును, భగవత్తత్త్వము తెలిసినవారును. ఈనాల్గువిధములుగ నుండువారలే నన్నుఁ గొలుతురు. ఈభేదములు పుణ్యకర్మతారతమ్యముచేఁ గలిగినవని యూహింపవలయును. అర్థమనఁగా నిహపరలోకములయందు భోగసాధనమైనదని యర్థము. (౧౭) అర్జునా! ఆనలువురిలో సంతతము నాయందు (భగవంతునియందు) సమాహితుఁడును, నాయం దొక్కనియందే భక్తిగలవాఁడు నధికుఁడు. ఆతఁడు జ్ఞాని యనంబడును. నేను జ్ఞాని కాత్మనగుటవలన నాతని కేను బరమప్రియుఁడను. జ్ఞానియు నా కాత్మయగుట వాఁడు నాకును బరమప్రియు

---

మాయా మేతాం తరంతి తే. ౧౪. నమాందుష్కృతినోమూఢాః ప్రపద్యంతే నరాధమాః, మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః. ౧౫. చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున, ఆర్తోజిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬. తేషాంజ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే, ప్రియో

డగును. ప్రత్యగభిన్నుఁ డగుభగవంతునియందు నిరంతరము సమాహితచిత్తముగలవాఁడును, చిత్తవిక్షేపములేని వాఁడును గావున నుత్కృష్టుఁడని తెలియందగును. దేహాద్యభిమానము లేమింజేసి చిత్తవిక్షేపము సంభవింపదు. దాననేకాంతభక్తి కుదురును. ఇతరుల కట్టి యేకాంతభక్తి గలుగ నవకాశము లేదు. కావుననే యానల్వురియందు నీతఁ డుత్తముఁ డగునని తెల్పితిని. (౧౮) ఆర్తుఁడు జిజ్ఞాసువు నర్థార్థియు ననునీముువ్వురుగూడ నాకుఁ బ్రియులే యగుదురు. వారికంటె జ్ఞాని నాకుఁ బరమప్రియుఁ డగును. కావున నాతఁడు నేనే యని నానిశ్చయము. ఏల యందువేని వాఁడు తానే భగవంతుఁడని మది నిశ్చయించుకొని నన్నే పరమగతినిఁ బొందుటకుఁ బ్రవర్తించువాఁ డగును. ఆర్తాదులు ముువ్వురు నాకుఁ బ్రియులు కారని నీవాశంకింతువని యెంచియే యీవిషయమును దెల్పితినని యెఱుంగుము. (౧౯) అనేకజన్మములు పుణ్యకర్మముల నాచరించుచు దానఁ జిత్తశుద్ధిని గాంచి చివరకు జ్ఞానియై సర్వము వాసుదేవమయమని భావించి నన్నుఁ బ్రత్యగాత్మనుగాఁ బ్రత్యక్షము చేసికొనును. అట్టిమహానుభావుఁ డీలోకమున మిక్కిలి దుర్లభుఁడని తెలియందగును. మహానుభావుఁ డనఁగా మిక్కిలి పరిశుద్ధమగు నంతఃకరణముగల వాఁడగుటంజేసి జీవన్ముక్తుఁడును, సర్వోత్కృష్టుఁడు నగు. వాని

---

హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమప్రియః.౧౭. ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవమేమతం, ఆస్థితస్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిం.. ౧౮. బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే, వాసుదేవ

కితరుఁడు సమానుఁడుకాఁడు. ఆతనికంటె నధికుఁడుండఁడుకదా. (౨౦) కౌంతేయా! బహువిధములగు కామములచేత వివేకజ్ఞానము కోలుపోయియుండువారు స్వస్వపూర్వజన్మార్జితమగు సంస్కారమున కనురూపముగా నాయానియమముల నవలంబించి యితరదేవతల నుపాసింతురు. వీరెల్ల రాజసులు తామసులు నగుటఁ గామాభిభూతు లగుట క్షుద్రదేవతలను సేవించుచుందురని యెఱుంగందగును. (౨౧) అర్జునా! ఎవ్వఁడెవ్వఁడే దేవతామూర్తిని శ్రద్ధాభక్తులు గలిగి పూజింపఁ గాంక్షించునో వానివాని కాదేవతామూర్తియందలి శ్రద్ధనే నేనును స్థిరముగ నిలువఁజేయుచున్నాఁడను. (౨౨) పార్థా! ఆతఁడునామూలమున స్థిరమగు నా శ్రద్ధతోఁగూడి యాదేవతామూర్తి నారాధించుచున్నాఁడు. అట్లారాధించి యాదేవతామూర్తివలన నాచేతనే కలుగఁజేయంబడిన యభీష్టములను బొందుచున్నాఁడని తెలియును. ఆతఁ డుపాసించు దేవతామూర్తులుగూడ నామూర్తులేయగును గదా. కాఁబట్టి నేనే వారి కాంక్షితముల నెఱవేర్తును. (౨౩) మందమతులు కాన వారలకు నశ్వరమగుఫలమే కలుగును. ఏలయనఁగా దేవతలనారాధించువారు దేవతలనే పొందుదురు. నాభక్తులుమాత్రమే నన్నుఁ బొందుదురు. సర్వ

---

స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః. ౧౯. కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః, తంతంనియమ మాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా. ౨౦. యోయోయాంయాం తనుంభక్త శ్శ్రద్ధయార్చితుమిచ్ఛతి, తస్యతస్యాచలాంశ్రద్ధాం తామేవ విదధామ్యహం. ౨౧. స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధనమీహతే, లభతేచతతః కామాన్ మయైవ విహితాన్ హితాన్. ౨౨. అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసాం, దేవాన్ దేవయజో

దేవతలును సర్వాత్మకుఁడనగు నామూర్తులే యగుదురు. వారి నారాధించుటయు వస్తుస్థితి ననుసరించి యూహింపఁగా నా యారాధనమే యగును. ఎల్లతావుల నంతర్యామినగు నేనే ఫలము నిచ్చువాఁడను. ఐనను నాయందే భక్తినునుచువార లకు నితరదేవతాభక్తులకు వస్తువివేకావివేకములచే ఫల వైష మ్యము కలదని తెలియఁజేసితిని అన్యదేవతాభక్తుల కెప్పటికి నిన్నుఁబొంద నవకాశమే లేదా యని ప్రశ్నింతువేమో. వారికిం గూడఁ జిరకాలమునకు నాయం దేకాంతభక్తి కుదురును. అపుడు ముక్తి నొందుదురని నమ్ముము. (౨౪)పార్థా! వారెందు వలన నన్నే తొలుతసేవింపరో తెలిపెదను. వినుము. వివేకశూ న్యులు కొందఱు నాశము లేక నిరతిశయమై యలరారు నాపర మస్వరూపము నెఱుంగఁజాలక నన్నిదివఱకుఁ బ్రకాశము లేక యిపుడు ప్రకాశమునొందినవానినిగాఁ (ఇదివఱకుఁ దెలియ రాక యిపుడు తెలియవచ్చినవానిగా) దలంచుచున్నవారు. (౨౫) కుంతీనందనా! నేను గుణాత్మకమగుమాయచేతఁ గప్పఁ బడినవాఁడను. కావున సర్వమానవులకు నెఱుంగ శక్యము కాక యుందును. అందువలన మూఢులగుజనులు జన్మము నాశము లేని నన్నుఁ దెలియఁజాలకుందురు. (౨౬) అర్జునా! నేను భూత భావివర్తమానము లగుభూతజాలము నెల్ల నెఱుంగుదును. కాని నన్నుమాత్రమం దెవ్వఁడు నెఱుంగఁడు. అందువలననే ప్రాయిక

---

యాంతి మద్భక్తా యాంతి మామపి. ౨౩. అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః, పరం భావమజానంతో మమావ్యయమనుత్తమం. ౨౪. నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయా సమావృతః, మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయం. ౨౫. వేదాహం సమతీతాని వర్త

ముగా నెల్లవారు నన్ను భజింపఁజాలరని యూహింపుము.(౨౭) భగవత్తత్త్వజ్ఞానప్రతిబంధముచేతఁ బ్రతిబద్ధములయిజన్మించు సర్వభూతములు దేనిచేతఁ నిన్నెఱుంగకుండునని ప్రశ్నింతు వేమో. వినుము. అర్జునా! సర్వప్రాణులు జన్మించునపుడే రాగ ద్వేషాదిద్వంద్వసంజనితమోహావేశమునంజేసి మోహితములై పుట్టుచుండు. కావుననే యజ్ఞానము దృఢమగును. దాననేనే సుఖి ని. నేనే దుఃఖిని అనునభినివేశము కల్గును. దానిచేతనే నన్నె ఱుంగఁజాలరు. (౨౮) పుణ్యకర్మము లనేకములు చేసినవారి కెవ్వరికిఁ బాపము నశించునో యట్టిపరిశుద్ధాత్ములుమాత్రము ద్వంద్వమోహనిర్ముక్తులగుచు దృఢవ్రతులై నన్ను భజింతురు. తక్కినవారు భజింపఁజాలరు. (౨౯) జరామరణమోక్షమునిమి త్తము నాయందే సమాహితచిత్తము గలిగి యెవ్వరు ప్రయ త్నింతురో వారు పరమేశ్వరుని నన్నెఱుంగుదురు. అపర బ్రహ్మమే సమస్తప్రత్యగాత్మవస్తు వనియు సమస్తకర్మరూ పమనియు నెఱుంగుదురు. వారు కృతార్థు లగుదురు. (౩౦) అర్జునా ! అధిభూతముతో, అధిదైవముతో, అధియజ్ఞ సంయుతముగా నెవ్వరు నన్నెఱుంగుదురో వారు సమాహి తాంతఃకరణులై మరణకాలమందుఁగూడ నన్నెఱుంగుదురు. భజింతురు.మరణకాలమున నింద్రియములు పరవశములుకాఁగా

---

మాని చార్జున, భవిష్యాణి చ భూతాని మాంతు వేద న కశ్చన. ౨౬. ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత, సర్వభూతాని సంమోహం సర్గే యాంతి పరంతప. ౨౭. యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్య కర్మణాం, తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః. ౨౮. జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతంతి యే, తే బ్రహ్మ తద్విదుః

నన్ను స్మరింపమఱచువారు కలరు. కాని యీచెప్పఁబడినవారు మాత్ర మట్లుగాక నన్నే స్మరింతురని యెఱుంగుము. అధిభూతాధిదైవాధియజ్ఞములవిషయము ముందు తెలిపెదను.

ఇది జ్ఞానవిజ్ఞానయోగము.

మహాశేముషీభూషితులారా! జ్ఞానవిజ్ఞానయోగమును బఠించితిరి. ఇందలిసార మేమని తర్కించు టనవసరము కాదు. ఆతర్కమే సన్మార్గమును గనఁబఱచును. అది లేనిచో ఫలము సమంజసముగాఁ గల్గఁజాలదని యెల్ల రంగీకరింపఁదగువిషయము. తొలుదొల్త నర్జునునకు శ్రీహరి నాకంటె నితర మేదియు లేదనియు దారమునందు మణిగణము గ్రుచ్చఁబడియుండునట్లు నాయందుండుననియుఁ దెలిపెను. దాని కుదాహరణముగా జలమందు రసపదార్థము నేను. చంద్రునందును సూర్యునందును బ్రభాపదార్థము నేను. అని యిట్లే మఱికొన్నింటిని దెలిపెను. మఱియు సర్వభూతములకు సనాతనబీజభూతునిగా నన్నె యుంగుమా యని స్పష్టపఱచెను. దీనిసారమేమి? ప్రపంచము మదాత్మికము. నాయాధారమున నుండును. నేను లేనిచోటు లేదు. నాతేజస్సు ప్రవేశింపనిచో నేదియుఁ బ్రకాశింపదనియేకదా. అనఁగా నీకేమియుఁ గర్తృత్వములేదు. నాచెప్పినట్లు చేయుము. అనియేకదా శ్రీహరి యాశయము. కర్తను గారయితను నేను గానుండ నీపని నేఁజేయననుటకు నీకేమి యధికారమని హరి

---

కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలం. ౨౯. సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః, ప్రయాణకాలేఽపిచ మాం తే విదుర్యుక్తచేతసః. ౩౦.

ఇతి జ్ఞానవిజ్ఞానయోగః.

హెచ్చరించెనని మన మూహింపవలయును. అట్లయిన నిన్నేల యందఱు సేవింపరని యర్జునుఁడు ప్రశ్నించునేమో యని యెఱింగి శ్రీకృష్ణపరమాత్మ యర్జునా! రాగద్వేషమోహాది ప్రకారభావములచేత మోహింపఁజేయఁబడిన యీప్రాణిసంతతి నన్నెఱుంగఁజాలదనియె. నన్ను నీగుణాతీతునిగా నెఱుంగు మా యనియె మాయ యంతశక్తిగలదియా యని యర్జునున కు సంశయముకలుగునని యూహించియే ప్రకృతిస్వరూపము నిట్లు నిరూపించెను. భగవంతునిస్వభావభూతురాలు త్రిగుణమయియు నగునామాయ శ్రమంపడినను దాఁటఁ దరముగానిది. నన్నెవరు భజింతురో వారే యామాయఁ దరింతురు అనఁగా సంసారబంధవినిర్ముక్తు లగుదురు. దీనిభావ మేమి? నామాయ దురత్యయ యనఁగా నెంతప్రయాసపడినను దాఁటఁజాలరు. నన్నే నమ్మి యెవరు సేవింతురో వారామాయను జయింతురు. మాయామోహితులు గారనికదా. సంసారబంధమునఁ దగులుకొనినవారు భగవంతు నారాధించునూహ కలవారగు టెట్లు? భగవంతు నారాధించిన మాయ తొలంగును. మాయ తొలంగిన భగవంతు నారాధించునూహ కలుగును ఈ యన్యోన్యాశ్రయదోషము తొలంగు టెట్లు? తొలుదొలుత భగవతి యగుమాయ నారాధించి తదనుగ్రహమునకుఁ బాత్రుఁడై పిదప భగవంతు నారాధింపవలయును. మాయామోహము తనయంతన వదలదు. తదుపాసనముచేతనే తొలంగవలయును. ఇదియే యిటఁగలసారము. ఈవిషయము దీని తరువాతిశ్లోకమునఁ జెప్పఁబడినది.

"న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః."

పై సిద్ధాంత మీశ్లోకాధారమయినది.

భగవదారాధనతత్పరులు నలువురు. రోగములు తస్కర వ్యాఘ్రాదిబాధలుగలవా రొక్క తెగవారు. ఆబాధలు తొలంగ నారాధింతురు. జిజ్ఞాసువులు—అనఁగా భగవత్తత్త్వమును దెలియఁగోరువారు. వీరు రెండవతెగవారు. ధనార్థులు. వీరు మూఁడవతెగవారు జ్ఞానులు. భగవత్తత్త్వ మిట్టిదని యెఱింగినవారు. వీరు నాల్గవతెగవారు. ఈనలువురిలో జ్ఞాను లుత్కృష్టులు. ఏలయనఁగాఁ దక్కినముప్వురు స్వార్థపరులు. జ్ఞాని స్వార్థపరుఁడు కాఁడు. కర్మసన్న్యాసి. అనఁగా ఫలాభిసంధిరహితుఁడు. కావుననే నుత్కృష్టుఁడని శ్రీహరి బోధించెను. తక్కిన ముప్వురు నాకుఁ బ్రియులే యనియె. ఏల? ఏకారణముచేత నైనను భగవంతు నారాధించినవా రుత్తము లగుదురనియే దీనిసారము. ఇఁక నన్యదేవతారాధనముగూర్చి శ్రీహరిభావ మేమని యించుక పరికింపఁదగును. ఒక్కొరొక్క రొక్కొక్క కోరికకలవారుగ నుందురు ఆకోరికలు వారిజ్ఞానమును హరించును. కావున నితరదేవతల నారాధింతురు. ఆయారాధనము స్వకీయప్రకృతి కనురూపముగా నుండును. జన్మాంతరార్జిత సంస్కారవిశేషమున నాయాయిదేవతలయం దభిమాన ముదయించును. కాని సర్వరూపములుగల సర్వేశ్వరుఁ డేయేభక్తుఁ డేయేరూపమును శ్రద్ధచే నారాధింపఁగోరునో యాయాదేవత యందు నిశ్చలభక్తి కుదురునట్లు చేయును. ఆభక్తుఁ డట్టిశ్రద్ధచేత నాయాదేవత నారాధించును. ఆదేవతవలన సకలవాంఛితములను బడయును. ఆకోరికల ఫలింపఁజేయువాఁ డాసర్వేశ్వరుఁడే

ఆర్యులారా! ఈసిద్ధాంతమే పెక్కుతావుల నీకృష్ణావతారతత్త్వమునందు వ్రాయఁబడినదని మీరెఱింగినవిషయమే. కాని క్రొత్తది కాదు.

"యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహం.
స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే,
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్."

అను నీయధ్యాయగతభగవద్వాక్యము లీవిషయమును దృఢపఱచుచున్నవి కదా. అయితే యిందొక్కరహస్యముకలదు. ఆయభీష్టదేవతారూపము సర్వేశ్వరస్వరూపమనియే భావింపవలయును. లేక వేఱుభావనచే నర్చించినచో నాఫలము సమగ్రము గాదు. దేవతాసాన్నిధ్యము దొరకిన నది యనంతకాలముండునది కాదు. భగవద్బుద్ధిచే నారాధించిన శాశ్వతమగును. కావున భక్తుఁ డభీష్టదేవతను సర్వేశ్వరునియాకృతివిశేషమనియే భావింపవలయును. అదియే పరమపురుషార్థము నొసంగుననుట సత్యము.

మూఢులు నన్నెఱుంగఁజాలరని శ్రీహరి వాక్రుచ్చెను. ఏల? యోగమాయాసమావృతుఁడ నగుట ననియు హేతువు తెల్పెను. దీనిసార మేమనఁగా యోగమాయను సామాన్యమని భావించువారు మూఢు లనఁబడుదురు. వా రనాదియగు భగవంతు నెఱుంగఁగలరా! "తదనుప్రధానద్వారా రాజదర్శనం కర్తవ్యమ్" అనున్యాయము ననుసరించి భగవంతునే యోగమాయ యావరించియున్నపు డది తుచ్ఛమని భావించిన వాఁడు మూఢుఁడు కాక మఱేమగును? అది యనిర్వచనీయ

మహిమము గలది. కావుననే "మమ మాయా దురత్యయా" అని భగవంతుఁ డాదేశించెను. ఎవ్వ రామాయాదేవి నారా ధింతురో వారు భగవదారాధన మొనరింపఁదగు ననుజ్ఞానము కలవా రగుదురు. అది వాఙ్మాత్రము కాదు. క్రియారూప మగును. మాటమాత్ర మెల్లవారును బలుకుదురు. క్రియా రూపమది కాంచలేదు. ఎవ్వరికి భగవదారాధనమున శ్రద్ధ నిశ్చలరూపిణియై యలరునో వారే మాయామోహమునుండి నిర్ముక్తులై పరమపదము నొందుదురు. ఈయధ్యాయమునఁ గర్మ సిద్ధాంతము లేదా! కర్మరతునకు భగవత్కరుణ గలుగుననియు దాన ముక్తి నొందుననియు నీయధ్యాయమునఁ గలసారము. ప్రధానముగా నీయధ్యాయమున భగవంతు నెఱుంగు సత్క ర్మమార్గము తెలుపఁబడినది.

"యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణా మ్" అనఁగాఁ గర్మము ప్రధానమనిగాక మతేమగును? అది జ్ఞానసాధనమగునని యెఱుంగఁదగిన ముఖ్యవిషయము. ఇంతట నీవిషయము నుజ్జగించి యవ్వలియుపదేశమును దెలిపెదను.

తారకబ్రహ్మయోగము.

(౧,౨) శ్రీకృష్ణమూర్తి యిట్లు జ్ఞానవిజ్ఞానయోగ ముపదే శింపఁగా విని యర్జునుఁ డిట్లు ప్రశ్నించెను. పరమేశ్వరా! నీ వుప దేశించిన బ్రహ్మమేది? అధ్యాత్మమనఁగా నేమి? కర్మ మేలాటిది? అధిభూత మనఁగా నెట్టిది? అధిదైవత మెట్టిదని చెప్పఁబడును? అధియజ్ఞు డనఁగా నీదేహమునం దెవ్వఁడని యెఱుంగవల

---

అర్జున ఉవాచ.—కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ,

యును? ప్రయాణకాలమందు నియతాత్ములచే నెట్లు నీవు తెలి
యంబడుదువు? మధుసూదనా! పురుషోత్తమా! నాకుఁ దెలి
యఁజేయుము. మఱియు నాబ్రహ్మము సోపాధికమా? నిరుపాధి
కమా? అధ్యాత్మమనఁగా శ్రోత్రాదికరణగ్రామమా? ప్రత్యక్చై
తన్యమా? కర్మము యజ్ఞరూపమా? లేక యింకొక్కటియా?
అని యిట్లర్జునుఁడు ప్రశ్నింపఁగా భగవంతుఁ డాతనియను
మానములను దీర్పఁగోరి యిట్లు సమాధానము తెల్పెను.

(౩) పార్థా! అక్షరమనఁగాఁ బరబ్రహ్మము. దాని
యొక్క ప్రత్యగాత్మరూపమే యధ్యాత్మమని యెఱుంగుము.
స్థావరజంగమాత్మకభూతోత్పత్తికి హేతువగుయజ్ఞమే కర్మ
మనుపేర వ్యవహరింపఁబడుచున్నది. ఇట బ్రహ్మమనఁగా నిరు
పాధికమే యని యెఱుంగవలయును. సర్వోపాధిశూన్యమై,
సర్వమునకును బ్రశాసిత యనందగి యవ్యాకృతాకాశాంత
మగుసర్వప్రపంచమును ధరించునదియై యీశరీరేంద్రియసం
ఘాతమునందును విజ్ఞాతమగునిరుపాధికచైతన్య మిట బ్రహ్మ
శబ్దముచే నెఱుఁగందగును. (౪) పార్థా! జన్మనాశముగలవస్తు
వాధిభూతం బనఁబడును. ఆదిత్యమండలాంతర్గతుఁ డగుపురు
షుఁడు హిరణ్యగర్భుఁ డాధిదైవతమని యెఱుంగుము.
ఈదేహమునందు వేలువేలుగానుండు యజ్ఞరూపకర్మమునకు

---

అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కిముచ్యతే. ౧. అధియజ్ఞః కథం కోఽ
త్ర దేహేఽస్మిన్మధుసూదన, ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతా
త్మభిః. ౨. శ్రీభగవానువాచ.—అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ
ముచ్యతే, భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః. ౩. అధిభూతం క్షరో

నభిమానియగు విష్ణువునగు నేనే అధియజ్ఞుఁడనని పిలువంబడు చున్నవాఁడను. (౫) మృతిసమయమునందుఁ బరమేశ్వరుని విష్ణువును నన్నే చింతించుచు నెవ్వాఁడు శరీరమును విడిచి పోవునో యాపురుషుఁడు నాదగు వైష్ణవతత్త్వమునుఁ బొందు చున్నవాఁడు. ఇందుల కిసుమంతయు సందియము లేదు. (౬) కౌంతేయా! సర్వదా ఒకానొక దేవతనే భావించుచు దానిని జక్కఁగా నభ్యసించినవాఁ డగుటవలన మరణకాలమునందు నట్లు తాను సర్వదా భావించుచుండిన యేదేవతను స్మరిం చుచు దేహమును వదలుచున్నవాఁడో యాదేవతనే యతఁడు పొందుచున్నాఁడు. (౭) ఏకారణమువలన నీరీతిగా నంత్యభా వన దేహాంతరప్రాప్తికిఁ గారణమగునో ఆహేతువువలన నీవు సర్వకాలములయందును నన్ను స్మరించుచుండుము. యుద్ధము నొనరింపుము. ఇట్లు మనోబుద్ధులను నాయందే యుంచిన నన్నే పొందుదువు. నిస్సందేహము. పూర్వజన్మకర్మవాసనయే యంత్య కాలమున స్మృతిహేతువగును. కాని యాతరుణమునఁ బరవ శుండగువానికి స్మరణప్రయత్నము సంభవింపదు. కాబట్టి సర్వ కాలము నన్నే స్మరించుచుండిన నంతకాలముననదియే తోఁచు నని నమ్ముము. (౮) ఓపార్థా! విషయాంతరములయందుఁ బ్రవ

---

భావః పురుషశ్చాధిదైవతం, అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర. ౫. అంతకాలేచ మామేవ స్మరన్ముక్త్వా కళేబరం, యఃప్రయాతి స మద్భావంయాతి నాస్త్యత్ర సంశయః. ౬. యంయం వాపి స్మరన్భావం త్యజత్యంతే కళేబరం, తంతమేవేతి కౌంతేయ సదా తద్భావభావితః. ౭. తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ, మయ్యర్పితమనోబుద్ధిర్మా మేవైష్యస్యసంశయః. ౮. అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,

ర్తింపక యేకాగ్రముగా నాయందే నిలుచునట్టి యభ్యాస యోగముతోఁ గూడినచిత్తముతో నన్నే శాస్త్రాచార్యోపదేశ ముచొప్పున ధ్యానించుచు సూర్యమండలాంతర్వర్తి యగు పరమపూరుషుని నన్నే పొందును. సంతతస్మరణమున కభ్యాస మనునది యంతరంగసాధనంబని యిందు సారము. (౯) పార్థా! సర్వజ్ఞుఁడును, జిరంతనుఁడును, సర్వలోకములకును శాసకుఁ డును, సఋవులలోఁ బరమాణువును, గర్మఫలముల నన్నింటిని బ్రాణులకు విభజించి యిచ్చువాఁడును, నచింత్యరూపుఁడు సూర్యునకుఁ బ్రకాశమువలె నిత్యచైతన్యప్రకాశముగల వాఁడు, నజ్ఞానాతీతుఁడు నగునుత్తమపూరుషు నెవ్వాఁడు తలం చునో యతం డాయుత్తపూరుషునే పొందును. (౧౦) అర్జునా మరణకాలమునందు నిశ్చంచలమగుమనస్సునందు భక్తియోగ బలంబులంగూడి భ్రూమధ్యమభాగమునఁ బ్రాణమును నిలిపి యేమఱక భగవంతుఁ డగుపరాత్పరునిస్మరించినయెడల నాతండు ప్రకాశస్వరూపుఁ డగుపురుషుని బొందుచున్నాఁడు. (౧౧) కౌంతేయా! ఏయక్షరమును వేదవేత్తలు చెప్పుదురో, దేనిని వైరాగ్యవంతులగు యతులు ప్రవేశించుచున్నవారో, దేనిని దెలియం గోరి సద్గురువుకడం జేరి బ్రహ్మచర్యమునఁ జరించు

---

పరమంపురుషం దివ్యం యాతిపార్థానుచింతయన్. ౯. కవింపురాణ మనుశా సితారమణోరణీ యాంసమనుస్మరేద్యః, సర్వస్యధాతారమచింత్యరూపమా దిత్యవర్ణః తమసః పరస్తాత్. ౧౦. ప్రయాణకాలే మనసాచలేన భక్త్యాయుక్తో యోగబలేనచైవ, భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ సతం పరంపురుష ముపైతిదివ్యం. ౧౧. యదక్షరం వేదవిదో వదంతి విశంతియద్యతయో వీత రాగాః,యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తే పదంసంగ్రహేణప్రవక్ష్యే.

చున్నారో, అట్టి యక్షరమ్మనుపదమును నీకు సంక్షేపముగాఁ జెప్పెదను. కేవలాభ్యాసయోగమునకంటె నంతరంగమై ప్రణవావలంబనమునగు నభ్యాసయోగమును విధింపఁగోరి యీ విషయమును సూచించితిని. ఇఁక దాని నాలకింపుము. (౧౨) పార్థా! ఉపలబ్ధిద్వారము లగు శ్రోత్రాదుల నన్నింటిని సంయమనముచేసి మనస్సును హృదయమున వృత్తిశూన్యముగా నిరోధించి హృదయారవిందమునుండి యూర్ధ్వగతంబగు సుషుమ్నానాడీమార్గమునఁ బ్రాణమును శిరస్సునందునిలిపి యోగధారణము నవలంబింపవలయును. (౧౩) బ్రహ్మనామమైన యేకాక్షరమగు నోంకారమును జపించుచుఁ దదర్థమగు నన్ను సంస్మరించుచు నేమానవుఁడు దేహమును వదలిపోవునో వాఁడు పరమగతినొందును (౧౪) పార్థా! ఎవ్వఁడు విషయాంతరమునందు మనస్సుపోనీయక యావజ్జీవంబును నిరంతరముగా నన్ను స్మరించునో, సర్వదా సమాహితచిత్తుఁడైన యట్టి యోగి నన్నుఁ బొందుట సులభమే యగును. ఎవ్వఁ డీరీతిగా వాయువును నిరోధింపఁజాలకయుండుటం జేసి భ్రూమధ్యభాగమునఁ బ్రాణమును జేర్చి మూర్ధన్యనాడిచే దేహమును స్వేచ్ఛఁగా విడువ సమర్థుడు కాఁడో, కర్మక్షయముచేతఁ బరవశుఁడై దేహమును వదలునో యట్టివానిగతి యేమగునని ప్రశ్నింతువని యూహించియే యీవాక్యమును దెల్పితిని. ఈవిషయ

---

౧౧. సర్వద్వారాణి సంయమ్యమనోహృది నిరుధ్యచ, మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణమ్. ౧౨. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్, యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాం గతిం. ౧౩. అనన్యచేతాస్సతతం యోమాంస్మరతి నిత్యశః, తస్యాహం సుల

మీాపటికే తెల్పియుంటిని. మరలఁ దెల్పుట దార్ఢ్యార్థమని యెఱుంగునది. (౧౫) అర్జునా! మహాత్ములగువారు నన్నుఁ బొంది యుత్తమమగు మోక్ష మనుపేరుగలసిద్ధిని బొందినవారయి దుఃఖముల కునికిపట్టును, అస్థిరము నగు పునర్జన్మము నొందరు. (౧౬) అర్జునా! బ్రహ్మలోకము లోనగుసమస్తలోకముల నొందినవారు పునరావృత్తి నొందుదురు. నన్నుఁ బొందినవారన్ననో పునరావృత్తి నొందరు. (మరల జన్మింపరు). బ్రహ్మలోకమునొందినవారు పునరావృత్తి నొందరను ప్రవాదము సత్యము కాదని తెలుపుటకే యీవిషయ ముపదేశించితిని. (౧౭) పార్థా! ఎందువలన బ్రహ్మలోకాదుల నొందినవారు పునరావృత్తి నొందుదు రందువేమో వినుము. అహోరాత్రసంఖ్యావిదులు బ్రహ్మకు వేయియుగము లొక్కపగలనియు నంతకాలము రాత్రియనియుఁ జెప్పుదురు. (౧౮) అవ్యక్త మనుపేరంబరఁగు బ్రహ్మదేవుని సుషుప్త్యవస్థనుండి పగలు రాఁగా (ఆతఁడు మేలుకొనఁగా) సర్వప్రాణులు అభివ్యక్తను లగుచున్నవి. రాత్రి రాఁగా (బ్రహ్మనిద్రింపఁగా) ఆయవ్యక్తమునందే లయము నొందుచున్నవి. అహోరాత్రముల చేతఁ బక్షమాసాదిసంఖ్యచేఁ బూర్ణమగు

---

భః పార్థ నిత్యయుక్తస్య యోగినః. ౧౪. మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతం, నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః. ౧౫. ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున, మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ నవిద్యతే. ౧౬. సహస్రయుగపర్యంత మహర్యద్బ్రహ్మణోవిదుః, రాత్రింయుగ సహస్రాంతాం తేఽహోరాత్ర విదోజనాః. ౧౭. అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవంత్యహరాగమే, రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రై

సంవత్సరశతము బ్రహ్మదేవునకుఁ బరమాయుస్సు. కాఁబట్టి కాల
పరిచ్ఛిన్నుం డగుటంజేసి నిత్యుఁడు కాఁడు. దానిచేఁ దల్లోక
మునుండి పునరావృత్తిగల్గుట న్యాయమే కదా. తక్కినలోకము
లన్నియు దానికంటె నల్పములు కావున వానిమాటఁ జెప్ప
నేల? (౧౯) పార్థా! స్థావరజంగమరూప మగుభూతగ్రామము
పూర్వకల్పమున (సృష్టియందు) నేదియుండెనో అదియే
యీకల్పమునందును, పగటివేళ రాఁగా నుండును. రాత్రికాల
ము రాఁగా నవశమయి లయము నొందుచుండును. మరలఁబవలు
రాఁగా నవశమై కలుగుచుండును. అనఁగా వేగనశించునదియై
నను సంసారమునకు నివృత్తిలేదు. క్లేశకర్మాదులచేఁ బరవశమై
మాటిమాటికిఁ బ్రాదుర్భవించుటవలనను, గలిగినది మరలఁ
గ్లేశాదికర్మవశమున తిరోహితంబగుటవలనను, నివృత్తిలేకుం
డును. ఇట్టి సంసారమునఁ దిరుగుచున్న ప్రాణులందఱకును,
స్వాతంత్ర్యము లేమింజేసి యవశులైనవారికి జన్మమరణాది
దుఃఖపరంపర కలుగుటవలన నీసంసారము తుచ్ఛమను వైరా
గ్యము జనియించుకొఱకును, సమాననామరూపులై మరల
మరలనావిర్భావమొందుటవలనను గృతనాశము, అకృతాభ్యా
గమదోషము పరిహరించుకొఱకేఁయుపదేశమని యెఱుంగుము.
దీనిచేత సృష్టిప్రళయప్రవాహ మవిచ్ఛిన్నంబని తెలియందగును.
(౨౦) కౌంతేయా! భూతగ్రామబీజమయి, యవిద్యాలక్షణము
గు పూర్వోక్తావ్యక్తమునకంటె భిన్నంబై విలక్షణంబై
యింద్రియములకవిషయంబై సనాతనమగు నక్షరాఖ్య

---

వావ్యక్తసంజ్ఞకే. ౧౯. భూతగ్రామస్స ఏవాయం భూత్వాభూత్వా ప్రలీ
యతే, రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే. ౨౦. పరస్తస్మాత్తు
భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః, యస్సస ర్వేషు భూతేషు నశ్య

మగుభావము పరబ్రహ్మ మేదియుండునో యది బ్రహ్మాది సర్వభూతములు నశించుచున్నను నాశమునొందదు. లోకముల కనిత్యత్వము పరమేశ్వరస్వరూపమునకు నిత్యత్వము ప్రతిపాదింపఁబడెనని దీనిసారము. (౨౧) పాండునందనా! ఏది యవ్యక్తము అక్షరము నని చెప్పఁబడినదో ఆభావమే పరమగతియని శ్రుతులు చెప్పుచున్నవి. దేనింబొంది మఱియు సంసారమునకు మరలిరారో యాభావము నాదగు పరమపదంబగు. (౨౨) పార్థా! ఎవ్వనిలోపల సర్వభూతములు నున్నవో ఎవ్వనిచే నీజగత్తంతయు వ్యాపింపఁబడినదో యాపురుషుఁ డన్నింటికంటె నధికుఁడు. ఆమహాపురుషుఁడాత్మవిషయమగుజ్ఞానముచేతనే పొందఁదగినవాఁడుగాని యుపాయాంతరముచేఁ బొందఁదగనివాఁడగును. అనఁగాఁ దత్ప్రాప్తి కుపాయమే భక్తియోగ మనంబడును. ఈభక్తి యంతరంగోపాయంబని చెప్పఁబడియే యున్నది. (౨౩) భరతర్షభా! ఏతరుణమునందు మృతినొందినవారై యనావృత్తిని, ఏకాలమునమరణమునొందివారై యావృత్తిని, యోగులు, ధ్యానయోగులును, గర్మయోగులును బొందుదురో యాకాలమును జెప్పెదను.ఆలకింపుము.ఏకాలాభిమాని దేవతోపలక్షితమార్గమునందుఁబోయిన యోగులు, నుపాసకులును, గర్మయోగులును యథాక్రమముగా ననావృత్తిని, ఆవృత్తిని బొందుచున్నారో అట్టి కాలా

---

త్సునవినశ్యతి. ౨౦. అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాంగతిం, యంప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ. ౨౧. పురుషస్సపరఃపార్థ భక్త్యాలభ్య స్త్వనన్యయా, యస్యాంతస్థాని భూతాని యేనసర్వమిదంతతం. ౨౨. యత్రకాలే త్వనావృత్తి మావృత్తించైవయోగినః, ప్రయాతాయాంతి

భిమానిదేవతోపలక్షితమార్గమును దెల్పితిని. (౨౪) అగ్ని దేవతయు, జ్యోతిర్దేవతయును, అహర్దేవతయును శుక్లపక్షదేవతయు, నుత్తరాయణదేవతయు నేమార్గమునందుఁ గలరో యామార్గమున మృతిఁబొంది పోయినవారలై బ్రహ్మోపాసకులగుమానవులు వరుసగా బ్రహ్మమును బొందుచున్నారు. ఇదియే యుపాసకులకు దేవమార్గమనునది. ఇదియే యనావృత్తిమార్గమని తలంపుము. (౨౫) ధూమము, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనరూపము లగునాఱునెలలు. వీని నభిమానించినదేవతలమార్గమునందుఁ బోవునట్టి కర్మి చంద్రునిజేరి యాచంద్రలోకమునందుఁ గర్మఫలముల ననుభవించి యది క్షీణింపఁగనే యావృత్తి నొందుచున్నాఁడు. నివృత్తికర్మసహితమగు నుపాసనముచేతఁ గ్రమముక్తియు, కామ్యకర్మములచే స్వర్గభోగానంతరమావృత్తియుఁ గలుగునని యెఱుంగందగును. నిషిద్ధకర్మములచేతనన్న నరకభోగానంతరమావృత్తి, క్షుద్రకర్మముల నొనరించినజంతువులకో యిందే మాటిమాటికిఁ బుట్టుకగల్గునని యెఱుంగుము. (౨౬) శుక్లంబగు నర్చిరాదిమార్గమునను, కృష్ణమగు ధూమాదిమార్గమునను, జ్ఞానకర్మముల నధికృతులగుజీవులకు శాశ్వతములని చెప్పఁబడినవి. అందు నర్చిరాది మార్గమునఁ బునరావృత్తి నొందఁడు. ధూమాదిమార్గమునఁ

---

తంకాలం వక్ష్యామి భరతర్షభ. ౨౩. అగ్నిర్జ్యోతి రహశ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణం, తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదోజనాః. ౨౪. ధూమో రాత్రిస్తథాకృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనం, తత్ర చాంద్రమసంజ్యోతి ర్యోగీ ప్రాప్యనివర్తతే. ౨౫. శుక్లకృష్ణే గతీహ్యేతే జగతశ్శాశ్వతేమతే, ఏకయా యాత్యనావృత్తిమన్యయావర్తతేపునః. ౨౬. నైతే సృతీ పార్థ జానన్

బునరావృత్తి నొందును (౨౭) అర్జునా! ఈరెండుమా ర్గములను జక్కఁగా నెఱింగినయోగి మోహము నొందకుం డును. కావునఁ బునర్జన్మము నొందించునట్టిదగు కేవలకర్మము నవలంబింపఁడు. కావున నీవును సర్వకాలములందును యోగము నభ్యసింపుము. (౨౮) పార్థా! వేదాధ్యయనములయందును, యజ్ఞానుష్ఠానములందును దపశ్చర్యలందును, దానములం దును, నేయేపుణ్యములు కలుగునని విధి విధించుచున్నదో యోగి యీభాగమునందు నేడుప్రశ్నములకు నిర్ణయముమూ లముననేఁ దెలిపినవిషయమంతయు నెఱింగి యనుష్ఠానము నడపునేని ఆపుణ్యమంతయు మించి యుత్తమమగు ఫలమును బొందుచున్నాడు. పరబ్రహ్మమునైఁతము నొందుచున్నాఁడు. కౌంతేయా! ఆత్మప్రకాశము మూలమునఁ దనవిషయమును గ్రహించుచున్నది కావున నధ్యాత్మమనఁగా నింద్రియమని, దానిప్రవృత్తిని గలిగించునది సూర్యాదిక మాధిదైవంబని చెప్పఁబడినది. రూపాదిక మాధిభూతము. సర్వత్రయధిగతమై ధ్యేయమయి వెలయు నాత్మరూప మేదియో దానిచే దాని యంతముననే నభిముఖముగా నున్నాను.

ఇది తారకబ్రహ్మయోగము.

మహామతులారా! ఎనిమిదవదగు తారకబ్రహ్మయోగ మును బఠించితిరి. దీనిసారము చాలభాగము పూర్వాధ్యాయ

---

యోగీముహ్యతికశ్చన, తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున. ౨౭. వేదేషుయజ్ఞేషు తపస్సుచైవ దానేషుయత్పుణ్యఫలం ప్రదిష్టం, అత్యే తితత్సర్వ మిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతిచాద్యమ్. ౨౮.

ఇతి తారకబ్రహ్మయోగః.

ములయందే చెప్పఁబడియెను. కొంచెవిశేషము లిందుఁగలవు. అర్జునుఁడు బ్రహ్మమననేమి? అను మొదలగు ప్రశ్నముల నొనరించెను. ఈప్రశ్నమూలమున నర్జునునిచిత్తవృత్తి యెంతదనుక మార్పునొందెనో భగవంతుఁ డెఱిఁగి సంతోషించెను. యుద్ధము మహాఘోరకార్య మనునూహ నశించి యర్జునకుఁ దనయందుఁ గలకర్తృత్వము వదలుకొనియెను. భగవంతుఁడు సర్వాకారుండని యెఱింగెను. కర్మానుష్ఠానము ముఖ్యమని యెఱింగెను. కర్మఫలమును గోరకుండు టుత్తమమార్గమని తెలిసికొనియెను. అదియే యొకయోగమని నిశ్చయించుకొనియెను. ఆమీఁద శ్రీహరి తెలిపినవిషయములను గ్రహించెను. మనశ్చాంచల్యముపోవుటకు యోగమే ప్రధానమనియు, వేఱొక యుపాయమున నది వదలదనియుఁ దలంచెను. శ్రీహరియు యోగమునుగుఱించియే పలుభంగుల నుపదేశించుచున్నందున నిది ముఖ్యమని నా కుపదేశించుచున్నాఁడని పార్థుఁ డూహింపఁజాలెను. భగవంతునిసేవించుటకు భక్తిమార్గముకూడఁ బ్రధానమని యెన్నుకొనియెను. బ్రహ్మమనఁగా సోపాధికమా యనుశంకను దీర్చుకొనఁగోరి బ్రహ్మమునుగుఱించి ప్రశ్నించెను. భగవంతుఁ డాప్రశ్నములకుఁ దగినయుత్తర మిచ్చెను. అందొకవిశేషము తెల్పెను

మరణకాలమున నెవ్వఁ డేభావముగలిగియుండునో దేహాంతరమున నాభావమునే పొందును. కావున సర్వకాలము నన్నే స్మరించుచుండుము. యుద్ధముచేయుము. మనోబుద్ధుల నాయం దర్పింపుము. నన్నే పొందుదువు ఇందులకు సందేహము లేదు అని. దీనిసారమేమి? ఏమానవుఁడైనను మరణ

కాలమున నేభావముగలిగి దేహమును వదలునో దేహాంతర మున నాభావమునే పొందును. అనఁగాఁ బూర్వకర్మానుసార మాకాలమున నాస్మృతియే కలుగునని, దాని కనుగుణ మగురూపము జన్మాంతరమునఁ గలుగునని, కావున సర్వకాల ములయందు భగవంతునే స్మరింపవలయుననియేకదా దీనిసా రము. మరణకాలమున భగవంతునిస్మృతి కల్గుట సత్కర్మాను ష్ఠానఫలమే యగును. అది లేక యిది కలుగదనుట సిద్ధాంతము. జన్మాంతరమున దుష్టకర్మములఫల మనుభవింపవలసియుండఁగా వానికి మరణకాలమున మంచిభావము పొడకట్టునా. సర్వకాల ములయందును భగవంతుని ధ్యానించునూహ జనించునా. కావున దీనిచేతను గర్మయోగమే ప్రధానమని తేలెడిని. అందులకే యుద్ధముచేయుమా అని శ్రీకృష్ణుడు బోధించెను. సర్వకాలములయందు నన్నే స్మరించుచు సన్న్యాసివికమ్మా యని హారిభావమా. కానేకాదు. నన్ను స్మరింపుమనుటంజేసి నేను గర్తనుకాను. అనుభావ ముదయించునని హారిభావము. కర్మానుష్ఠానము ముఖ్యమనుటను యుద్ధముచేయమని శాసిం చెను. కావున స్వోచితకర్మముల నాచరించువాఁడే కర్మయోగి యనంబడును. కాని ఫలాభిసంధిరహితుఁడు కావలయును. అపుడే భగవత్కారుణ్యం బాత్రుండగును. లేనిచో నచఫలము లం గాంచును. సర్వమునను భగవంతుఁడే గతి యనుభావ ముదయింపదు. ఈవిషయము మఱచిపోవకుండుటకే బ్రహ్మా స్వరూపమును దెలుపుచు నీగొడవలో నీకర్మసిద్ధాంతమును మఱచిపోవుదేమో యని యనుమానించి యుద్ధము చేయుము. నన్నుమాత్రము స్మరించుచుండు మని హితముఁ దెలిపెను.

బ్రహ్మలోకము లోనగుస్థానములంగోరి విశేషకృషి సల్పుట వ్యర్థమని యాకృషిచేఁ బునరావృత్తి కలుగునని తెలుపుట కనుగుణముపద్ధతులం గొన్నింటిని దెలిపెను. ఈభాగమున నెందుఁగాని నాలోకమని యొకఁడు కలదని తెలుపలేదు? ఏల? నాలోకమిదియని తెలిపిన సర్వవ్యాపకత్వము నశింపదా. ఈలోకములు శాశ్వతములుకావు. నాతత్త్వము శాశ్వతము. దాని నొందినవాఁడు పునరావృత్తిం గాంచడనియే హరి బోధించెనని మనము గ్రహింపవలయును. ఆర్యమహాశయులారా! ఈవిషయములనెల్లఁ బరికించినచోఁ గర్మసిద్ధాంత మన్నింటికి మూలాధారమని పొడకట్టెడిని. దానినిమాని యేమార్గము నవలంబించినను నేలవదలి సాముచేసినట్లే యగును. కావున ఫలమునుగోరక కర్మములను జాతికినిర్ణయించినవానిని దప్పక యాచరింపవలయును. వానినివదలి సులభములని యితరమార్గముల నాశ్రయించిన రెండింటికిం జెడుటయేకాని వేఱుగతి కానరాదు. ఇఁకఁ బై విషయమునకుఁ బోవుదము.

## రాజవిద్యారాజగుహ్యయోగము.

(౧) అనిపలికి శ్రీహరి మఱియు నర్జునున కిట్లుపదేశించెను. కుంతీనందనా! మూర్ధన్యనాడీమూలమున ధారణాయోగమును సగుణముగాఁ దెలిపితిని. దానివలనఁ గలుగుఫలమును, అగ్న్యర్చిరాదిక్రమమునఁ గాలాంతరమందు బ్రహ్మప్రాప్తిలక్షణ

---

రాజవిద్యారాజగుహ్యయోగః.

శ్రీభగవానువాచ.—

ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే, జ్ఞానం విజ్ఞానసహితం యత్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. ౧. రాజవిద్యా రాజగుహ్యం

మే యపునరావృత్తిరూపముగ నిర్దేశించితిని ఇపుడు ఇమ్మార్గముచేతనే మోక్షప్రాప్తిఫల మధిగతంబగును. మార్గాంతరమునఁగాదు. అనుశంకను దీర్పఁగోరి నీకీవిషయమును దెల్పఁబూనితిని. నీవీజ్ఞానమునుబొందినఁగాని సంసారబంధమునుండి విముక్తుఁడవుకావో అట్టిగోప్యతమమగు విజ్ఞానము ననుభవయుక్తముగా ననూయవిరహితుఁడవు నీవని యెంచి తెలుపుచున్నాఁడను. ఆమార్గము భక్తిప్రధానము. అసాధారణము. అని గ్రహింపుము. శ్రద్ధమెయి నాలకింపుము. (౨) బ్రహ్మజ్ఞాన మీయది విద్యలకెల్లఁ బ్రభువు. రహస్యములందెల్ల రహస్యము. అనఁగా రహస్యములను నధిపతి. పవిత్రములయందెల్లఁ బవిత్రము. ప్రత్యక్షఫలముగలదియునగు. ధర్మమునకు విరుద్ధముకానిది. సుఖముగా (ఆయాస మించుకంతయులేక) సాధింప శక్యమైనది. నాశములేనిది. కావున దాని నాలకింపుము. (౩) ఓపరంతపా! ఈధర్మమునందు శ్రద్ధలేనినాస్తికులు శరీరపోషణమాత్రమున నాసక్తిగలపూరుషులు నన్నుఁ బొందఁజాలరు. అంతియుగాక మత్ప్రాప్తికి సాధనమగుభక్తినిగూడఁ బడయజాలక మృతియుక్తమగుసంసారమార్గమునందే పడియుందురు. అతిసులభమగు నీయుపాయమున నేల యెల్లరు సంసారవిముక్తులు కారు? అని సంశయింతువేని యిదియే దానికిఁ దగు సమాధానమని యాలోచింపుము.(౪) నారూప మింద్రియముల కగోచరమైనది. అట్టి నారూపముచే జగంబంతయు నావృతంబయియుండును. సర్వభూతములును నామూలమున నాత్మవంత

పవిత్ర మిదముత్తమమ్, ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయం. ౨. అశ్రద్దధానాః పురుషాధర్మస్యాస్యపరంతప, అప్రాప్యమాం నివర్తంతే, మృత్యుసంసార వర్త్మని. ౩. మయాతత మిదం సర్వం జగద వ్యక్తమూర్తినా

ములగును. కాన నాయందే యవి యుండును. నేనుమాత్రము వానియందుండువాఁడనుగాను! (౫) ఆకారణముచేతనే భూతములు నాయం దుండునవి కావు. ఐశ్వరమగునాయాథాత్మ్యము బరికింపుము. అసంగమై భూతములభరించుచు నారూప ముండును. ఐనను భూతములయందున్నట్లు భావింపరాదు. అట్లే భూతములఁ బ్రభవింపఁజేయుచున్నది. అసంగము నారూపమనుటచే వ్యాపకత్వము. ఆశ్రయత్వము, అని మున్నుపదేశించినవిధమునకు విరోధముకదా యని శంకింతువని యూహించియే యసాధారణమగు నఘటితఘటనాచాతుర్యము బరికింపుమంటిని. నాదగుయోగమాయావైభవ మూహింప శక్యముగానిదని తలంపుము. అపుడు విరోధ మున్నయట్లు తోపదు. (౬) ఎల్లతావులఁ దిరుగునట్టి మహాపరిమాణవాయువు సర్వదా యెట్లు నభమునందున్నదో యట్టులాకాశమువలె సర్వగతుఁడనైన నాయందు సర్వభూతములు నన్నునంటకయే యుండునని తెలిసికొనుము. (౭) కౌంతేయా! అట్టిసర్వభూతములును బ్రళయకాలమునందు నాదైన త్రిగుణాత్మకమగు నపరప్రకృతిని బొందును. మరల వానిని ఉత్పత్తికాలము నందు నేను బుట్టించుచున్నాఁడను. (౮) పార్థా! ఈరీతి

---

మత్థ్సాని సర్వభూతాని నచాహం తేష్వవస్థితః. ౪. నచమత్థ్సానిభూతాని పశ్యమే యోగమైశ్వరం, భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః. ౫. యథాకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్, తథా సర్వాణి భూతాని మత్థ్సానీత్యుపధారయ. ౬. సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతిమామికాం,కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహం. ౭. ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః, భూతగ్రామమిమం

నవిద్యాలక్షణమగు నాద్యైనప్రకృతిని వశీకరించి స్వభావవశ
మున నవిద్యాప్రముఖదోషజాలముచేతఁ బరవశమై యీప్ర
కృతినుండి కల్గిన యీభూతసమూహమును సమస్తమును
మాటిమాటికి నుద్భవింపఁజేయుచున్నాఁడను. పరమేశ్వరుని
దగు నీసృష్టి దేనికొఱకు? సర్వసాక్షిభూతచ్చైతన్యమాత్రుఁ
డగు నాపరమాత్మకు భోక్తృత్వము లేమివలన నతనికి భోగా
ర్థముకాదు. లభోక్తృత్వము కలదన్నయెడల సంసారిత్వము
సంభవించుటచే నీశ్వరత్వము వ్యాహతమగును. ఈశ్వరుని
కంటెఁ జేతనాంతరము లేదు. కావున నింకొక్కఁడు భోక్త
కలఁడు. వానికొఱకే యీసృష్టి యన నవకాశమే లేదు. ఈశ్వ
రుఁడే యెల్లతావుల జీవరూపమున నున్నవాఁడు కావునను,
అచేతనమభోక్తయగును గావునను, ఈసృష్టి యీకారణముల
నుబట్టియే మోక్షార్థముగూడఁ గాదు. ఏలయనఁగా బంధము
లేమివలనను, ముక్తివిరోధియగుటవలనను, ఈలోనగు నను
పత్తి సృష్టికి మాయాత్వము సాధించుచున్నదై మాకుఁ బ్రతి
కూలముకాదు. కావునఁ బరిహరింపఁదగినది కాదనుతాత్పర్య
ముచేత మాయామయంబగుటంజేసి ప్రపంచము మిథ్యయని
తెలుపుటకే యీవిషయము నుపదేశించితిని. ఈయుపదేశము
చేత నసంగుఁడవు. నిర్వికారుఁడవు నగు నీవెట్లు సృజింతువన్న
ప్రశ్నము రాఁదగదు. (౯) అట్టులైన విషమమగు భూతగ్రామ
మును సృజించునట్టిపరమేశ్వరునకు నీకుఁ దన్నిమిత్తములగు
ధర్మాధర్మములతో సంబంధము సంభవించునుగదా ' యందు
వేమో. ధనంజయా! సమాధానము వినుము. ఉదాసీనునివలె

---

కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్. ౯. నచ మాంతాని కర్మాణి నిబధ్నంతి

నున్నవాఁడను. ఆకర్మములయందుఁగర్తృత్వాభిమానముగాని ఫలాసక్తిగాని లేనివాఁడను. కావున నన్నాధర్మాధర్మములు బంధింపఁజాలవని యెఱుంగుము. ఒకానొకయుదాసీనుఁడు ఇర్వురు వాదులాడుచుండఁగా జయపరాజయములసంబంధము లేనివాఁడయి వానిమూలమునఁ గలుగు హర్షవిషాదము లొందక నిర్వికారుఁడై యెట్లుండునో యట్లే నిర్వికారుఁడనై యున్నవాఁడ నని యెఱుంగందగును. ఇట్లు చెప్పుటచేత నానావిధములగుకర్మములను జేయుచున్న నీకు జీవునకుంబోలె బంధమేకారణమున లేకపోవునన్న యనుమానము తొలఁగును. (౧౦) భూతగ్రామమును సృజించుచున్నవాఁడ నంటివి. ఉదాసీనునివలె నున్నవాఁడ నంటివి. ఇది విరుద్ధముకాదా. యందువేమో. కౌంతేయా! వినుము. నేను సాక్షిభూతుఁడనై యుండుటంజేసి యవిద్యాలక్షణమగు నాప్రకృతిచరాచరసహితమగు జగత్తును సృజించుచున్నది. నాసాక్షిత్వమను హేతువుచేతనే ప్రపంచము నానావిధములుగాఁ బరివర్తనము నొందుచున్నది. అనఁగా జన్మాదివినాశాంతవికారజాతమును సదా పొందుచున్నదని యర్థము. ఇందువలన భాసకతామాత్రరూపమగు వ్యాపారముచేఁ బుట్టించుచున్నానని పలికితిని. అంతమాత్రముచేతనే ఆదిత్యాదులకుంబోలెఁ గర్తృత్వము లేమివలన నుదాసీనునివలె నున్నానంటిని. ఇందు విరోధ మేలాగువచ్చెను. (౧౧) కౌంతేయా! ఇట్టి నన్ను మానవశరీరధారిని, సర్వభూతములకు

---

ధనంజయ, ఉదాసీనవదాసీన మసక్తం తేషుకర్మసు. ౯. మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం, హేతునానేన కౌన్తేయ జగద్విపరివర్తతే. ౧౦. అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం, పరం

నాత్మయగు నాపరమతత్త్వమెఱుంగనివారలై పరిచ్ఛిన్ననిగా దిరస్కరింతురు. (౧౨) అట్టివారికోరికలును, వారు చేయుకర్మములును నిరర్థకములగును. వారిజ్ఞానముకూడ నిష్ఫలంబగును. వారు వివేకశూన్యులగుదురు. మఱియు మోహజనకంబగు రాక్షసప్రకృతి నాసురప్రకృతిని బొందుదురు. భగవదవజ్ఞాననిందనములచేఁ గలుగుమహాదురితముచేతఁ బ్రతిబద్ధబుద్ధులై నిరంతరనరకవాసము నొందుదురని యెఱుంగుము. (౧౩) ఓ పార్థా! పరిశుద్ధచిత్తులైనవారలే దైవి యనంబడుప్రకృతినొంది నన్ను సర్వభూతకారణముగను, అవినాశినిగను ఎఱింగి యనన్యాసక్తచిత్తులై సేవింతురు. కామాదులచే నభిభూతముకాని చిత్తముగలవారు పరిశుద్ధచిత్తు లనంబడుదురు. (౧౪) సర్వదా నన్నుఁ గీర్తించుచు నింద్రియనిగ్రహము లోనగుధర్మములతోడ యత్నించుచు నన్ను నమస్కరించుచు దృఢవ్రతముగలవారలై నిరంతరము భక్తితో నన్నుపాసించుచున్నారు. ఇదియే మహాత్ములు నన్ను సేవించుప్రకారమని తెలిసికొనుము. (౧౫) బ్రహ్మనిష్ఠులగువారు నన్ను జ్ఞానయజ్ఞమున నుపాసింతురు. అందు నొక్కఁడియ పరబ్రహ్మమని యుత్తము లేకత్వమున నుపాసింతురు. కొందఱు ఆదిత్యాదులరూపమున నేనే

---

భావమజానంతో మమ భూతమహేశ్వరం. ౧౧. మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః, రాక్షసీమాసురీంచైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. ౧౨. మహాత్మానస్తు మాంపార్థ దైవీంప్రకృతిమాశ్రితాః, భజంత్యనన్యమనసో జ్ఞాత్వాభూతాదిమవ్యయం. ౧౩. సతతంకీర్తయంతోమాం యతంతశ్చ దృఢవ్రతాః, నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. ౧౪. జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతోమా ముపాసతే, ఏకత్వేన

యలరువాఁడనని యాయాయిభేదముల నుపాసింతురు. మఱి కొందఱు బహుప్రకారముల నేనున్నయట్లు తలంచి సర్వతో ముఖుఁడనగు నన్ను ననేకప్రకారముల నుపాసింతురు. ఎవ్వ రిట్టి శ్రవణమనననిధిధ్యాసములయం దసమర్థులో వారెల్లరు మూఁడువిధములుగా నుందురు ఉత్తమమధ్యమాధమములని వానిపేరులు. వారందఱును దమ కనురూపముగా నన్నుపా సించుచున్నారని యెఱుంగుము. (౧౬) నిన్నే బహుప్రకార ముల నుపాసింతురందువేమో వినుము. నేనే క్రతువును. యజ్ఞము నేనే. అన్నము నేనే. ఔషధము నేనే. మంత్రము, ఆజ్యము, హోమము నేనే యగుదును. (౧౭) ఈజగంబునకు నేనే తల్లిని. దండ్రిని. కర్మఫలదాతను. పితామహుఁడను. నేనే యెఱుంగఁదగువాఁడను. నేనే పావనపుణ్యకర్మమగుదును. ప్రణవము నేనే. ఋక్సామయజుర్వేదములు నేనే యగుదును. (౧౮) కర్మఫలమనఁగా నేనే. పోషకుండను. ప్రభువను. ప్రాణుల కర్మములకు సాక్షిని. ప్రాణులకు నివాసస్థానంబను. ఆర్తులకు శరణంబను. ప్రత్యుపకారము నపేక్షింపని యుపకారిని. జగ త్తున కుత్పత్తికారణంబను. ప్రళయస్థానంబను. నీతిస్థానంబను. నిక్షేపమ్మను. అవ్యయంబైన యుత్పత్తికారణంబను. ఇన్నియు

---

పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్. ౧౬. అహం క్రతురహం యజ్ఞ స్స్వధాహ మహ మౌషధం, మంత్రోఽహ మహ మేవాజ్యమహ మగ్ని రహంహుతం. ౧౭. పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః, వేద్యం పవిత్ర మోంకార ఋక్సామయజురేవచ. ౧౮. గతిర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్, ప్రభవః ప్రళయస్థానం నిధానం బీజ

నేనే యని యెఱుంగుము. (౧౯) ఓయర్జునా! సూర్యరూపమున నెండ కాయువాఁడను నేనే. వర్షమును గురియించి మరల నేనే యానీరి నాకర్షించుచున్నాఁడను. మరల నేనే వృష్టి నిచ్చుచున్నాఁడను. దేవతలయమృతంబు నేనే. మర్త్యులకు మృత్యువు నేనే కారణసంబంధి యై యభివ్యక్తమగు కార్యమగుసత్తు నేనే. అభివ్యక్తము కాని నామరూపంబగు కారణం బనంబడు నసత్తు నేనే యని తెలిసికొమ్ము కావున సర్వాత్మునిగా నన్నుం దెలిసికొని తమతమ యధికారము ననుసరించి బహుప్రకారముల నన్ను నుపాసించుచున్నారని నిశ్చయించుకొమ్ము. (౨౦) అజ్ఞులును సకాములునై ఋగ్యజుస్సామవేదములఁ బఠించినవారును, సోమపానము చేసినవారును, నిష్పాపులునగు నేవారలగ్నిష్టోమాదియజ్ఞములచే నన్ను నారాధించి స్వర్గమునొంది సుఖింపఁగోరుచున్నారో వార లాపుణ్యఫలమగుస్వర్గమును బొంది యచ్చట నప్రాకృతములగు దేవభోగముల ననుభవించుచున్నారు. ఇట్టివారలకు జన్మమృత్యుప్రవాహము దుర్వారమని యెఱుంగుము. (౨౧) వారు కాంక్షానురూపమగు స్వర్గభోగముల ననుభవించి పుణ్యము క్షీణించినపిదప మర్త్యలోకమును జేరుచున్నారు. ఇవ్విధమునఁ గామకాములై వేదోక్తకర్మములనే యాశ్రయించినవారు రాకపోకలనే (జన్మమరణము

---

మవ్యయం. ౧౮. తపామ్యహ మహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ, అమృతంచైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున. ౧౯. త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే, తే పుణ్యమాసాద్య సురేంద్రలోకమశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్. ౨౦. తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి, ఏవం త్రయీధర్మ

లనే) పొందుచున్నారు. గర్భవాసాదియాతనాప్రవాహము వారలకు నిరంతరంబుగా ననువర్తించును. (౨౨) పార్థా! ఎవ్వారు పృథగ్భావము లేక నన్నే తమ్ముగా భావించి యారాధింతురో నిత్యము భక్తితో నన్నే ధ్యానించునట్టి యట్టివారలకు నేనే యోగక్షేమములను సంపాదించుచున్నాఁడను కనుక నాభక్తులు నాయనుగ్రహమునఁ గృతార్థులగుచున్నారు. (౨౩) కౌంతేయా! ఎట్టివారితరదేవతలను శ్రద్ధాసమన్వితులై యారాధించుచున్నారో వారు నన్నే యారాధించుచున్నారు. కాని నాతత్త్వము తెలియక యారాధించుచున్నారు. ఇట్లు చెప్పుటచేత సత్యము నారయ నాకంటె వ్యతిరిక్తమగు దేవతాంతరము లేకుండుటచేత నింద్రాదుల నారాధించువారు నాభక్తులే కావున వారెట్లు గతాగతములఁ బొందుదు రన్న సందేహము నీకుదయింపకుండఁగలదు. (౨౪) కౌంతేయా! సర్వయజ్ఞఫలభోక్తను బ్రభువు నేనేకదా. అట్లు నేనే యజ్ఞములకు భోక్తను బ్రభువు నగుదునని వారెఱుంగరు. కాఁబట్టి యవిధిపూర్వకముగా యజించుటం జేసి వారికిఁ గర్మఫలము సమగ్రముగా సిద్ధింపఁజాలదు అనఁగా నెవ్వారు తత్తద్దేవతలయందు భగవంతునే సర్వాంతర్యామిని జూచుచు యజింతురో వారు భగవదర్పణముగాఁ గర్మముల నొనరించి తద్విద్యాసహితకర్మవశమున నర్చిరాదిమార్గమున బ్రహ్మలోకమునకుం బోయి యాలోకమున

---

మనుప్రపన్నా గతాగతం కామకామా లభంతే. ౨౨. అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం. ౨౩. యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః, తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకం. ౨౪. అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ, న తు మామభిజానంతి తత్త్వే

సమ్యగ్దర్శనమునొంది తద్భోగావసానమున ముక్తులగుదురని సారము. (౨౩) అన్యదేవతాభక్తులై యేవారలవిధిపూర్వకముగా యజించుచున్నారో వారలకును యజ్ఞఫలం బవశ్యము కలుగును. ఎట్లనఁగా దేవతల నారాధించువా రాదేవతలఁ బొందుదురు పితృదేవతల నర్చించువారు పితృదేవతలఁ బొందుదురు. భూతముల నర్చించువారు భూతములనే యొందుదురు నన్నుఁ బూజించువారు నన్నే పొందుదురు ఇతరదేవతల నారాధించువారలకు ననావృత్తిఫలము లేకపోయినను, తత్తద్దేవతాయాగానురూపమైన యల్పఫలము తప్పక కలుగునని యెఱుంగందగు. (౨౬) నాభక్తులకు నపునరావృత్తిరూపమగు ననంతఫలము కలుగుటకాక యారాధనమున సుఖము కూడ నున్నది. ఎట్లనఁగా పవమానవుఁడు శుద్ధచిత్తుఁడై భక్తితో నాకుఁ బత్త్రపుష్పఫలముల నర్పించుచున్నాఁడో యానరుఁడు భక్తిపూర్వకముగా నర్పించిన యాపత్త్రపుష్పాదులను నేను గ్రహించుచున్నాఁడను. నాయందలిప్రీతిచే సమర్పించినపదార్థము నాకుఁ బరమసమ్మతమని గ్రహింపుము. (౨౭) కౌంతేయా! తనయంతనే ప్రాప్తించినలౌకికకర్మమును దేనిని జేయుచున్నావో ఏభోగమును భుజించుచున్నావో, శాస్త్రవిహితమగు శ్రౌత

---

నాతశ్చ్యవంతి తే. ౨౫. యాంతి దేవవ్రతా న్దేవా న్పితౄన్యాంతి పితృవ్రతాః, భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మాం. ౨౬. పత్త్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి, తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః. ౨౭. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్, యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం. ౨౮. శుభాశుభఫలై రేవం, మోక్ష్యసే కర్మబంధనైః

స్మార్తకర్మ మేది చేయుచున్నావో బ్రాహ్మణాదులకు నేది యిచ్చు చున్నావో, తపస్సును దేనిని జేయుచున్నావో అదియంతయు నాకు సమర్పింపుము. ఇదియే నన్నారాధించుపద్ధతి. పత్రము పుష్పము లోనగుపదార్థములనుగూడ శ్రమంపడి యాగము నకుఁ బశ్వాదులను సేకరించినట్లు సేకరింప నక్కఱలేదు. నీవు చేయుసత్కర్మమునంతయు నాకొఱకుగా నాచరించితినని భావించినం జాలునని తెలిసికొనుము. (౨౭) ఇట్లు సర్వకర్మముల నాకు సమర్పింతువేని యిష్టానిష్టఫలములఁ గలిగించునట్టికర్మములచే విడువఁబడుదువు. ఈరీతిగాఁ గర్మముల నాకు సమర్పించి కర్మముల నాచరించుటయే సన్న్యాసమనంజెల్లు. ఈకర్మసన్న్యాసయోగముతోఁ గూడినచిత్తముకలవాఁడవై జీవించియున్నప్పుడే కర్మబంధములవదలి దేహపాతానంతరము నన్నుఁ బొందఁగలవు. ఇదియే నాభజనమునకు ఫలము. (౨౮) భక్తుల నను గ్రహించుట యభక్తుల ననుగ్రహింపకుండుట యనునీకార్యములచేత రాగద్వేషములు కలవాఁడ వనఁబడుదువుకాని. పరమేశ్వరుఁడ వగుదువని యాశంకింతువేమో వినుము. నేను సర్వభూతములయందును సమత్వము గలిగియున్నవాఁడను. నాకు ద్వేషింపఁదగువాఁడుగాని ప్రేమింపఁదగినవాఁడుగాని యెవ్వఁడును లేఁడు. ఐన నెవ్వరు నన్ను భక్తితో నారాధింతురో వారు స్వభావమువలననే నాయందున్నవారే యగుదురు. వారియందు నేనును స్వభావసిద్ధముగనే యున్నాఁడను. కాని యిందులకు రాగము నిమిత్తము కాదు. దేనితో సంబం

---

సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి. ౨౮. సమోఽహం సర్వభూతేషు న మేద్వేష్యోఽస్తి న ప్రియః, యే భజంతి తు మాం భక్త్యా

ధమునొందునో తదాకారమును గ్రహించును. ఇదియే స్వచ్ఛ ద్రవ్యముతో సంబంధించినవస్తువునకుఁ దగినస్వభావము అస్వచ్ఛద్రవ్యమునం దది ప్రతిఫలించును. అస్వచ్ఛద్రవ్యమునకుఁ గూఁడ నిదియే స్వభావము. ఎట్లనఁగాఁ దనయందు సంబంధించినదానియొక్కయు నాకారమును గ్రహింపదు. అస్వచ్ఛద్రవ్య సంబంధము గలవస్తువునకు నిదియే స్వభావము. దానియందయ్యది ప్రతిఫలింపదని భావము. ఎల్లయెడల వ్యాపించియున్నదైనను సూర్యునిప్రకాశము నిర్మలమగునద్దము మొదలగు వస్తువులయందే యభివ్యక్తమగునో, ఎట్లు మలినమైన ఘటాది వస్తువితతియందు నభివ్యక్తముకాదో, ఏతన్మాత్రమున నాసూర్య ప్రకాశమునకు దర్పణాదులయందుఁ బ్రీతికలదని ఘటాదులయందుఁ బ్రీతిలేనిదని అనఁగా ద్వేషముకలదని చెప్పఁగూడదో, అట్లే సర్వసముఁడనైనను నిర్మలమగుభక్తులచిత్తమునందు నభివ్యక్తి నొందుదును. మలినమగు నభక్తులచిత్తమునందు నభివ్యక్తిని బొందను. అట్టి నేనెవ్వనియందును బ్రీతికలవాఁడనుగాను. ఎవ్వనియందును ద్వేషముకలవాఁడనుగాను. కావునఁ బక్షపాతము నాకులేదని గ్రహింపుము (౩౦) పాండునందనా! దురాచారముగలవాఁడైన ననన్యభక్తిగలిగి నన్నెవ్వఁడు భజించునో వాఁడు సదాచారసంపన్నుఁడే యని యెఱుంగవలయును. ఎందులకందువా? వాఁడు దృఢనిశ్చయముగలవాఁడు. అదియే పరాకాష్ఠ యనంబడును. ఈయుపదేశముచేత నాభక్తి ప్రభావము తెలియ శక్యముకానిదని గ్రహింపుము. ఇట నాచారములనఁగా శాస్త్రనిషిద్ధములగు హింసాదులు కావ

---

మయి తే తేషు చాప్యహం. ౩౦. అపిచేత్సుదురాచారో భజతే మామనన్య

నియు వంశపరంపరాప్రాప్తములగు శిష్టాచారవిరుద్ధములగు నలవాటులే యగుననియు గ్రహింపవలయును. (31) కౌంతే యా! అంతఃకరణమునందు దృఢనిశ్చయముగలవాఁడగుటం బట్టి యట్టివాఁడు శీఘ్రకాలముననే ధర్మాత్ముఁడగును బాహ్య మగుదురాచారమునుండి వదలఁబడును. నాభక్తుఁ డెట్టివాఁడైనను నాశమునొందఁడని దృఢముగాఁ బ్రతినచేయుము. కుతర్క ములు వదలి నాభక్తివలన సద్గురువు నాశ్రయించునని యెఱుం గుము. (32) పాపజన్మముగలవారలు స్త్రీలు వైశ్యశూద్రులు లోనగువారుకూడ నన్నే యాశ్రయించి పరమగతి నొందు చున్నారు. ఆగంతుకదోషమూలమున దుష్టులగువారలకు భగ వద్భక్తిప్రభావమువలనఁ దరణోపాయము మున్ను వివరించి తిని. స్వాభావికదోషములచే దుష్టులైనవారలకుంగూడ నిట్టి తరణోపాయము గలదనియే యీయుపదేశమని నిశ్చయింపు ము. (33) పార్థా! పాపులవిషయ మిట్లుండఁగా నింకఁ బుణ్య జననము గలబ్రాహ్మణులు రాజర్షులును భక్తులై నన్నాశ్రయించి పరమగతిఁ జెందుదురని వేఱచెప్పవలయునా? అందువలన నీవు శాశ్వతముగానిదై సుఖమేలేని పురుషార్థసాధనమగు మనుష్య త్వమునొందుట సఫలంబగువిధమున నన్ను భజింపుము. (34)

---

భాక్, సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః. 30. క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి, కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి. 31. మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాప యోనయః, స్త్రియో వైశ్యాస్తథాశూద్రాస్తేఽపి యాంతి పరాం గతిం. 32. కిం పునర్బ్రాహ్మణాః పుణ్యాః భక్తా రాజర్షయస్తథా, అనిత్యమసుఖంలోక మిమం ప్రాప్య భజస్వ మాం. 33. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం

అర్జునా! నాయందు మనస్సుగలవాఁడవుకమ్ము. నాకు భక్తుఁడవు కమ్ము. నన్నే యారాధింపుము. నాకు నమస్కారము లర్పించు చుండుము. ఇవ్విధమున నన్నే పరమగతిగాఁ దలంచి సమాహితుఁడ వగుదువేని సర్వభూతాత్మభూతుఁడనగు నన్నే పొందఁగలవు. ఇదియే నన్ను భజించుటకుఁ జక్కనిమార్గము.

ఇది రాజవిద్యారాజగుహ్యయోగము.

భక్తిభరితస్వాంతులారా! రాజవిద్యారాజగుహ్యయోగమను నీతొమ్మిదవయధ్యాయమును మననముచేసితిరి. ఇఁక దీనఁగల సారతరార్థమేది? అని యించుకే విచారింపకుండుట బాగుకాదు. ఈయధ్యాయమునకీపేరేల పెట్టఁబడినది? అనఁగా విద్యలకు రాజు. రహస్యములకు రాజు. అనఁగా బ్రహ్మవిద్యాతత్త్వ మిందుఁ గలదు. కావున రహస్యాతిరహస్యము. అని దీని భావము. ఇందు భగవత్సేవాప్రకారము ముఖ్యవిషయము. సులభోపాయముగ భగవంతు నారాధింపవచ్చునని యేలాటి క్లేశము లుండవనియు దీనఁగలసారము. శ్రద్ధలేనిపూరుషు లీయోగము నెఱింగియు నన్నుఁ బొందనేరక మరణస్వభావమగు సంసారమార్గము నాశ్రయించి ముక్తికి దూరులగుదురని శ్రీహరి యుపదేశించెను. ఏవిషయమువిన్నను శ్రద్ధగలిగి వినవలయును. లేకున్న సత్ఫల మది యీయఁజాలదనియేకదా యీవాక్యభావము. శ్రద్ధగలిగి వినిన దాని నాచరింపఁ దలంపుఁ గొనును. అశ్రద్ధ యనునది యాచరణమునకు దూరముగా

---

నమస్కురు, మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. ౩౪.

ఇతి రాజవిద్యారాజగుహ్యయోగో నామ.

వాసీని నిలుపును శ్రద్ధయే యతిపావని యనియు నదికలవాఁడే గౌరవార్హుఁడనియుఁ బెక్కుతావుల శ్రీమహాభాగతమునందుఁ దెల్పఁబడినది. ఏది ధర్మాచరణమున కభిముఖుని గావించునో దానికంటె నుత్కృష్టమగున దేదియుండును?

జగంబునందెల్ల నే నున్నాఁడను. నాయందే జగమున్నది. కాని దానికి నేను లోఁబడినవాఁడను గాను. వాయు వెల్లతావులనుండియు నాకాశమున నున్నది. యట్లే సర్వభూతములు నాయందున్న ట్లెఱుంగుము. అని భగవంతుఁడు పలికెను. అనఁగా నాప్రభావ మతర్క్యమని హరి తెలిపెనని మన మెఱుంగవలయును. మఱియు నసంగుఁడని హరి బోధించె ననియు మనము తలంపవలయును. నాయోగమాయ నాశ్రయించి ప్రాణులఁ బలుసారులు సృజింతును. ఈభూతగ్రామ మంతయుఁ బ్రకృత్యధీనమేకాని స్వతంత్రము గాదు. ఆభూతములు నన్ను బంధింపఁజాలవు. ఆకర్మములయందు నే నుదాసీనుఁడనై యుందును. అని హరి స్పష్టపఱచెను. అనఁగా మూలప్రకృతి నాయిచ్ఛామాత్రమునఁ బ్రపంచమును సృజించునని యు, నే నాకార్యమునఁ బ్రవర్తింపననియు నేభూతములు నన్ను బంధింపఁజాలవనియు నుదాసీనుఁడననఁగా వానిసుఖదుఃఖముల యందు సంబంధముగలవాఁడను గానని యు, సాక్షిమాత్రుఁడ ననియు హరి తెలిపెనని మన మెఱుంగవలయును. దీనిచేతఁ ద్రిమూర్తు లనఁబడు బ్రహ్మావిష్ణుమహేశ్వరులు ముక్తిప్రదులు కారని స్పష్టమయ్యెను. ప్రకృతియే సర్వకార్యముల నొనరించుననియుఁ దక్కఁగలవారెల్లఁ దదవశింవదులనియుఁ దేటపడియెను. త్రిమూర్తులు ప్రకృత్యతీతులుకారనియు నొక్కపర

మేశ్వరుఁడే ప్రకృత్యతీతుఁడనియుఁ దదిచ్ఛామాత్రమే ప్రకృతి యనియు మన మెఱుంగుట తరణోపాయము.

"మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే."

అన్న పదియవశ్లోకమే పై విషయమును సహస్రథా సిద్ధాంతము చేయుచున్నయది.

మూఢులు మనుష్యశరీరమును ధరించిన నన్నెఱుంగక తిరస్కరింతురు. నాతత్త్వము వారికించుకంతయుఁ దెలియదు నన్ను సర్వభూతాధిపతినిగా నెఱుంగరు. ఏలయనఁగా వా రొనరించుకర్మము లట్టివి. రాక్షసీ, ఆసురి యగు వారిప్రకృతి వారి నట్టివారినిగాఁ జేయుచున్నది. మహాత్ములు దైవియగు ప్రకృతి నాశ్రయించి యనన్యమనస్కులై నన్ను భూతజాలము నకుఁ గారణముగా నవ్యయునిగా నెఱింగి యారాధింతురు అనియెనుగదా. అనఁగా వారు చేయుకర్మముల ననుసరించి ప్రకృతి మార్పునొంది పరమపదమునకు దూరులనుగా నొన రించి క్షుద్రఫలప్రదాత లగుదేవతల నారాధించువారినిగా నొనరించుననికదా సారము. దీనింబట్టి కర్మాచరణమే ప్రధాన మనియుఁ గర్మమే దేవతాద్వేషమును భక్తిని బుట్టించుననియుఁ దేలుచున్నదికదా. కర్మము ప్రధానమవి యీయధ్యాయమునం దును జెప్పఁబడినదికదా. గీతాశాస్త్రము కర్మసిద్ధాంతమునే బోధించుననుటకు దృష్టాంత మింకేది కావలయును?

శ్రీహరి తననే నమ్మి పూజింపఁదగుననుటకు సర్వము తానే నని తెలిపెను. కొందఱితరదేవతలను శ్రద్ధగా నుపా సించినను వారును నన్నే యవిధిపూర్వకముగా నారాధించు

చున్నవారు. కాని నేను యజ్ఞఫలభోక్తనని ప్రభుపునని యెఱుం గరు. కావున యాగఫలములను సంపూర్ణముగా నొందఁజాల రని యాదేశించెను. దీనిభావమేమి? సర్వదేవతారూపుఁడను నేనైనను నాతత్త్వము నెఱింగి పూజింపకున్నందున వారి కల్ప కాలఫలములు గలుగుంగాని శాశ్వతసుఖప్రదము లగుఫల ములు కలుగవని సారము. ఎంతయో శ్రమంపడి యజ్ఞములకు వస్తువులు నేకరింపవలయును. నన్నారాధించుట కట్టిప్రయాస మక్కఱలేదు. పత్త్రము పుష్పము ఫలము లోనగునవి యత్యం తసులభముగా దొరకువానిని భక్తిపూర్వకముగా నాకు సమ ర్పించిన వారిచిత్తము పరిశుద్ధముకావున దానిని బరిగ్రహింతు ననియె. మఱియు నర్జునా! నీ వేమిచేయుచున్నావో, ఏమి భుజించుచున్నావో, ఏది హోమముచేయుచున్నావో యాచ కులకు దేని నిచ్చుచున్నావో, ఎట్టితపస్సుచేయుచున్నావో యదియంతయు నాకు నర్పింపుమనియెను. ఏమి దీనియందుఁగల సారము? భక్తిచేత సమర్పించినపదార్థ మెంతమాత్రమైనను జాలుననియుఁ జేయుచున్నకర్మమంతయు శ్రీకృష్ణార్పణమ్మని చేసి నచో నాభావన సద్భావనయగుట నాకర్మము సఫలమ్మగుననియు "భావనామాత్రసంతుష్టహృదయః పరమేశ్వరః" అన్నసూక్తి యేనాఁటికిఁ దప్పదనియు భగవదభిప్రాయమని మనము గ్రహిం పఁదగుసారము. కావున నేదేవత నుపాసించినను, నేకర్మము చేసినను, ఏదానముచేసినను, ఏదేవతాపూజచేసినను భగవదా కృతిని ధ్యానించి తదర్పణబుద్ధితో నొనరించినచో నది నాకుఁ బ్రీతికరమగునని శ్రీకృష్ణమూర్తియే తెలిపెనని మనమెఱుంగు టయేగాక యట్టి లనుష్ఠానముచేయవలయును ప్రతికార్యము

నందును దానిఫలమునుగోరక నుండవలయు. దానికే సన్న్యాస యోగమని పేరు. శిఖాయజ్ఞోపవీతత్యాగము కాదు.

ఎల్లభూతములు నాకు సమానములు. ఒక్కభూతము నందు ద్వేషము. వేఱొకప్రాణియందు మైత్రి నాకు లేదు. నన్నెవ్వ రారాధింతురో వారికి నేఁబ్రియుఁడను. వారు నాకుఁ బ్రియులు. దురాచారముగలవారైనను, ఇతరధ్యానము లేక నన్నే యారాధింతురో వారు సాధువులే ఏలయనఁగా శ్రద్ధావంతులుగదా. యని శ్రీహరి తెల్పెను. దీనినుండి గ్రహింపఁదగినదేది? ఎవ్వ రెవ్వరు సత్కర్మముల నాచరింతురో వారు నాకొక్కటియే. దుష్కర్మములను జేసినవారు నొక్కరూప. కాని మదారాధన తత్పరు లగువారలఁ దరింపఁజేయుదును. ఇతరులు కష్టము లను భవించుచుండఁగాఁ జూచుచుందును. ఇది పక్షపాతము కాదా యనరాదు. మానవప్రయత్నసాధ్యములగు నాచారములు నడపకున్నను నన్నే నమ్మి యారాధించిన ననఁగా నాయందు విశ్వాసము గలిగియుండుటయే పూజ. అంతమాత్రముననే వారలు సాధువులగుదురు. వారిమనస్సున శ్రద్ధయను నమూల్య పదార్థము కలదు దానియందే నాకెక్కుడు మక్కువ. ఈహరి వాక్యమునుబట్టి యాలోచించిన నీన్యాయము తేలెడిని. అవ కాశముండినంతదనుక శక్తి కనురూపముగా నాచారములను జరపుచు జరపలేనివానికై చింతింపక శ్రీపరాత్పరునే నమ్మియుం డినమాత్రమున వాఁడు భక్తుఁ డనంబడును. అవకాశముండి నను దేహమున శక్తి యుండినను ఆచారము లేలయని వదలు వారు సాధువులు కాఁజాలరు. వంచకు లనంబడుదురు దొంగ తనముచేయుచు నందఱు సమానులే. భేదమేమను టెట్టిదో యిదియు నట్టిది. కావునఁ బరమాత్మయందు శ్రద్ధగలిగియుండుటే

సజ్జనలక్షణము. పార్థా! క్షణభంగురము, దుఃఖాలయము అగు నీ మానవలోకమునుబొంది నన్నే సేవింపుము. తరింతువు. అనునుపదేశమున నొకరహస్యము కలదు. ఈలోకమునమనుష్యజన్మముం గాంచుట మిక్కిలి మంచిది. ఈజన్మముననే తరించునవకాశము కలదు. ఇట్టిజన్మము లభించిననుగూడ నాయాజ్ఞ నుల్లంఘించి యవివేకమూలమగుకర్తృత్వము నారోపించుకొనినచో మదాజ్ఞోల్లంఘనమే నీయధఃపతనమునకు హేతువగును. కావున జాగరూకుఁడవై నాయుత్తరువుచొప్పున ఫలాభిసంధిరహితముగా యుద్ధకర్మము నడపుము. నీ వేకర్మముచేసిన నది నాకర్పింపుమనఁగా భావమేమి? నాయాజ్ఞానుసారముచేయునదెల్ల సత్కర్మమేయగు. అది నిన్ను సంసారసాగరమున ముంచివేయఁజాలదు. ఇదియయాయుపదేశరహస్యము. దీనినిజక్కఁగా నెఱింగినమానవుఁడు భగవద్భక్తుఁ డగును. లేనిచో నధోగతియే సిద్ధించును. ఇఁకఁ దరువాతి శ్రీకృష్ణపరబ్రహ్మాయుపదేశించినవిషయమును బరికింతము

## విభూతియోగము.

(౧) అని యిట్లు రాజవిద్యారాజగుహ్యమును బోధించి శ్రీకృష్ణుఁడు మరల నర్జునున కిట్లు పలికెను. తనతత్త్వము దుర్విజ్ఞేయంబగుట నర్జునునిచిత్త మురియాడునేమో యని యెంచి

---

విభూతియోగః.

శ్రీభగవానువాచ.—భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః, యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా. ౧. న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః, అహమాదిర్హి దేవానాం మహ

యే మరల వచించుట. మహాబాహూ! మరల నుత్తమమగు నావాక్యము నాలకింపుము. అది యమృతమువంటిది. సంసారదుఃఖము లుండవు. మహానంద మొనఁగూడును. కావున నీహితము గోరియె తెల్పఁబూనితిని. అవహితుఁడవు కమ్ము. (౨) అర్జునా! దేవతలుగానిమహర్షులుగాని నాప్రభావమును విభూతిరూపమున నాయావిర్భావమును నెఱుంగరు. ఎందులకనఁగా వారికెల్ల నెల్లవిధంబుల నేనే కారణముగా నున్నాఁడను. వారలకు నే నుత్పాదకుఁడ నగుటచేతను బుద్ధ్యాదిప్రవర్తకుఁడ నగుటచేతను నాయనుగ్రహము లేక నన్నెవ్వరు నెఱుంగఁజాలరు. (3) నేను బుట్టుక లేనివాఁడను. అనాదిని. తురీయరూపుఁడై యజ్ఞానము తత్కార్యము లేని మహేశ్వరుఁడని నన్నెవ్వఁ డెఱుంగఁగలునో యతఁడు సమ్మోహవివర్జితుఁడు గావున సమస్తపాపవినిర్ముక్తుఁ డగును. ఇదియే నన్నెఱుంగుటవలనఁ గలుగుఫలమని తెలియుము. (౪-౫) నేను సర్వలోకములకు మహేశ్వరుఁడ నగుట కీచెప్పఁబోవునవియే కారణములు. పార్థా! బుద్ధియు, జ్ఞానము, అసమ్మోహము, క్షమ, సత్త్వము, దమము, శమము సుఖదుఃఖములు, భవము, అభావము, భయాభయములు, అహింసయు, సమత్వము, తుష్టియుఁ, దపోదానములు, యశము, అయశము అను

---

ర్షీణాం చ సర్వశః. ౨. యో మామజమనాదించ వేత్తి లోకమహేశ్వరం, అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. 3. బుద్ధిర్జ్ఞానమసమ్మోహః క్షమాసత్యం దమశ్శమః, సుఖం దుఃఖం భవో భావో భయం చాభయమేవ చ. ౪. అహింసా సమతా తుష్టిస్తపోదానం యశోఽయశః, భవంతి భావా భూతానాం మత్తఏవ పృథగ్విధాః. ౫. మహర్షయస్సప్తపూర్వే చత్వారో

నీభావము లన్నియుఁ బ్రాణులకెల్ల నాయాయికర్మముల కను రూపముగా ననేకప్రకారములుగా నామూలముననే కలుగు చున్నయవి. ఇతరునిమూలమునఁ గలుగునవి కావు. అందువల ననే నాలోక మహేశ్వరత్వము దుర్విజ్ఞేయ మనంబడును. (౬) ఈలోకమునందు నెల్లప్రజలు నెవ్వరిచే సృజింపఁబడిరో పూర్వులగు నట్టిసప్తమహర్షులు నలువురుమనువులును మద్గత భావనగలవారలై నాచేతనే మనస్సుచే సృజింపఁబడి యావిర్భ వించిరి. మహర్షులనఁగా వేదవేదార్థవేత్తలు. సర్వజ్ఞులు. విద్యా సంప్రదాయప్రవర్తకులు నగుభృగువు లోనగువారని యర్థము. మనువులు సావర్ణులనువారు నల్వురు. ఈసృష్టియంతయు వారల సంతతియే యగు. (౭) నా యీవిభూతిని, ఐశ్వర్యమును ఎవ్వాఁడు చక్కఁగా నెఱుంగుచున్నవాఁడో యాతఁడు నిశ్చ లమగుసమ్యగ్దర్శనము నొందుచున్నాఁడు. ఇందులకు సంశ యము లేదు. (౮) నేను బరబ్రహ్మమగుదును. సర్వజగత్కార ణుఁడ నగుదును. నామూలముననే వికారభూతజగత్తు నడచు చున్నది. అని యెఱింగి తత్త్వవేత్తలు పరమార్థతత్త్వమునం దభినివేశముగలవార లగుచు నన్ను నారాధింతురు. ఇట్టివా రలే నన్నెఱుంగఁగలరని యెఱుంగవలయు. (౯) మఱియు వినుము. నాయందే మనస్సునునిచి సర్వేంద్రియములను

---

మనవస్తథా, మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః. ౬. ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః, సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః. ౭. అహం సర్వస్య ప్రభవో మత్తః స్సర్వం ప్రవర్తతే ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః. ౮. మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరం, కథయంతశ్చ మాం నిత్యం

నాయందు నిలిపి మద్గతజీవనము గలిగినవారలగుచు నన్నే పర
స్పరము తెలుపుకొనుచుఁ దమశిష్యులకు నెల్లబోధించుచు నిరం
తరము సంతోషముగలిగి సుఖము నొందుదురు. (౧౦) ఆరీతిగా
నిరంతర మేకాగ్రతగలిగి పరమప్రీతితో నన్నారాధించువారికి
నేను నాతత్త్వ మెఱుంగుటకు సాధనమగుబుద్ధియోగము
నొసంగుదును. (౧౧) పార్థా! అట్టివారి ననుగ్రహించుటకై
నేను వారియంతఃకరణవృత్తియం దున్నవాఁడ నగుచుఁ బ్రకాశ
మానమగు జ్ఞానదీపముచే వారియవివేకజన్యమగు మిథ్యాజ్ఞా
నంబనెడి యంధకారమును నశింపఁజేయుదును. అనగాఁ బుద్ధి
యోగము నిచ్చి దాని ననుభవపర్యంతము గావించి యవిద్యా
కృతంబగుసంసారము నశింపఁజేయుచున్నాఁడనని గ్రహింపుము.

(౧౨-౧౩)అని శ్రీహరి యుపదేశింపఁగా నర్జునుఁ డిట్లు
ప్రశ్నించెను. భగవంతా! నీవే పరబ్రహ్మమవు. పరమతేజో
రూపుఁడవు. పరమపావనుఁడవు. నిన్ను నిత్యుఁడవని, దివ్యుఁడ
వని, ఆదిదేవుఁడవని, అజుఁడవని, సర్వవ్యాపకుఁడవని, మహా
పురుషుఁడవని వసిష్ఠాదిమహర్షులందఱు దేవర్షియగు నారదుఁ
డును, అసితుఁడును, దేవలుఁడును, వ్యాసుఁడును జెప్పు
చున్నారు. నీవును నాకుఁ జెప్పుచున్నావు. (౧౪) కేశవా భగ

---

తుష్యంతి చ రమంతి చ. ౯. తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి
పూర్వకం, దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే. ౧౦. తేషా
మేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః, నాశయామ్యాత్మభావస్థో జ్ఞాన గీ
పేన భాస్వతా. ౧౧. అర్జున ఉవాచ.—పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం
పరమం భవాన్, పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుం. ౧౨.
ఆహుస్త్వామృషయస్సర్వే దేవర్షిర్నారదస్తథా, అసితో దేవలో వ్యాస
స్స్వయం చైవ బ్రవీషి మే. ౧౩. సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి

వంతా! నాకేది నీవుచెప్పుచున్నావో అదియంతయు సత్యమే
యగునని తలంచుచున్నాఁడను. నిరుపాధికమగు నీస్వభావమును
దేవతలు దానవులు నెఱుంగరు. కావున నాకిత్తఱుణమున
నీయైశ్వర్యవిషయమై శంక తొలఁగినది. (౧౪) ఓపురుషోత్తమా!
భూతజాలములఁ బుట్టించుమహాశక్తిమంతుఁడవు. భూతముల
కెల్ల నధిపతివి. దేవదేవుఁడవు. జగద్రక్షకుఁడవు. నీయంతట
నీవే నీస్వరూపము నెఱుంగుదువు. ఇతరులు నిన్నెఱుంగ సమ
ర్థులు కారు. (౧౫) శ్రీకృష్ణా! నీ వేయేవిభూతులచే లోకజాల
మును వ్యాపించియున్నవాఁడవో, అట్టి నీవిభూతు లప్రాకృత
ములు గావున నితరుల కెఱుంగ సాధ్యములు గావు. కాఁబట్టి
నీవే నాకెఱిఁగింపవలయును. (౧౬) యోగతత్త్వము నెఱింగిన
భగవంతుఁడా! నేను నిన్ను నేవిధమున ధ్యానించిన నెఱుంగు
దును? ఏయేవస్తువులయందు నిన్ను ధ్యానింపవలయు? నాకు
నెఱిఁగింపుము. (౧౭) జనార్దనా! నీయోగమును విభూతిని
మఱియు విస్తరించి నాకుఁ దెలియఁజెప్పుము. నీవాక్యామృ
తము నెంత విన్నను నాకు సంతృప్తి కలుగకున్నయది.

(౧౮) అని ప్రశ్నింపఁగా విని భగవంతుఁ డిట్లు బదులు

---

కేశవ, నహి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః. ౧౪. స్వయమే
వాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ, భూతభావన భూతేశ దేవదేవ జగ
త్పతే. ౧౫. వక్తుమర్హస్యశేషేణ దివ్యాహ్యాత్మవిభూతయః, యాభిర్విభూతి
భిర్లోకానిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి. ౧౬. కథం విద్యామహం యోగిన్
త్వాం సదా పరిచింతయన్, కేషు కేషుచ భావేషు చింత్యోఽసి భగవ
న్మయా. ౧౭. విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన, భూయః
కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతం. ౧౮. శ్రీభగవానువాచ.—

చెప్పెను. కురుశ్రేష్ఠా! దివ్యములగు నావిభూతులను ముఖ్యములయినవాని నిప్పుడే నీకుఁ దెల్పెదను. నావిభూతులకుఁ బారము లేదు. కాఁబట్టి సాకల్యముగా వచింప శక్యము కాదు. కొన్నింటిని మాత్రమే తెల్పెదను. (౨౦) నిద్రను జయించిన యోయర్జునుఁడా! సర్వభూతములహృదయమున నున్న ప్రత్యగాత్మను నేనేయని ధ్యానింపఁదగును. అట్లుధ్యానించుటకశక్తుఁడైనచో నీకుఁ జెప్పఁబోవుభావంబుల నన్ను ధ్యానింపవచ్చును. సర్వభూతములకు నాదియు మధ్యము నంతము నేనేకదా. (౨౧) ద్వాదశాదిత్యులలో విష్ణువనుపేరుగల యాదిత్యుఁడను నేను. ప్రకాశించువస్తువులలో సహస్రకరుండగు సూర్యుఁడను నేను. మరుత్తులను దేవతాభేదములలో మరీచి యనుమరుత్తు నేను. నక్షత్రములలోఁ జంద్రుఁడు నేను. ప్రత్యగాత్మధ్యానము చేయఁజాలనివా రిట్లు బాహ్యధ్యానములను జేయవలయును. (౨౨) వేదములలో సామవేదము నేను. దేవతలలో నింద్రుఁడు నేను. ఇంద్రియములలో మనస్సు నేను. భూతములలోఁ జైతన్యము నేను. (౨౩) ఏకాదశరుద్రులలో శంకరుఁడు నేను. యక్షరాక్షసులలోఁ గుబేరుఁడను నేను. అష్టవసువులలో నగ్ని నేను.

---

హంత తే కథయిష్యామి దివ్యాహ్యాత్మవిభూతయః, ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే. ౧౯. అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః, అహమాదిశ్చ మధ్యం చ భూతానామంతఏవ చ. ౨౦. ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్, మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ. ౨౧. వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః, ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా. ౨౨. రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసాం, వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరి

పర్వతములలో మేరుపర్వతము నేను. (౨౪) పార్థా! పురోహితులలో ముఖ్యుఁడైన బృహస్పతి నేనే నని యెఱుఁగుము. సేనాపతులలో దేవసేనాపతియగు కుమారస్వామి నేను. సరస్సులలో సముద్రుఁడు నేను. (౨౫) మహర్షులలో భృగుమహర్షి నేను. అర్థవంతములగు వాక్కులలో నోంకారము నేను. యజ్ఞములలో జపయజ్ఞము నేను. స్థావరములలో హిమాలయపర్వతము నేను. (౨౬-౨౭) సమస్తవృక్షములలో నశ్వత్థము నేను. దేవర్షులలో నారదుఁడు నేను. గంధర్వులలోఁ జిత్రరథుఁడు నేను. సిద్ధులలోఁ గపిలమహాముని నేను. అశ్వములలో నమృతమథనసమయమునందుఁ బుట్టిన యుచ్చైశ్శ్రవము నేను. గజేంద్రములలో నైరావతము నేను. మనుష్యులలో రాజు నేనని తలంపుము. (౨౮-౨౯) ఆయుధములలో వజ్రాయుధము నేను. ధేనువులలోఁ గామధేనువు నేను. ప్రజలఁ బుట్టించుమన్మథుఁడు నేను. సర్పములలో వాసుకి నేను. నాగములలో నాదిశేషువు నేను. జలదేవతలలో వరుణుఁడు నేను. పితృదేవతలలో నర్యముఁడు నేను. నిగ్రహముచేయువారిలో

---

ణామహం. ౨౪. పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిం, సేనానీనామహం స్కందస్సరసామస్మి సాగరః. ౨౫. మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరం, యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః. ౨౬. అశ్వత్థస్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః, గంధర్వాణాం చిత్రరథస్సిద్ధానాం కపిలోమునిః. ౨౭. ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్, ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపం. ౨౮. ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్, ప్రజనశ్చాస్మి కందర్పస్సర్పాణామస్మి వాసుకిః. ౨౯. అనంతశ్చాస్మి నాగానాం వరుణో

యముఁడు నేను. (౩౦-౩౧) దైత్యులలోఁ బ్రహ్లాదుఁడు నేను. గణియించు వారిలోఁ గాలము నేను. మృగములలో సింహము నేను. పక్షులలో గరుత్మంతుఁడను నేను. పవిత్రము చేయు వానిలో వాయువు నేను. ఆయుధధారులలో దశరథపుత్త్రుఁడగు రాముఁడు నేను మత్స్యములలో మకరము నేను. నదులలో గంగానది నేను. (౩౨) ఓయర్జునా! సృష్టులవగు నుత్పత్తిస్థితిలయములు నేను. విద్యలలో నధ్యాత్మవిద్య నేను. వాదించువారుచేయు నానాప్రసంగములలో వాదము నేను. (౩౩-౩౪) అక్షరములలో నకారము నేను. సమాసములలో ద్వంద్వసమాసము నేను. అక్షయకాలము నేను. సర్వతోముఖుఁడై కర్మఫలము నిచ్చువాఁడను నేను. సర్వమును హరించుమృత్యుదేవతను నేను. కలుగఁబోవుకళ్యాణములలో నుత్కృష్టకల్యాణము నేను. స్త్రీలలోఁ గీర్తియు లక్ష్మియు సరస్వతియు స్మృతియు మేధయు ధృతియు క్షమయు నేను. (౩౫) సామములలో బృహత్సామము నేను. ఛందోవిశిష్టఋక్కులలో గాయత్రియనుఋక్కు నేను. మాసములలో మార్గశీర్షమా

---

యాదసామహం, పితౄణామర్యమా చాస్మి యమస్సంయమతామహమ్. ౨౯. ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహం, మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చపక్షిణాం. ౩౦. పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహం, ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ. ౩౧. సర్గాణామాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున, అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహం. ౩౨. అక్షరాణామకారోఽస్మి ద్వంద్వస్సామాసికస్య చ, అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః. ౩౩. మృత్యుస్సర్వహరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతాం, కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా. ౩౪. బృహత్సామ తథా సామ్నాం

సము నేను. ఋతువులలో వసంతర్తువు నేను. (౩౬) పరుల వంచించువారిజూదము నేను. తేజస్వులలోఁ దేజస్సు నేను. జయించువారిజయము నేను. యత్నవంతులయత్నము నేను. సాత్త్వికులసత్త్వము నేను. (౩౭-౩౮) వృష్ణివంశసంభూతులలో వాసుదేవుఁడను నేను. పాండవులలో నర్జునుఁడవగు నీవు నేను. మునులలో వ్యాసుఁడు నేను. కవులలో శుక్రుఁడు నేను. ఉత్పథగాములను నిగ్రహించువారుచేయునిగ్రహము నేను. జయింపఁ గోరువారు చేయుజయోపాయమగునీతి నేను. రహస్యములలో మౌనము నేను. జ్ఞానవంతులజ్ఞానము నేను. (౩౯) ఓయర్జునా! సకలభూతములకును బ్రరోహకారణ మేదికలదో అది నేను. చరస్థిరములలో నేదియును నన్ను వదలియుండునది లేదు. (౪౦) పరంతపా! నాదివ్యవిభూతుల కంతము లేదు. నాయనంతవిభూతులలో నేకదేశభూతమగు విభూతివిస్తరముమాత్రమే నీకిప్పు డుపదేశించితిని. (౪౧) లోకమున నేయేవస్తువైశ్వర్యవంతమైకాని శ్రీమంతమై బలాద్యతిశయము కలదియై కాని

---

గాయత్రీ ఛందసామహం, మాసానాం మార్గశీర్షోఽహమృతూనాం కుసుమాకరః. ౩౫. ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహం, జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహం. ౩౬. వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః, మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః. ౩౭. దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతాం, మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహం. ౩౮. యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున, న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరం. ౩౯. నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప, ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా. ౪౦. యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూ

యుండునో ఆయావస్తువు నాతేజస్సునంశమునఁ బుట్టినదాని నిగా నెఱుంగుము. (౪౨) అర్జునా! ఇపుడు నేనెఱిఁగించిన నిశ్శేషముకాని యీవిభూతివిస్తారము నెఱుంగుటంజేసి నీకేమి లాభము? నిశ్శేషముగా నెఱుంగుపద్ధతి యేదనఁగా నీసర్వ ప్రపంచమును నేనొక యంశమున ధరించియున్నాఁడను.

ఇది విభూతియోగను.

దీర్ఘదర్శనులారా! గీతాశాస్త్రమున విభూతియోగ మనంబడు పదియవయధ్యాయమును దిలకించితిరి. ఇందేమివిశేషము కలదు? అనియే తోఁచును. కాని యించుక పరిశీలించిన నెన్నియోవిశేషము లిందుఁ గానంబడియెడిని. వానియందు నొకటిరెండువిషయములం బరిశీలింతము. భగవదనుగ్రహము వలనఁ దోఁచినవానిని స్మరింతము.-ఈవిషయముచెప్పుటేల యని యూహింతువేమో నాప్రభావమును దేవతలు మహర్షులు తెలియఁజాలరు. కావున నేనే చెప్పవలసివచ్చినదని శ్రీహరి తెల్పెను. అనఁగా మాయానిబద్ధులు మాయాతీతునిమహత్త్వ మింతయని ఇట్టిదని తెలియఁజాలరనియేకదా భావము? ఆదేవతలకు నామహర్షులకుఁ గారణము నేనేకదా. కార్యము కారణ సర్వస్వము నూహింపఁజాలదు. అట్లే నేనాదిగాఁగలదేవతలు,

ర్జితమేవవా, తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్. ౪౧. అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున, విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్. ౪౨.

ఇతి విభూతియోగోఽధ్యాయః.

ఋషులు నామహత్త్వ మిట్టిదనిమాత్రము నిశ్చయముగా నెఱుంగఁజాలరు. లేశము నెఱింగిన నెఱుంగుదురేమో. కను కనే తెలుపఁబూనితిని అనఁగా లోకమునఁ బ్రకృతిబద్ధులగు పామరులు భగవత్తత్త్వ మిదియని తెలుపఁబూను టసంగత మని సారము. తమ రెఱుంగనిదానిని బోధించు టుచితము కాదుకదా.

ఎవ్వఁడు నన్నుఁ బుట్టుకలేనివానినిగా ననాదిగా సర్వ లోకేశ్వరునిగాఁ దెలిసికొనునో మూర్ఖుఁడుకాని యతఁడు మానవులలోఁ బాపవిముక్తుఁడని తలంపఁజను. అని హరిపల్కెను. భగవత్తత్త్వ మెఱుంగుటకంటెఁ బుణ్యకార్యము లేదనియు సకలపుణ్యములు దానికే తోడ్పాటు గావించుననియు మన మెఱుంగఁదగును. సకలపుణ్యము లాచరించినఁగాని మనస్సు పావనతఁగాంచదు. అది లభించినఁగాని భగవత్తత్త్వ మెఱుక పడదు. ఇఁక వానికిఁ బాపము లెక్కడివి? ఇం దతిశయోక్తి యేమికలదు? బుద్ధియు జ్ఞానము లోనగునవి యిరువదో క్కఁడుభావములు భూతములకు నావలననే వేఱువేఱుపద్ధతు లుగా స్వస్వకర్మానుసారము కలుగుచుండునని శ్రీహరి తెలిపెను. ఇందలిసార మేమనఁగా ప్రాణులు కర్మానుసారము వీనిఁబొందు దురనియు నందు సంపూర్ణముగాఁ గర్మము నాచరించినవారు ఫలమును సంపూర్ణముగా నొందుదురనియు నది రవంతయైన వానిలో నించుకమాత్రమే కలుగుననియు సారమనక తప్పదు. దీనిచేతను గర్మయోగమే ప్రధానమని తేలెడిని. కర్మమూల మునవే యివ్వి కల్గును. కాని యాకర్మము భగవత్స్వరూపమే. కా వుననే నావలననే కలుగునని కృష్ణమూర్తి తెల్పెను.

ఈవిభూతియోగమును సాకల్యముగా నెవ్వఁడెఱుంగునో వాఁడు నన్ను సాక్షాత్తుగాఁ గాంచఁగలఁడు. సంశయమొందఁ బనిలేదు. అని హరివాక్యము కన్పట్టెడిని. ఈయోగమున సర్వత్రవసించు నన్నెఱింగిన ముక్తుఁ డగునన్నదియే ప్రధానము. సర్వవస్తువులయందు నేకరూపమున భగవంతుం గాంచుట యేమి సామాన్యమా? ఆభాగ్యముకలిగిన భగవత్కారుణకుఁ బాత్రుఁడుకాఁడా. దాన ముక్తి చేకూరదా. ఇందుల కేమిసందియము. అనఁగా సర్వత్ర భగవంతునిగాంచుట యనునదియే ముక్తిసాధనమని యత్యుత్తమతపఃఫలమని తేలెడిని. ఇది కుదురుటెట్లనునదియే యిచ్చట సంశయము. కుదిరినచో ముక్తి దొరకును. దానికి యోగమే ప్రధానము. ఆయోగము లభించునదృష్టము కలుగుట సత్కార్యాధీనము. ఇన్నింటికి మూలాధారము కర్మమని సిద్ధాంతము. అట్టిభాగ్యము కలుగు తఱి జ్ఞానదీపము వెలుంగునఁట. అప్పుడే యజ్ఞానజంబగు తమస్సుతొలంగునఁట. ఇదేమి సామాన్యకర్మమున నెఱవేఱునా? ఎన్నిజన్మములకైనను సత్కర్మముల నాచరింపక కలుగునట్టి భాగ్యము కాదు. దీనిచేఁ గర్మమున కెంతప్రధానత్వము చెప్పఁబడినదో మన మూహింపవచ్చును. అది మానినచో నేలవదలి సాముచేసినట్లుకదా.

ఈయుపదేశమును వినఁగా నర్జునునకు సంశయ ముదయించి ప్రశ్నింపసాగెను. శ్రీకృష్ణా! నిన్నునీవే యెఱుంగుదువు. ఇతరు లెఱుంగఁజాలరు. సర్వత్ర నిన్నుఁ గనుఁగొనవలయు నంటివి. నీవిభూతు లెట్టివి? వానిచేఁగదా నీవు జగములనెల్ల వ్యాపించియున్నవాఁడవు? ఇదివఱకు వచించినది చాలదా యనక విస్తరించి తెలుపుము. తృప్తిలేకున్నయది.

ఇదియే యర్జునునిప్రశ్నము. ఇప్పటి కర్జునునకు శ్రీకృష్ణుఁడు సర్వవ్యాపకుఁడని తెలిసినది. అట్టి నిన్నుఁ గనుఁగొను టెట్లు? అనుసంశయ మంకురించినది అట్టితఱి శ్రీహరి మనశిష్యుఁడు దారికి వచ్చుచున్నాఁడు. మనస్సునఁగలశంకలు తొలఁగించి నిలుకడఁగాంచఁజేయవలయునని తలంచి తనవిభూతులను దెల్పెను. ఏవిషయమున నేది ప్రధానమో తెలిపెను. కొన్ని తెలిపి యర్జునా! నావిభూతు లిన్నియని యెట్లు తెలుప శక్య మగును? పాండవులలో నర్జునుఁడనువేరుగల నీవు నేనే యగు దును సర్వభూతములలోఁ దేజోవంతములగునవియెల్ల నాస్వ రూపములే. బీజరూపమున నన్నింటియందుందును. అని తెలి పెను. తేజోహీనమైనది నాస్వరూపముకాదా యనునూహ పనికిరాదు. అని హరిభావమే కావలెను. సత్కర్మముల నాచ రింపక యాచరించిన మేలని యూహించినవారికిఁ దేజస్సు ఉండి లేనట్లుండును. ఆచరించినకొలఁది నది హెచ్చుచుండును. తేజస్సే యాతనిసత్కర్మములఁ జాటుచుండును. తేజోవిహీనుఁ డసత్కర్మముల నాచరించువాఁడుకదా. అట్టివానియందును భగవదంశము లేదని భావముకాదు. అది ప్రకాశింపదు. మలిన దర్పణమువలె నుండును.

అని యిట్లు శ్రీకృష్ణమూర్తి ప్రపంచమున నేదియేది ప్రకాశవంతమో యదెల్ల నాస్వరూపమని తెలిపెను. మాన వులయం దధికప్రకాశము బ్రాహ్మణులయందుఁ గలదని ప్రవా దము కలదు. ఈవిషయము రాజవిద్యారాజయోగమునందుఁ జెప్పఁబడినది.

"మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాంగతిం.

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా,
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్." 33
అనుశ్లోకములయందుఁ గనఁబడియెడిని. నన్నాశ్రయించిన పాప
జన్మముగల స్త్రీవైశ్యశూద్రులు పరమగతినొందుదురుకదా.
ఇంక బ్రాహ్మణులును భక్తులగు రాజర్షులును బరమగతినొందుదు
రని చెప్పవలసినదేమి? అనఁగా భావమేమి? స్త్రీవైశ్యశూద్రులు
లోనగువారే తరింతురఁట. ఇఁక బ్రాహ్మణులేద్యైన నడుగవలెనా
యనికదా హరిభావము. బ్రాహ్మణులయందు భగవదంశ మధిక
ముగా నుండునని యేకదా. కొందఱు జాతులు కల్పితము లే
కదా యుండును. వర్ణములు నాలుగున్నయట్లు గీతాశాస్త్రమునఁ
బెక్కుతావులఁ గలదు. అన్నితావులను భగవంతుఁడే తెలిపి
నట్లున్నది. అభివ్యక్తమను ప్రపంచము కాఁగాఁ గర్మనిరతిఁ గాం
చినదాదిగా అనఁగా మానవసృష్టిమొదలుకొని జాతులను భగ
వంతుఁడే గుణకర్మములనుబట్టి నిర్ణయించినట్లు తేటపఱచెను.
గుణకర్మములనుబట్టి యేర్పడునని కాదు ఏర్పఱచితిననియే గీతా
వాక్యము. ప్రతిదినము మార్పు నొందుచుండుననియుఁగాదు.
అది కేవలము కల్పితము కాన దానియం దాస్తికులు విశ్వాస
మునుపరాదు. బ్రాహ్మణబ్రువు లుండుటంబట్టి కలికాలమగుట
నట్టికల్పనము చేయఁబడుచున్నదని యెన్నవలయుంగాని వేఱు
గాదు.

ఇట్టు లీయధ్యాయమున శ్రీహరి యర్జునునకుం గల
భక్తిని దృఢపఱుప నెంచి విభూతియోగమును దెలిపెను.
వానిని గ్రమంబునఁ బూజింపుమని హెచ్చరించెను. అర్జునుఁడ
వగు నీవు నేనే యనుటచే నాయపరస్వరూపమవగు నీవు నా
యాజ్ఞ నెఱవేర్పఁ దగుదువని కాదా. అనఁగా లేనిపోని సంద

యములనుంచుకొనక యుద్ధము చేయుమని మరలమరలఁ గర్మసిద్ధాంతమును స్మృతికిం దెచ్చుచుండును. ఏలయనఁగా నాతనిమూలమున నేకార్యము చేయింపఁదలంచెనో యాకార్యము కర్మసిద్ధాంతమునకులోఁబడినదే కాన నావిషయమున నతనిమనస్సురియాడకయుండ బోధించుననియు, భగవదారాధనముపద్ధతులలో నీయధ్యాయమునఁ దెలిపినపద్ధతి యుత్తమమనియు మన మూహించి యారీతిగా భగవంతుని సర్వవస్తువులయందుఁ జూడఁదగినజ్ఞానముగలవారమగుటకు నేర్చుకొనవలయును. దానికి యోగము ప్రధానము కావున యోగాభ్యాసమునకై ప్రయత్నించుట భక్తులలక్షణము రిత్తమాటలవలన లాభము లేదనియు నవిలోకమునువంచించువారివేయగుననియు మన మెఱుంగవలయు. ఇఁకఁ దరువాతి భగవదుక్తిని బఠింతము.

విశ్వరూపసందర్శనయోగము.

(౧) శ్రీకృష్ణపరబ్రహ్మ మీరీతిగా విభూతియోగ ముపదేశింపఁగా నర్జునుఁడు వినయముతోఁ నిట్లు ప్రశ్నించెను. భగవంతా! నన్ననుగ్రహించుటకై పరమపావనము, రహస్యంబు, నాత్మవిషయము నగునేవాక్య ముపదేశించితివో యావాక్యముచేత నాయవివేకము నశించెను. ఆత్మ కర్తృత్వాదులు లేనివాఁడని యెఱింగితిని. (౨) కమలాక్షా! భూతములయుత్పత్తినాశములను నీమూలమున విస్తరించి విన్నాఁడను మఱియు నక్ష

విశ్వరూపసందర్శనయోగః.

అర్జున ఉవాచ.—మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితం, యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ. ౧. భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా, త్వత్తః కమలపత్త్రాక్ష మాహాత్మ్య

యంబగు నీమాహాత్మ్యంబునుగూడ విననోచితిని. నీవు సృష్ట్యాదికర్తవైనను సర్వనియంతవైనను శుభాశుభకర్మములను జేయించువాఁడవైనను, బంధము మోక్షము లోనగువిచిత్రఫలములనొసంగువాఁడవైనను, నిర్వికారత్వము, వైషమ్యరాహిత్యము, నసంగము, నౌదాసీన్యము ననునీమాహాత్మ్యముగూడ వినఁబడినది. అక్కారణమువలన జీవులెల్ల నీకుఁ బరతంత్రులగుటంబట్టి గూడ "నేనే కర్తను" అనుమొదలగు నామోహము నశించినది. (౩) ఓపరమేశ్వరా! నీస్వరూపమును నీవెట్లు వచించితివో అది యట్టిదేకాని వేఱుకాదు. ఐనను నీపారమేశ్వరస్వరూపమును జూడఁ గాంక్షించెదను. మాటయందు విశ్వాసము లేదాయని యూహింపకుము. చూడవలయు ననునిచ్ఛ యతిశయముగా నున్నది. ఈవిషయము సర్వజ్ఞుండవు, సర్వాంతర్యామివియు నగుటవలన నీవే యెఱుంగుదువు. అయినను నాకాంక్ష యతిశయముగా నున్నందున విన్నవించితిని. (౪) ఓప్రభూ! యోగేశ్వరా! ఆరూపము నాకుఁ జూడ శక్యమైనదని నీవు తలంతువేని, నేను మిక్కిలి యాశపడుటవలన నవ్యయమగు నీరూపము నాకుఁ గనఁబఱచి కృతకృత్యుని జేయుము. చూడరాని నారూపము నేల చూడఁగోరుచున్నావని ప్రశ్నింపకుము. బదులు చెప్పఁజాలను.

(౫) అని ప్రార్థింపఁగా భగవంతుఁ డిట్లుపలికెను. పార్థా!

---

మపి చావ్యయం. ౨. ఏవమేతద్యథాత్థ త్వమాత్మానం పరమేశ్వర, ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ. ౩. మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో, యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మానమవ్యయం. ౪. శ్రీభగవానువాచ.—పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ

నారూపము లసంఖ్యాకములు, అనేకవిధములు, అప్రాకృతములు, నానావర్ణములు, నానావిధాకృతులు. కావున నట్టి నా రూపములం జూడుము. (౬) ఓభారతా! ద్వాదశాదిత్యుల, నష్టవసువులను, ఏకాదశరుద్రులను, నిరువురశ్విదేవతలను, నలువదితొమ్మండ్రుగురను మరుత్తులను బరికింపుము. ఇంతియగాక యీవరకు కెన్నఁడు నెవ్వరును జూడనియాశ్చర్యములు పెక్కులుగలవు. వానినెల్లం గనుంగొనుము. (౭) నిద్రను జయించిన యోకౌంతేయా! నా యీదేహమునందు నొక్కచోటనే యుండుస్థావరజంగమాన్వితసమస్తజగత్తు నిప్పుడే చూడుము. వెండియు మనమే జయింతుమో వారే మనల జయింతురో యని యనుమానించితివికదా. దానిం గుఱించఁ గనఁగోరుదువేని నా యీదేహమునందే చూడుము. దాన నీకుఁ గలసందేహములు తొలఁగును. (౮) పార్థా! ఒక్కమాట ముందు వినుము. నారూపమును జూపఁదలఁచితినిగాని ప్రాకృతమగు నీదృష్టిచేత నన్నుఁ జూడ శక్యముకాదు. కావున మిగుల నాశపడియున్నాఁడవు. కావున నీకు దివ్యదృష్టి నిచ్చెదను. దానిచేత నీశ్వరుఁడనగు నాయోగమహిమమును జూడుము. (౯) అని పలికి హరి చేసినకార్యమును జెప్పఁదలంచి సంజయుఁడు ధృతరాష్ట్రున కిట్ల

సహస్రశః, నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచ. ౬. పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుతస్తథా, బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత. ౭. ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరం, మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి. ౮. న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా, దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరం. ౯. సంజయ ఉవాచ.—ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగే

నిరి. రాజా! ఈవిధముగా మాటలాడి దివ్యదృష్టి నిచ్చినతరు
వాత మహాయోగీశ్వరుఁడగు శ్రీకృష్ణమూర్తి పార్థునకుఁ బరమ
పావనమగు తనవిశ్వరూపమును గనఁబఱచెను. (౧౦,౧౧) సం
ఖ్యకు మించినముఖములు కన్నులును గలదియును, లెక్కకు
మీఱిన యాశ్చర్యదర్శనముల కునికిపట్టైనదియు, లెక్కింపఁ
దరముగాని దివ్యాభరణములుగలదియు, ననేకాయుధములను
ధరించినదియు నగురూపమును భగవంతుఁ డర్జునునకుం జూ
పెను. దివ్యకుసుమములను వస్త్రములను దాల్చినవాఁడును,
దివ్యగంధమును బూసికొనియున్నవాఁడును, సర్వాశ్చర్యమ
యుండు ననంతుఁడును, సర్వతోముఖుఁడు నగునీశ్వరుని బాండు
నందనుఁడు కనుఁగొనియెను. (౧౨) నభోభాగమునం దొక్క
మాఱు సహస్రసూర్యులప్రకాశము వెలసినచో నయ్యది యా
మహాత్మునిదగు నప్పటితేజస్సునకు సమానము కావచ్చునేమో
యని యూహింపఁదగినదై యుండెను. (౧౩) పాండవుఁ డాసమ
యమునందుఁ బరమమగు నాదేవదేవుని విశ్వరూపమునందు
నానావిధములగు భేదములఁగూడిన సర్వప్రపంచము నొక్కచోఁ
జూచెను. (౧౪) ధనంజయుం డంత నావిశ్వరూపమును గాంచి

---

శ్వరో హరిః, దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరం. ౯. అనేక
వక్త్రనయన మనేకాద్భుతదర్శనం, అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతా
యుధం. ౧౦. దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనం, సర్వాశ్చర్య
మయం దేవమనంతం విశ్వతోముఖం. ౧౧. దివి సూర్యసహస్రస్య భవే
ద్యుగపదుత్థితా, యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః. ౧౨.
తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా, అపశ్యద్దేవదేవస్య శరీరే.
పాండవస్తదా. ౧౩. తతస్సవిస్మయావిష్టో హృష్టరోమాధనంజయః, ప్రణమ్య
శిరసా దేవం కృతాంజలిరభాషత. ౧౪. అర్జునఉవాచ.—పశ్యామి దేవాం

యచ్చెరువొంది రోమాంచితశరీరుఁడై యమ్మహాత్మునకు మ్రొక్కి కరములు జోడించి శిరస్సువంచి యిట్లు వినయమునఁ బలికెను. (౧౫) దేవా! నీ యీశరీరమునందు సర్వవిబుధులను భూత సమూహములను భూమధ్యంబున మేరుకర్ణికాసీనుఁడగు ప్రజా పతి యనఁబడు బ్రహ్మదేవుని దివ్యులగుమహర్షులను భుజగులను గనుచున్నాఁడను. (౧౬) ఓవిశ్వేశ్వరా! విశ్వరూపా! అసం ఖ్యములగు బాహువులు, నుదరములు, నుఖములును, నయన ములును గలవాఁడవు. లెక్క లేనిరూపములు గలవాఁడవు. ఇట్టి నిన్ను సర్వత్ర చూచుచున్నాఁడను. నీ యీరూపమునకు నాదిమధ్యాంతములు కనఁబడకున్నవి. ఇదేమిమాయయో గొ లుంగఁజాలకున్నాఁడను. (౧౭) మహనీయకిరీటముగలవాఁ డవు. గదాధారివి. చక్రహస్తుఁడవు. నిరుపమానతేజోనిధివి. ఎల్లయెడలఁ బ్రకాశమానుఁడవు. దీప్తాగ్నిసూర్యులచందమున వెలుఁగుచున్నవాఁడవు. అప్రమేయుఁడవు. దుర్నిరీక్షుఁడవు. ఇట్టి నిన్ను సర్వభాగములయందును గాంచుచున్నాఁడను.(౧౮) మహానుభావా! నీవు ముముక్షువు లెఱుంగవలసిన యక్షరపర

---

స్తవ దేవ దేహే సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్, బ్రహ్మాణమీశం కమ లాసనస్థమృషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్. ౧౫. అనేకబాహూదర వక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపం, నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప. ౧౬. కిరీటినం గదినం చ క్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమంతం, పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతాద్దీప్తానలార్కద్యుతిమప్రమేయం. ౧౭. త్వమక్షరం పరమం వేది తవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానం, త్వమవ్యయం శాశ్వతధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతో మే. ౧౮. అనాదిమధ్యాంతమనంతవీర్య

బ్రహ్మవు. నీవే యీసర్వజగత్తునకుఁ బరమాశ్రయమయినవాఁడవు. నీ వవ్యయుఁడవు. శాశ్వతమైనధర్మమును రక్షించువాఁడవు. సనాతనుఁడగు పరమపురుషుఁడవన నీవే యని నేను దలంచుచున్నాఁడను. అప్రతర్క్యమయి యనుపమానమగు నీ యైశ్వర్యమును జూచుటచేత నాయూహా లిట్లున్నవి. (౧౮) ఆదిమధ్యాంతములు లేక యుండుదువు. నీ వీర్య మనంతము. నీబాహువు లసంఖ్యాకములు. చంద్రుఁడు సూర్యుఁడు నీకు నేత్రములు. జ్వలించునగ్నియే నీముఖముగా నున్నది. స్వకీయమగు తేజోవిశేషముచేతఁ బ్రపంచమంతయుఁ దాపము నొందునట్లు చేయుచున్నవాఁడవు. ఇట్టి నిన్నిచ్చుటఁ జూచుచున్నాఁడను. (౨౦) మహాత్మా! భూమ్యాకాశములవివరమును, సర్వదిక్కులను నీవొక్కఁడవే వ్యాపించియున్నాఁడవు. అద్భుతము భయంకరమునగు నీరూపమును జూచి మూఁడులోకములు భయము నొందెను. (౨౧) శ్రీహరీ! భూభారమును హరించుటకై మర్త్యలోకమున నవతరించిన నిన్ను వస్వాదిదేవతలు ప్రవేశించుచున్నారు. కొందఱు భయంపడి కరములు ముకుళించి నిన్ను స్తోత్రముచేయుచున్నారు. మహామునులు సిద్ధులు దుర్నిమిత్తములు కనఁబడఁగా లోకమునకు మంగళమగుఁగాక

---

మనంతబాహుం శశిసూర్యనేత్రం, పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వమిదంతపంతం. ౧౯. ద్యావాపృథివ్యోరిద మంతరంహివ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః, దృష్ట్వాద్భుతం రూపమిదం తవోగ్రం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్. ౨౦. అమీ హి త్వా సురసంఘా విశంతి కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి, స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాస్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః. ౨౧. రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా

యని పలికి [సంపూర్ణస్తోత్ర రాజములచే నిన్ను వినుతించుచు న్నారు. (౨౨) రుద్రాదిత్యవసుసాధ్యవిశ్వేదేవాశ్వి దేవతలు మరుద్గణములును, పితృదేవతలు, గంధర్వులు, యక్షులు, నసురులు, సిద్ధులు నాశ్చర్యమునొంది నిన్నుఁ దిలకించుచున్నారు. (౨౩) ఓమహాబాహూ! ప్రమాణాతీతములై యసంఖ్యాకను లగు ముఖములు నేత్రములు హస్తము లూరువులు పాదము లుదరములు దంష్ట్రలును గలిగి మహాభయ మును గలిగించుచున్న నీరూపమును గాంచి జగమునంగల ప్రాణులు భయము నొందియున్నారు. నేనుఁగూడ సాధ్వసము నొందియున్నాఁడను. (౨౪) ఓవిష్ణూ! ఆకసమును దాఁకుచు మండుచు భయంకరములగు ననేకవిధములగు నవయవసంస్థాన ములుగలవాఁడ వగుచు వక్త్రములు తెఱచుకొని మండుచున్న విశాలనేత్రములుగలిగి వెలయు నిన్నుఁ గాంచినమాత్రమున మహత్తరభయమునొంది ధైర్యమునుగాని సంతోషమునుగాని పొందఁజాలకున్నాఁడను. (౨౫) దేవాధిపా! జగన్నివాసా! దంష్ట్రలచే భయమునుగలిగించుచుఁ బ్రళయకాలాగ్నులవలె మండుచున్న నీమోములంజూచి దిక్కులు కనఁబడక యున్నందున

---

విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ, గంధర్వయక్షాసురసిద్ధసంఘా వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే. ౨౨. రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో బహుబాహూరుపాదం, బహూదరం బహుదంష్ట్రాకరాళం దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాహం. ౨౩. నభస్స్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రం, దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా ధృతిం న విందామి శమంచ విష్ణో. ౨౪. దంష్ట్రాకరాళాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని దిశో నజానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస.

భయంపడుచున్నాఁడను. ఇట్టినాకుఁ బ్రసన్నుఁడ వగుమా. (౨౬,౨౭) ఓశ్రీకృష్ణా! ధృతరాష్ట్రపుత్త్రులు దుర్యోధనాదులు, భీష్మద్రోణకర్ణాదులు, వారలసంబంధముగలరాజులు, వారలపరివారము, మాపక్షమున నున్నయోధులు వీరెల్ల నీయందుఁ బ్రవేశించుచున్నారు. వారెల్లఁ గోఱలచే భీతినిబుట్టించుచు మనోధైర్యమును దుదముట్ట నశింపఁజేయు నీముఖములను ద్వరపడి ప్రవేశించుచున్నవారు. వారిలోఁ గొందఱు కోఱల నడుమఁ జిక్కుకొని తలలు చూర్ణములుకాఁగా మొండెములుగాఁ జూపట్టుచున్నారు. (౨౮) అనేకనదీప్రవాహములు సముద్రాభిముఖములై యెట్లు ప్రవేశించుచున్నవో యట్లే యీమానవవీరులు మండుచున్న నీముఖములందుఁ జొచ్చుచున్నారు. (౨౯) మిడుత లెట్లు తమనాశనముకొఱకు మండుచున్న నగ్నిహోత్త్రుని ద్వరగాఁ బ్రవేశించునో యట్లే ప్రాణికోటి తమనాశనముకొఱకు వేగమున నీముఖములం జొచ్చుచున్నారు. (౩౦) ఓవిష్ణూ! నీవుమాత్రము సమస్తప్రపంచమును నీతేజస్సు

---

౨౬. అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్త్రాస్సర్వే సహైవావనిపాలసంఘైః, భీష్మద్రోణస్సూతపుత్త్రస్తథాసౌ సహాస్మదీయైరపి యోగముఖ్యైః. ౨౭. వక్త్రాణి తే త్వరమాణా విశంతి దంష్ట్రాకరాళాని భయానకాని, కేచిద్విలగ్నా దశనాంతరేషు సందృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః. ౨౮. యథా నదీనాం బహవోంబువేగాస్సముద్రమేవాభిముఖా ద్రవంతి, తథా తవామీ నరలోకవీరా విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి. ౨౯. యథా ప్రదీప్తం జ్వలనం పతంగా విశంతి నాశాయ సమృద్ధవేగాః, తథైవ నాశాయ విశంతి లోకాస్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః. ౩౦. లేలిహ్యసే గ్రసమానస్సమంతాల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః, తేజోభిరాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో. ౩౦. ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో.

లచే ముంచి జ్వలించువక్త్రములతో నెల్లప్రాణులను మ్రింగుచుఁ జవిచూచుచున్నవాఁడవు. నీతేజోవిశేషములు భయంకరములై లోకములను దాపము నొందఁజేయుచున్నవి (3౧) దేవాది దేవా! ఇంతక్రూరమగు నాకారముగలవాఁడవై యున్నవాఁడవే. ఇట్టి నీవెవ్వఁడవో చెప్పుము. నీకు వందనములు. నాయెడ సుప్రసన్నుఁడవగుము. ఆదిమపూరుషుఁడవగు నీవెవ్వఁడవో చక్కఁగాఁ దెలిసికొనఁ గాంక్షించెదను. నీవ్యాపారము నాకు వివరించి చెప్పకున్నఁ దెలిసికొనఁజాలక యున్నాఁడను.

(3౨) ఇట్లర్జునుఁడు విశ్వరూపమును జూచి యచ్చెరువు భయమునొంది తా నెవఁడో తెలిసికొనఁదరముగామి ప్రశ్నింపఁగా శ్రీహరి యిట్లు బదులుచెప్పెను. పార్థా! నేను లోకక్షయము చేయఁగోరినప్రవృద్ధుండగుకాలుఁడను. ఇప్పుడు సర్వప్రాణులను సంహరించుటకై ప్రవర్తించితిని. ఒకప్పుడు నీవు యుద్ధముచేయకున్న నీశత్రుసేనలయం దున్నశూరులెల్ల వినాశమునొందక నిలువఁజాలరు.(33)ఓసవ్యసాచీ! ఆకారణమువలన నీవు లెమ్ము. జయమువలనఁ గలుగుయశస్సును బొందుము. శత్రువులను జయించి సమృద్ధరాజ్యము ననుభవింపుము. వీరెల్ల నింతకుముందే నాచేతనే వధింపఁబడిరి. నీవు నిమిత్తమాత్రుఁడవే కావలయును. నీ విందుఁ జేయవలసినఘనకార్య మేది

---

నమోఽస్తు తే దేవవర ప్రసీద, విజ్ఞాతుమిచ్ఛామి భవంతమాద్యం న హి ప్రజానామితవప్రవృత్తిం. 3౧. శ్రీభగవానువాచ.—కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః, ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. 3౨. తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం, మయై

యును లేదు. నేనే వీరినెల్ల రథములనుండి పడఁద్రోయుచుం దును. కాని నీవే కర్తవని లోకులు తలంతురు. దాన నీకప్రయత్నసిద్ధమగు యశస్సుకలుగును. దానినేల పోఁగొట్టుకొందువు. నీవూరకున్నను భీష్మద్రోణాదులు బ్రదుకరనిమాత్రమునమ్ముము. జగత్సృష్టి ప్రళయసంకల్పులమగు మాకు నీకురుకులదహన మేమాత్రపుఁబని. ఇపుడు నిన్ను నిమిత్తమాత్రముగా నుంచుకొనఁ దలఁచితిమి. (౩౪) విజయా! ద్రోణుఁడు బ్రాహ్మణశ్రేష్ఠుఁడు ధనురాచార్యుఁడు. విశేషించి నాకు గురువు. దివ్యాస్త్రములు గలవాఁడు. భీష్ముఁడు స్వచ్ఛందమరణముగలవాఁడు. దివ్యాస్త్రవేత్త పరశురామునియంతవానితో ద్వంద్వయుద్ధముచేసియుఁ బరాజయమందక జయమందినమేటి. జయద్రథునితండ్రియగు వృద్ధక్షత్త్రుఁడు "నాపుత్త్రునిశిరస్సు భూమిమీఁద నెవ్వఁడు పడునట్లు గొట్టునో వానితలగూడ నప్పుడే భూమిపైఁబడును." అని కోరి తపస్సుచేయుచున్నందున నట్టిసైంధవుని జయింప శక్యమే కాదు. మఱియు నాతఁడు శంకరు నారాధించినవాఁడు. దివ్యాస్త్రసంపన్నుఁడు. కర్ణుఁ డన్ననో సూర్యతనయుఁడు. సూర్యు నారాధించి దివ్యాస్త్రములను బడసినవాఁడు. ఇంద్రుని వలన ననేకపురుషులఁ జెందునదియు నివారింప సాధ్యముకానిదియు నైనశక్తిని బడసినవాఁడు. కృపాశ్వత్థామలు భూరిశ్రవఃప్రభృతులు మహాత్ములు. అన్నిపద్ధతుల నాలోచించిన దుర్జయులే. ఇట్టి మహాశూరు లుండఁగా శత్రువులను జయించి రాజ్యము నెట్లనుభవింపఁగలను? అని శంకింతువో యేమో. విను

---

త్రైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. ౩౩. ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ కర్ణం తథాన్యానపి యోధవీరాన్, మయా

ము తెలిపెద. ద్రోణభీష్మసైంధవులు కర్ణుఁడు మఱియు నితర వీరులును నాచేతనే హతులైయున్నారు. కావున నీవు నిమిత్త భూతుఁడ మాత్రంబవై యనాయాసముగా వీరినందఱ వధింపుము. భయంపడవలదు. యుద్ధముచేయుము యుద్ధమునందు శత్రువుల సులభముగా జయింపఁగలవు. (౩౪) సంజయుఁ డీలాగున వచించి యిట్లుచెప్పెను. ధృతరాష్ట్రా! భగవంతుఁడు పల్కిన యీవాక్యమును విని యర్జునుఁడు చేతులుమోడ్చి వడఁకుచు నమస్కరించి పలుమాఱు భయమువలనఁ బ్రణతుఁడై గద్గద కంఠముతో శ్రీహరితో మఱియు నిట్లు పలికెను. (౩౫) హృషీకేశా! నీమాహాత్మ్యకీర్తనమును విని జగత్తు హర్షానురాగములను బొందుచున్నది. రాక్షసులు భీతులై దిక్కులకుఁ బాఱిపోవుచున్నారు. కపిలాదులందఱును నమస్కరించుచున్నారు. ఇదియంతయు నీవిషయమున నెంతయుఁ దగినదే. (౩౬) మహాత్మా! అనంతా! దేవేశా! జగన్నివాసా! నీ వందఱికంటె శ్రేష్ఠుఁడవు. హిరణ్యగర్భుఁ డనఁబడు బ్రహ్మకును గారణంబవు. కావున నిన్నుఁగూర్చి వారెట్లు నమస్కారములు చేయకుందురు? సదసత్తులుపాధులుగాఁగల్గిన యక్షరశబ్దవాచ్యుఁడవు నీవు. పరమార్థమునందు నాసదసత్తులకుఁ బరమైనయక్షరము నీవే. అట్టి

---

హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా యుద్ధ్యస్వ జేతాసి రణే సపత్నాన్. ౩౪.
సంజయ ఉవాచ.—ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాంజలిర్వేపమానః కిరీటీ, నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య.
౩౫. స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ, రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః. ౩౬. కస్మాచ్చ తే ననమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే, అనంతదేవేశ

నీకు సర్వప్రాణులు నమస్కరింతురు. ఇట్లు నమస్కరించుట కీతొమ్మిదియుఁ గారణములు. (౩౮) ఓయనంతరూపా! ఆది దేవుఁడవు. పురాణపురుషుఁడవు. నీవే యీసమస్తజగత్తులకును నిధానభూతుఁడవు. సర్వజ్ఞుఁడవు. తెలియఁదగినవస్తువవు నీవే. పరమమగువైష్ణవపదము నీవే. ఈసమస్తము నీచే వ్యాపింపఁ బడియున్నది. ఈహేతుసప్తకముచేత నీవు సర్వజనులకు నమస్కరింపఁదగినవాఁడవు. (౩౯) శ్రీహరీ! వాయువు, యముఁడు, నగ్నియు, వరుణుఁడును, చంద్రుఁడును, ప్రజాపతియును ఈదేవతలందఱు నీవే. లోకపితామహుఁడగు బ్రహ్మదేవునకుఁ దండ్రివి నీవు. నీకు నమస్కారము. వేయిమాఱులు నమస్కారము లొనరింతును. మఱియు నీకు ననేకపర్యాయములు నమస్కరించుచున్నాఁడను. (౪౦) నీకుఁ దూర్పుభాగమునకుఁ బశ్చిమభాగమునకు నమస్కారములు. అట్లే యెల్లదిక్కులందు నానాయైరూపంబుల నున్ననీకు నమస్కారము. సర్వరూపముల ధరించు స్వామీ! నీ వనంతవీర్యము, ననంతపరాక్రమముకలవాఁడవై సర్వజగత్తును నీవొక్కఁడవే వ్యాపించియున్నాఁడవు. కావున సర్వము నీవే యగుదువు. లోపలను వెలుపలను వ్యాపించియున్నాఁడవు. సువర్ణము కటకకుండలాదికమునువలె

---

జగన్నివాస త్వమక్షరం సదసత్తత్పరం యత్. ౩౭. త్వమాదిదేవః పురుషః పురాణ స్త్వమస్య విశ్వస్య పరం నిధానం, వేత్తాసి వేద్యం చ పరంచ ధామ త్వయా తతం విశ్వమనంతరూప. ౩౮. వాయుర్యమోఽగ్ని ర్వరుణశ్శశాంకః ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ, నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చభూయోఽపి నమో నమస్తే. ౩౯. నమఃపురస్తా దథపృష్ఠతస్తే నమోఽస్తుతే సర్వత ఏవ సర్వ, అనంతవీర్యామిత విక్రమ స్త్వం సర్వం

సర్వకార్యమును వ్యాపించియున్నాఁడవు. (౪౧-౪౨) ఓకృష్ణా! ఓయాదవా! ఓచెలికాఁడా! నీవు నాతో సమానవయస్కుఁడ వని తలంచి నీమహత్త్వము నెఱుంగక మూఢుఁడనై బుద్ధిలేక గాని స్నేహమునఁగాని నిన్నల్పునిగా నొనరించి సఖుఁడా యని పిలిచితిని. నిన్నుఁ బరిహాసముకొఱకు విహరించునపుడు శయనించునపుడును గూరుచుండునపుడును భోజనకాలమందును నీవు లేనితఱిఁగాని యెదుటఁగాని నిన్నవమానించితిని. నాయీయపరాధముల నన్నింటి నప్రమేయుఁడవగు నీవు క్షమింపవలయునని ప్రార్థించెదను.(౪౩)సాటిలేనిమహిమముగల శ్రీకృష్ణా! చరాచరప్రపంచమునకు నీవే తండ్రివి. పూజార్హుఁడవు. గురుఁడవు. గురువులకునెల్ల గురుండవు. ముల్లోకములయందును నీకు సమానుఁడే లేఁడు. ఇంక నధికుఁడుండునా?(౪౪) ఓదేవా! ఆకారణమువలన నీకు వందనమొనరించి నమ్రుఁడనై సర్వలోకేశ్వరుఁడు, స్తోత్రార్హుఁడవు నగునిన్నుఁ బ్రసన్నునిగా నొనరించుకొనుచున్నాను. పుత్రునియపరాధమును దండ్రి క్షమించునట్లును, మిత్రాపరాధమును మిత్త్రుఁడు క్షమించునట్లును, ప్రేయసీ

---

సమాప్నోషి తతోఽసిసర్వః. ౪౧. సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ హే యాదవ హేసఖేతి, అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదాత్ప్రణయేన వాపి. ౪౨. యచ్చావహాసార్థ మసత్కృతోఽసి విహారశయ్యాసనభోజనేషు, ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షం తత్క్షామయే త్వా మహమప్రమేయమ్. ౪౩. పితాసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్, న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావ. ౪౪.తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వా మహమీశమీడ్యం, పితేవ పుత్రస్య సఖేవసఖ్యుః ప్రియః

తప్పును ప్రియుఁడు సహించునట్లును, నాయపరాధమును నీవు క్షమింపవలయును.(౪౫) దేవా! దేవేశా! జగన్నివాసా! ఇంతకుముం దెన్నఁడు నెవ్వరుం జూడని యీవిశ్వరూపమును జూచి పరమానందముం బొందితిని. అయినను భయముకూడ నామనస్సును బీడించుచున్నది. కావున నామిత్రభూతమగు నారూపమునే కనఁబఱుపుము. నాయందుఁ బ్రసన్నుఁడవగుము. (౪౬) సహస్రబాహూ! విశ్వమూర్తీ! కిరీటగదాచక్రములఁ దాల్చి పూర్వరీతిగా నున్ననిన్ను దర్శింప నాశించుచున్నాఁడను. కావున నిత్తరుణమున విశ్వరూపమున సహస్రబాహువులుకలవాఁడవై యున్ననీవు పూర్వరీతగాఁ జతుర్భుజములు గలవాఁడవయి నాకు దర్శనమిమ్ము.

(౪౭) అని ప్రార్థింపఁగా భయపడియున్న యర్జునునిం గాంచి శ్రీహరి యిట్లు భాషించెను. అర్జునా! నేను నీయెడ ననుగ్రహమునిచి యింతకుము న్నెన్నఁడు నీకంటె నొరు లెవ్వరు చూడనిది తేజోమయము విశ్వాత్మకము ననంతము నగు నీవిశ్వరూపమును నాయైశ్వర్యసామర్థ్యమువలన నీకుఁ గనఁబఱచితిని. (౪౮) కురుప్రవీరా! వేదపఠనములచేఁగాని, యజ్ఞా

---

ప్రియాయార్హసి దేవ సోఢుం. ౪౫. అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే, తదేవ మే దర్శయ దేవరూపం ప్రసీదదేవేశ జగన్నివాస. ౪౬. కిరీటినంగదినం చక్రహస్త మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ, తేనైవరూపేణ చతుర్భుజేన సహస్రబాహో భవవిశ్వమూర్తే. ౪౭. శ్రీభగవానువాచ.—మయాప్రసన్నేనతవార్జునేదం రూపం పరం దర్శితమాత్మయోగాత్, తేజోమయం విశ్వమనంతమాద్యం యన్మే త్వదన్యేన న దృష్టపూర్వం. ౪౮. న వేదయజ్ఞాధ్యయనైర్నదానైర్న చ

ధ్యయనములచేతఁగాని, దానములచేతఁగాని, కర్మములచేతఁగాని, యుగ్రతపస్సులచేతఁగాని నీవు చూచిన విశ్వరూపముతోఁ గూడినన్నుఁ జూచుట కీమానవలోకమునందు నీకుఁదప్ప నితరులకెవ్వరికిని శక్యముకాదు. ఈరూపదర్శనాత్మకమై మిగుల దుర్లభమగు నాప్రసాదమునొంది కృతార్థుఁడ వైతివి. (౪౯) అర్జునా! భయమునుగలిగించు నా యీవిశ్వరూపమును గాంచుటంజేసి నీకు భయము వలదు. మనోమోహము వలదు. నీవు మరల నిర్భయుండవై సంతుష్టహృదయుండవై నీకుఁబ్రియమగు నాచతుర్భుజరూపమునే పరికింపుము. (౫౦) అని తెలిపి సంజయుఁ డాంబికేయున కవ్వలివృత్తాంతమును దెల్పుచుఁబూని యిట్లు పలికెను. వాసుదేవుఁ డీవిధముగా భాషించి యర్జునునకుఁ దనపూర్వస్వరూపమును గనఁబఱచెను.

(౫౧) అర్జునుఁ డారూపముం గాంచి యిట్లు పలికెను కృష్ణా! జనార్దనా! సౌమ్యమై నాకుఁ జిరపరిచితమునగు నియీ మానుషరూపమును జూచినపిదప నామన స్సిప్పుడు యథాప్రకారముగా నుండినది. నాకు ధైర్యము కలిగినది. (౫౨) అని ప్రార్థింపఁగా శ్రీహరి యిట్లు భాషించెను. నావిశ్వరూపమును దేనిని

---

క్రియాభిర్న తపోభిరుగ్రైః, ఏవం రూపశ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర. ౪౮. మా తే వ్యథా మాచ విమూఢభావో దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదం, వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం తదేవ మే రూపమిదం ప్రపశ్య. ౪౯. సంజయఉవాచ.—ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా స్వకం రూపం దర్శయామాస భూయః, ఆశ్వాసయామాస చ భీతమేనం భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా. ౫౦. అర్జునఉవాచ.—దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన, ఇదానీమస్మి సంవృత్తస్సచేతాః ప్రకృతిం గతః. ౫౧. శ్రీభగవానువాచ.—సుదుర్దర్శమిదం రూపం దృష్ట

నీ విపుడు చూడఁజాలితివో దాని నెవ్వరును జూడఁజాలరు. దేవతలుగూడ నీరూపమును సర్వదా కనుఁగొనఁ గోరుదురు. కాని చూడఁజాలరని యెఱుంగుము. నీయందు నాకుఁగల యనుగ్రహ మతిదుర్లభమని నమ్ముము. (౫౩) అర్జునా! వేదములచేతఁగాని, చాంద్రాయణాదితపస్సుచేఁగాని, గోభూహిరణ్యాదిదానములచేఁగాని యజ్ఞముచేఁగాని పూజనముచేఁగాని నీవు చూచినట్టి యావిశ్వరూపము నెట్టివారికేఁ జూడఁదరముగాదని నిశ్చయింపుము. (౫౪) అర్జునా! పరంతపా! ఎట్టిభక్తిచే వాసుదేవునికంటె నితరము సర్వకరణములచేత ననుభవింపఁబడదో అట్టి యనన్యభక్తిచే మాత్రము విశ్వరూపుఁడనగు నన్ను నెఱుంగను జూడను నైక్యమునఁ బ్రవేశింపను సాధ్యమగును. వేదాంతవాక్యశ్రవణమనననిధిధ్యాసనముల పరిపాకముచేత శక్యమగును అంతట స్వరూపసాక్షాత్కారమువలన నవిద్యాతత్కార్యములు నివర్తిల్లఁగా నారూపమును బొందుటకుఁగూడ శక్యమగు. ముముక్షువు చిత్తశుద్ధికొఱకు శ్రద్ధాభక్తులతో బ్రహ్మమే యిది యంతయు నగునని సవిశేషవిశ్వరూపబ్రహ్మోపాసనము చేయును. దానిచేత భేదప్రత్యయము నశించును. దానివలన నాత్మ పరిశుద్ధమగును. నిర్విశేషపరబ్రహ్మము నెఱుంగుటకును, సాక్షాత్కరించుకొనుటకును, తద్ద్వారా పావస్థానలక్షణమైన విదేహముక్తిని బొందుటకును దనయంతటనే శక్తుఁడగునని సారముకదా యని గ్రహింపుము. (౫౪) ఓపాండునందనా! నానిమిత్తమే సత్కర్మముల నొనరించువాఁ

---

వానసి యన్మమ దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః. ౫౨.
నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా, శక్య ఏవంవిధో ద్రష్టుం
దృష్టవానసి మాం యథా. ౫౩. భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం

డును, నన్నే పరమగతిగా నిశ్చయించినవాఁడును, నాయందే భక్తిగలవాఁడును, ధనాదులయందుఁ బ్రీతిలేనివాఁడును, సకల భూతములయందును దనకపకారము చేసినవారియందునుగూడ వైరములేనివాఁడు నెవ్వఁడో యతఁడు నన్నే పొందునని తెలియవలయు. ఇదియే యీగీతాశాస్త్రసారభూతమగు నర్థ మని యెఱుంగఁదగు. నిశ్శ్రేయస్సునొందఁగోరినవార లీయర్థము ననుసంధానముచేయుచు నిట్లనుష్ఠానమును జేయవలయునని యు నూహింపుము.

ఇది విశ్వరూపసందర్శనయోగను.

మనీషావిశేషభూషితులారా! విశ్వరూపసందర్శనయోగ మను పదునొకండవయధ్యాయమును బఠించితిరి. వీనివిశేషము తెలుంగ సాధారణముగాఁ దరముకాదనియే నాభావము. తెలిసినంతదనుక విమర్శింతము. దీనిసార మిది యని తెలిసికొను టకుఁ బ్రధానము భక్తి. అది హృదయమున నొదవనివారల కీయధ్యాయగతవిషయము మోసమనియే తోఁచును. తదను రూపములగు నాక్షేపణములు వచ్చును. అవియుక్తములే యని తలలూఁపువారును బెక్కండ్రు దొరకుదురు. వారిమాటలు నిష్ఫలములని వారపరిపక్వచేతస్కులని భావించి యీవిషయ మును దర్కింపవలయును. అపుడే యొకత్రోవ పొడకట్టును. దాని నాధారముచేసికొని పయనము సాగించిన సత్పదము కనఁ

---

విధోఽర్జున, జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప. ౫౪.
మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః, నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ. ౫౫.

ఇతి విశ్వరూపసందర్శనయోగః.

బడును. అందుఁ జొచ్చిన భగవత్సందర్శనము లభించును. ఇంచేది యొదవకయున్నను గొంచెము లాభముకాడఁ గలుగ దనియే నావిశ్వాసము. కావున భగవద్భక్తులకే యిది ముఖ్యము కాని యితరులకుఁ గాదు.

విభూతియోగము నాలకించి యర్జునుఁడు శ్రీకృష్ణా! నన్ననుగ్రహింపఁగోరి రహస్యాతిరహస్యమగు నధ్యాత్మయోగము నుపదేశించితివి. దానిచేత నాకుఁగల యజ్ఞానము తొలఁగెను. భూతముల జననమరణప్రకారములను వింటిని. నీమాహాత్మ్య మవ్యయమపరిమేయము ననియు నెఱింగితిని. ఇట్లే నీయైశ్వర్యరూపమునుజూడఁ గోరుచున్నాఁడను. అద్దాని దర్శించుటకు నాకు యోగ్యతగలదని నీకుఁదోఁచినచో నవ్యయమగు నీ రూపమునుగనఁబఱపుము.అని ప్రశ్నించెను.విభూతియోగమున నెందెందు భగవద్విభూతి విశేషించి కలదో యది చెప్పఁబడినవి. అంతియగాక లోకమున నేయేవస్తువుగలదో యదెల్ల నాయంశముగలదనియే తెలియఁదగుననియు బోధింపఁబడినది. దీనిచేత నర్జునునకుఁ గలసంశయములు తొలఁగినవి. కర్తృత్వాభిమానము దూరమైనది. కాఁబట్టియే నాయజ్ఞానము తొలఁగినదని చెప్పఁగలిగెను. ఆమీఁదివాంఛయేది? భగవత్సాక్షాత్కారమే. శ్రీకృష్ణమూర్తి యెదుట నున్నాఁడుకదా. మఱేల వేరొకరూపమును జూడఁగోరెను? అనున దొకప్రశ్నము.గీతాశాస్త్రము పదియధ్యాయములు విన్నంత నర్జునునకు భగవంతునిరూపము విశ్వరూపమేకానినాలుగాయుధములను దర్శించి మానుషరూపముకాదనిదృఢపడియెను. కాఁబట్టియే "ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ"అని ప్రశ్నించెను.ఇపుడు

భగవత్స్వరూపమనఁగా విశ్వరూపమే యని తేలినది. పార్థ సారథిరూపము వాస్తవరూపము కాదనియు నది యొక కార్యార్థము ధరింపఁబడినదనియును దెలిసినది. సర్వరూపములు సర్వనామములు భగవంతునివే యని దృఢపడినది. సర్వవ్యాపకుఁడు కావున నొకచోటనుండి యొకచోట లేఁడనఁగాదని స్పష్టమైనది. కావున నట్టిరూపమును జూడఁగోరెదనని యర్జునుఁ డాకాంక్షించుటయుక్తమే యనక తప్పదు. ఈజ్ఞాన మర్జునునకుఁ గలుగకపోయినచో నీప్రశ్నమే యసంగతమనక తప్పదు. గీతోపదేశము వ్యర్థమయ్యె ననకుండ వలనుపడదు. ఎదుట నేనే భగవంతుఁడనని శ్రీకృష్ణుఁడు పలుకుచుండ నీరూపమును జూడఁగోరెదననియు దానికి యోగ్యుఁడనని తోఁచినఁ గనఁబఱుపుమనియుఁ గోరుట వెఱ్ఱిపట్టినదని తెల్పును. కావున నెదుటనున్నదియు నొకటి యనవలయునేకాని వేఱుకాదు. భక్తరక్షార్థము భగవంతుఁ డర్చారూపముల నెన్నింటినో ధరించుచు నుండును. కార్యానంతరము వదలును. కాననే దానిం జూడ నర్జునుఁ డాకాంక్షించెను.

అర్జునుఁడు కోరినరూపము సర్వభూతమయము. సర్వనామములుగలది సర్వప్రీతికరము. సర్వేష్టదాయకము. "వృష్ణీనాం వాసుదేవోఽస్మి" అనఁగా నేమి? వాసుదేవుఁ డనుపేరుగూడ నాకుఁ గలదనికాదా దానిభావము? దీనిచేత సర్వనామములు నాకే చెల్లునని చెప్పినట్లు కాలేదా. ఇట్లుండఁగా శివకేశవులకుఁ దారతమ్యము గల దనువా రెంతధన్యాత్ములో వచింపఁదరమా! ఏవిధమున నాలోచించిన నీత్రిమూర్తులు ప్రకృతివశమున నుండువారు. పరాత్పరుఁడు ప్రకృత్యతీతుఁడు. ఇట్లు తత్త్వము కనుపట్టుచుండఁగా నత్యల్పవిషయమగు శివ

కేశవభేదము నాధారముగఁ జేసికొని దూషించు వారిదౌర్భాగ్య మేమనవచ్చును?

అర్జునుఁ డిట్లు వాంఛింపఁగా భగవంతుఁడు కరుణామయుఁడు కావున నిట్లు పలికెను. కౌంతేయా! నీవు కోరినరూపమును జూడుము. ఆయాకృతి యనేకాకృతి విశేషములు కలది. దానివర్ణము లనేకములు. అందే సకలదేవత లుందురు. ఆశరీరమున నొక్కభాగమున నీబ్రహ్మాండమెల్ల నుండును. ఇంకేమేమి చూడఁగోరుదువో అదెల్ల నందే కనఁబడును. కాని యర్జునా! నీకిపు డుండుదృష్టిచేమాత్రము చూడఁజాలవు. దీని కది కనఁబడునది కాదు. నీ కిపుడుండునది మాంసచక్షుస్సు. దాని కది లొంగునా? దివ్యదృష్టి నొసంగెదను. దాన నాపరమరూపమును బరికింపుము. అని నిజరూపమును బ్రదర్శించెను. ఇందు నేమేని విశేషముకలదా? సకలవర్ణములు నీలపీతాదులుగలది. సకలదేవత లందుందురు. వారు వీరననేల? ఎల్లవారం దుందురు. ఆరూప మితరులకుఁ జూడ దుర్లభము. విజయునకుఁ గనఁబఱచిన నీతనిశంకలు తొలఁగును. మఱియు మనస్సు నిర్మలమగును. తానేమో కర్త ననుకొన్నదురూహాపటాపంచలగును. సర్వము భగవదధీనమనుబుద్ధి నెలకొనును. దానఁ దనపని సాగును. ప్రతిజీవులు తమతమకర్మములు పురికొలుపఁగా లయమొందుచుందురు. ఇంకొక్కఁడు నిమిత్తమాత్రమే. ఆవిషయము ప్రత్యక్షమునఁ గనఁబడినచో నేలాటి సందియము లుండవుకదా. ఆఫల మర్జునునకుఁ గలుగవలయు ననియే పరమేశ్వరుఁడు తనరూపమును గనఁబఱచెనని మన మూహింపవలయును.

కొందఱీవిషయము సర్వాబద్ధమనియుఁ బరకాయ ప్రవేశవిద్య కృష్ణుఁ డెఱుఁగుననియు దాన నర్జునునిమనస్సు మోసపుచ్చి సమస్తము గనఁబడఁజేసెననియుఁ జెప్పుదురు. మఱియు నారూపము తాదృశమైనచో నెల్లరకు నేల కనఁబడకుండుననియు నాక్షేపింతురు. భక్తిబీజాంకురలేశమైనను మనోభూమిని లేనిమహాత్ములమాటలకు మనము బదులు తెల్పఁబూనుటయు ననవసరము. కాని యిందలి సత్యాసత్యములు కనుఁగొనఁ దలంచువారలు కొందఱుందురు. వారల మనస్సున కిది యుక్తమే యని తోఁచెనేని వారు నమ్ముదురు. అట్టివారి కొక్కరికైన నిది యుపకరించినఁ జాలుననియే చర్చించవలయు. లేకున్న నీచర్చ గతజలసేతుబంధమే యగును. శ్రీకృష్ణుఁడు "గారడి" యనువిద్యను జూపవలసిన యవసరమగపడదు. దాన లాభ మామహాత్మున కించుకంతయు లేదు. లాభము లేనిపని యెవ్వఁడును చేయునని మన మూహించు నాచారము లేదు. విశ్వరూపమనఁగా సర్వప్రపంచమును తానే యని కనఁబఱచుటయే. ఆవిషయ మర్జునునకుఁ దెలిసినఁ జాలును. ప్రపంచాకారమునఁ దాఁ గనఁబడుటయే విశ్వరూపమును జూపుటకదా. ఎల్లప్రాణులు తమతమకర్మానుసారము ఫలముల ననుభవించుచుండును. ఏయేప్రాణి యేయేప్రాణి కపకారమో ఉపకారమో చేయఁబూని ప్రయత్నించునట్లు వారివారికర్మములే పురికొల్పుచుండును. వానిచేఁ బ్రోత్సాహితులై ప్రాణులు ప్రవర్తించి కర్తృత్వమును దమయం దారోపించుకొని రజోగుణము ప్రధానముగాఁ బ్రవర్తింతురు. అది యూహలచేఁగాక ప్రత్యక్షమున మనము గాంచినయెడలఁ జక్కఁగాఁ గర్మసిద్ధాంత

మును నమ్ముదుము. ఒకప్రాణి వేఱొకప్రాణినిఁ జంపఁబూనినట్లు, అది చంపఁబడుచున్నయట్లు, ఈ రెండు నస్వతంత్రములే యైనట్లు మనము కన్నులారఁ గాంచినపుడు భగవంతునిసంకల్ప మెంత బలవత్తమమో మన మెఱుంగఁ గలముకదా.

ఇపు డర్జుననకుఁ గలిగినసంశయము విశ్వరూపప్రదర్శనమునఁ దొలఁగవలయును. విశ్వరూపము తనదని నమ్మఁదగినంత బోధించెను. ఆమీఁద దానిం జూపుమా యని యర్జునుఁడు ప్రార్థించెను. ప్రాకృతచక్షుస్సున కది చూడఁదరము కాదని శ్రీహరి దివ్యచక్షుస్సు నొసంగెను. జ్ఞానదృష్టి యనియు నంత ర్దృష్టి యనియు, యోగదృష్టి యనియు దానికే పేరులు. సుషుమ్నానాడీమార్గమున బాహ్యదృష్టిని మరలించిన నపారజ్యోతిస్స్వరూపమున వెలుఁగొందుదృష్టి సర్వమును గాంచఁజాలు నది లభించును. ఆజ్యోతిస్స్వరూపమే భగవంతుఁడని తేజస్సమారాధనతత్పరు లుపాసింతురు. జ్యోతిరుపాసన ముత్తమోత్తమమని పెద్దలందురు. బాహ్యదృష్టి నొక్కొక్కయంతర్భాగమున లయింపఁజేసిన నొక్కొక్కమహిమము గలుగుచుండునని యోగశాస్త్రము నుడువుచున్నది.

సూ. "కాయరూపసంయమాద్బాహ్యశక్తిస్తంభేచక్షుష్ప్రకాశ
సంప్రయోగేఽన్తర్ధానమ్. ౨౧.
భువనజ్ఞానం సూర్యే సంయమాత్. ౨౬.
చంద్రే తారావ్యూహజ్ఞానమ్. ౨౭.
ధ్రువే తద్గతిజ్ఞానమ్. ౨౮.
నాభిచక్రే కాయవ్యూహజ్ఞానమ్. ౨౯.
కంఠకూపే క్షుత్పిపాసానివృత్తిః. ౩౦.

కర్మనాడ్యాం స్థైర్యమ్. ౩౧.

**మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనమ్.** ౩౨

(పాతంజలియోగసూత్రములు విభూతిపాదము.)

యోగసాధనములేక దివ్యదృష్టి కలుగదనుట సిద్ధాంతము. భగవదనుగ్రహమున నన్నియు సులభలభ్యములే యగుచుండు గదా. పరమాణు లెల్లతావుల నిండియున్నను మనమాంస చక్షుస్సునకుఁ దోఁపనట్లు దివ్యచక్షుర్గమ్యము లున్నను మనకగ పడవు. యుద్ధరంగముగూడ నామహాకాయమున నొకమూల నుండునదియే. దివ్యదృష్టిని బ్రసాదింపఁగా సర్వవ్యాప్తమగు పరమేశ్వరునాకారము కనఁబడెను. అంతు భీష్మాదులు తమయంతన తామే మృత్యువక్త్రమునఁ బ్రవేశించుచున్నట్లగపడియెను. ఇది వింతగాదు. దీపమును జూచి శలభము దానిపైఁబడును. ఇంచుక జ్ఞానముకలిగి చూచుచుండినవారు దీపాభిముఖముగా నిది కాలప్రేరితమై పోవుచున్నది. తనచావు తానెఱుంగకున్నది. అనుకొనుచుండునంతలో నది దీపము నార్పఁబోయి యద్దానిచే మృతినొందును. దానికన్నుల కాశ్చర్యముగాఁ నొకదీపము కనఁబడఁజేసి దాని నార్పఁబూనునట్లు దీనిఁ బ్రోత్సహించి యందుఁబడునట్లుగాఁ జేసినది దానికర్మముగాక మఱేది? ఇట్లే మనచర్యలఁ గాంచుచుండుయోగులు కనుఁగొందురు. ఆమహాహవమునఁ జావఁగలవారెల్ల మృత్యువువక్త్రబిలమును దమయంత తారే శలభము దీపమును గాంచి పరుగిడునట్లు పరుగెత్తి చొచ్చుచుండ నర్జుననకుఁ గనఁబడెను. ఇతరులు ప్రయత్నించిన ట్లగపడును. కాని యితరులును గర్తలు గారు. మనకర్మమే వారిని బ్రోత్సహించును. వారును బరవశులే. కావు

ననే శత్రువు లెవ్వరు లేరని జ్ఞాను లందురు. ఈవిశ్వరూపము దివ్యచక్షుస్సుగల యర్జునునకుందప్ప నితరుల కెట్లు గనఁబడును. సంజయున కెట్లు తెలిసెననఁగా వ్యాసప్రసాదముననే యనవల యును. కావున భగవంతుఁడగు శ్రీహరి యర్జునునిమోహ నివృత్తికొఱకు విశ్వరూపమును గనఁబఱచుట మోసము కాదు.

"యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్."

అని శ్రీహరి పలికెఁగదా. ఇంతకుముందు ధృతరాష్ట్ర నకుం జూపలేదా యని కొందఱాక్షేపింతురు. అసత్యము హరి పలికెఁగదా యనియుఁ బలుకుదురు. ధృతరాష్ట్రునకు భీష్మాదు లిట్టిప్రయత్నమున నున్నయట్లు కనఁబఱుపలేదనియు దుర్యోధనాదులు తన్నొక్కనిగా భావించి కట్టివేయఁబూను టంజేసి తనకెంత బలమున్నదో తెలియఁజేయుటకే తగినంత రూపమును గనఁబఱచెననియు సమాధానముగా వారు గ్ర హింపవచ్చును. భగవదుక్తియందుఁ బూర్వాపరవైషమ్యము లుండవు. ఎవ్వరియోగ్యతానుసారము వారి కవి యర్థమ గును. సమన్వయము చేసికొనుశక్తియుఁ దదనుగుణముగనే యుండును. కావున నసంగతప్రశ్నములను జేసి తమమనస్సును గలవిలపాటొందించుకొనక భగవదుక్తింగలసారమును గ్ర హించి కృతార్థులు కావలయునని కోరుటకన్న వేఱొండు ప్రార్థనమేల?

అర్జునుం డాయాకారమును వీక్షించెను. అది సర్వతో ముఖము. నిరుపమానతేజోబంధురము. అందొక్కభాగమున బ్రహ్మాండము లుండెను. అవి యనేకభంగుల విభజింపఁబడి యుండెను. నరుం డారూపమును గాంచి నమస్కరించెను.

"ప్రవిభక్తమనేకథా"అని యున్నది. దీనిభావమేమి? ఒక్కొక్క లోకమున నొక్కరీతినుండు ప్రాణికోటు లుండును. ఎట్టికర్మము లుచేసినవారు తదనురూపఫలములను బొందఁదగు ననుకూలము లందుండును. సర్వకర్మఫలముల ననుభవించునవకాశము గలలోక మొక్కండుండదు భూలోకముగాక చంద్రలోకమునఁ బితృదేవత లుందురని శ్రుతులు చెప్పుచున్నవి. పితృదేవతలనఁగా సర్వదా పరుల క్షేమములు గోరువారు. ఆలోకమున నందఱు పితృదేవతలు గారు. తత్సమానప్రతిభగలవారలు నుందురు. అట్లే యితరలోకములనని యెఱుంగవలయును. కావుననే స్వసుఖమును గోరి కర్మములుచేయఁదగువారు మర్త్యలోకముననే యుందురని చెప్పఁబడినది యోగులు కొంద ఱట్లే చెప్పుదురని నానుడిగలదు. కావుననేయాభగవద్రూపమునందుఁ బెక్కురీతుల విభజింపఁబడి జగత్తులున్నట్లు చెప్పఁబడినది. బ్రహ్మ మొదలగుకీటకములవఱకుఁ గలప్రాణికోటి యందుండెను. ఆరూపమున కాద్యంతములు కానరాకపోయెను. రెండుచేతులుగల వారు మొదలు పెక్కుబాహువులుగలవారలవఱకు నందుండిరి. నాల్గుచేతులుండునా యని కొంద ఱల్పమతు లనుమానింతురు. ఏలయనఁగా నీలోకమునఁ జూచియుండలేదు. కావుననే యది యసంగతముగాఁ దోఁచును. ఇతరలోకములందు బహుపాదాదులు కలవారుందురు. లేరనరాదు. రెండుతలలు గలపామునుజూచుచున్నారము. "పంచవక్త్రేణ భోగినా" యను రామాయణవాక్యమును దప్పనరాదు. ఏలయన మనము చూడనివి లేవనునూహ కలుగుట మంచిదిగాదు. రెండుతలలపాము

తలఁచుగా లేక యొకానొకచోట నుండఁగా మఱెందో గ్రైదు తలలపా ముండఁగూడదని చెప్పుట పొరపాటుగాదా.

అందొకచో మోములు ప్రజ్వలించుచుండెను. ప్రళయ కాలజ్వాలనుని బోలియుండెను. వానిం గాంచినంతన యర్జును నకు భీతిగదిరెను. ధృతరాష్ట్రసూనులు భీష్మాదులు తనయోధు లాముఖముల జొరఁబాఱుచుండిరి. త్వరపడిపోవుచుండిరి. కొం దఱాముఖములం బ్రవేశించి దంతాంతరములం బడి భస్మమగు చుండిరి. లోకమునఁగల పెక్కండ్రుజీవులు త్వరపడి తమయంత తమరే పరుగిడి మండుచున్నయాముఖములఁ జొచ్చుచుండిరి. ఆవిషయము నేత్రగోచరముకాఁగా నర్జునుఁడు దేవా! నీవెవ్వఁ డవు? ఇంతయుగ్రరూపమునఁ గనఁబడుచున్నాఁడవు. నాకుం దెలుపుమా యని ప్రార్థించెను. ఏల యిట్లుగపడియె? మహాజీవప్ర ళయము ముందు కాఁబోవుచున్నది. కాలుఁడు నోరు తెఱచు కొని యున్నవాఁడు. కర్మము వారిని బురికొల్పుచున్నది. వారు పరవశులు కావున నేమిచేయుదురు? ఒడలు తెలియనిపౌరుష మున విఱ్ఱవీఁగి పరుగిడి మృత్యువక్త్రము మండుచున్న నందుఁ బ్రవేశించుచున్నారు. తనయంతన తాము మృత్యుముఖగహ్వ రమును జొచ్చుచుండఁగా నర్జునుఁడక్కటా! వీరి నేనెట్లు చంపు దునని పరితప్తహృదయుఁ డగుటకు భగవంతుఁ డచ్చెరువడి వారిస్థితిని గనఁబఱచెను. "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అని హెచ్చరించెను. ప్రత్యక్షముగఁ గాంచిన యర్జునునకు నంత కుముందు శ్రీహరిచేసిన యుపదేశమునకంటె నెక్కుడు విశ్వా సము కలిగెను. ఓహో! నేను జాలఁ బొరపడితిని. నేనేమి వీరిని వధించుటేమి? కర్తృత్వారోపణము కేవలాజ్ఞానము. భగవన్మా

యఁ దెలియ నాకే కాదు. బ్రహ్మాదులకైనఁ దరంబుగాదని తోఁచెను. కర్మ గరీయస్త్వ మప్పటికి దృఢపడియెను. కావున సౌమ్యరూపమునఁ గనఁబడిన శ్రీహరిని గాంచి యీభయంకరాకారమునఁ గనఁబడు నీవెవ్వఁడవో తెల్పుమాయని యడిగెను. నీముఖములు మండుచున్న వే యేమని యడిగెను. నీతత్త్వము నాకుఁ దెలుపుమా యని ప్రార్థించెను. యథాపూర్వరూపమును గనఁబఱుపుమా యని మొఱ్ఱయిడెను. చతుర్భుజమగురూపమును జూడఁగోరెదను. ఈరూపమును జూడఁజాలకున్నాఁడను. నన్నుఁ గరుణఁజూడుమా యని దీనత్వమున నభ్యర్థించెను. ఇట్లు ప్రార్థించునర్జునునిభావము నెఱింగి తనయుపదేశము ఫలించెనని సంతసించి యిట్లు పలికెను.

కుంతీనందనా! నీయందు దయఁగల నేను నీకీరూపమును గనఁబఱచితి ఇది తేజోమయము నీవుతప్ప నితరుఁ డీరూపమును జూడఁజాలఁడు. పూర్వ మీలోకమున నెవ్వఁడును జూచినదియు లేదు. వేదపఠనము, యజ్ఞములుచేయుట, తులాపురుషాదిమహాదానములుచేయుట, అగ్నిహోత్రార్చనము, చాంద్రాయణాదికతపస్సు లోనగువానిచేతనన్ను మానవులు కాంచలేరు భయంపడకుము. విమూఢభావమును వదలుము. ఇది ఘోరరూపమని భావించితివికదా. ఆభావమును వదలి సంతోషమున నుండుము. నీవు కోరినరూపమును గనఁబఱచెదను. దానినే గాంచుచుండుము. ఇప్పుడు జనక్షయముకొఱకుఁ గాలరూపుఁడనైతిని. నీకు మున్నువోలె సౌమ్యరూపమును గనఁబఱచెదనని శ్రీకృష్ణరూపమును గనఁబఱచెను. దీనిసారమేమి? వేదపఠనాదులు జ్ఞానాంగములు. వానివలన జ్ఞానము కలుగును. తజ్జన్యజ్ఞానము దృఢపడుటకు యోగము నభ్యసింపవలయు. దాన

మనస్సు నిర్మలమగును. పవిత్రస్వాంతుఁడుగాని నన్నుం జూడఁ జాలఁడు. భక్తిపరాకాష్ఠ నొందినఁగాని నాకరుణకుఁ బాత్రుఁడు కాఁడు. యజ్ఞాదులవలన స్వర్గాదిభోగములు కలుగునేకాని యపునరావృత్తికమగు పదము లభింపదు. సత్కర్మములను ఫలాభిసంధిరహితములుగ నాచరించిన భక్తి గలుగును. యోగము నభ్యసించిన బుద్ధిపరిశుద్ధమగును. ఈ రెండును గలిగిన నాకరుణ వారియందుఁబొదలును. వేదవేత్తల మనుకొనువారు నన్నుఁ గాంచఁజాలరు సుమా! ఏలయందువో తదుక్తప్రకారానుష్ఠానము వారికి లేదు. అది లేకయున్న సంపూర్ణఫలము నావేదపఠన మీయఁజాలదు. కావున నీవు ప్రాగ్జన్మసుకృతఫలమున నన్నాశ్రయించితివి. నాదివ్యరూపమును గాంచితివి. ఎల్లసంశయములు తొలఁగెనుగదా. ఇఁక నేను గర్తననుసభిమాన మూనకుందువు గాక. ఇఁక నన్ను నొందఁగలవు. సంశయింపకుము. మదుక్తకర్మము నెఱవేర్పుము. అనన్యభక్తి నాకరుణకుఁ బాత్రునిగఁ జేయును. సకలకర్మములు నాకొఱకుఁ జేయుము. నన్ను రక్షకునిగా భావింపుము. నాయందు భక్తి నునుపుము. పుత్త్రకళత్రమిత్రాదిసంగమునుండి దూరమున నుండుము. అది బంధకమగునుజుమీ. దానిం దగులుకొనినవాఁడు విడిచివచ్చుట దుర్ఘటము. పరిణామమున నది దుఃఖప్రదము. నాభక్తి పరిణామమున నానందప్రదము. అని యుపదేశించిన శ్రీకృష్ణపరమాత్మను రక్షకుఁడనిమనము నమ్ముటకంటె వేఱొకటికోరఁదగినదేముండును? ఇట్టు లీయధ్యాయమునుండి మనము భగవదుపదేశమును గ్రహించి తదనుగుణముగాఁ బ్రవర్తింపవలయును. ఇఁకఁ దరువాతివిషయమును బఠింపఁ గడఁగుదము.

## భక్తియోగము.

(౧) ఇట్లు శ్రీకృష్ణపరబ్రహ్మము విశ్వరూపమును గనఁబడఁజేసి దానివిధము నెఱింగింపఁగా నర్జునుఁ డిట్లు ప్రశ్నించెను. పరమేశ్వరా! నీవుపదేశించినట్లుగా నిరంతరము భగవత్కార్యాదులయందు వ్యాపారముగలవారలై యనన్యగతికులగుచు నేమానవులు విశ్వరూపుఁడవై యలరారు నిన్నుపాసింతురో ఏమానవులు సర్వకర్మముల సన్న్యసించి సర్వోపాధివర్జితమగుచు సర్వకరణాగోచరమగునక్షరము నుపాసింతురో ఈయిరువెగలవారిలో నెవ్వ రుత్కృష్టయోగు లగుదురు? కరుణించి యుపదేశింపుము. అని ప్రశ్నింపఁగా భగవంతుఁ డిట్లు సమాధానమును దెలిపెను. (౨) అర్జునా! నాయందే మానసమును నిలిపి నిత్యయుక్తులై యుత్కృష్టశ్రద్ధాపూర్వముగా నెవ్వారు నన్నుపాసించుచున్నవారో వారే యుత్తమయోగులని నాభావము. నీకు సగుణవిద్యయందే యధికారముగలదని యెఱింగితిని. అధికారానుసారము తారతమ్యయుక్తమగుసాధనవ్రాతమునువిధింపబూనియిట్లుపలికితినని యెఱుంగుము. ఉపదేశముపదేశ్యునియోగ్యతానుసారముగ నుండవలయును. (౩-౪) నిర్గుణబ్రహ్మవిదుల

---

భక్తియోగః.

అర్జునఉవాచ.—ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే, యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః. ౧. శ్రీభగవానువాచ.—మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే, శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః. ౨. యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే, సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్. ౩. సన్నియమ్యే

కంటె సగుణబ్రహ్మావిదులే యుత్తములు. కావుననే వారుత్కృ
ష్టులనిపలుక నవకాశముకలదు అని ప్రశ్నింతువేమో వినుము.
ఏప్రమాణములచేతను దెలియఁదరముకానిదియుఁ గావుననే
శబ్దముచేత నిది యిట్టిదని నిర్దేశింప శక్యముకానిదియు సర్వ
మును వ్యాపించినదియు మనస్సుచేత నేనుగూడఁ జింతింపనలవి
కానిదియు, మాయధిష్ఠానమగునదియు, రాశివలె వికారశూన్య
మగునదియు, నట్లగుటచే నిశ్చలము, నిత్యము నగునాశములేని
దియు నగుతత్త్వమును సర్వేంద్రియముల వశీకరించి యెవ్వ
రుపాసింతురో, ఎల్లప్పుడు నిష్టముగాని యనిష్టఫలముగాని లభిం
చినచో నా రెండింటియందును సమబుద్ధులును సర్వభూతహి
తులు నగునట్టి యాయక్షరోపాసకులు నన్నే పొందుచున్నారు.
(౫) అవ్యక్తమగునక్షరము నుపాసించువారలకు నితరులగు
సగుణోపాసకులకంటె శ్రమము మిక్కిలి యెక్కుడు. ఏలయ
నఁగా దేహాభిమానమును వదలినవారికేకాని యక్షరోపాసనము
శక్యముకాదు. దేహాభిమానవిశిష్టులకు నవ్యక్తప్రాప్తి లభించుట
కష్టమే యగును. (౬-౭) పార్థా! ఎవ్వారు కర్మములనెల్ల నాకు
సమర్పించి పరమగతి నేనేయని నమ్మకముకలవారలై యనన్య
యోగమున నన్ను ధ్యానించుచు నుపాసింతురో వారు విశ్వ
రూపుఁడనగు నాయందు మనస్సు నునిచినవారు కావున నట్టి
భక్తులను మృత్యురూపమగు సంసారసాగరమునుండి త్వరగ
నుద్ధరించుచున్నాఁడను. నాభక్తుల కనాయాసముగ నాప్ర

---

ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః, తే ప్రాప్నువంతి మామేవ సర్వభూత
హితే రతాః. ౫. క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసాం, అవ్యక్తా హి
గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే. ౬.యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య

పాదమున సిద్ధికలుగునని యెఱుంగుము. (౮) అర్జునా! నాయం
దే మనస్సు నిలుపుము. నాయందే బుద్ధి నిలుచున ట్లభ్యసిం
పుము. అందుచేత దేహపాతానంతరము నాయందే మద్రూప
మున నిశ్చయముగా వసింపఁగలవు. సంశయింపకుము. (౯)
ధనంజయా! ఇఁక నాయుపదేశము ననుసరించి విశ్వరూపుఁడ
నగు నాయందు మనస్సును స్థిరముగా నిలుపుటకు నీకు సామ
ర్థ్యము లేనిచో నప్పుడు సులభమగు ప్రతిమాద్యాలంబనము
నందు మనస్సు నిలిపి సమాధిచేయుట కుపక్రమించి (అభ్యాస
యోగమును నాచరించుచు) నన్నుఁ బొందుటకు యత్నింపుము.
సగుణబ్రహ్మధ్యానమునందు నశక్తులకు శక్తితారతమ్యమును
బట్టి తొలుదొలుత బాహ్యములగు ప్రతిమాదులయందు భగ
వద్ధ్యానాభ్యాసంబును, దానియందు శక్తిలేనివారలకు భాగ
వతధర్మానుష్ఠానమును, దానియందును శక్తిలేనివారలకు సర్వ
కర్మఫలత్యాగమును అనుసాధనత్రయంబును జెప్పఁబూనితినని
యెఱుంగుము. ఇదియే సులభోపాయమని నమ్ముము. (౧౦)
అభ్యాసమునందు నీకు శక్తిలేదేని నాకొఱకుఁ గర్మముల నొన
రించుచుండుము. అభ్యాసము ననుష్ఠింపకున్నను నన్నుద్దేశిం
చియే కర్మములను జేయుచుండువేని నీవు క్రమముగా మోక్ష

---

మత్పరాః, అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. ౬. తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారబంధనాత్, భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్. ౭. మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ, నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః. ౮. అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరం, అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ. ౯. అభ్యాసేప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ, మదర్థమపి

ము నొందఁగలవు. శ్రవణకీర్తనాదిభాగవతధర్మమే నాకొఱకుఁ జేయుకర్మమని యర్థము. (౧౧) అర్జునా! ఇఁక మత్కర్మపరమత్వముఁగూడ నీవు చేయఁజాలకున్న నప్పుడు నీవు చేయుకర్మములనెల్ల నాకర్పించి చేయుచు మనస్సును ఫలాభిసంధిగలదానినిగా నీయక సర్వకర్మఫలత్యాగమును జేయుము. (౧౨) అజ్ఞానపూర్వకమగు నభ్యాసమునకంటె జ్ఞానము శ్రేష్ఠమగును గదా. జ్ఞానమునకంటె జ్ఞానపూర్వకధ్యాన ముత్కృష్టము. ఆ ధ్యానమునకంటెఁ గర్మఫలత్యాగ ముత్కృష్టము. ఏమిటికందువో కర్మఫలత్యాగము సిద్ధింపఁగానే సకలసంసారవిముక్తియే కలుగును. అంతకంటెఁ గావలసిన దేమియున్నది? కర్మఫలములే కామములు. కాఁబట్టి కర్మఫలత్యాగముకూడఁ గామత్యాగత్వసామాన్యమువలన సర్వకామత్యాగఫలము చేవినుతింపఁబడుచున్నది. అట్టిది కుదురుటయే వాంఛింపఁదగినవిషయము. (౧౩-౧౪) చిత్తసమాధానలక్షణమగు యోగ మీశ్వరునియందు ముఖ్యమనువిషయ మింక వినుము. సర్వభూతములయందును ద్వేషములేనివాఁడును, సర్వభూతములకును మిత్త్రుఁడును, దుఃఖించువారివిషయమున దయచూపువాఁడును, దేనియందుఁగాని మమకారములేనివాఁడును, అహంకారవిరహితుఁడును దుఃఖముగాని సుఖముగాని వచ్చినపుడుగాని ద్వేషరాగములు లేనివాఁడై సమానముగా వాని ననుభవించువాఁడును, దూషించి

---

కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి. ౧౦. అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః, సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. ౧౧. శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే, ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాంతి రనంతరమ్. ౧౨. అద్వేష్టా సర్వభూతానాం మైత్రః

నను భూషించినను వికారమునొందక యుండునంత యోర్పుగల వాఁడును, ఎల్లప్పుడు భిక్షాదికము దొరకినను దొరకకున్నను మంచిదిగాని చెడుపదార్థముగాని లభించినను సంతోషము గలిగియుండువాఁడును, సమాధిగలవాఁడును, దేహమును నిగ్రహించి స్వాయత్తముగ నుంచుకొనువాఁడును, ఆత్మతత్త్వ విషయమున దృఢనిశ్చయముగలవాఁడును, నాయందే మనోబుద్ధుల నునిచియున్నవాఁడును, ఈ చెప్పినధర్మములుగల నాభక్తుఁ డెవ్వఁడో యతఁడు నాకుఁ బ్రియుఁడగును. మందాధికారికి నక్షరోపాసన మత్యంత దుష్కరంబగుటంజేసి దానిని వలదని సుకరమగు సగుణోపాసనము విధించి యందున శక్తితార తమ్యము ననువదించుచుఁ దక్కినసాధనములఁగూడ విధించితిని. అట్లు విధించుట యేలనఁగా సర్వప్రతిబంధరహితుఁడై యుత్తమాధికారము గలిగి ఫలభూతాక్షరవిద్యయందుఁ బ్రవేశించునను తలంపుచేతను, సాధనవిధానము ఫలార్థమగుటచేతనని యెఱుంగుము. మఱియు నిట్టిభక్తునకు సత్వరముగాఁ బరమేశ్వరప్రసాదహేతుభూతధర్మములఁ జెప్పినఁగాని కృతార్థుఁడు కాఁడని వీనిం జెప్పుచున్నాఁడనియు నిశ్చయింపుము. (౧౪)

ఎవ్వనివలన లోకము సంతాపమునొందదో ఎవ్వఁడు లోకమువలన సంతాపము నొందఁడో ఎవ్వఁడు హర్షామర్షభయోద్వేగములు లేకయుండువాఁడో అట్టిసాధువు నాకుం బ్రియుఁడు. హర్షమనఁగాఁ బ్రియలాభమునందు రోమాం

---

కరుణ ఏవ చ, నిర్మమో నిరహంకారస్సమదుఃఖసుఖః క్షమీ. ౧౩. సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః, మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః. ౧౪. యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే

చాశ్రుపాతాదిహేతువై యానందాభివ్యంజకమగు చిత్తవృత్తివిశేషము. అమర్ష మనఁగాఁ బరోత్కర్షాసహనరూపమగు చిత్తవృత్తివిశేషము. భయమనఁగా వ్యాఘ్రాదిక్రూరజంతుసందర్శనమునఁ గలుగుచిత్తవృత్తివిశేషము. ఉద్వేగమనఁగా ఏకాకిని ఏవిధముగా సర్వపరిగ్రహశూన్యమగుమానవులు లేనితావున జీవింపఁగల ననువ్యాకులతారూపమగు చిత్తవృత్తివిశేషము. (౧౬) కౌంతేయా! దేనియందు నపేక్షలేనివాఁడును, బాహ్యాభ్యంతరశౌచముగలవాఁడును, తాఁజేయఁదగు కార్యములందు సమర్థుఁడును, మిత్రప్రభృతులయందుఁ బక్షపాతము లేనివాఁడును, నిర్భయుఁడును, ఇహపరలోకసుఖ సాధనములయి కామహేతువులగు సర్వకర్మములను వదలినవాఁడును నగుభక్తుఁ డెవ్వఁడో వాఁడు నాకుం బ్రియుఁడగును. (౧౭) ఏమానవుఁ డిష్టఫలలాభమునందు హర్షము, అనిష్టఫలలాభమునందు ద్వేషము లేకయుండునో, ఇష్టఫలము నశించినపుడు శోకింపక, ఇష్టఫలము లభింపనియపుడు దానిఁ గాంక్షింపక యుండునో, శుభాశుభకర్మములను బరిత్యజించునో అట్టిభక్తుఁడు నాకుఁ బ్రియుఁడు. (౧౮) శత్రుమిత్రులయందు సమానుఁడై యుండువాఁడును, తనను బూజించిన నవమానించినను సమానమగునిర్వికారచిత్తముతో నుండువాఁడును, శీతోష్ణసుఖదుఃఖరూపద్వంద్వములు సంభవించినను వికారమునొందనివాఁడును, సర్వము

---

చ యః, హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః. ౧౫. అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః, సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః. ౧౬. యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి, శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః. ౧౭. సమశ్శత్రౌ

నందు నాసక్తిలేనివాఁడు నగుభక్తుఁడు నాకుంబ్రియుండగును (౧౯)నిందించినను వినుతించినను సమముగాఁదలంచువాఁడును మౌనము గలవాఁడును, ఆహారాదులవెట్టివి లభించినను సంతోషించువాఁడును, నియతనివాసస్థలము లేనివాఁడును, బరమార్థవస్తువిషయమున స్థిరబుద్ధిగలవాఁడు, నాయందు భక్తిగల వాఁడు నాకుఁ బ్రియుఁడు. (౨౦) కుంతీనందనా! ఎవ్వారు నే నిపుడు చెప్పినప్రకారమున నీధర్మ్యామృతమును శ్రద్ధగలవారలై యనుష్ఠానమున నుపాసింతురో అక్షరాత్మకుఁడనగు నేనే పరమగతిగలవారలగుదురో పరమార్థజ్ఞానరూపమగు నుత్తమ భక్తి నాశ్రయించిన యట్టిసన్న్యాసులే నాకత్యంతప్రియు లగుదురు.

ఇది భక్తియోగము.

ఆర్యమహాశయులారా! భక్తియోగమును బఠించితిరి. ఇది పండ్రెండవయధ్యాయము. ఏడవయధ్యాయము మొదలు పండ్రెండవయధ్యాయముదనుకఁ గలయాఱధ్యాయములచేత భక్తియోగమే చెప్పఁబడియెనని కొందఱందురు. మొదటి యాఱు కర్మయోగమనియు దానికన్న నీభక్తియోగ ముత్కృష్టమనియు వాకొనుచుందురు. ఆమాటల కర్థమే లేదని నాయా

చ మిత్రే చ తథా మానావమానయోః, శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః. ౧౮. తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్, అనికేత స్స్థిరమతిర్భక్తిమాన్ మే ప్రియో నరః, ౧౯. యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే, శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః. ౨౦.

ఇతి భక్తియోగః.

శయము. ఏలయనఁగాఁ గర్మయోగమే గీతాశాస్త్రమంతయుఁ దెలుపుచున్నది. ఆకర్మయోగమునఁ గర్తృత్వాభిమానము నశించుటకే తక్కినవిషయములు తెలుపఁబడినవి. భక్తిజ్ఞానములు కుదిరినఁగాని కర్తృత్వాభిమానము నశింపదు. సత్కార్మానుష్ఠానమునఁగాని భక్తిజ్ఞానములు కుదురవు. భక్తిజ్ఞానములు మనస్సు పరిశుద్ధముగా నుండుటయే హేతువులుగాఁగలవి. మనఃపారిశుద్ధ్యము సత్కార్మానుష్ఠాన మాధారముగాఁగలవి. కావున నివి యన్యోన్యాశ్రయము గలవగును. ఈవిషయ మంగీకరింపకతప్పదు. కర్మమనాదియనువిషయము నెట్లంగీకరింపక యున్న వలనుపడదో యిదియు నట్లే యని సారము. కర్మయోగము ఫలాభిసంధిరహితముగా నభ్యసించుటకుఁ దగినవిషయము లించుక బోధించి కర్తృత్వాభిమానము లేకయుండఁ జేయుటకే శ్రీకృష్ణుఁ డీగీతాశాస్త్రము ననువదించెననుట సిద్ధాంతము.

ఇఁక భక్తియోగసార మేమనునదియే ముఖ్యము. కృష్ణా! నిరంతరము భగవత్కార్మము విధివిహితముగాఁ జేయుచుండు భక్తులకును, అవ్యక్తమగు నక్షరతత్త్వము నుపాసించువారలకు గలభేదమేమి? ఎవ్వ రిందుత్తములు? అని యర్జునుఁడు ప్రశ్నించెను. అనఁగా సగుణోపాసకులు నిర్గుణోపాసకులు అనువీరిలో నెవరుత్తములనియే ప్రశ్నసారము. విశ్వరూపము చూపితివి. అంతకుముందుఁ జతుర్భుజునివిగ నుంటివి. ఈ రెండురూపముల నుపాసించువారు కలరు. ఈ యిరువురిలో నెవ్వా రుత్కృష్టులు? ఎవ్వరు నికృష్టులు? అని యర్జుననిశంక. అనఁగా విగ్రహార్చకులు కొందఱు విశ్వరూ

పార్చకులు కొందఱు. వీరిలో నుత్తము లెవరు? అని యర్జునుఁడు ప్రశ్నించెనని మనమూహించుట ప్రమాదము కాదు. ఈప్రశ్నమునకు భగవంతుఁడు సమాధానము చెప్పఁబూని యిట్లు చమత్కారముగాఁబలికెను. సగుణోపాసనము నిష్ఫలమన్నచో నర్జునుఁడు ఖిన్నుఁడగును. యుద్ధముచేయఁడు. సఫలమన్నచో సత్యదూరము. కావున నంటీయంటనట్లు తగిలితగులనట్లు సమాధానము చెప్పవలయును. సగుణోపాసకులే లోకమునఁ బెక్కం డ్రుగలరు. నిర్గుణోపాసకులు కొలఁదిసంఖ్యాకులే యుందురు. కాని నిర్గుణోపాసకుఁడు కాక యున్న ముక్తిలేదని పెద్దలమతము. సగుణోపాసనము వ్యర్థమాయన్న గాదు. ఆమార్గమునఁ బ్రవర్తింపఁగా భగవంతుని విశ్వరూపధ్యానమున కవకాశము దొరకును. కాఁబట్టి యివియన్నియు భగవంతుని సర్వవ్యాపకునిగాఁ జూచుటకు మార్గములని యెఱుంగవలయును.

ఇప్పట్టునఁ గొలఁదిపంక్తులు వ్రాయవలసియున్నది. భగవంతునికరుణకుఁ బాత్రులుకావలయు నన్న భక్తియే ముఖ్యమార్గమని కొందరందురు. భక్తి భక్తి భక్తి యిని వదరుచున్న భగవంతుడగపడునా? ఇది కేవలము కపటనాటకసూత్రధారులకుఁ బితరులగుమాయయోగులమాటలు. "నిత్యయుక్తా ఉపాసతే" అని పలుమాఱులు శ్రీహరి పల్కెను.అనఁగా భావమేమి? భగవంతు నాత్మారాముగా ధ్యానించుటె. ధ్యానమునకుఁ బ్రధానాంగము మంత్రము. స్తోత్రాదులుకావు. అది భగవద్విభూతిని పావనచరిత్రమును దెలుపును. వీనిచేత మనస్సునందుఁ బరమేశ్వరుని ధ్యానించునూహ కలుగును. ధ్యానముచేయుటకుఁ బెక్కుమార్గము లుండవచ్చును. అందు మంత్రోపాసనమార్గమే

ప్రధానము. ఆమంత్రమునఁగల బీజాక్షరములు భగవద్రూపాక
ర్షణాక్షములై యుండును. కావునఁ దదుచ్చారణమున గొప్ప
ఫలముకల్గును. ఆయుచ్చారణమే ప్రధానమనుకొనిన లాభము
లేదు. మంత్రాధిదేవతారూపము హృదయదర్పణమునఁ బొడక
ట్టవలయును. ఆమంత్రబీజవర్ణము లాయాకృతితత్త్వమును దెలు
పును. సత్త్వరజస్తమోగుణములలో నేది ప్రధానమో యద్దా
నిని దెలుపునట్టిదియే మంత్రబీజవ్యూహము కార్యము. మంత్రో
చ్చారణము తద్రూపదర్శనము ననునీ రెండుకార్యము లితర
కార్యమున మనస్సు పోవకుండఁజేయుటకై యుపయోగింపవల
యును. అట్లుపయోగింపవేని సఫలములు కావండ్రు. ఇక్కార్య
మునకు యోగాభ్యాసము ప్రధానము. అదియే యుపాస
మనియుఁ జెప్పవచ్చును. భగవద్రూపము మనోదర్పణమున
సర్వదా ప్రతిఫలించునంతదనుకనే మంత్రముసాయము కావల
యును. అదియే యోగసిద్ధి. ఆవల మంత్రము నుచ్చరింప నక్క
ఱలేదు. సంతతధ్యానమున మనస్సలవాటుపడియుండును.
ఆవలిపని సర్వభూతములయందుండు పరమేశ్వరుని సమముగ
భావించుటయే. ఇది సాధుమార్గము. ఉపాసనమనఁగ నిట్టిదే కాని
వేఱుకాదు.

కొంద ఱలసులు అనఁగా వేషధారులు యోగులవలెఁ
దిరుగుచు భక్తిని బోధింతురు. ద్రవ్యార్జనముననే వారికి యోగ
సిద్ధి. వారిమాటలకు మోసపోవువారు పెక్కండ్రుకలరు. వారికి
మంత్రోపాసనమన నేమో తెలియదు. కావుననే వారు మంత్ర
ములు వ్యర్థము లందురు. మంత్రములు ప్రణవరహితములుగా
నైన నుండునుగాని నమశ్శబ్దరహితములుగా నుండవని వారు

ప్రేలుదురు. సీ! సీ! వారికి మంత్రరహస్యములే తెలియవు. నమశ్శబ్దరహితములగుమంత్రములే యధికసంఖ్యాకములు. ప్రణవరహితములే కొలఁదిసంఖ్యాకములు. ప్రణవమే ప్రాణము. మంత్రమునకుఁ బ్రాణము ప్రణవమే. అట్టిది లేకున్న వియుఁ గొన్ని కలవు. కాని తత్తుల్యబీజములు కొన్నిగలవు. అవియైన నుండుం డును. అవియు లేకున్న నది శాబరమంత్ర మనవలయును. ఇది దీనిరహస్యము. ఈవిషయమునఁ బరిశ్రమము చేయక యుపాస కులు కాక ధనార్జనమునకై వేషమును వేసికొని తమకంటె నజ్ఞాను లను గొందఱశిష్యులను జేర్చుకొని గురుమహిమ మపారమని తెలుపుచు ద్రవ్యములాగుచు వెఱ్ఱియోగములను గొన్నింటిని ఎప్పటికిని బనికిరానివానిని బోధించుచు బూటకపుమాట లతో నుపన్యాసవేదికల నిండించుచుఁ దిరుగుదురు. అంతతో నుండరు. ఇతరులనుదూలనాడుదురు. నిరంతరఫలాభిసంధిరహిత కర్మాచరణమొకయుపాసనము. అది స్వార్థమునఁగాక పరోపదే శార్థముగాఁ జేయుచునే యుండవలయును. జపము లేటికనువా రిమాటల నెంతమాత్రము నమ్మరాదు. వారికి జపమన నేమో తెలియదు. రామకృష్ణాదినామములఁ బఠించుట మేలు కాదనరా దు కాని దానికన్న జప ముత్తమోత్తమము. కావుననే "యజ్ఞా నాంజపయజ్ఞోఽస్మి"యని శ్రీహరియే బోధించెను. రామకృష్ణాది నామపారాయణమునమాత్రమే ముక్తి లభింపదు. ఏనాఁటికిని లభింపదు. మఱేమనిన దాన భగవంతునియం దాదరము కలు గును. కొంతకాలమున కాపారాయణము మనోమాలిన్యము నడంచును. దాన సత్కర్మానుష్ఠానమున కున్ముఖుఁడగును. ఇట్లు వరుసఁగా భగవంతుని గనుఁగొనుట కవకాశము కలదు. సర్వ

కాలనామజపముచేత నేమిగలుగునన్న సర్వకర్మఫలత్యాగము చేయునూహ కలుగు. ఇదియు నొకయుపాసనమే. కాని యింత కంటె విధివిహితమంత్రజప ముత్తమోత్తమ మనవలయు. సర్వకాలములందును నామజపముచేయుట యనఁగా సత్కర్మాచరణము ప్రాగ్జన్మమున సాగియుండినదనియే. దానికి ఫలమే యిది. దీనిచేత మంత్రజప ముత్తమము కాదని తిరస్కరింపఁబడదని యెఱుంగవలయు. జపమేటికి? తపమేటికి? అని కొందఱందురు. జపతపములకు భేదమేమో గొప్పదియున్నట్లు వారియూహ. దీనిచేతనే వారలసులని యిందలితత్త్వ మెఱుంగరని స్పష్టము. ఈరెండింటికి భేదము లేదనవలయు. రీతిభేదమే. విభీషణుఁడు బ్రహ్మనుగూర్చి తపస్సుచేసెననఁగా భావమేమి? ఆకర్షణబీజన్యాసపూర్వకముగా బ్రహ్మను ధ్యానించెననియేగాని వేఱుకాదు. మహర్షులు తపస్సుచేయఁగా నాతపోగ్ని ప్రజ్వరిల్లి లోకములఁ గాల్పఁబూనఁగా దేవతలు భగవంతునికడకుం బోయి యెఱింగించిరను పురాణములతాత్పర్యమేమి? అదియే జపపరాకాష్ఠయని యెఱుంగుఁడు.

అర్జునుని ప్రశ్నమునకుఁ దగినసమాధానము చెప్పఁబూని శ్రీహరి మఱియు నిట్లు పలికెను. కౌంతేయా! అవ్యక్తాసక్తతేజస్కులకు (నిర్గుణోపాసకులకు)నధికక్లేశము కలదు. సకలకర్మములునాకు నర్పించి నన్నుఁ బరమగతిగాఁ దలంచుచు ననన్యయోగమున ధ్యానించుచు నుపాసింతురో వారిని సంసారమునుండి యుద్ధరించువాఁడను నేనేయని యెఱుంగుము.-ఈమార్గమునీవు నవలంబింపుము. దాన నాయందే నీవుందువు. అనఁగా ముక్తి నొందుదువు. ఇట్టియభ్యాసమునందు శక్తి నీకుఁ జాలదేని.

యింకొక్కమార్గము కలదు. నన్ను గుఱించియే కర్మముల నాచరింపుము. దాన యోగసాధనబుద్ధి కుదురును. దానిమూలమున సిద్ధి నొందుదువు. ఆ కార్యమునకుం జాలవేని సర్వకర్మఫలత్యాగము నొనరింపుము. అని తెలిపెను. దీనిచేతనే సగుణోపాసనము నిర్గుణోపాసనమునకంటె నించుక యల్పమని తేలును. ఎంతసులభమార్గము నాశ్రయింతురో యంత యల్పఫలమని యేకదా దీనిసారము. దీనినుండి మనము గ్రహింపఁదగినభావమేమి? ప్రతిదేహికి నొక్కమార్గమే భగవదారాధనకుం దనుకూలము కాదనియు నాయాయికర్మముల నాచరించి తదనురూపముగా మాఱిన మనస్సుగలవారలకుఁ దదనుకూలమార్గ ముపదేశింపఁదగునని యామార్గము నమ్మి భగవంతు నారాధించినదానికంటె నుత్తమమార్గము తనంతన లభించునని చిట్టచివరకు నిర్గుణోపాసనమార్గము దొరకునని మన మెఱుంగవలయును. ఇదియే యీయుపదేశతాత్పర్యము. ఈమార్గమున నడుప నశక్తుండవైన నీమార్గము. ఇదియు వలనుపడదేని యీమార్గమని తెలుపుటకిదియే కారణముగాక యింకేమియుండును. ఇట్టి యీయుపదేశమునుండి మనము తెలిసికొని మనశక్తికిందేది యనురూపమని యూహించుకొని శక్తిచాలనిమార్గము నాశ్రయించి చెడక యనురూపమగుత్రోవ నాశ్రయించి భగవంతు నారాధింపవలయును. దాన నుత్తమపదము లభించుచునే యుండును.

ఇఁక సగుణోపాసనమునందును విగ్రహార్చన మధమాధమము. అనఁగాఁ బ్రథమసోపానము. లోహనిర్మితబింబములు దారుపాషాణనిర్మితప్రతిమలు ప్రధానములుగాభావించి యామ

రణము తదారాధనమే చేయుట ప్రథమసోపానమే. అది కేవల
పామరుల కుపయోగించును. పెద్దలుకూడిన నాచరించిరే యనఁ
గా లోకసంగ్రహార్థమే యనవలయు. విగ్రహార్చన మప్రధాన
మనుటకేకదా సాలగ్రామశివలింగములు. ఆదిత్యగణనాథాంబిక
లను నిరవయవములుగా నుంచి పూజించుటకు శాసించిరి. ఈ
దేవతాప్రతిమలు పీఠాలంకారములుగా నుంచుట కలదుకదా.
అభిషేకాదులు నిరవయవములకేకదా సాగును. దీనిరహస్య
మేమి? విగ్రహములు ప్రధానములు కావనియు నిరవయవము
ప్రధానమనియుఁగాక మఱేమగును. ఈసాలగ్రామాదివస్తువు
లుకూడఁ బ్రధానములు కావని మానసికపూజ చెప్పఁబడిన
దికదా. కావునఁ దొలుదొలుత విగ్రహరూపమునఁ బూజించి
యామీఁద సాలగ్రామాదినిరవయవమూర్తుల నర్చించి పిదప
మానసమున ధ్యానింపవలయును. ఇది నిశ్శ్రేణికాన్యాయము
ననుసరించుపద్ధతి.

ఈరీతిగా నీభక్తియోగము నుపదేశించెను. భక్తి
యనఁగా భగవంతునియందు నిరంతరప్రీతియే యని సాధు
మతము. అన్నిమార్గములందును భక్తి యుండవలయు. భక్తి
యం దన్నిమార్గము లుండవలయును. అనఁగా సత్కర్మాను
ష్ఠానము భక్తిమార్గమే యగునని భావము. ఇది యందఱ కుప
యోగింపకున్నను గొందఱ కుపయోగించును. ముఖ్యముగా
నీయధ్యాయమున యోగమార్గమే చెప్పఁబడినది. నాయందు
మనస్సు నిలుపుమనఁగా నదిగాక మఱేమిటి? ఇఁక నీవిషయము
నర్జునున కుపదేశించుటకుం గలసారమేమనఁగా నాప్రీతికై కర్మ
ములను జేయుము. వానిమూలమున సిద్ధిని బడయుదువు.

మనస్సు నాయందే నిలుపుము. కౌంతేయా! "మయ్యేవ మన ఆధత్స్వ మత్కర్మపరమో భవ, మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి." అనుటచేత నాకుఁ బ్రీతికరమైన దిపుడు సంగ్రామము. దానిని నాకొఱకుఁ జేయుము. మనస్సు నాయందు నిలుపుము. ఇది భగవత్కార్యము. చేయువాఁడు చేయించువాఁడును భగవంతుఁడే. నేను నిమిత్తమాత్రుఁడను, కర్తను గాను. అని చేయుమని యాదేశించుటయే యని యెఱుంగవలయును. ఇం దెచ్చోటఁగాని యాచార్యునకు సర్వమర్పింపవలయునని గాని భగవంతుఁడే యాచార్యుఁ డనిగాని భగవంతునికంటె నాచార్యు నెక్కుడుగా భావింపవలయుననిగాని చెప్పఁబడలే దనుట రూఢముగదా. ఏటికో నామధారులు కొందఱాచార్యులమని, ఆచార్యపూజయే ప్రధానమని, దానిని జేయకున్న భగవదనుగ్రహము కలుగదని యుపదేశించుచుందురు. వారల కధోగతియే కాక మఱేమగును? కపటయోగులకు జన్మాంతరమున నుత్తమగతి లభించుననుట కల్లగదా. ధనార్జనమునకుఁ బెక్కుమార్గములుండ నీభగవన్నామవిక్రయ మేల చేయవలయునో తెలియకున్నది. అట్టివారియుపదేశములకు లోఁబడక భగవంతుఁ డుపదేశించినమార్గమును జక్కగ నెఱింగి భగవంతు నుపాసించి తత్కరుణకుఁ బాత్రులుకావలయుననుటయే ప్రధానము.

శ్రీహరి తనకు నెవరియం దెక్కుడుప్రీతి యుండునో వారిలక్షణములు విశేషించి యిందుఁ దెలిపెను. ద్వేష మేజంతువునందు లేకుండుట, ఇంకను గొన్నిలక్షణము లందుఁగలవు. వానియం దొక్కఢానినేని యభ్యసించినను శ్రీపరమేశ్వరుకరు

ణకుఁ బాత్రుఁడు కావచ్చుననుట నిస్సంశయము. ఇట్టు లీభక్తి యోగమునఁగృష్ణమూర్తి ప్రియశిష్యునకుఁ గలసంశయములను దొలఁగించి తనకార్యముగా భావింపక భగవత్కార్యముగఁ దలంచి చేయుమని యుపదేశించెను. దీనిని బారాయణము చేయుటమాత్రము చాలదు భగవంతున కెట్టివానియం దె క్కుడుప్రీతియుండునో యందులకు లక్షణము లేవి చెప్పఁబడి నవో వాని నెఱింగి యభ్యసింపవలయు. అదియే తరణోపాయ మగును. ఇఁకఁ దరువాతియుపదేశమును బఠింపఁబూనుదము.

## ప్రకృతిపురుషవివేకయోగము.

(౧) ఇట్లు భక్తియోగమును బోధించి శ్రీకృష్ణపరబ్ర హ్మము మరల నర్జునుని కిట్లనియె. కౌంతేయా! ఈశరీరము క్షేత్రమని చెప్పంబడును. దీని నెవ్వఁ డెఱుంగునో యాతఁడు క్షేత్రజ్ఞుఁడని క్షేత్రజ్ఞులలక్షణముల నెఱింగినవారు పలుకు దురు. ఇంతకుముందే మృత్యుసంసారసాగరమునుండి వారల నుద్ధరించువాఁడను నేనని చెప్పితిని. ఆత్మాజ్ఞానలక్షణము మృ త్యువు. అట్టిదానినుండి యాత్మజ్ఞానముచేతఁ దప్ప వేఱొండు మార్గమున నుద్ధరింప వలనుపడదు. ఆకారణముచేత నెట్టి యాత్మజ్ఞానమున సంసారసాగరమునుండి మరలుట సిద్ధిం చునో, ఎట్టి తత్త్వజ్ఞానముగలవారు పూర్వోక్తాద్వేష్టృత్వాది గుణములుగలిగిన కర్మసన్న్యాసులుగ మున్ను చెప్పఁబడిరో

---

ప్రకృతిపురుషవివేకయోగః.

అర్జునఉవాచ.—ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవచ,

యట్టి యాత్మజ్ఞానము వివరింపఁదగును. అందు నద్వితీయుండగు పరమాత్మతోఁగూడినజీవునకు భేదము లేదనువిషయము ప్రధానము. సర్వవిధానర్థములు తద్భేదభ్రమహేతువులగును. మఱియు నందు సంసారులై ప్రతిక్షేత్రమును భిన్నలగుజీవులకు నేకారణమున నసంసారియు నద్వితీయుఁడు నగు పరమేశ్వరునితో నెట్లభేదంబగు ననుసంశయము కలుగును. అందులకుగా సంసారమును, భిన్నత్వము నను నివి యవిద్యాకల్పితములగు ననాత్మధర్మములైనకారణమున జీవునకు సంసారిత్వము, భిన్నత్వము నను నవి లేదని నిరూపింపవలయును ఆ నిరూపణముకొఱకు దేహేంద్రియాంతఃకరణరూపము లగు క్షేత్రములనుండి వివేచించి క్షేత్రజ్ఞుఁ డగుపురుషుఁడు, జీవుఁడు ప్రతిక్షేత్రము నొక్కఁడే నిర్వికారుఁడని తెలుపుటకొఱకు క్షేత్రక్షేత్రజ్ఞవివేకము చేయఁబడును. మున్ను రెండుప్రకృతులని తెల్పియుంటినిగదా వాని నెఱింగించుమూలమునఁ దత్త్వంబు నిరూపింపఁబూని యీవిషయమును జెప్పఁదలంచితినని యెఱుంగుము. ఈవిషయమును జక్కఁగా శ్రద్ధాయుక్తుఁడవై వినుము. (౨) భారతా! సర్వక్షేత్రములనుండు క్షేత్రజ్ఞుఁడను నేనే యని యెఱుంగుము. క్షేత్రక్షేత్రజ్ఞజ్ఞానమేదియో అదియే చక్కనిజ్ఞానమనినాయభిప్రాయము. దేహేంద్రియాదులకంటె విలక్షణుఁడై స్వప్రకాశుఁడై యుండు క్షేత్రజ్ఞునిఁ బ్రతిపాదించి యాక్షేత్రజ్ఞుని పారమార్థికతత్త్వమును, అసంసారియగు పరమాత్మతో నైక్యమును జెప్పఁదలంచియే

---

ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ. ౧. శ్రీభగవానువాచ.— ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే, ఏతద్యో వేత్తి తం ప్రాహుః

యీవిషయము నెఱింగించితినని యెఱుంగుము.(౩)ధనంజయా! ఆక్షేత్ర మేలాటిదో దానిధర్మము లెట్టివో ఎట్టివికారములు దానియందునో యెట్టి యాక్షేత్రములవలన నేకార్యములు కలుగుచున్నదో అంతియగాక యాక్షేత్రజ్ఞుఁ డెట్టివాఁడో యెట్టి యుపాధిచే నెట్టి ప్రభావములుగలవాఁడగునో యావిధ మెల్లఁ జాలసంగ్రహముగాఁ దెలిపెదను. ఇరువదినాలుగు భేదంబులచే భిన్నమైనట్టిప్రకృతియే క్షేత్రమని చెప్పఁబడినది వాస్తవమే. అయిన నది దేహరూపమునఁ బరిణమించిన యాప్రకృతియందే యహంభావమున నవివేకము స్పష్టమగుచున్నది. కావునఁ దద్వివేకార్థ మీశరీరము క్షేత్రమను విషయము చెప్పఁబడినది. దాని విస్తరించుటకై విశేషించి పలుకక తత్సారమును దెల్పుటకే యీప్రతిజ్ఞయని యెఱుంగుము. (౪) ఆక్షేత్రజ్ఞులయాదార్థ్యము వసిష్ఠాదిమహర్షులచే బహువిధములుగాఁ దెలుపఁబడినది. నానాశాఖలుగల ఋగాదివేదములచే వివేకమున సిద్ధాంతీకరింపఁబడినది. యుక్తియుక్తములయి నిశ్చితార్థబోధకములగు బ్రహ్మసూత్రపదములచేతను నిరూపింపఁబడినది. (౫-౬) సూక్ష్మమహాభూతము లైదును, దత్కారణమగు నహంకారమును' దత్కారణమైనబుద్ధియుఁ దత్కారణమగుమూలప్రకృతియు, నింద్రియములు పదియును, మనస్సును, శబ్దాదివిష

---

క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. ౨. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత, క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ. ౩. తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్, స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. ౪. బహుభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్, బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః. ౫. మహాభూతాన్యహం

యము లైదును స్థూలమహాభూతము లైదు, నిచ్ఛాద్వేషములును, సుఖదుఃఖములును, దేహేంద్రియసంఘాతమునం దభివ్యక్తమగు నంతఃకరణవృత్తియు, ధృతియు నీమొదలగు నంతఃకరణధర్మములును నివియన్నియు సంక్షేపమున వికారసహితము క్షేత్రమని చెప్పఁబడినది. (౭-౮) ఆత్మశ్లాఘనము లేకుండుట, అచరించుధర్మమును బయల్పఱుపకుండుట, ప్రాణికోటిని బాధింపకయుండుట, యితరులు తన కపకార మొనరించినను వికారము లేకుండుట, కపటము లేకయుండుట, ముక్తిసాధనోపాయము నెఱిఁగించు నాచార్యుని సేవలచే నుపాసించుట, దేహమును మనస్సును బరిశుద్ధములుగా నునుచుకొనుట, ముక్తిపథమున నిలుకడ కలిగియుండుట, దేహేంద్రియములను గుమార్గములఁ బోవకయుండ సన్మార్గమునందే నిలుచునట్లు నిగ్రహించుట, ఇహపరలోకములయందు శబ్దాదిభోగములయందు వైరాగ్యము, అహంకారరాహిత్యము, జన్మమరణములయందును వార్ధకమునందును, వ్యాధులయందును, దుఃఖరూపములివియనియు దుఃఖ మొక్కటే వీనిమూలమునఁ గలుగుననియు ననుసంధించుటయును. (౯) విషయములయందుఁ బ్రీతి లేకుండుటయుఁ బుత్త్రదారగృహాదులయందుఁ దానే యవి యను భావము పొడమకుండుటయు, నిష్టానిష్టములు ప్రాప్తించినను

---

కారో బుద్ధిరవ్యక్తమేవ చ, ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః. ౬. ఇచ్ఛాద్వేషస్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః, ఏతత్క్షేత్రం సమాసేన సవికారముదాహృతం. ౭. అమానిత్వమదంభిత్వమహింసా క్షాంతిరార్జవం, ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః. ౮. ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ, జన్మమృత్యుజరావ్యాధి

సర్వదా హర్షవిషాదములు లేక సమచిత్తము గలిగియుండుట యు. (౧౦) నాయందు ననన్యయోగముచేతఁ జలింపనిభక్తి కలిగియుండుటయు, భయరహితమై పవిత్రమైన యేకాంత ప్రదేశమున నుండుటయుఁ, బ్రాకృతజనసంఘమును వదలు టయు. (౧౧) ఆత్మానాత్మవివేకము సర్వకాలములయందును గలిగియుండుటయుఁ దత్త్వజ్ఞానఫలభూతమగు ముక్తి నాలో చించుచుండుటయు ననునీసాధనసమూహము జ్ఞానహేతు వగుటవలన జ్ఞానమనియే చెప్పఁబడుచున్నది. దీనికి విరుద్ధము లగు నమానిత్వము మొదలగునవి సంసారకారణము లగుట వలన నజ్ఞానంబనియుఁ జెప్పఁబడుచున్నదని యెఱుంగుము. (౧౨) కౌంతేయా! యిట్టిజ్ఞానముచేతఁ దెలియఁదగినదేదని శంకింతు వేమో వినుము. దానిఁ దెలిసినంతటనే మరల మరణము నొం దఁడు. మోక్షము నొందును. అది యనాదియయి నిరతిశయ మునగు బ్రహ్మము. దానిని సత్తు అనిగాని, యసత్తనిగాని చెప్ప శక్యముకాదు. అది సర్వశబ్దాదివిషయమునగు. (౧౩) అర్జునా! ఆబ్రహ్మము ప్రాణికోటియందంతటను హస్తచరణములు గలది యు, నేత్రములు శిరస్సులు ముఖములు గలదియు సర్వత్ర శ్రోత్రములుగలదియు నగును. అయ్యది సర్వంబును వ్యాపించి యున్నది. ఈసర్వదేహమునందలి పాణిపాదాదీంద్రియములన్ని

---

దుఃఖదోషానుదర్శనం. ౯. అసక్తిరనభిష్వంగః పుత్త్రదారగృహాదిషు, నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు. ౧౦. మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ, వివిక్తదేశసేవిత్వమరతిర్జనసంసది. ౧౧. అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనం, ఏతత్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా. ౧౨. జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యత్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే, అనాది

యు క్షేత్రజ్ఞునిసన్నిధానముననేకదా స్వవ్యాపారములు చేయ సమర్థములగును. కావున వీనివలన క్షేత్రజ్ఞుఁ డున్నాఁడనుట సిద్ధమగుచున్నది. క్షేత్రజ్ఞుఁ డనఁగా బ్రహ్మమే యగునని తెలియందగును. (౧౪) ఆజ్ఞేయ ముపాధిభూతములగు సర్వేంద్రియవ్యాపారములచే నవభాసిల్లునట్లుండును. కాని యడయన్నో వానివ్యాపారములచే వ్యాపారవంతముమాత్రము కాదు. ఎందుల కనఁగా నది సర్వేంద్రియ రహితము. కావున నయ్యది సర్వసంగవివర్జితము. ఐనప్పటికి నదియే సమస్తమునకు నధిష్ఠానము. ఇంతియగాక సత్త్వరజస్తమోగుణరహితమై యాగుణములను వానివ్యాపారముల నెఱుంగుచు నది యుండును. (౧౫) మఱియు నయ్యది సర్వప్రాణులను దేహములకును బాహ్యాంతరముల నున్నయది. ఈచరాచరాత్మకమైన దేహాభాసమంతయు నదియే యగును. అటు లయ్యును సూక్ష్మమగుట నజ్ఞుల కెఱుంగఁదరముగాదు. కావున వారికి దూరముననున్నది. విద్వాంసులకునాత్మయగుటవలన నిత్యము సమీపముననున్నది. (౧౬) ఆబ్రహ్మము పరమార్థమునఁ బ్రతిదేహమును విభాగము లేక యాకాశమువలె నేకముగానే యుండునది. అట్లయ్యును సకలప్రాణులయందును దేహములందే చూడఁబడుటవలన విభాగముగలదానివలె నవివేకులకుఁ దోఁచుచున్నది. అయ్యదియే స్థితికాలమునందు భూతావళిం బోషించుచున్నది. లయకాల

---

మత్పరం బ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే. ౧౩. సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖం, సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి. ౧౪. సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితం, అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ. ౧౫. బహిరంతశ్చ భూతానామచరం చరమేవ చ,

మున నెల్లర మ్రింగుచున్నది. మరల సృష్టికాలమునందు నుత్పత్తి చేయుచున్నది. ఎట్లనఁగాఁ గల్పితసర్పాదులను రజ్జ్వాదులవలెనే యని యెఱుంగుము. (౧౭) ఆజ్ఞేయము సూర్యాదిజ్యోతుల కును జ్యోతిస్సు. వానికింగూడఁ బ్రకాశము తానే యొసంగు చున్నది. అజ్ఞానమునకు మిగుల దూరమున నున్నది. తత్సం బంధములేనిదియునగు. పూర్వోక్తమగు నమానిత్వాదిజ్ఞానము, ఈచెప్పినజ్ఞేయము, ఈజ్ఞానముచేఁ బొందఁదగిన యాజ్ఞేయరూప మగుఫలము, ఈమూఁడును సర్వప్రాణులయందును నివసించి యున్నవి. సర్వస్థలముల నున్నను గానఁబడకపోయినచో నది జడమే కావలయునుగదా అని శంకింతువేమో యట్లుగాదు. స్వయంప్రకాశమై యది యున్నను రూపాదిహీనము కావున నింద్రియాదుల కగ్రాహ్యమనుట యుపపన్నమేకాని యనుప పన్నముకాదని యూహింపుము. (౧౮) భారతా! ఈరీతిగా క్షేత్రమును, జ్ఞానమును, జ్ఞేయమును సర్వశాస్త్రార్థము సంగ్ర హముగఁ జెప్పఁబడినది. పరమేశ్వరుఁడనగు నాయందుఁ బర మాత్మభావ రూపమగుభక్తిగలవాఁడీసమ్యగ్దర్శనమునొంది పరమాత్మభావమును (మోక్షమును) బొందుచున్నాఁడు (౧౯.) అర్జునా! మున్ను క్షేత్రక్షేత్రజ్ఞరూపమగు ప్రకృతిద్వ యము భూతములకునెల్ల సంభవస్థానమని చెప్పితినిగదా. ఆ యర్థమును విశదీకరించుచున్నాఁడను వినుము. క్షేత్రక్షేత్ర

---

సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ యత్. ౧౬. అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితం, భూతభర్తృ చ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభ విష్ణు చ. ౧౭. జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమసః పరముచ్యతే, జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య ధిష్ఠితమ్. ౧౮. ఇతి క్షేత్రం తథా జ్ఞానం

జ్ఞలక్షణములగు నీశ్వరుని పరాపరప్రకృతులు రెండును అనాదులని తెలియందగును. బుద్ధ్యాదివికారములను, సుఖదుఃఖాద్యాకారపరిణతములగు సత్త్వాదిగుణములను బ్రకృతిజన్యములని గ్రహింపుము. జగత్కారణమగుటవలనఁ బ్రకృతి యనాదియయ్యె. దానికిని గారణముకలదన్నయెడల ననవస్థాదోషము సంభవించును. సర్వజగమును వానిధర్మాధర్మములచేతనే ప్రయుక్తమగుటవలనఁ బురుషుండు ననాదియగును. ఇట్లు ప్రకృతి యనాది యని సిద్ధమగుటవలన నది భూతయోని యని మున్ను చెప్పినది యుపపన్నమగుచున్నదికదా. (౨౦) దేహేంద్రియాదులను సుఖదుఃఖమోహాదులను బుట్టించునదియగుటం జేసి ప్రకృతి సంసారమునకుఁ గారణముగాఁ జెప్పఁబడుచున్నది. పురుషుఁడుసుఖదుఃఖభోక్తయగుటచే సంసారమునకుఁ గారణముగాఁ జెప్పఁబడుచున్నాఁడు. (౨౧) పురుషుఁడు దేహేంద్రియాదిరూపములఁ బరిణమించి యుండుఁ బ్రకృతిని అది తానే యని తలఁచి పొందియున్న వాఁడగుటవలనఁ బ్రకృతిజము లగుసుఖదుఃఖాదిగుణములను నేనుసుఖినినేను దుఃఖిని అను మొదలుగా భుజించుచున్నాఁడు. వీనికి అవిద్యయే గాక యీప్రకృతిగుణములందు నాసక్తిగూడ దేవబ్రాహ్మణాద్యుత్తమయోనులందును బశ్వాద్యధమయోనులందును జన్మాదిసంసారమునకుఁ గారణము. కావున దానిని వర్జింపవలయును. అవికారియు జన్మరహితుఁడు నగువానికి భోక్తృత్వ మేలాగు

---

జ్ఞేయం చోక్తం సమాసతః, మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే. ౧౯. ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి, వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. ౨౦. కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృ

కలుగు ననుశంక దీనివలనఁ దీర్చుకొమ్ము. (౨౨) పార్థా! పై విష-
యమునే విస్తరించి చెప్పెదను. అవహితుఁడవు కమ్ము. ఈ దేహ
మునం దున్నయవ్యక్తాతీతుఁ డగుపరమపురుషుఁడు కార్యకార
ణములవగు వ్యాపారముల నన్నింటిని దాను నిర్వికారుఁడై
చెంతనుండి చూచుచున్న వాఁ డగుటవలన నుపద్రష్ట యనఁ
బడును. మఱియు వానివ్యాపారములను దాను నిరాకరింపక
యనుమోదించుటవలన ననుమంత యనియుఁ జెప్పఁబడును.
ఇంకను స్వచైతన్యముచేతనే వానికిస్వరూపధారణముచేయుట
వలన భర్త యని చెప్పఁబడును అంతియకాక తద్వృత్తులనన్నిం
టిని విభాగముచే నెఱుంగుటవలన భోక్తయనియు ననువదిం
పఁబడును. మఱియుఁ దాని వానికన్నింటికి నతీతుఁడై స్వతంత్రుఁ
డగుటవలన మహేశ్వరుఁడనియు, నవిద్యచే నాత్మత్వంబునఁ
గల్పితములగు దేహేంద్రియాదు లన్నింటికంటె నుత్కృష్టుం
డగుటవలనఁ బరమాత్మయనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. (౨౩)
అర్జునా! ఈరీతిగా నాత్మయే తాననియుఁ బ్రకృతియుఁ దత్కా-
ర్యములు నాత్మసంబంధులు కావనియు మిథ్యాకల్పితములనియు
నెవ్వఁ డెఱుంగునో యాతఁ డెట్టియాచారము గలవాఁడైనను
వెండియు జన్మము నొందఁడు. ఇఁక సదాచారముకలవాఁడైన
యెడలఁ జెప్పవలసినదేమి? (౨౪) కొంద ఱుత్తమాధికారులు
మనస్సు నేకాగ్రముగాఁ బ్రత్యగాత్మయందే నిలిపి ధ్యానముచేఁ

---

తిరుచ్యతే, పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే. ౨౧.
పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్, కారణం గుణసం-
గోఽస్య సదసద్యోనిజన్మసు. ౨౨. ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా
మహేశ్వరః, పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః. ౨౩.

బ్రత్యగాత్మయే పరమాత్మయని యెఱుంగుచున్నారు. మధ్యమాధికారులు కొందఱు గుణములు దృశ్యములనియుఁ దాను ద్రష్టయై తద్విలక్షణుఁడగు నాత్మయనియు విమర్శించి యిట్టి సాంఖ్యయోగముచేఁ గ్రమముగా నట్టిజ్ఞానము నొందుచున్నారు. కొంద ఱధమాధికారులు కర్మయోగముచేతఁ జిత్తశుద్ధి జ్ఞానోత్పత్తిద్వారమున నట్టివిజ్ఞానమును సంపాదించుచున్నారు (౨౫) పార్థా! పూర్వోక్తసాధనములలో నేదానిచేతనైన నాత్మ నెఱుంగుటకు శక్తిలేనివారు సజ్జనులవలన శ్రవణముచేసి తదుపదేశమును శ్రద్ధమెయి నుపాసింతురు అట్లు తమకు వివేకశక్తి లేక పరోపదేశమే ప్రమాణముగా నమ్మి యుపాసించువారును గ్రమంబున సంసారసాగరమును దప్పక తరింతురని నమ్ముము. మిక్కిలి మందమతుల కిదియే జ్ఞానసాధనమని యెఱుంగుము. (౨౬) భరతకులోత్తమా! స్థావరముగాని జంగమముగాని యేవస్తువు పుట్టుచున్నదో యది యంతయు క్షేత్ర క్షేత్రజ్ఞులయధ్యాసరూపమగు సంయోగమువలననే పుట్టుచున్నదని యెఱుంగుము. అధ్యాసము స్వరూపజ్ఞానమువలన నశించుం గావున జ్ఞానికి సర్వప్రపంచనివృత్తియై మోక్షము సిద్ధించును. (౨౭) బ్రహ్మమొదలు స్థావరాంతముగనుండు సర్వప్రాణులయందును నిర్విశేషుండై యవి నశించుచున్నఁదాను నశింపక యేకరసుండై యుండునట్టియాత్మను స్వరూపమున

---

య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ, సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే. ౨౪. ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా, అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. ౨౫. అన్యే త్వేవమజానంతశ్శ్రుత్వాన్యేభ్య ఉపాసతే, తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. ౨౬. యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజంగమం,

నెవ్వాఁడు చూచుచున్నాఁడో యతఁడే యాత్మజ్ఞుఁ డగును. (౨౮) అర్జునా! సర్వభూతములయందును సమానముగా నున్న యాత్మను నిర్విశేషునిగాఁ జూచుచున్న వాఁడు తన్నుఁదా హింసింపఁడు. అందువలనఁ బరమగతిని (మోక్షమును) బొందుచున్నాఁడు (౨౯) సర్వకర్మములు త్రిగుణాత్మకమగు భగవన్మాయయగు ప్రకృతిచేతనే చేయఁబడుచున్నవనియు, క్షేత్రజ్ఞుఁ డగు తాను నకర్త సర్వోపాధివర్జితుఁ డనియు నెవ్వఁడు తెలియుచున్నాఁడో యతఁడు పరమార్థము నెఱింగినవాఁడు. ఇట్టి నిర్విశేషుం డగునాత్మకు భేదము కలదనుటకుఁ బ్రమాణమే లేదు. (౩౦) సమ్యగ్దర్శనమునే విస్తరించి వచించెదను. అవధరింపుము. భూతముల భేదములెల్ల నాత్మయం దొక్కనియందే యున్నవి. ఇవన్నియు నాత్మయే యనియు, నాత్మవలననే వీని యుత్పత్తిసాగుననియు నెప్పుడు శాస్త్రములవలన నాచార్యోపదేశమువలన నెఱుంగుచున్నాఁడో యప్పుడే బ్రహ్మమే యగుచున్నాఁడు. (౩౧) అనాదియగుటను నిర్గుణుఁ డగుటను ఈ పరమాత్మ నిర్వికారుఁడు. అందువలన శరీరములయం దుండిన వాఁడే యైనను గర్మమును జేయఁడు. తత్ఫలముల నంటఁడు. (౩౨) ఆకాశ మెట్లు సర్వపదార్థములందును వ్యాపించియున్న

---

క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ. ౨౭. సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం, వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి. ౨౮. సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరం, న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిం. ౨౯. ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః, యః పశ్యతి తథాత్మానమకర్తారం స పశ్యతి. ౩౦. యదా భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి, తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా.

డైనను, సూక్ష్మమగుటవలన నేపదార్థముతో సంబంధింపదో అట్లే యాత్మ సర్వదేహములయందును వ్యాపించియున్నవాఁ డైనను దేహేంద్రియాదులతో సంబంధింపఁడు. (33) భారతా! ఎట్లు సూర్యుఁ డొక్కరుండే యీసమస్తలోకమును బ్రకాశింపఁజేయుచు నలిప్తుఁడై యున్నాఁడో అట్లు పరమాత్మ యొక్కఁడే మహాభూతాదిధృత్యంతమగు సమస్తక్షేత్రమును బ్రకాశింపఁజేయుచు నలిప్తుఁడై యున్నాఁడు. (34) ఈరీతిగా క్షేత్రక్షేత్రజ్ఞులవైలక్షణ్యమును, అవిద్యావిమోచనప్రకారమును జ్ఞాననేత్రమున నెవ్వరు తెలిసికొనుచున్నారో వారు పరబ్రహ్మము నొందుదురు.

ఇది ప్రకృతిపురుషవివేకయోగము.

మహనీయగుణభూషితులారా! ప్రకృతిపురుషవివేకయోగమను నీపదుమూఁడవయధ్యాయమును బఠించితిరి. దీని సారమేదని యించుక విచారింపవలయును. భగవంతుఁడు భక్తియోగానంతరమునందు నీవిషయము తెల్పెను. క్షేత్రక్షేత్రజ్ఞులకుఁ గలతారతమ్యము నెఱుంగునట్టిజ్ఞానమే నాకు సమ్మతమని శ్రీహరి యొఱిఁగించెను. పిదప జ్ఞానాజ్ఞానములకు లక్ష

31. అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాయమవ్యయః, శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే. 32. యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే, సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే. 33. యథా ప్రకాశయత్యేకః కృత్స్నంలోకమిమం రవిః, క్షేత్రం క్షేత్రీ తథాకృత్స్నం ప్రకాశయతి భారత. 34. క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ మంతరం జ్ఞానచక్షుషా భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాంతి తే పరం. 35.

ఇతి ప్రకృతిపురుషవివేకయోగః.

ణము లెక్కించెను. అందుఁ బరబ్రహ్మము సత్తుగాదు. అసత్తు గాదని బోధించెను. దానిస్వరూప మెఱింగించుచు సర్వము నావరించి యది యుండునని తెల్పెను. అది నిర్గుణ మనుటకు గుణభోక్త యనుటకును దగిననిదర్శనములు గనఁబఱచెను. సూర్యాదిగోళములయందు జ్యోతిస్సనునది యాబ్రహ్మమే యని తెల్పెను. అజ్ఞానమున కది దూరమనియు. దీనిచేఁ బరబ్రహ్మములేనిపదార్థము ప్రకాశింపదనియే మన మెఱుంగవలయును. ఇది యెఱింగిన నాభక్తుఁడు ముక్తినొందునని తెల్పెను. అనఁగా బ్రహ్మమన్నిజీవుల నుండునదియనియు నావిషయము నెఱుంగుటయే భక్తునికృత్యమనియు దాన ముక్తి దొరకు ననియుఁ గధా సారము.

ప్రకృతిద్వయము. ఈశ్వరుఁడు ఈరెండు ననఁగాఁ బ్రకృతిపురుషు లనాదులు. వీ రెప్పుడుపుట్టిరో యెఱుంగఁదర ముగాదు. ఆద్యంతములు లేనివారని భావము. వికారములు గుణములు ప్రకృతినుండియే కలుగును. అనఁగాఁ బ్రకృతి సర్వ సృష్టిపాలనలయకర్త్రి యని సారము. పురుషుఁ డనఁగాఁ బరబ్రహ్మము కారణమగు ననఁగాఁ దదిచ్ఛయే ప్రకృతిగానఁ దా నుదాసీనుఁడుగా నుండుననియుఁ దదిచ్ఛామాత్రమునఁ బ్రకృతి సర్వ వికారములనఁగా సకలబ్రహ్మాండముల నిర్మించుననియుఁ దాత్పర్యము. ఆప్రకృతియందుండి సర్వమును భగవంతుఁ డనుభవించున ట్లుండును. భగవంతుఁడు లేక పదార్థముండదు. ఇట్లు పురుషునియాథార్థ్యము నెవ్వఁ డెఱుంగునో గుణములతోఁ బ్రకృతి నెవ్వఁ డెఱుంగునో వానికిఁ బునర్జన్మము లేదనియు అనఁగాఁ బ్రకృతిపురుషులతత్త్వ మిది యని యెఱింగినవాఁడు

మరల జన్మింపఁడనియు ముక్తినొందుననియు భావము మనము గ్రహింపవలయును.

ఆత్మదర్శనమున బహూపాయములు కల్పింపఁబడినవనియు, ధ్యానము సాంఖ్యయోగము కర్మయోగము లోనగునవి యాయుపాయములనియు, నీయుపాయములలో నెద్దానిచేతను దత్త్వమెఱుంగఁజాలకున్నవాఁడు జ్ఞానులచేఁ జెప్పఁబడినవిషయమున శ్రద్ధగలిగియుపాసించినయెడల వారును దరింతురనియు శ్రీహరి యెఱింగించెను. ఏమార్గముననైనఁ దత్త్వమిది యని యెఱుంగుటయే ప్రధానమనియు భావము. ధ్యానసాంఖ్యయోగాదులంబట్టితత్త్వమెఱుంగఁజాలనివారు పెద్దలసేవించి వారుచెప్పినదానిఁ బదిలముగా నిడుకొని దానినే యుపాసించుచున్నయెడలభగవదనుగ్రహముకలుగునుగాన దానిచే వారును దరింతురనిసారము. భగవంతుఁడుసర్వత్రయుండియు వానినంటఁడనుటకాకాశముదాహరణముగాఁ జెప్పఁబడినది. ఈయుదాహరణము చేతనే భగవంతుఁడు తా సర్వవ్యాపియయ్యును గర్మబద్ధుఁడు కాఁడనియుఁ దేటఁపడును జ్ఞానచక్షుస్సుచే నెఱుంగుటకలవాటుపడినవాఁడు ముక్తుఁడగును. ఇట్టులీయధ్యాయమునఁ బ్రకృతిపురుషులకుఁ గలదారతమ్యము చెప్పఁబడినది. దీనినుండి మన మెఱుంగఁదగువిషయము లేవనఁగా ప్రపంచమంతయుఁ బ్రకృతి సంభవమనియు, నామెయే సర్వాధికారములుగలదనియుఁ, దదిచ్ఛామాత్రమున సకలబ్రహ్మాండములు కలుగుననియు, వానికన్నింటికి నధికారిపురుషులగుత్రిమూర్తులు లోనగువారిని నిర్మించునధికారము ప్రకృతిదే యనియుఁ, బరాత్పరుఁడు నామరూపాదులులేక సర్వవ్యాపియై యుండుననియుఁ, బ్రకృతి

యనఁగాఁ దదిచ్ఛయే యనియు, నామహాతత్త్వము నిచ్ఛామాత్రమునఁ బ్రకృతి యభివ్యక్తముకాఁగా సర్వసృష్టియు సంభవించుననియు, నయ్యది పరతత్త్వమున లీనమగుటయే ప్రళయమనియు, బ్రహ్మాదులు త్రిమూర్తులు పరాప్రకృతిచేతిబొమ్మలనియు, వీరే ముక్తిదాతలనియు నొకరికంటె నింకొక్కరు గొప్పవారని వాదించుట యవివేకమనియుఁ బ్రకృత్యతీతుఁడు బ్రహ్మమే యనియు, దాని నెఱింగినఁగాని ముక్తి సాధ్యము గాదనియు, దానినెఱుంగుట కనేకమార్గములు కలవనియు, సందేమార్గమున నుపాసించినను భగవత్తత్త్వము నెఱుంగుట కవకాశము కలదనియు నివియేయని మనమెఱుంగవలయును. ఇఁకఁ దరువాతి భగవదుపదేశవిధిని బఠింతము.

## గుణత్రయవిభాగయోగము.

౧ ప్రకృతిపురుషవివేకయోగమును దెలిపినపిదప శ్రీభగవంతుఁ డిట్లు పలికెను అర్జునా! మున్ను ప్రకృతిస్థత్వమును, గుణములయందు సంగమును సంసారహేతువని తెలిపితిని. ఏగుణమునం దెట్లు సంగము? గుణము లేవి? ఆగుణము లెట్లు బంధించును? ఆగుణములనుండి విముక్తి యెట్లు కలుగును? ముక్తునిలక్షణం బెద్ది? అను నీవిషయములఁ దెలుపవలసియు

---

గుణత్రయవిభాగయోగః.

శ్రీ భగవానువాచ.—పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమం, యత్ జ్ఞాత్వా మునయస్సర్వేపరాం సిద్ధిమితో గతాః. ౧. ఇదం జ్ఞానముపాశ్రిత్యమమ సాధర్మ్యమాగతాః, సర్గేఽపి నోపజాయంతే ప్రళ

న్నది. ఏజ్ఞానమునొంది మునులందఱు నీసంసారబంధమునుండి మోక్షమును జెందిరో, అట్టి పరమాత్మవిషయమును, సర్వజ్ఞానములలో నుత్తమము నగుజ్ఞానమును నే నింతకుమున్ను చెప్పియున్నను మరలఁ జెప్పుచున్నాఁడను. (౨) ఈజ్ఞానమును యథోక్తసాధనానుష్ఠానముచే సంపాదించి నాతో నైక్యము నొందినవారు సృష్టియందు జనింపరు. ప్రళయమునందు నాశనమును జెందరు ఈసిద్ధినియతంబని యెఱుంగునది. (౩) భారతా! సర్వభూతములకు నుత్పత్తిస్థానమైనట్టినాయొక్కమాయ త్రిగుణాత్మిక, ప్రకృతి సర్వకార్యములకంటె గొప్పదియగుటవలనను, సర్వకార్యములను వృద్ధినొందించున దగుటవలనను మహాబ్రహ్మమని చెప్పఁబడుచున్నది. నేను దానియందు హిరణ్యగర్భాదిసర్వభూతములకును జననకారణమగు బీజము నునుచుచున్నవాఁడను. అందువలన హిరణ్యగర్భుఁడు లోనగుసర్వభూతములకును జన్మము కలుగుచున్నది. (౪) కౌంతేయా! దేవతిర్యఙ్మనుష్యాదిసమస్తయోనులయందును, దేహరూపములగు నేయేయాకృతులు పుట్టుచున్నవో వానికన్నింటికినాయాయవస్థతోఁ గూడిన ప్రకృతియే కారణము. నే నీశ్వరుఁడను. తండ్రివలెనే గర్భము నునుతును. దేవాదిదేహవిషయములకుఁ గారణాంతరములు సంభవించుచుండఁగా సర్వభూతములకును దానినుండియే యుత్పత్తి యెట్లని ప్రశ్నింతువని యూహించియే యీ విషయమును దెల్పితిని. (౫) మహాబాహూ! గుణములేవి? అవి

---

యే న వ్యథంతి చ. ౨. మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహం, సంభవస్సర్వభూతానాం తతో భవతి భారత. ౩. సర్వయోనిషు కౌంతేయ మూర్తయస్సంభవంతి యాః, తాసాం బ్రహ్మ మహద్యోనిరహం బీజప్రదః పితా. ౪. సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః, నిబ

యెట్లు బంధించును? అనుశంకకు సమాధానము నాలకింపుము. సత్త్వమని, రజస్సని, తమస్సని, గుణములు మూఁడును బ్రకృతి వలనఁ బుట్టుచున్నవి. అవిగుణములవలెనే క్షేత్రజ్ఞునాశ్రయించి నవై తాను వాస్తవమున వ్యయరహితుఁడై దేహమునందు "ఇదినేను ఇదినాది" యను నధ్యాసముగల క్షేత్రజ్ఞుని బంధించు నట్లు కనఁబడుచున్నవి. (౬) నిష్పాపుఁడా! అందు సత్త్వగుణము నిర్మలమగుటవలనఁ బ్రకాశము నిచ్చునదియు నేలాటియుపద్రవ ము లేనిదియు నై యున్నది. మఱియు నయ్యది విషయసుఖము నందు సంగమును అంతఃకరణధర్మమగుజ్ఞానమునందు సంగమును బొందించి జీవుని బంధించుచున్నది. (౭) కౌంతేయా! రజోగు ణము రాగరూపమనియుఁ, దృష్ణకు, నసంగమునకుఁ గారణమ నియు నెఱుంగుము. అది దృష్టాదృష్టార్థము లగుకర్మముల యందు నాసక్తి నొందించి యాత్మను బంధించుచున్నది. (౮) భారతా! తమోగుణ మజ్ఞానసంభవమగునదియు, నెల్లజీవుల కును మోహముకలిగించునదియు నని యెఱుంగుము. అది ప్రమాదము, నాలస్యమును, నిద్రను బొందించి జీవుని బంధిం చుచున్నది. (౯) భారతా! జీవుని సత్త్వగుణము సుఖాసక్తు నిగ నొనరించుచున్నది. రజోగుణము కర్మమునం దాసక్తునిగాఁ జేయుచున్నది. తమోగుణము సత్త్వకార్యమగుజ్ఞానము నావ

---

ధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్. ౬. తత్ర సత్త్వం నిర్మల త్వాత్ప్రకాశకమనామయం, సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ. ౭. రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగసముద్భవం, తం నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్. ౮. తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినాం, ప్రమాదాలస్యనిద్రాభిస్తన్నిబధ్నాతి భారత. ౯. సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత, జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత. ౧౦.

రించి ప్రమాదమున నాసక్తిగలవానిగాఁ జేయుచున్నది. (౧౦) భారతా! ఈకార్యములు గుణము లెప్పు డెప్పుడు చేయుననియె. దవేమో వినుము. సత్త్వగుణము రజస్తమోగుణములఁ దిరస్క రించి తా నెప్పుడు వృద్ధినొందునో అత్తరుణమునందు జ్ఞాన సుఖాదుల నొసంగుకార్యము నారంభించును. రజోగుణముకూడ సత్త్వతమస్సుల మించి తాఁ జెలరేఁగునపుడు కర్మసంగాదిస్వకార్యము నారంభించును. అట్లుతమోగుణ మెప్పుడు సత్త్వరజస్సుల నతిశయించినపుడు జ్ఞానావరణము లోనగుస్వకార్యములఁజేయ నారంభించును. (౧౧) ఇపు డీగుణ మారంభించినదని యెఱుంగుటకుఁ జిహ్నము లేవని ప్రశ్నింతువేమో వినుము. అర్జునా! ఈదేహమునందు నాత్మకు నుపలబ్ధిద్వారము లగుకర్ణములు లోనగునింద్రియములమూలమునను బుద్ధివృత్తిరూప మగు జ్ఞాన మెపుడు విస్పష్టముగాఁ గలుగుచున్నదో యపుడు సత్త్వ గుణము వృద్ధినొందెనని యెఱుంగుము. (౧౨) భరతర్షభా! రజోగుణము వృద్ధినొందునపుడు పరద్రవ్యమును గ్రహించు నాశయుఁ బ్రవృత్తియుఁ గర్మములఁ బ్రారంభించుటయు హర్ష రాగాదులను బొందుటయు సర్వసామాన్యవస్తువులయం దాశ యుననునివి కలుగుచున్నవి (౧౩) కురునందనా! తమోగుణము చెలరేఁగినపుడు మిగుల నవివేకము, ప్రవృత్తిలేక యూరకుండుట, ప్రమాదము మోహము నను నివి కలుగుచున్నవి. (౧౪).

రజస్తమశ్చాభిభూయసత్త్వం భవతి భారత, రజస్సత్త్వంతమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా. ౧౦ సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే, జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత. ౧౧. లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమస్పృహా, రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ. ౧౨. అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ, తమస్యేతాని

మరణకాలమునందుఁ బెంపొందినసత్త్వాదులకు ఫలవిశేషమును జెప్పెద. ఆలకింపుము. జీవుఁడు సత్త్వము వృద్ధినొందియుండున పుడు మరణముగల్గునేని మహదాదితత్త్వవేత్తలు పొందు నిర్మలములగు నుత్తమలోకములను బొందును. (౧౫)జీవుఁడు రజోగుణము వృద్ధినొందియుండుతఱి మృతిఁబొందినయెడలఁ గర్మాసక్తిగలమానవజాతియందుఁ బుట్టును. ఆరీతిగానే తమోగుణాభివృద్ధికాలమునఁ దనువును వదలినఁ బశువులు లోనగువాని యందుఁ బుట్టుకంగాంచు. (౧౬) అర్జునా! సాత్త్వికకర్మములకు సాత్త్వికము నిర్మలము నగుఫలము సంభవించును. రాజసకర్మమునకు రాజసమనంబడు దుఃఖము ఫలమగును. తామసకర్మమునకుఁ దామసమగు నజ్ఞానము ఫలమని తత్త్వవిదులు వక్కాణింతురు. (౧౭) సత్త్వగుణమువలనఁ జక్కనిజ్ఞానము కలుగును. రజోగుణమువలన లోభము కలుగును. తమోగుణమువలనఁ బ్రమాదమోహములు నజ్ఞానమును గలుగును. (౧౮) సత్త్వగుణప్రయుక్తము లగుజ్ఞానకర్మములయం దుండువారు దేవతాదులయందుఁ బుట్టుదురు. రజోగుణప్రయుక్తకర్మములయం

---

జాయంతే వివృద్ధే కురునందన, ౧౩ యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాతి దేహభృత్, తదోత్తమవిదాం లోకానమలాన్ ప్రతిపద్యతే. ౧౪. రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే, తదా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే. ౧౫. కర్మణస్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలం ఫలం, రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్. ౧౬. సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ, ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ. ౧౭. ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః, జఘ

డుండువారు మానవజాతి జన్మింతురు. తమోగుణప్రయుక్తకర్మములయందుండువారు పశ్వాదులయందు జనింతురు పూర్వోక్తత్రిగుణచిహ్నములచేత నివిగుర్తింపఁబడును.(౧౯)కౌంతేయా! పూర్వోక్తకార్యకరణక్షమము లగుగుణములే కర్తలుగాని వానికంటె నన్యుఁ డెవ్వఁడును గర్తలేఁడని జ్ఞాని యెప్పు డెఱుంగునో గుణవ్యాపారసాక్షిభూతమగు నిర్గుణబ్రహ్మమునుగాఁ దన్నెఱుంగునో యప్పుడాజ్ఞానిమద్భావము నొందుచున్నాఁడు. ప్రకృతిగుణములచేఁ గలుగుసంసారమును విస్తరించిపలికి తద్వివేకమునఁ గలుగుఫలమగుముక్తిని దెలిపితినని నిశ్చయింపుము. (౨౦)మాయోపాధిరూపములగుచు దేహముపుట్టుటకు హేతువులగు నీసత్త్వాదిగుణములను మూఁడింటి నతిక్రమించి విద్వాంసుఁడు జన్మమృత్యుజరాదుఃఖములచే ముక్తుఁడై జీవించి యున్నయప్పుడే మద్భావరూప మగుముక్తి నొందుచున్నాఁడు.

(౨౧) ఇట్లు జీవించియున్నప్పుడే గుణములమించి యమృతమును బొందుచున్నాఁడని శ్రీహరి నిర్వచనముచేయఁగా విని యర్జునుఁడు గుణాతీతునిగుర్తులను, వానియాచారమును, గుణాతీతుఁ డగుటకుఁ దగినయుపాయము నెఱుంగఁ గోరినవాఁడగుచు నిట్లు ప్రశ్నించెను.సర్వలోకప్రభూ ఈమూఁ

---

న్యగుణవృత్తస్థా అధో గచ్ఛంతి తామసాః. ౧౮. నాన్యంగుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి, గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి. ౧౯. గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్, జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే. ౨౦. అర్జునఉవాచ.—కైర్లింగైస్త్రీన్ గుణానేతానతీతో భవతి ప్రభో, కిమాచారః కథం చైతాం స్త్రీన్గుణానతి

డుగుణముల నతిక్రమించినవాఁ డేచిహ్నములు గలిగియుం డును? అతనియాచార మెట్టిది? ఎట్లు మఱి యీమూఁడుగుణ ముల నతిక్రమింపవచ్చును? నాకుఁ దెలుపుము. (౨౨) ఇట్లు ప్రశ్నింపఁగా విని శ్రీభగవంతుఁ డిట్లనియె అర్జునా! సత్త్వ రజస్తమోగుణకార్యములగు ప్రకాశప్రవృత్తిమోహములు కలుగఁగా గుణాతీతుఁడు వాని ద్వేషింపఁడు. అవి నివృత్తి నొందఁగా వానిని గోరఁడు. మున్నే "స్థితప్రజ్ఞస్య కా భాషా" యను మొదలగుప్రశ్నములను జేసితివి. "ప్రజహాతి యదా కామాన్" అను మొదలగునుత్తరములను జెప్పితిని. వానికే మఱియొకమార్గమును దెలియంగోరి యడుగుచున్నావని యెఱింగి యీసమాధానమును వచించితిని. (౨౩) కౌంతేయా! రెండుపక్షములుగాఁజేరి వాదించునపు డందేపక్షమునఁ జేరక యుండు మధ్యస్థునివలెఁ దాను కూటస్థుఁడనని తెలిసికొని దేని యందును సంబంధమును గలుగఁజేసికొనక యవిక్రియారూపుఁ డై యుండు నేపురుషునిగుణములు అవి తమలోఁ దొంటి యందుఁ బ్రవర్తించుచున్నవేకాని తన కేమియు సంబంధ మందు లేదని నిశ్చయించుకొని యెవ్వఁడు తనస్వరూపావస్థ నుండి చలింపక యట్లే యుండునో యతఁడు గుణాతీతుఁడని యెఱుంగవలయును. (౨౪) దుఃఖసుఖములు ప్రాప్తించినపుడు సమానుఁడై సర్వదా ప్రసన్నుఁడై మృత్పాషాణకాంచనములు

---

వర్తతే. ౨౧. శ్రీభగవానువాచ.—ప్రకాశంచ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ, న ద్వేష్టి సంప్రవృత్తాని నివృత్తాని న కాంక్షతి. ౨౨. ఉదా సనవదాసీనో గుణైర్యో న విచాల్యతే, గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే. ౨౩. సమదుఃఖసుఖస్స్వస్థస్సమలోష్టాశ్మకాంచనః, తుల్యప్రియా

మొదలగువానిని దుల్యముగాఁ గాంచువాఁడయి ప్రియాప్రియములయందు సమానుఁడై స్తుతినిందలయందు సమదృష్టిగలిగియుండు వివేకబుద్ధిసంపన్నుఁ డెవఁడో యతఁడు గుణాతీతుఁడగును. (౨౫) అర్జునా! తన్ను సమ్మానించినను నిందించినను సముఁడై మిత్రామిత్రపక్షములందు సమవృత్తిగలవాఁడై దేహయాత్రకుఁ గావలసినదితప్పఁ దక్కినసమస్తకర్మములను బరిత్యజించినవాఁ డెవ్వఁడో వాఁడే గుణాతీతుఁడగును. (౨౬) ఎవ్వఁడు సకలభూతహృదయములనున్న సర్వేశ్వరుని నన్ను సర్వదా నిశ్చలమగుభక్తియోగముచేత సేవించుచుండునో వాఁడు సత్త్వరజస్తమోగుణముల నతిక్రమించి జీవన్ముక్తుఁడు కాఁగలఁడు. (౨౭) పార్థా! అమృతము, నవ్యయము, నిత్యము, జ్ఞానయోగ మనుధర్మముచేతఁ బ్రాప్యము, నిత్యానందరూపము నగు బ్రహ్మమునకు నేనే ప్రతిష్ఠను, బ్రహ్మశక్తిరూపుఁడను. నేనే బ్రహ్మము. కావున నన్నే భజింపుము.

ఇది గుణత్రయవిభాగయోగము.

సాధుమనీషులారా! గుణత్రయవిభాగయోగ మనునీయధ్యాయమును బఠించితిరి. ఇద్దానినుండి మనము గ్రహింపఁదగుసార మేదని యించుక విచారింతము. భగవద్భక్తుఁగు

---

ప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః ౨౪. మానావమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః, సర్వారంభపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే. ౨౫. మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే, స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. ౨౬. బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమమృతస్యాఽవ్యయస్య చ, శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ. ౨౭.

ఇతి గుణత్రయవిభాగయోగః.

బుద్ధిమహాత్త్వమున మనము నెమకుట యపరాధము కాదు. కాని మన మూహించినను సద్విషయసారము తెలియరానిచోఁ బెద్దలు తెలిపినయెడల వారి నాక్షేపించుటమాత్రము మహాపరాధము. భగవంతుఁ డీవఱకే తెల్పియున్నయభిప్రాయమును మరల నిందుఁ జెప్పఁబూనెను ఏల? ఈవిషయమును విన్నపిదప మఱికొన్నివిషయములు తనవలన విన్నయర్జునునకు మరల నీవిషయమును చెల్పినఁ దత్సారము చక్కఁగా మనస్సునకుఁ బట్టుననియే కాని కాలక్షేపార్థము కాదు. అందులకే "జ్ఞానానాం జ్ఞానముత్తమమ్" అని తెలిపెను. పూర్వోక్తవిషయములు విన్నమీఁద నిది మరల విన్నఁ గృతకృత్యుఁడగునని శ్రీకృష్ణపరమాత్మ యూహించినట్లు మనము నిశ్చయింపవచ్చును. జ్ఞానమనఁగా దేనినెఱింగివఁ బరమగతి లభించునో యదియేకదా. ముక్తియనఁగాఁ బునర్జన్మ మెప్పటికిని లేకుండఁ జేయునదియే కదా. అట్టిజ్ఞానమునే యిపుడు మరల నర్జునునకు నుపదేశింపఁ బూనెను.

అర్జునా! సర్వభూతములను బుట్టించునది నామాయ. అది త్రిగుణాత్మకప్రకృతి యనంబడు. మహాబ్రహ్మమని దానినే పిలుతురు. ఆనామాయయందు బ్రహ్మ మొదలు సకలభూతములకు జననకారణమగు బీజము నునుచుచున్నాఁడను. అద్దానివలన బ్రహ్మాదులు కలుగుచున్నారని తొలుదొలుత నుపదేశించెను. ఇందేమిసారముగలదు? బ్రహ్మాదులు ప్రకృతిసంభవులనియు, ఆప్రకృతి నాది యనియు, అదియుఁ దనయంతఁ దాను బుట్టుననియు నన్నెడఁబాయదనియు, దాని మూలమున జగత్సృష్టి మొదలగుకార్యముల నొనరింతుననియేకదా సారము. ప్రకృత్యతీతుఁడు పరంధాముఁ డొక్కఁడే. ఆతఁడే నేను.

తక్కుంగలవారంచటు ప్రకృతివశంవదులు. సకలభూతములకు జనయిత్రి ప్రకృతి. అదియు మదిచ్ఛయే. ఇందుచేతనే సాక్షి మాత్రుండను నేనయితిని. సర్వకార్యములు నేనే యొనరించుచో నాకు నియామకుండు వేఱొకం డుండవలయుంగదా! కావున దేవాదులయందుం గలుగుభూతజాలమునకు నేనే బీజప్రదుండనని యెఱుంగుము.

ఈయుపదేశమున నర్జునున కొకశంక మది నంకురించెను. ఏగుణములెట్లు బంధించును? అనునదియే యాతనిశంక. ఆసందేహము నెఱింగిన పరమేశ్వరుం డిట్లు సమాధానము చెప్పెను. ప్రకృతి మూండుగుణములను బుట్టించెను. సత్త్వమని, రజస్సని, తమస్సని వానినామములు. అవియే యవ్యయుండగు దేహిని బంధించుచున్నవి. అందు నేయేగుణమున కేలక్షణములు. వానివలన నేయేఫలములు గలవని ప్రశ్నింతువేమో వినుము. అని వానిగుణములను తత్ఫలములను దెలిపెను. మఱియు నాగుణములలో నేది ప్రధానముగా నుండునో యదిగలవారేచోట నుత్పత్తియగుదురో యాసిద్ధాంతము నెఱింగించెను. ఈగుణములను మూండింటి నతిక్రమించి యనంగా వీనివికారముల నెఱింగి వానికి లోంబడక వానికంటెం బర మేదియని తర్కించి నన్నుం గనుంగొనువారు నాపదము నొందుదురని శ్రీహరి నొక్కి వక్కాణించెను. దీని తాత్పర్యమేమి? సర్వము ప్రకృతివికారము. ఆవికారములలోం జిక్కి తత్తఱిల్లక యింకెట్లు దాంటుదునని గుటకలు మ్రింగక దాని నుపాసించి తదనుగ్రహపాత్రుండై నన్నుం బ్రకృత్యతీతునిగా నెవం డెఱుంగునో వాండు నాభావము నొందును. ఎఱుంగు టెట్లనంగా గుణవ్యాపారసాక్షిభూతునిగా నిశ్చయిం

చుటయేగాని వేఱుకాదు. త్రిగుణముల నతిక్రమించు టెట్లు? ఈవ్యాపారములన్నియు గుణజన్యములు. వీనికి లోఁబడకుం డినఁగాని సంసారనివృత్తి కాదు. అని తలపోయుచు నెట్టులేఁ గష్టపడి యోగము నభ్యసించి మనస్సును బరిశుద్ధమగునట్లు చేసికొని ప్రకృతి నాశ్రయించి తదతీతుఁ డగుపరాత్పరుని ధ్యానించుటయే యని యెఱుంగుము. ఈయుపాయము తక్కుంగలయుపాయములలో నుత్తమోత్తమము. తక్కుం గల యుపాయములు సాపాయములు. ఇదియొక్కటియే నిరపా యము. ఈమార్గము దొరకు టెట్లు? సత్కర్మముల నాచరించి ఫలాభిసంధిరహితుఁడై యుండినఁగాని యీయూహ పొడ మదు. సత్కర్మములు పెక్కువిధములు. అందు జపయోగ ముత్తమోత్తమము. దాని ననుష్ఠానమున నాశ్రయించిన నదియే యిది తరణోపాయమని యామార్గమును జూపును. తక్కుంగల మార్గములు వ్యర్థములా యన్నఁ గావనవలయు. కాని యవి ద్రావిడ ప్రాణాయామమువంటివి. కాన వానిని మాని యీ మార్గము సులభమని, ద్రవ్యార్జనశ్రమ మక్కఱలేనిదని, యితరసహాయము నపేక్షింపనిదని, ప్రాయశ్చిత్తములు లేనిదని, దేహశ్రమ మన్నింటికంటెఁ దక్కువగనుండునట్లు చేయునదని తలంచుచు నాత్రోవ నాశ్రమింపవలయు.

ఏగుణము ప్రధానమని కనుఁగొనుటకుఁ గొన్ని దృష్టాం తములు తెల్పెను. ఒక్కనియలవాటులంబట్టి వీనితనువున నేగు ణము ప్రధానముగా వ్యాపించియున్నదని మనము కనుఁగొనుట కాలక్షణములు తగియున్నవి. దానిం గాంచి యాగుణము నెఱుం గవలయును, ఆవల వాని త్రిప్పులకు లోఁబడనట్టి యలవాటు

గలిగియుండవలయును. భక్తి సాంద్రరీతిగా నుండఁగా భగవం
తుని విధివిహితముగా నారాధించువాఁడు ముక్తుఁడగును.
ఇట్టు లీయధ్యాయమున శ్రీకృష్ణుఁడు గుణత్రయవిభాగము
దానినుండి ముక్తిదొరకుమార్గమును దెలిపి యర్జునుని బవిత్రాం
తఃకరణుం జేసెను. ఈగుణత్రయవిభాగము తెలుపుటవలనఁ గర్మ
ముల నొనరించునపు డేగుణము నాశ్రయించినవృత్తితోఁ జేసిన
దదనురూపమగుఫలము గలుగుననియుఁ గావున సర్వదా కర్మా
చరణమునందు సత్త్వగుణముగా నుండునట్లు గట్టిప్రయత్నము
చేసి తాఁ జేసినకర్మమును భగవదర్థమని సంకల్పింపవలయుననియు
నట్టికర్మ మనంతఫలదమై తుదకు భగవత్సాక్షాత్కారమును
గల్పింపఁజాలుననియు మనము గ్రహింపవలయును. మఱియు
భగవంతుఁడు సాక్షిమాత్రుఁడే యనియుఁ గర్మములే ఫలముని
చ్చుననియు మనము విశ్వసింపవలయును. ఈవిశ్వాసమున వే
ఱొకలాభము కలదు. సుఫలముగాని దుష్ఫలముగాని మనకుఁ
గలుగునపుడు దానికి మనముచేసినకర్మమే హేతువుగాని
యితరులుగారనియు నితరులనుగాని యితరమతములను నితర
దేవతలనుగాని నిందించు టెంతయు దుష్కార్యమనియు, నది
మనపురోభివృద్ధిని బాడుచేయుననియు మనము చక్కఁగా
నెఱుంగవలయు. ఇంతకంటె గొప్పలాభ మేదికలదు? ఇట్టిలాభ
మును బాడుచేయు ప్రయత్నమే మనము నిరంతరము చేయం
బూనక మనము తరించునుపాయము వెదకు టుచితము. ఇఁకఁ
దరువాతిభగవదుపదేశ మెట్టిదో మన మరయుదము.

## పురుషోత్తమప్రాప్తియోగము.

(౧) గుణత్రయవిభాగ యోగము నుపదేశించినపిదప నర్జునుఁ డేమియుఁ బ్రశ్నింపక యూరకుండఁగా నిఁక నీతనిమ నస్సు కుదుటఁబడినది. కర్మసిద్ధాంతము తెలిసికొనినాఁడు. యోగమున నియతుఁడగుచున్నాఁడు. కర్మములకర్మఫలము, జ్ఞాను లజ్ఞానఫలము నాయధీనము లేహేతువుననగునో యట్టి నన్ను భక్తియోగమున సేవించినవారలు నాయనుగ్రహపాత్రులై జ్ఞాన ప్రాప్తమూలమున గుణముల నతిక్రమించి ముక్తినొందుదురు. కావున నిక నీశిష్యునకు నాతత్త్వసార మెఱిఁగింపవలయు. ఇఁకఁ జేయవలసినప్రశ్న మేమని యాలోచించుచు నేమడిగిననేమందు నోయని లజ్జించుచున్నవాఁడు. వేగముగ నాతత్త్వము నెఱిం గించెద. అని యాలోచించి స్వీయామేయతత్వసారము నెఱిఁ గించువాఁడై యిట్లు పలికెను. అర్జునా! ఈసంసారవృక్షముమా యామయముసుమా! ఈసంసారవృక్షమునకు బ్రహ్మమే మూ లము (వేరు) దానిక్రింద నొప్పుచుండుమహాదహంకారతన్మా త్రాదులు శాఖలవంటివి. వృక్షమును ఆకులు కప్పుకొని కాపాడురీతిని ఆసంసార వృక్షమును గర్మకాండరూపము లగువేదములు ధర్మాధర్మతత్ఫలబోధములగుచు నాచ్ఛాదించి కాపాడును. ఈమహావృక్షము ఆద్యంతములులేని దేహపరం పరను గల్గించునట్టిదైనను నశ్వత్థ మనఁగా రేపుగూడ నుండ నిది (క్షణకాలమున నశించునది) అని వేదములు చెప్పుచున్నవి. అట్టి యీసంసారవృక్షమును మూలసహితముగా నెవ్వఁడెఱుం

---

పురుషోత్తమప్రాప్తియోగః.

శ్రీభగవానువాచ.— ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్య

గునో, యాతఁడు సర్వవేదములయర్థము నెఱింగినవాఁడగును. మూలభూతబ్రహ్మముతో నీసంసారవృక్షతత్త్వము నెఱింగినవాఁడు కర్మకాండరూపసకలవేదసారము నెఱింగినవాఁడగును. (౨) ఆసంసారవృక్షమున కేయవయవము నవయవకల్పనము నింక వినుము. మానవులు మొదలుకొని స్థావరములవఱకుఁ గ్రిందుగాను, మర్త్యలోకము మొదలు సత్యలోకమువఱకును మీఁదుగాను, ఆయాజీవులయొక్క జ్ఞానకర్మఫలములు సత్త్వరజస్తమోగుణములచేత వృద్ధినొంది శబ్దాదివిషయములే పల్లవములుగాఁ గల్గినవగుచు, నాభవమహీరుహమునకు శాఖలుగా వ్యాపించియున్నవి. మఱియు ముందుముందుగా నున్నకర్మములవలనఁ గలుగు రాగద్వేషాదులు వాసనలు మూలములరీతిగా (వేరులవలె) ధర్మాధర్మరూపకర్మమునకును గారణములగుచునట్లే క్రిందుగను మీఁదుగను మర్త్యలోకమునందంతటను వ్యాపించియున్నవి. ఊర్ధ్వాధోలోకములయం దేది యనుభవింపఁబడినదో తత్తద్భోగవాసనలచేతఁగాదే కర్మవృక్షమున మర్త్యలోకమును బొందినవారలకుఁ దదనురూపములగు కర్మములయందుఁ బ్రవృత్తికలుగుచున్నది. ఈలోకమునందే కర్మాధికారముకదా. ఇతరలోకములయం దదిలేదు. అకారణముచేతనే మర్త్యలోకమని చెప్పఁబడినదని తలంపుము.(౩) కౌంతేయా! ఈసంసారవృక్షస్వరూపమింతగా వినుతించినట్లు ఎవ్వరికిఁగాని సంసారావస్థయందు గానరాదు. అట్లేదీనియంతము మొదలు మధ్యభాగము

---

యం, ఛందాంసి యస్యపర్ణాని యస్తం వేద స వేదవిత్. ౧. అధశ్చోర్ధ్వం చ ప్రసృతాస్తస్యశాఖాగుణప్రవృద్ధా విషయప్రవాళాః, అధశ్చ మూలాన్యనుసంతతాని, కర్మానుబంధీని మనుష్యలోకే. ౨. నరూపమస్యేహ తథోపల

గూడ నించుకంతయైనఁ గనంబడదు. ఈరీతిగా నంతటను మూల ములుపాఱి పాదుకొనియున్న యీసంసారభూరుహమును దృఢ వైరాగ్యఖడ్గముచేత సబీజముగా నఱికివైవవలయును. (౪) పార్థా! ఈసంసారమహీరుహమెల్ల నేపురుషునినుండి కల్గినదో సర్వమున కాదిభూతుఁడగు నాపరమాత్మనే శరణుచొచ్చు చున్నాఁడనని తదితరముల నన్నింటిని విసర్జించి తదేకశరణుఁడై సంసారవృత్తమున కవ్వలనుండు నా పరాత్పరునే వేదాంత వాక్యములమూలమునఁ జక్కఁగా విచారించి తెలియవల యును. వాని నెఱింగి తద్భావమునుబొందినవారు మరల సం సారమును జెందరనుట నిశ్చితము. (౫) ఫల్గునా! అహంకారా వివేకములు లేనివారును, సంగదోషమును జయించినవారును, నిరంతరముగాఁ బరమాత్మస్వరూపపర్యాలోచనమును జేయు వారును, కామములనెల్ల వదలినవారును, సుఖదుఃఖాదిద్వంద్వ ముల నిర్జించినవారునునై యజ్ఞానమును వదలినసాధువులు పూర్వోక్తమై యపునరావృత్తిక మగునిరుపమానపదమును బొందుదురు. పరిమార్గణపూర్వకముగా భగవత్పదము నొందు వారల కివి యంగాంతరములని యెఱుంగందగు. (౬) పూర్వో క్తపరమపదమునే విస్తరించి యింకను దెలిపెదను. పార్థా!

---

భ్యతే నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠా, అశ్వత్థమేనం సువిరూఢ మూలమసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా. ౩. తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తంతి భూయః, తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ. ౪. నిర్మానమోహాజితసంగ దోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః, ద్వంద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞై ర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్. ౫. న తద్భాసయతే సూర్యో న

స్వయంప్రకాశతేజోరూపమగు నెట్టిపదమును సూర్యచంద్రా గ్నులుకూడఁ బ్రకాశింపఁజేయఁజాలరో మఱియు దేనిని బొం దిన వారికిఁ బునరావృత్తి లేదో అట్టిదియే నాపరమపదమగును. (౭) సంసారమునందు భోక్తయని కర్తయని ప్రసిద్ధినొందిన సనాతనుఁడగుజీవుఁడు ఘటాకాశము మహాకాశముగాఁదోఁచు చందమున ట్లుపాధివశంబునఁ బరమాత్మనగునాయంశముగాఁ దోఁచుచున్నవాఁడు. అట్లు వాస్తవముగ నాలోచింప నాకంటె నభిన్నుఁడైనను, ఆయవిద్యాకృతోపాధిచేతనే మనస్సుతోడ, నింద్రియములతోడను సంబంధించియుండుటవలన సంసారము నొంది యాయింద్రియముల నాకర్షించుచున్నాఁడు. సుషుప్తి ప్రళయములయందు నాయంశములగుటవలన సర్వజీవులకు నాయందు లయము గలుగుటచే మత్పదప్రాప్తికలుగుట వాస్త వము ఐననవిద్యాసమావృతుఁడై యనుశయసహితుఁడైనవానికి సప్రకృతికుఁడనగునాయందు లయమగుంగాని శుద్ధునియందు లయము లేదనియెఱుంగుము.అందువలనమఱియుసంసారమునకు నిర్గమించునవిద్వాంసుఁడు ప్రకృతియందు బీజములైయుండు సోపాధిభూతములగునింద్రియముల నాకర్షించుచున్నాఁడు. విద్వాంసుఁడన్ననో శుద్ధస్వరూపమునొందుటవలనఁ బునరా వృత్తి యతనికి లేదని యెఱుంగుము. (౮) దేహాదిసంఘాతమున నకుఁ బ్రభువగుజీవుఁ డెప్పుడుతనువును వదలిపోవుచున్నాఁడో యప్పుడు మనస్సుతో నాఱగునింద్రియముల నాకర్షించు చున్నాఁడు. ఎప్పుడు వేఱొకతనువును బొందుచున్నాఁడో

---

శశాంకో న పావకః, యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ.
౭. మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః, మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. ౮. శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రా-

యప్పుడు వాయువు పుష్పాదులనుండి గంధములను సంగ్ర హించునట్లు ఆమనస్సుతో నాఱగు నాయింద్రియములను దీసి కొనిపోవుచున్నాఁడు. ఆకర్షించి యేమిచేయు ననుసందేహము తొలఁగుట కీవిషయమును దెల్పితినని యెఱుంగుము. (౯) పార్థా! శ్రోత్రాదులగునింద్రియములను వీనిలోపల నొక్కొక్కదా నితోఁ గలిసినమనస్సు నధిష్ఠించి దేహమునం దీజీవుఁడు శబ్దాది విషయముల సేవించుచున్నాఁడు. (౧౦) ఇట్లు దేహమును వదలి పోవునపుడుగాని వెండియు దేహము నొందియున్నపుడుగాని శబ్దాదుల ననుభవించునపుడుగాని సుఖదుఃఖమోహముల నొం దునపుడుగాని యీయాత్మ తమస్వరూపమే కావునఁ దేటతె ల్లముగా నెఱుంగదగినవాఁడై యున్నను విషయభోగవశత్వ మున బహువిధములుగా మూఢులుగా నుండువారు దీని నెఱుంగకున్నారు. ఇది విచారకరము. వివేకదృష్టిగలవారుమా త్రమే యెఱుంగఁగలరు. కార్యకరణవ్రాతముననుండి వివేచించి యిట్టియాత్మ నెల్లవార లేకారణమున నెఱుంగఁజాలరని సంశ యింతువేని అందుల కిదియే సమాధానము. (౧౧) సమాహిత చిత్తముగలిగి శ్రవణాదికము చేయువారుమాత్రమే తమ బుద్ధి యందున్న యీయాత్మ నీతఁడే నేనని స్వస్వరూపంబున నెఱుంగఁ గల్గుదురు. తపస్సుచేత నింద్రియనిగ్రహము చేతను జిత్తసంస్కా రముసొందని యవివేకులు శ్రవణాదికమును జేసినను గూడ నీ

---

మతీశ్వరః, గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్. ౮. శ్రోత్రం చక్షుస్స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ, అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే. ౯. ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణా న్వితం, విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః. ౧౦. యతంతో

యాత్మ నెఱుంగఁజాలరు. (౧౨)సూర్యచంద్రాగ్నులయందుండు నేతేజస్సుసమస్తలోకములఁ బ్రకాశింపఁజేయుచున్నదో ఆ తేజస్సు నాదని తెలియుము. అనఁగా సూర్యచంద్రాగ్నులయందుఁగల యేచైతన్యజ్యోతి లోకముఁ బ్రకాశింపఁజేయుచున్నదో యట్టి చైతన్యజ్యోతి నాదని యెఱుంగుము. (౧౩) అర్జునా! నేను భూమిని బ్రవేశించి యందలిస్థావరజంగమభూతముల నన్నిఁటిని నాబలముచేత నిలువరించుచున్నాఁడను. నేనే రసాత్మకుఁడగుచంద్రుఁడనై యోషధులనన్నింటిని బుష్టినొందించుచున్నాఁడను (౧౪) ప్రాణులజఠరమునందుండు వైశ్వానరహుతవహుఁడనై నేనే ప్రాణులదేహమును బ్రవేశించి ప్రాణాపానవాయువులతోఁ గూడి భక్ష్యభోజ్యలేహ్యచోష్యరూపచతుర్విధాన్నమును బక్వముచేయుచున్నాఁడను. (౧౫) శిష్యుఁడా! నేను సర్వప్రాణులబుద్ధియందాత్మనై యున్నాఁడను. ఆత్మనగునావలననే సర్వప్రాణులకును బూర్వజన్మకర్మానుసారముగాఁ బుణ్యకర్ములకు స్మృతిని జ్ఞానమును, బాపకర్ముల నాచరించినవారలకు నాస్మృతిజ్ఞాననాశమును గలుగుచుండును. వేదములన్నింటిచేతను నెఱుంగవలసినపరమాత్మను నేనే. లోకమున వేదాంతా

---

యోగినశ్చైనం పశ్యంత్యాత్మవ్యవస్థితం, యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః. ౧౧. యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం, యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకం. ౧౨. గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా, పుష్ణామి చౌషధీస్సర్వాస్సోమో భూత్వా రసాత్మకః. ౧౩. అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః, ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం. ౧౪. సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తస్స్మృతిర్జ్ఞానమపోహనం చ. వేదైశ్చ సర్వై

ర్థసంప్రదాయమునకుఁ బ్రవర్తకుఁడగువాఁడను నేనే. వేదా
ర్థమెల్ల నెఱింగినవాఁడను నేనే యని తెలిసికొనుము (౧౬)
పార్థా! ఇపుడు నారాయణాఖ్యపరమాత్మయే క్షరాక్షరోపాధు
లచేఁ బ్రవిభక్తుండని నిర్ధారణమొనర్చి నిరుపాధికుఁడై కేవలుఁ
డనంబడునాత్మస్వరూపమును నిరూపించుచున్నాఁడను. చక్కఁ
గా వినుము. సంసారమున క్షరుఁడని, యక్షరుఁడని, యిర్వురు
పురుషులు గలరు. వారిలో సర్వకార్యరాశి క్షరుఁ డనంబడు.
సర్వసంసారబీజమైన భగవంతుని మాయాశక్తియే యక్షరుం
డనఁబడునని తెలిసికొమ్ము (౧౭) అర్జునా! ఈక్షరాక్షరపురుషుల
కంటె నుత్తముఁడగు పురుషుఁడు క్షరాక్షరముల యుపాధి
దోషమునంటక వీరికంటె మిక్కిలి విలక్షణుఁడై యున్నాఁడు.
అవిద్యాకల్పితులగు దేహాద్యాత్మలకంటెఁ బరముఁడగు నాత్మ
కావున వానిని బరమాత్మయని వేదాంతములు (ఉపనిషత్తులు)
చెప్పుచున్నవి. ఆపరమాత్మయే తనచైతన్యబలశక్తిచేత బ్రపం
చమునంతయు వ్యాపించి తనవ్యాప్తిచేతనే సర్వమును భరిం
చుచున్నాఁడు. అతనినే యవ్యయుండనియు నీశ్వరుఁడగు నారా
యణమూర్తి యనియుఁ జెప్పుదురు. (౧౮) అశ్వత్థ మను పేరు
గల సంసారమాయావృక్షరూపముగల క్షరపురుషు నతిక్ర
మించి నేనాసంసారవృక్షమునకుఁ బీజభూతమగు నజ్ఞానమగు
నక్షరపురుషునికంటె నుత్కృష్టుండనై యున్నవాఁడను. కాఁబట్టి

---

రహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహం. ౧౬. ద్వావిమౌ పురుషౌ
లోకే క్షరశ్చాక్షర ఏవ చ, క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే
౧౭. ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః, యో లోకత్రయ
మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః. ౧౮. యస్మాత్క్షరమతీతోఽహమక్షరాదపి

ప్రసంగమునందును శ్రుతియందును బురుషోత్తముఁ డనునామము నాకుఁ బ్రసిద్ధమైయున్నది. (౧౯) భారతా! పూర్వము తెలిపినట్లు సర్వాత్మత్వము లోనగువిశేషణములతోఁగూడిన యీశ్వరుని నన్ను, ఇపుడు తెల్పినట్లు క్షరాక్షరాతీతతత్త్వమునఁ బురుషోత్తముఁడని ప్రసిద్ధుఁడైనవానిని విమోహుఁడై యేపురుషుఁడు "ఇతఁడే నేను" నని తెలిసికొనుచున్నాఁడో యాతఁడు సర్వాత్మబుద్ధిగలవాఁడగుచు సర్వవేత్త కాఁబట్టి సర్వజ్ఞుఁడే యగును. సర్వాత్ముఁడనై వెలయు నాయందే నిలచినచిత్తము గలవాఁడగుచు సర్వభూతములయందున్న నన్నే పొందుచున్నవాఁడు. (౨౦) ఈయుపదేశ మెట్టిదో చెప్పెదను వినుము. నిష్పాపుఁడవగు నోయర్జునా! గీతాశాస్త్రము నర్థమును సర్వవేదార్థమును సంగ్రహముచేసి పరమరహస్యమైన యీశాస్త్రమును నీకుఁ జెప్పితిని. నాయుపదేశించినరీతిగా దీని నెఱింగినవాఁడు జ్ఞానియై కృతార్థుఁ డగును. వాని కిఁకఁ గర్తవ్యమేమియు నుండదు.

ఇది పురుషోత్తమప్రాప్తియోగము.

జిజ్ఞాసువులగు నోమహనీయులారా! పురుషోత్తమప్రాప్తియోగమను నీగీతాధ్యాయమును బఠించితిరి. పేరును బట్టియే దీనియుపయోగము తెలియవచ్చుచున్నది. కర్మయోగ

---

-చోత్తమః, అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. ౧౮. యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమం, స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత. ౧౯. ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయానఘ, ఏతద్బుద్ధ్వా బుద్ధిమాం స్యాత్కృతకృత్యశ్చ భారత. ౨౦.

ఇతి పురుషోత్తమప్రాప్తియోగః.

మున కిది ఫలము కర్మయోగానుష్ఠానమునఁ జిత్తము పరిశుద్ధ ముకాఁగా నాపావనత్వమునకు యోగము ప్రధానాంగము కాఁగా దానికిఁ బ్రతిఫలముము క్తియే యను టెల్లరకు స్పష్టమే. కావుననే భగవంతుఁడు ముక్తినిబొందుమార్గము తెలుపుటకే యీయధ్యాయగతవిషయము నుపదేశించెను. ఇంతదనుక నుపదేశించినవిషయముల కన్నింటికి నిదియే ఫలమని మన మెఱుంగవలయును. ఎన్నికర్మముల నాచరించినను, ఎన్నివిధ ముల భగవంతు నారాధించినను ఎన్నియోగముల నభ్యసించి నను దుదకుఁ గాఁగలఫలము ముక్తియే. కావున నర్జునునకు నీవిషయము తెలిపెను. ముందు మహాసంగ్రామము కాఁబోవు చుండఁగాఁ దదనురూపమగు విషయజాతము నుపదేశింపక ముక్తి యేల యుపదేశించెనని ప్రశ్నింప నవకాశము కలదు. కర్తృత్వము తనకులేదని యర్జునుఁ డెఱుంగవలయును. దాన నహంకారము మానును. గమ్యస్థానమన నేది? అను నాలో చనము కలుగును. అది నివర్తించినఁగాని కార్యము సాగింప వలనుపడదు. గమ్యస్థానము నేనే యని శ్రీహరి తెలుపఁబూను టెంతయు సమంజసముగా నున్నదనక తప్పదు. దీనిచేత సకల కార్యములకుఁ దన్నే యాశ్రయింపవలయునని యర్జునుఁ డెఱుంగవలయు నను నుద్దేశముచేతనే కావలసినవిషయముల నెల్లం దెలిపెను. కాఁబట్టి దీనిచేతఁ బ్రకృతకార్యమునకుఁ బ్రతి బంధమేదియు రాఁబోదు. పురుషోత్తమప్రాప్తి యనఁగా మోక్షము. అదియే యెల్లరకు నెన్నిజన్మములకేని ప్రాప్యము. అది యొకతావు కాదు. అందొకసింహాసనము లేదు. వానిపై నెవ్వరు కూరుచుండియుండరు. ఆచోటు ద్వీపమున లేదు. ఈమోక్షార్థి

యెచ్చటికిఁబోయి యాఫలము నొందవలయునన్న యెడల సమాధానము రాదు. ఏల? "ఎచ్చటికిఁ బోయి" యన్న మాట కర్థము లేదు. ఒక్కచోటని నిర్ధారణము చేయఁగానే యదిక్షరమను వాదమునకు బదులు లేదు. ఒక్కస్థలమన్న యెడల నది నశ్యము గాక తప్పదు. ఏవస్తువుకాని నశింపని దేలోకమునను లేదు. కావున నది యెట్టిదన్న ప్రశ్నము రావలసినదేకదా. భగవంతుఁడనఁగా వైకుంఠముననో కైలాసముననో సత్యలోకముననో యుండువాఁడని చెప్ప నవకాశము లేదు. సర్వవ్యాపకుఁ డన్న నామ మాతని కప్పుడు చెల్లదు. ఆచోటు స్థిరమన్న యెడల వస్తు నిర్దేశము చేసినట్లగును. పదార్థములయం దొక్కటి స్థిరమన్న వాద మసంగతము. సర్వాంతర్యామి యగుభగవంతుఁ డొక్కఁడే స్థిరమన్న వాదమే సద్వాదమని యెల్ల రంగీకరించిరి. శ్రుతులదియే తెలుపంబూనినవి. సకల పురాణములు దానినే నిర్దేశించెను. కావున వైకుంఠాదిలోకములలో నొక్కతావు ముక్తిస్థానమని నిర్వచించుట కేవలాజ్ఞానము.

"ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావృత్తినోఽర్జున,
మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే."

యని యింతకుముందే శ్రీహరి తెల్పెనుగదా ఒక్కనిర్దిష్టస్థలము శాశ్వతము కానేరదు. ఆవిషయమే యీయుపదేశమునఁ గన్పట్టెడిని. దానినెఱుఁగఁగోరి తత్సారము నించుక చర్చింతము.

సంసారమునుండి విరక్తుఁ డెవ్వఁడగునో వానికే భగవత్తత్త్వజ్ఞానమునం దధికార ముండును. కాని వేఱొకకారణమునఁ గానేరదు. కావున నింతకుముం దుపదేశించినట్టి పరమేశ్వరాధీనప్రకృతిపురుషసంయోగకార్యమగుసంసారమును వృక్షరూ

పమునఁ గల్పించి వైరాగ్యమును దెలిపి యావృక్షమును వర్ణిం
చి దానిని ఛేదించువిధము దెలిపెను. సముద్రాదిరూపములసంసా
రమును వర్ణింపక వృక్షరూపమున నేల వర్ణించెనని కొందఱు
ప్రశ్నింతురు. ఇట్టిప్రశ్నముల కనవస్థాదోషము సంభవించును.
కాన వర్ణించినదానిని బరిశీలింతము. ప్రస్తుతమగు గుణాతీత
త్త్వమునకు వైరాగ్య ముపాయమగును. కాన నూర్ధ్వమనఁగాఁ
బరబ్రహ్మము. ఏల? అది సర్వోత్కృష్టము. ఎందుల కనఁగా నా
పరబ్రహ్మము స్వప్రకాశపరమానందముగదా! అదియే మాయ
చేత నీసంసారభూరుహమునకు మూలము. అధశ్శబ్దస్వారస్య
ముచేత నిటీవలివారలు కార్యోపాధులునగు హిరణ్యగర్భా
దులు గ్రహింపఁబడుదురు. వారు నానాదిక్కుల వ్యాపించి
యీవృక్షమునకు శాఖలవలె నున్నారు. కాఁబట్టి యాతరువధ
శ్శాఖ మయ్యెను. అశ్వత్థము. అతి శీఘ్రముగా నశించునది. ఎల్లి
యే నుండునదికాదు. కావున నశ్వత్థ మనుపేరు పెట్టఁబడినది.
ఇట్టిదాని నవ్యయమని యేల చెప్పుదురు? అన్న నది యాద్యంత
ములులేని దేహాదిపరంపరకు నాశ్రయము. ఆత్మజ్ఞానములేక
నశింపనిది. అట్టులగుట నవ్యయమనియు నంతము లేనిదనియు
శ్రుతిస్మృత్యాదులు ఘోషించుచున్నవి. ఇట్టి దీనిస్వరూపము
నెఱింగినవాఁ డెవ్వఁడే నుండిన నాతఁడే వేదవిదుఁ డగును.
ఇతరులు కారని యెఱుంగఁదగును.

ఇట్టి రూఢమూలమగు సంసారవృక్షమును వదలిపోవుట
కొక్కటియే యుపాయము కలదు. దీనిని ఛేదించియే పోవల
యును. కల్పితవృక్షమును ఛేదించు టెట్లు? అసంగ మనునదియే
యొకశస్త్రము. శస్త్రసహాయమున వృక్షచ్ఛేదనము చేయుచంద

మున నసంగమనఁగా దానియం దాసక్తి లేకుండుట. కాఁబట్టి యసంగశస్త్రమున దీని బాధలంటకుండఁ దప్పించుకొనవలయు. అనఁగా నిస్సంగుఁడు కావలయు ఎల్లరిం జేర్చుకొని వారిచే మర్యాదలందుచు వారిని దరింపఁజేయఁబూనినట్లు నటించుచు నింకను సంగమును బెంచుకొని తా నందులో మునిఁగి నశిం పక నిస్సంగుఁడు కావలయును. తనను దరింపఁజేసికొనలేనివాఁ డితరులఁ దరింపఁజేయుననుట పరిహాసాస్పదము. ఏకాంతవాస మును గోరవలయు. అది లభించినఁగాని సంసారబాధలు తొలం గవనుట రాజమార్గము. ఏశంకలు లేవు. ఎవ్వఁడు సంగవర్జితుఁడు కాఁడో వాఁడు సంసారియే యగును కాని సంసారవిముక్తుఁడు కాఁజాలఁడు. అట్టివారు శుకాదులు కారా యన్న నగుదురు కాని వారు నిస్సంగులై యుండి పరిపక్వజీవులను దరింపఁజేయు పొంటె నాసమయమునఁ బొడచూపి వారి కామార్గమును తెలి పి పోవుదురు. వారినే కూడి వ్రేలాడుచుండరు.

అర్చావతారము లనేకములు గలవు. వాని నన్నింటిని బూజించిన ముక్తి రాదాయని ప్రశ్నింపరాదు. వానిం బూజిం చినఁగాని దృఢభక్తి కుదురదు. ఆరూపము హృదయగమ్యము కావలయును. దారు పాషాణమయముగా నుండ నర్చించుట ప్రథమసోపానము. సర్వవ్యాపకత్వ మాపరతత్త్వముదగుట సర్వప్రాణియం దారూపమే పొడకట్టవలయు. ఆస్థితియందు భేదబుద్ధి నశించును ఏకత్వమే దృఢమగును. అట్టి దృఢవిశ్వా సముగలవారలకు నసంగత్వ మలవడుట శ్రమముకాదు. అతి సులభము. వారికిఁ బరమపదము లభించుట యనఁగా దన్మయ త్వము నొందుట యచ్చెరువుకాదు. ముక్తిస్థానమును వర్ణించిన

భాగము నుంత పరికించిన నాచోటిట్టిదని స్పష్టమగును. సూర్య శశాంకులు హుతవహుఁడు ప్రకాశింపఁజేయఁజాలనిస్థానమేదో యట్టి నిరుపమానస్థానము నాది. అనికదా భగవదు క్తి. అనఁగా సారమేమి? నిరుపమానతేజస్సు నాస్వరూపమని కాదా. అది యొకస్థానము కాదని యింతకంటె వేఱుగఁ జెప్పవలయునా? సూర్యునియందుఁ దుహినదీధితియందుఁ గలతేజస్సు నాదని భగవంతుఁడు బోధించెను. దీనిభావమేమి? తేజోధాముఁడను నేనని నా తేజస్సులేనితావు ప్రకాశింపదనియుఁ గాదా. ముక్తి యనఁగాఁ దన్మయత్వ మొందుటయే కాని యొకద్వీపమున నొక యారామమున నొకసరస్తటమున నొకసౌధమున నొకరత్న సింహాసనమున నెన్నియో చేతులు గలపురుషునికడఁ జేతులు జోడించుకొని యుండుట కాదు. అట్టిస్థితి ముక్తి యనఁబడునని వచింప నించుకంతయు నవకాశము లేదు.

మఱియు నేను భూమియందు వ్యాపించి సర్వభూత ముల ధరించుచున్నాఁడను. చంద్రుఁడనై సర్వౌషధులఁ బోషించుచున్నాఁడనని శ్రీకృష్ణుఁడు వచించెను. సర్వము మన్మయ మనుట కింకేయుదాహరణములు కావలయును? కావున నో మహాశయులారా సర్వవ్యాపకుని నిరంజనుని బరాత్పరుని నిశ్చల భక్తి సేవించిన ముక్తిగలుగునని యీ యుపదేశసారము కావున స్వల్పవిషయములలో భేదములఁ బాటింపక భగవత్సేవచేయు టయే పరమపురుషార్థము. సర్వదేవతాస్వరూపుని సర్వతేజో మయుని భగవంతుని మదిని ధ్యానించి తద్వ్యతిరిక్తము ప్రపంచమున నించుకంతయు లేదని విశ్వసించి నిరంతరయోగాభ్యాసబలమున సర్వప్రాణులయందుండు నేకరూపమును గనుఁగొనఁ

బ్రయత్నింపవలయును. శివవిష్ణ్వాదిరూపభేదములంబట్టుకొని కలహించుచుఁ దమపురుషార్థమును బోఁగొట్టుకొనక తమకుఁ దరణోపాయ మేదని యాలోచించుకొని సాధుసమ్మతమార్గము ననుసరింపవలయును. సంసారసంగవర్జితుఁడు కానిచో ముక్తి దొరకదు. కావున నట్టియభ్యాసమున నిరతులము కావలయును. ఇంకఁ దరువాతివిషయమును బఠింతము.

దైవాసురసంపద్విభాగయోగము.

(౧) అర్జునా! సర్వప్రాణులప్రకృతులు దైవియు నాసురియు రాక్షసియు నని మూఁడువిధములుగా నుండునని యీవఱకే చెప్పియుంటినిగదా. ఆవిషయమునే విస్తరించి తెలిపెదను. సంసారముక్తికొఱకు దైవప్రకృతి యుపకరించును. సంసారనిబంధనార్థము ఆసురియు రాక్షసియు నుపయోగించును. కావున దైవప్రకృతి యెట్లు సంపాదింపవలయునో. తక్కిన యాసురీరాక్షసీప్రకృతుల నెట్లు పరిత్యజింపవలయునో యనువిషయములు తెలియందగినవి కావున వానిం దెలిపెదను. అవహితుఁడవు. కమ్మని శ్రీభగవంతు డిట్లు బోధించెను. ఏవిషయమునందు నేకాలమునందును భయములేకుండుటయు నంతఃకరణము వ్యవహారములయందును బరవంచనామాయానృతాదులయందును విముఖమై పరిశుద్ధముగా నుండునట్లుచేయుటయు, శాస్త్రమునుండియు నాచార్యులనుం

---

దైవాసురసంపద్విభాగయోగః.

శ్రీభగవానువాచ.—అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితిః,

డియు నాత్మాదిపదార్థముల నెఱుంగుటయుఁ దానెఱింగినవాని నింద్రియాదుల నుపసంహరించి యేకాగ్రతచేఁ దనకు సమంజసముగాఁ దెలియునట్లుచేసికొనుటయు, నీజ్ఞానయోగముల రెండింటియందును నిష్ఠగలవాఁడగుటయు దైవప్రకృతియని యెఱుంగవలయును. ఈప్రకృతియే సాత్త్వికమని పెద్దలచే వ్యవహరింపఁబడుచున్నది. ఈప్రకృతిగలిగియుండుటయు శక్తి కనురూపము నార్తులకు నన్నాదు లొసంగుటయు నింద్రియనిగ్రహము శ్రౌతస్మార్తరూపమగు నగ్నిహోత్రదేవయజ్ఞాదికము, వేదపాఠము, తపస్సు, ఋజుత్వము అనఁగాఁ దనయందు విశ్వాసము నుంచినవారలకుఁ దానెఱింగినయర్థమును దాఁపక తెలుపుట యని భావము. ఈయవి దైవప్రకృతిగుణములు. (౨) ప్రాణులఁ బీడింపకయుండుటయు, నప్రియము నన్నృతమును వదలి విషయమును దెలుపుటయు, నితరులు నిందించినపుడుగాని దండించినపుడుగాని తనకుఁ గల్గినక్రోధము నుపశమించునట్లు చేయుటయు, సంసారాసక్తి లేకుండుటయు, నంతఃకరణనిగ్రహము, నితరులలోపములను దెలుపకయుండుటయు, సకలభూతదయయు, విషయసన్నిధానమున నింద్రియములు వికారము నొందకుండఁ జేయుటయు, మృదుత్వము, లజ్జయుఁ బ్రయోజనములేనితఱి వాక్కులోనగువాని వ్యాపారము లేకుండ నియమించుట యనునివియు దైవప్రకృతు లనంబడును. (3) ప్రాగల్భ్యము, ఓర్పు, దేహముగాని యింద్రియములు

దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్. ౧. అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాంతిరపైశునం, దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్. ౨. తేజః క్షమా ధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా, భవంతి సంపదం దైవీమభిజాతస్య భారత. ౩. దంభో దర్పోఽతిమానశ్చ క్రోధః

గాని యలసినప్పుడు దానిని వోలఁగించునంతః కరణవృత్తివిశే షము, బాహ్యాభ్యంతరశౌచము, పరులను హింసించునిచ్ఛయే లేకుండుట తానే యతిపూజ్యుఁడ ననుదురభిమానము పూనక యుండుట యనునీగుణములు దైవసంపద నుద్దేశించి జన్మించి నవానికి గలుగుచున్నవి. (౪) పార్థా! ఆసురసంపదతో జన్మించిన వానికి డంభము, మదము, అతిమానము, క్రోధము, పరుష వచనము, అజ్ఞానము ననునీగుణములు కలుగుచున్నవి. (౫) పాండునందనా! పూర్వోక్తసంపదలయందు దైవసంపద సంసార బంధమునుండి, మోక్షమునొందుటకు సాధనమగును. ఆసుర సంపద సంసారబంధమునందే మెలఁగునట్లుచేయును. కావున శోకమునొందకుము.ఏలయందు వేమోనీవు దైవసంపదతో జన్మిం చినవాఁడవు (౬)పార్థా! ఈసంసారమునందు దైవమనియు నాసు రమనియు భూతసృష్టిద్వివిధముగానున్నది.అందు దైవసంపదను విశేషించి నీకునుపదేశించితిని. ఇంక నాసురమును విపులముగా దెలిపెద. వినుము. (౭) పురుషార్థసాధనమునందు శాస్త్రవిహిత ప్రవృత్తినిగాని, యనర్థహేతువునుండి శాస్త్రనిషిద్ధమగు నివృ త్తినిగాని యాసురు లెఱుంగరు. అంతియగాక వారియందు శుచిత్వముగాని యాచారముగాని లేవని యెఱుంగుము. (౮) కౌంతేయా! ఆసురజనులు మనమేలాగు అసత్యప్రాయులమో

---

పారుష్యమేవచ, అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీం. ౫. దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా, మాశుచస్సంపదం దైవీమభి జాతోఽసి పాండవ. ౬ ద్వౌభూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ, దైవోవిస్తరశః ప్రోక్త ఆసురం పార్థమే శృణు. ౭. ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః, న శౌచం నాపి నాచారో న సత్యం తేషు విద్యతే. ౮. అసత్యమప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరం, అపరస్పరసంభూతం

అట్లే జగత్తుకూడ నసత్యమే యనియు దానికి ధర్మాధర్మము
లాధారములు కావనియు, నాధర్మాధర్మముల మూలమున
శాసించునీశ్వరుఁడే యీలోకమునకు లేఁడనియుఁ బలుకుచున్న
వారు. మఱియుఁ గామప్రయుక్తులగు స్త్రీపురుషుల యన్యో
న్యానుయోగమువలన జగంబంతయుఁబుట్టినది. కాఁబట్టి ప్రాణుల
కామమే ప్రపంచమునకుఁ గారణముకాని ధర్మాధర్మరూప
మగు నదృష్టకారణము నేఱొకటిలేదనియుఁ జెప్పుచున్నవారు.
పార్థా! వేదప్రతిపాదిత ధర్మములయందు నాసురజనులు ప్రవృ
త్తినివృత్తుల నెట్లెఱుంగరు? ధర్మాధర్మముల నంగీకరింపనిచోఁ
బ్రపంచమునకు సుఖదుఃఖాదికావస్థ యేహేతువునుండి కలుగు
చున్నది? వా రెట్లు శౌచాచారాదివిషయమగు నీశ్వరాజ్ఞను
మీఱుదురు? ఈశ్వరుఁడు కలఁడని యంగీకరింపనియెడల దేని
వలన జగత్తు కలుగును? అను నీప్రశ్నములకు నీమనస్సాస్పద
మొసంగునేమో యని యూహించియే యీవిషయము నుప
దేశించితినని యెఱుంగుము. (౯) పాండునందనా! ఈచెప్పిన
నాస్తికమతము నాశ్రయించి పరలోకసాధనమునుండి భ్రష్టులై
విషయములయందే నిరతులై యుండుటవలన నల్పబుద్ధులై
హింసయే స్వభావముగలిగి లోకమునకు శత్రువులై లోక
నాశముకొఱ కాసురులు పుట్టుదురు. (౧౦) పార్థా! ఆసురులు
ఎట్టి ప్రయత్నములచేతను బూరింప శక్యముగాని కామము
నాశ్రయించి దంభము మానము మదము గలవారలై యజ్ఞా
నమువలన నమంగళకరములగు నిశ్చయములకులోనై యపరి

---

కిమన్యత్కామహైతుకం. ౮. ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్ప
బుద్ధయః, ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః. ౯. కామ

శుద్ధవ్రతములు చేయుచు లోకమునఁ బ్రవర్తింతురని యెఱుంగుము. (౧౧) అంతియగాక వారు మృతివఱకు నింతయని చెప్పనలవిగాని చింతను వహించియుందురు. విషయోపభోగమే పరమపురుషార్థమనియు, దానికన్నను వేఱుపురుషార్థము లేదని నిశ్చయించుకొన్నవారని తెలియందగును. (౧౨) పార్థా! దుష్పూరములగు నాశాపాశములచే బంధింపఁబడి వానిచే నానావిధములగు విషయములచే నాకర్షింపఁబడుచుఁ గామక్రోధములనే ప్రధానములనుగా నాశ్రయించి విషయోపభోగనిమిత్తమై పరద్రవ్యాపహారణము లోనగు పాపకృత్యములచే నర్థములను జేర్చుచున్నారు. (౧౩) అర్జునా! ఈయర్థమిప్పుడే నాకులభించినది. ఇఁక దీనిని గూడ వాంఛపూర్తియగునట్లు పొందఁగలను. నాయొద్ద నింతద్రవ్య మిపుడున్నది. ఇంక మీఁద నింతద్రవ్యము చేరఁగలదు. అంతట మిగుల ధనవంతుఁడ నేనగుదును. అని యిట్లాసురులు తలంచుచుందురని నిశ్చయింపుము. (౧౪) అంతియగాదు. బలశాలియగు నీపగవానిం జంపితిని. ఇంక నల్పులగు వైరులఁ జెండాడెదను. నాకు సమానుఁ డింక నుండఁడు. ప్రభువును నేనే, నేనే భోగిని. నేనే పుత్త్రపౌత్త్రాదిసంపన్నుఁడను. నేను సామాన్యమానవుఁడనుగాను. బలశాలిని

---

మాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః, మోహాద్గృహీత్వా సద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః. ౧౦. చింతామపరిమేయాం చ ప్రళయాంతాముపాశ్రితాః, కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః. ౧౧. ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః, ఈహంతే కామభోగార్థ మన్యాయేనార్థసంచయాన్. ౧౨. ఇదమద్యమయాలబ్ధమిదం ప్రాప్స్యే మనోరథమ్, ఇదమస్తీ దమపి మే భవిష్యతి పునర్ధనం. ౧౩. అసౌ మయా హత

సుఖవంతుఁడను నేనే యగుదును. ఇతరులెల్ల భూమికి భారముపంటివారే (నిరర్థకులు). అని యీరీతిగా నాసురు లూహింతురు. (౧౫) ధనవంతుఁడను, సత్కులప్రసూతుఁడను నేనే. నాతోసమానుఁడని చెప్పఁదగిన వాఁడెవ్వఁడు లేఁడు. యజ్ఞములనొనరించి యందఱికంటె నధికుఁడనను ప్రఖ్యాతిఁగాంచెదను. అపాత్రములకు దానముచేసెదను. మహానందమునొందుదును. అని యిట్లాసురు లజ్ఞానముచేత నానావిధములుగా మోహమునొంది యూహించుచునే యుందురు, (౧౬) విజయా! ఈరీతిగా ననేకదుష్టసంకల్పములు గలిగి నానావిధములుగా భ్రాంతులగుచు మోహబంధవశంగతులై విషయభోగ మాత్రాసక్తులై యాయఘముచేత నా యాసురులు తుట్టతుదకు హేయమైన వైతరిణ్యాదినరకమునం బడుదురు. (౧౭) అంతియగాక వారు తమరే గుణవంతులమని పొగడుకొనుదురు. అడఁకువలేక గర్వించిమిట్టిపడుదురు. దంభార్థము శాస్త్రోక్తప్రకారమును లెక్కపెట్టక పేరునకు మాత్ర మాశపడి యాగములొనరించి యజ్ఞములుచేసినవారను ఖ్యాతినొందఁగోరుదురు. (౧౮) ధనంజయా! ఆయాసురు లహంకారమును, బలదర్పములను, గామక్రోధముల నాశ్రయించి తమదేహము

---

శత్రుర్హనిష్యేఽ చాపరానపి, ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ. ౧౪. ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశోమయా, యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః. ౧౫. అనేకచిత్తవిభ్రాంతాః మోహజాలసమావృతాః. ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ. ౧౬. ఆత్మసంభావితా స్తబ్ధా ధనమానమదాన్వితాః, యజంతే నామయజ్ఞైస్తే దంభే నావిధిపూర్వకం. ౧౭. అహంకారం బలం దర్పం కామం క్రోధంచ

లందును బరదేహములందును దద్బుద్ధి కర్మసాక్షినై యున్న నాయందు మదాజ్ఞాతిక్రమణము చేసి ద్వేషించి సాధువుల గుణములవిషయమున నసూయగలవారలగుదురు. (౧౮) ఈరీతిగా సన్మార్గద్వేషులు సాధువిరోధులు నగుటయేకాక నన్నును ద్వేషించుచుఁ గ్రూరులై యధర్మాసక్తులై సర్వకాల మశుభకర్మముల నాచరించు, నీచులగు నాయాసురులను నేను ఘోరతరనరకములయందుఁ బడఁద్రోసి యంతఁ గ్రూరకర్మములనే యొనరించుచుండు సింహవ్యాఘ్రాదిజంతుయోనులం బుట్టునట్లు చేయుదును. (౨౦) కౌంతేయా! ఆరీతిగా వారు ప్రతి జన్మమునందు నాసురయోనియందే జన్మించుచు మూర్ఖులై నన్నుఁ బొందుటకు సాధనంబగు సన్మార్గమును గూడ నది నాచేతనే శాసింపఁబడుటం జేసి దానిం బొందఁజాలక యంతకంటె నీచమగుగతి నొందుదురు. (౨౧) ఇది నరకద్వారము, ఆత్మను నశింపఁజేయునదియునయి మూఁడువిధములు గలది ఈద్వారమును ప్రవేశించినంతనే పురుషుఁడెట్టిపురుషార్థమునకును యోగ్యుఁడుగాక చెడిపోవును. ఆమూఁడు విధములేవనఁగాఁ గామక్రోధలోభములే యగు. కావున నీయూఁడింటిని ద్యజింపవలయును. (౨౨) ఓకౌంతేయా! దుఃఖమోహమయమగు నరక

---

సంశ్రితాః, మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. ౧౮. తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్, క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు. ౧౯. ఆసురీం యోనిమాపన్నాః మూఢా జన్మని జన్మని; మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిం. ౨౦. త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః, కామః క్రోధస్తథాలోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్. ౨౧. ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైస్త్రి

మునకు ద్వారములగు నీకామాదులమూఁడింటిని విడిచిన మానవుఁడు తనకే దానివలన శ్రేయస్సుగలుగునో యట్టి కర్మము నాచరించుచున్నాఁడు. దానివలన ముక్తినిఁబొందుచున్నాఁడు. (౨౩) ఏమానవుఁడు ధర్మమిది యధర్మమిది యని స్పష్టముగాఁ దెలియఁజేయు విధినిషేధరూపమగు శాస్త్రము నుల్లంఘించి కామప్రయుక్తుఁడై వర్తించుచున్నవాఁడో ఆపురుషుఁడుపురుషార్థమును బొందఁజాలఁడు. ఈలోకమునందును సుఖముగాంచనేరఁడు ఇఁక నతనికి స్వర్గముగాని మోక్షముగాని కలుగనేరదని వేఱుగఁజెప్పవలయునా. (౨౪) కుంతీనందనా! ఆకారణమువలన ధర్మాధర్మములను (కార్యాకార్యముల) నిశ్చయమున నెఱుంగుటకు నీకుశాస్త్రమే ప్రమాణమగును. ఇట్టి శాస్త్రమునందు ధర్మముగా నీకేది నిషేధింపఁబడినదో యావిషయమునెఱింగి నీవు దానినే యీలోకమునం దాచరింపుము.

ఇది దైవాసురసంపద్విభాగయోగము.

శ్రద్ధాళువులారా! దైవాసురసంపద్విభాగయోగమను నీపదాఱవయధ్యాయమును బఠించితిరి. దీనిసారమేమి? మన మిద్దానినుండి యాచరింప నింతమాత్రము శక్యమగునని గ్రహింపఁదగినవిషయమేమి? అని విమర్శింపఁబూనుకొనుటుచి

---

ర్నరః, ఆచరత్యాత్మనశ్శ్రేయస్తతో యాతి పరాంగతిం. ౨౨. యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః, న స సిద్ధిమవాప్నోతి న సుఖం నపరాంగతిం. ౨౩. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ, జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి. ౨౪.

ఇతి దైవాసురసంపద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః.

తము. భగవంతుఁ డింతకుముందు పురుషోత్తమప్రాప్తియో
గము నుపదేశించెను. దానివెంటనే యీయోగము నుప
దేశించెను. ఏల? పురుషోత్తమప్రాప్తి ప్రతిబంధవిషయము
లేవి? తదనుకూలవిషయము లేవి? వేనిని బట్టి మన మీవిషయ
ములఁ దెలిసికొనఁగలమో యాగుణుతులు తెలియుటకే భగ
వంతుఁ డీయోగము నుపదేశించెను. ఇందు ముఖ్యముగా దైవ
సంపదగల వారు వీరని తెలిసికొనుటకుఁ గొన్ని చిహ్నములు
తెలుపఁబడినవి. ఆసురసంపదగలవారు వీరని తెలిసికొనుటకుఁ
గొన్ని గుణుతులు చెప్పఁబడినవి. తొమ్మిదవయధ్యాయమునఁ
బ్రకృతులు మూఁడనియును, అవి దైవియు నాసురియు
రాక్షసియు ననఁబడుననియుఁ దెలుపఁబడెను.

శ్లో. మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. ౧౨
మహాత్మాన స్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః,
భజం త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్. ౧౩

అనియే యీయుపదేశము. ఇపుడు దైవి ఆసురి యనునవియే
చెప్పఁబడినవి. రాక్షసి ఆసుర్యంతర్భావమని యూహింపఁ
దగును. ఇందు దైవసంపద మోక్షమును గల్పింపఁజాలును.
ఆసురి బంధమునే కల్పింపఁజాలును. ఇందే సంపదగలవారు
వీరని యెఱుంగుటకు లక్షణములు కొన్ని తెలుపఁబడినవి.
ఆలక్షణముల ననుసరించి మన మూహించుకొనవలయును.
సాధారణముగా లోకులలోఁ బెక్కండ్రు హేతువాదులే
యగుదురు. హేతువు నెఱుంగుటకుఁ బ్రశ్నించుట తప్పు
గాదు కాని బుద్ధ్యతీతవిషయములను బుద్ధిసాధ్య హేతువుల

చేతనే యెఱుంగుట శక్యమా కాదా యని బుద్ధిమంతు లూహించుకొనవలయును. అట్టి విషయములను దెలుపునవి శ్రుతులు తదర్థోపబృంహితములగు పురాణములు నగును. వానిమూలమునఁ దెలిసికొని స్వానుభవమున నెఱుంగుటకుఁ బ్రయత్నింపవలయును. ఆయనుభవము యోగాభ్యాసము భక్తియను నీమార్గముల మూలముననే కావలయును. కాని తోచినట్లెల్లఁ బ్రశ్నించుచుఁ గాలమును వ్యర్థముచేయుటం జేసి లభింపనేరదు. కాఁబట్టి మతిమంతులగువారు పెద్దలమాటలం బరికించి శ్రద్ధగలిగి తదుక్తమార్గమున ననుష్ఠానముచేయవలసియుండును. హేతువాదులు తుచ్ఛులను శాస్త్రోక్తి కిదియే కారణము. వారు సర్వదా యాక్షేపించుటయే పురుషార్థమను కొనువారు. అతీంద్రియవిషయములను బుద్ధిచే నెఱుంగశక్యము కాదని సామాన్యులుకూడ నెఱుంగుదురు. కావున నది సత్కర్మముల నాచరించి తదుపలబ్ధభక్తిచే వానినెఱుంగవలయుననుట నపాయమగుమార్గము. అపుడుమాత్ర మెట్లెఱుంగ వచ్చు నను ప్రశ్నము కలదు. అజ్ఞానతమోవృతమగుబుద్ధిజ్ఞానదీపమున వికసించును. అజ్ఞానము సత్కర్మాచరణమున నుద్భవిల్లును. ఒక్కదాని కొక్కటి యధికరణ మనంబడును. సత్కర్మముల నాచరింపక జ్ఞానము కలుగదు. జ్ఞానములేక సత్కర్మముల నాచరింప శక్యముకాదు. పూర్వజన్మకృతసుకృతవిశేషమున నెట్లో సత్కర్మము నాచరించి దానిచేఁ గలిగినయల్పజ్ఞానమున సత్కర్మస్వరూప మిదియని యెఱింగి దానినే మరలమరల నాచరింప నజ్ఞానధ్వాంతము నిశ్శేషమగుచుండును. జ్ఞానము పొడచూపుచుండును. దీనికి నిరంతరాచరణము సాధ

నమగును. విసుగు నొందక సాధుకర్మము నాచరించుచుండు నతఁడే దైవసంపదగలవాఁడని యూహింపఁదగియుండును. దీనినిబట్టి యూహింపఁగా సత్కర్మాచరణపరాయణత్వమే సర్వ సంపత్ప్రధానమని తెలకమానదు. దానిని మానినచో నేలవిడిచి సాముచేసినట్లే యగును. ఎంతటిబుద్ధిమంతుఁడైనను ముక్తుఁడగువఱకు సత్కర్మాచరణపరాయణుఁడు కావలయును. ఆసమయముననే,

సర్వధర్మాన్ పరిత్యజ్య మేకం మాంశరణం వ్రజ.

అన్నభగవదుక్తికిఁ బాత్రుఁడగును. అంతకుముందో పైవాక్యమునకు సర్వధర్మాన్ పరిత్యజ్య ఏకం. మామేవ శరణం మా వ్రజ మా ప్రాప్నుహి" అని యర్థముచేసికొనవలయు. అనఁగా సర్వధర్మములను వదలిపెట్టి నన్నాశ్రయింపకుమా. అని భగవంతుఁ డర్జునున కుపదేశించెనని యూహించుకొని సర్వధర్మముల ననఁగాఁ దనకు శక్యమగువాని నాచరించుచు వానిఫలముల నాశింపక భగవంతునందు సమర్పించుచుండవలయును. ఇట్లుండిన భగవదనుగ్రహ మాతనికిం గలుగకమానదు. భగవదనుగ్రహపాత్రుఁడైనపిదప లోకసంగ్రహార్థ మాచరించిన నాచరింపవచ్చును. వదలిన వదలవచ్చును. అట్టిపరీక్షలోఁ దేలినంతదనుక సత్కర్మాచరణము మానరా దనుట నిర్వివాదమగు సిద్ధాంతము. అలసులై కర్మములు బంధకములగుననియు, వానిని వదలి భగవంతు నాశ్రయించిన ముక్తిలభించు ననియుఁ బలుకుచుండుట కలదు. వారు పరవంచకులే యగుదు రనక తప్పదు. కావున నీయోగమున శ్రీహరి తెలిపినచందమ్మున

దైవసంపదగలవాఁడని తెలుపులక్షణముల నెఱింగి ప్రవర్తింపవలయును.

ముఖ్యముగా నీయుపదేశమున భగవంతుఁ డర్జునునకు స్వీయకర్మాచరణవిముఖత పనికిరాదని యుపదేశించెను. శాస్త్రమే కర్మాకర్మముల శాసించుననియు, నట్టిశాస్త్రము విధినిషేధరూపమనియు దాని నమ్మవలయునని దాని నమ్మకపోయినవాఁ డుభయలోకభ్రష్టుఁడగుననియు, నెవ్వఁడు శాస్త్రములఁ దూలనాడునో వాఁడు తనమేలును బాడుచేసికొనువాఁడగుననియు, మనము దృఢముగా నమ్మవలయును. తనమే లెఱుంగనివాఁడితరులకు నుపదేశింపఁ నర్హుఁడుకాఁడని వేఱుగఁ జెప్పవలయునా? శ్రీహరి కంఠోక్తముగా శాస్త్రము ప్రమాణమని తెల్పెను. దానిని బాటింపనివారు భగవదుక్తిని నమ్మనివారే యనుట విచిత్రముకాదుకదా. వారిహపరదూరులగుదురనుటయు నచ్చెరువు కల్పింపఁజాలదు. కొందఱు తమయజ్ఞానమును గప్పిపుచ్చఁబూని శాస్త్రములు కల్పితములుగాన వానినినమ్మరాదనియుఁ దనబుద్ధితో నాలోచించి ప్రతివిషయమును జేయఁబూనవలయుననియు నుద్ఘోషింతురు. వారిమార్గము ననుసరించువారు వారివలెనే యిహపరలోకసుఖదూరులగుదురనుట విచిత్ర మేలయగును? ఇతరులమాటలయందు విశ్వాసము లేకయున్నఁ దరణోపాయము లేనేలేదు. సురాపానముచేయువాఁడాలోచించినచో దాన నెంతయో సుఖమున్నదనియు, నేకష్టము కొంతకాలము తోఁపకయుండుననియు నదియే యానందమనియు దాని ననుభవించుటకంటెఁ బురుషార్థము లేదనియు సిద్ధాంతముచేసికొనును. ఇట్లే యితరులును దమరుచేయు

కార్యము లుత్తమములనియే యూహించుకొందురు. దానం జేటుమూడక పోవదు. కావునం గృతార్థులు కాందగినవార నంగాం బరిపక్వజీవులు పెద్దలమాటల నాలకించుచు వాని నాచరణమునకుం దెచ్చుకొనుచు శాస్త్రమేరీతిగా నుపదేశించు నని పరికించుచు నారెండును సరిపడుటెట్లని యాలోచించుచు సరిపడకున్నబుద్ధిమంతుల నడుగుచు నిట్లు ప్రయత్నించి ప్రయ త్నించి తుదకు వానిని దనయనుభవమూలమున సరిచేసికొని భగవంతు నారాధించినం గృతార్థుం డగు ననునదియే చక్కని సిద్ధాంతము. దీనిని మించినసిద్ధాంతముగనంబడుట యాశ్చర్యమే యగును. కావునం బెద్దలమాటల నమ్మి శాస్త్రవిధిని బరిశీలించి భగవంతునిపాదారవిందముల నాశ్రయించి కృతకృత్యులు గావలయును. ఇది దైవసంపత్తుగలవారలకుం దగుమార్గము.

ఇంక నాసురసంపదగలవారలవిషయ మించుక పరిశీలిం తము. అహంకారాదులు మిగులం గలిగి నన్నెవరు ద్వేషిం తురో నాసంపన్మహత్వమున కెవ్వ రసూయాపరవశులగుదురో యట్టి దుర్మతులగునరాధములను సంసారార్ణవమునం బడ వేయుదునని శ్రీహరి వక్కాణించెనుగదా. వారాసురయోనులం బుట్టుచుం గిట్టుచు నెన్నియోజన్మము లందేయుందురు గాని నన్నెఱుంగంజాలరనికూడ భగవంతుం డనువదించెను. ఈయుపదేశమును బరిశీలించినం బరమేశ్వరున కించుక పక్ష పాతముగలదని తోంచునుగదా? సర్వసముండగు దైవమునకు నీపక్షపాత మేల యని కొందఱందురు. కాని యది మిగులం బొరపాటు. ఆపక్షపాతము భగవంతునియం దారోపింప రాదు. కర్మసిద్ధాంతము నెఱుంగనివారే యట్టు లారోపింతురుగాని

దాని నెఱింగినవా రట్లుపలుకరని నానమ్మకము. అసత్కార్మము లకు ఫల మారీతిగనే యుండును. తమరు చేసినకర్మములకుం దగుఫలములం దారొందకయున్న నింక వాని ననుభవించువా రెవ్వరు? ఆకర్మముల ననుసరించి భగవంతుఁడు ఫలప్రదాత యగుచుండునుగాని స్వతంత్రించి ఫలము నీయఁబూనఁడు. దుష్కర్మములకుం దగినఫలములం గొంద అనుభవింపకయే యున్న వానిని మానవలయునని యెవ్వరికిఁ దోఁపకయే యుండును. కాఁబట్టి యాయాయికర్మములకుఁ దగునాయాఫల ముల వా రనుభవింపక తప్పదు. దానికి భగవంతు నాక్షేపిం చుట నఱింత పాపహేతు వగును. కష్టములం గుడుచువారు తమదుష్కర్మములకుఁ జింతించుచుఁ నిట్టివి చేయరాదని యూ హించుచుఁ జేసినవానికి ఫలములనొందుచు వానికి దుఃఖింపక పరాత్పరా! ఇఁక నిట్టిదుష్కర్మముల నొనరింపకయుండ మమ్ము ననుగ్రహింపుమా యని ప్రార్థించుచు నుండవలయు. దాని నించుక దుష్కర్మఫలము నశించును. భగవత్కారుణ్యముఁ బొడ చూపును జన్మాంతరమునందు సత్కార్మానుష్ఠానమునకు నుత్సాహము గలుగును. క్రమక్రమమున నుత్తమమార్గము గోచరించును. కావున నట్టియుత్తమమార్గమునకుఁ బ్రతిబంధకములగు నహం కారాదులమాని భగవంతునిపై ననూయ నూనక దాసులమై తత్పాదసేవ చేయుచుండుటతప్ప నింకొకపురుషార్థము గోరుట మంచిదికాదు. ఇట్టిదైవాసురసంపద్విభూతియోగము శాస్త్రము ననుసరింపక తప్పదనియు, నహంకారాదులమానవల యుననియు, సర్వభూతదయాదిసద్గుణముల నలవరించుకొనవ లయు, బోధించుచున్నది. దీనింబఠించినంతనే తృప్తినొందక

యిందలివిషయముల ననుభవమునకుఁ దెచ్చుకొనుటకుఁ బ్రయత్నింపవలయును.

## శ్రద్ధాత్రయవిభాగయోగము.

(౧) ఈరీతిగా నా శ్రీకృష్ణపరబ్రహ్మ ముపదేశింపఁగా విని యర్జునుం డిట్లు ప్రశ్నించెను. శ్రీకృష్ణా! ఎవ్వరు శాస్త్రవిధానము నెఱుంగక దానినిమాని శ్రద్ధతో యజనముచేయుచున్నారో వారియజనప్రకారము సాత్త్వికమా, రాజసమా, తామసమా, నాకుఁ దెలుపుము. శ్రద్ధ సాత్త్వికమగుట వలనను, క్లేశబుద్ధి చేతఁగాని యాలస్యముచేతఁగాని శాస్త్రమునందనాదరము రాజసతామసంబగుటవలనను మూఁడువిధముల సందేహము. వారు సత్త్వభావసంశ్రితు లగుదురేని అప్పుడు సాత్త్వికులగుటవలన వారికిని బూర్వోక్తమగునాత్మజ్ఞానమునందధికారముకలుగును. అట్లుకాదేని కలుగదు. కావున నాయీ ప్రశ్నమునకు నుత్తరంబిచ్చి సంశయము తీర్పుము. (౨) అర్జునునిప్రశ్నము నాలకించి భగవంతుఁ డిట్లు బదులు చెప్పఁబూనెను. ధనంజయా! శ్రద్ధ మూఁడుప్రకారములుగా నుండును. దేహధారుల కయ్యది పూర్వజన్మమందలి ధర్మాదిసంస్కారరూపమగు వాసనవలనఁ బుట్టును. సాత్త్వికమనియు రాజసమనియుఁ దామసమనియు నామూఁడువిధములకు నామములు. వానివిధము

---

శ్రద్ధాత్రయవిభాగయోగః.

అర్జున ఉవాచ. యే శాస్త్రవిధిముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః. తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః. ౧. శ్రీభగవానువాచ. త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా, సాత్త్వికీ రాజసీ చైవ.

క్రమముగా నెఱింగించెద. అందు నేమానవులు శాస్త్రక్రమ
మును బరిత్యజించి తదుక్తరీతిగా యజించుటయందు శ్రద్ధగల
వారలగుదురో వార లాశ్రద్ధాభేదముచే భిన్నులగుచున్నా
రు. అందెవ్వరు సాత్త్వికశ్రద్ధగలవారుగ నుందురో వారు దేవత
లు. వారు శాస్త్రోక్తసాధనమునం దధికారులు. దానిఫలమును
బొందఁదగుదురు. ఎవ్వరు రాజసముగాని తామసముగాని
శ్రద్ధగలవారలగుదురో వా రసురులు. శాస్త్రానుకూలసాధన
మునం దధికారులుకారు. తత్ఫలమును బడయ నర్హులుగారు.
అని నిర్ధారణచేసి తెలిపెదను. అవహితుండవుకమ్ము. (3) భారతా!
దేహధారుల కంతఃకరణ మెట్టిసంస్కారముకలదగునో యట్టి
సంస్కారముతోఁగూడిన యంతఃకరణమునకు ననురూపముగా
ననఁగా దానిసంస్కారమునకుఁ దగినట్లుగా శ్రద్ధయు నుండును
అక్కారణమున నెవని కెట్టిశ్రద్ధయుండునో యదియే వానిస్వ
రూపము. వానిప్రవర్తనమంతయు నట్టిశ్రద్ధ కనురూపముగా
నుండునని యెఱుంగుము (౪) ఏయుపాయముచే నాశ్రద్ధ
నెఱుంగవచ్చును? అని యూహింతువేమో? దేవపూజాదికార్య
ములచిహ్నముచేత నది యనుమేయంబగు ననువిషయమును
దెలిపెదను. సత్త్వనిష్ఠగలవారు దేవతలను బూజింతురు. రజో
నిష్ఠగలవారు యక్షులను రాక్షసుల నారాధింతురు. తమోనిష్ఠ
గలవారు భూతప్రేతగణముల నర్చింతురు. వీరొనరించు నారా
ధనప్రకారమును గాంచి వీరినిష్ఠ యిట్టిదని యూహింపవల

తామస శ్చేతి తాం శృణు. ౪. సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత, శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః. 3. యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః, ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే.

యును. (౫) శాస్త్రవిధిని వదలినచో నత్త్వాదినిష్ఠలు కార్యమును బట్టియే నిర్ణీతము లగుచున్నవి. అందు సహస్రసంఖ్యాకు లలో నొక్కఁడే దేవపూజాసక్తుండై సత్త్వనిష్ఠగలవాఁడుగ నుండును. అధికసంఖ్యాకులు రజోనిష్ఠయుఁ దమోనిష్ఠయుఁ గలవారే యగుదురు. కావున నేమిచేయఁ దగునని ప్రశ్నింతు వేమో? కౌంతేయా! యాలకింపుము. శాస్త్రవిహితముకానిది, తనకు నన్యులకును బీడాకరమైనదియు నగుతపస్సు నేమానవు లు చేయుదురో, దంభము, అహంకారము, కామము, రాగబ లముగలిగి శరీరమందలి యింద్రియములను గృశింపఁజేయుచుఁ దత్కర్మములకు బుద్ధికిని సాక్షిభూతుఁడనై యంతర్యామినై యుండు నను నాయానతిని దాఁటుటంజేసి యవివేకులగు దురో యట్టివారలను నాసురనిష్ఠవారలని యెఱింగి దూరము గా వారలుండునట్లు ప్రవర్తింపుము. (౭) అర్జునా! ఆహారము కూడ ముప్విధములుగా నుండును. అందొక్కొక్కటి సాత్త్వి కరాజసతామసులకు వరుసగాఁ బ్రియముగా నుండును. అట్లే యజ్ఞము తపస్సు దానము మూఁడువిధములై సాత్త్వికరాజ సతామసులచే వరుస ననుష్ఠింపఁబడుచుండును. వాని భేదముల నెల్ల నీకు నుపదేశించెదను. (౮) ఆయుస్సును సత్త్వబలారోగ్య ములను సుఖమును, బ్రీతిని వృద్ధినొందించునవియు, రసయుక్త

యజంతే తామసా జనాః. ౪. అశాస్త్రవిహితం ఘోరంతప్యంతే యే తపో ధనాః, దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః. ౫. కర్శయంం తశ్శరీరస్థం భూతగ్రామమచేతసః, మాం చైవాంతశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసుర నిశ్చయాన్. ౬. ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః, యజ్ఞస్త పస్తథా దానం తేషాం భేదమిమం శృణు. ౭. ఆయుస్సత్త్వబలారోగ్యసుఖ

ములును, స్నేహవంతములును, (నూనె నెయ్యి వీనితోఁగలిసి
నవి) దేహమునం దధికకాలము నిలుచునవియు, హృదయప్రీతి
కరములునునగు నాహారములేవిగలవో యవి సాత్త్వికప్రకృతిగ
లవాని కిష్టములుగ నుండును. ఈయాహార మిష్టమై యున్న
తఱిఁ బురుషులు తమకు సత్త్వగుణ మధికముగా నున్నదని తె
లిసికొని యాపదార్థములనే యనుదినము భుంపవలయుననియే
దీని సారమని గ్రహింపుము. (౯) చేదు, పులును, ఉప్పు, వేడి
కారము నగుపదార్థములును, స్నేహవర్జితములును, సంతాపజ
నకములు నగుచు దుఃఖశోకరోగములను గల్పించుచు నుండు
నాహారములు రజోగుణప్రధానుల కిష్టములుగ నుండును.
(౧౦) ధనంజయా! చక్కఁగా నుడుకబెట్టఁబడనిదియు, రస
శూన్యముగ నప్పు డుండునదియు, దుర్గంధముగలదియుఁ బక్వ
మైనపిదప రాత్రిగడచినదియు, దినఁగా మిగిలినదియు నపవిత్ర
మునునగు నాహారము. తామసులకిష్టముఁగ నుండును. (౧౧)
యజ్ఞముకూడ మూఁడువిధములుగా నుండును. అందుసాత్త్వి
కయజ్ఞమును దెల్పెదను యజ్ఞముచేయవలసినదని చేయుట
యేగాని ఫలాభిసంధిలేనివారు దానిఫల మించుకంతయు
వలదని సిద్ధాంతముచేసికొని శాస్త్రచోదితమగు నెట్టియజ్ఞ
మును జేయుచున్నారో అది సాత్త్వికయజ్ఞ మనంబడు.

---

ప్రీతివివర్ధనాః, రస్యాస్స్నిగ్ధాస్స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః
౮. కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః, ఆహారా రాజసస్యేష్టా దుఃఖ
శోకామయప్రదాః. ౯. యాతయామం గతరసం పూతిపర్యుషితం చ
యత్, ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియం. ౧౦. అఫలా
కాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే, యష్టవ్యమే వేతి మనస్సమాధాయ

(౧౨) భరతశ్రేష్ఠా! ఫలాభిసంధికిని దాను ధార్మికుఁడ నను ఖ్యాతిని గలిగించుకొనుటకును జేయుయాగము రాజసమగు నని నిశ్చయించుకొనుము. (౧౩) శాస్త్రవిధిలేనిదియు, నన్నదానశూన్యమును, మంత్రవిహీనమును, దక్షిణలేనిదియు. శ్రద్ధావివర్జితమును నగునట్టియజ్ఞము తామసమని తెలియందగు, (౧౪) ఇఁకఁ త్రివిధమగు తపస్సును వినుము. దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, త్రికాలవేత్తలను బూజించుటయు, బాహ్యాభ్యంతరశౌచము విహితకర్మప్రవృత్తియునిషిద్ధకర్మనివృత్తియు ననఁబడు నార్జవము, బ్రహ్మచర్యము, అహింసయు నను నివి యన్నియు శారీరకమగుతపస్సని చెప్పఁబడును. (౧౫) ఇతరులకు దుఃఖముగలిగింపనిదియు, సత్యమును బ్రియమును హితమగు వాక్యమును యథావిధి వేదపాఠమును, ఇవి వాఙ్మయతపస్సని చెప్పంబడును. ఈతపస్సునకు వాచికతపస్సనియుఁ బ్రసిద్ధి గలదు. (౧౬) మనస్సును బ్రసన్నముగా నునుచుకొనుట, సౌమ్యతయు మౌనము, మనోనిగ్రహము, పరులతో వ్యవహరించునపుడు కపటములేకుండుటయు నను నివి మానసతపస్సని చెప్పంబడును. (౧౭) శారీరవాచికమానసభేదమునఁ ద్రివిధమని

---

ససాత్త్వికః. ౧౧. అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్, ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్. ౧౨. విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణం, శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. ౧౩. దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవం, బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే. ౧౪. అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్, స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. ౧౫. మనః ప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః, భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే

తెలిపినతపస్సునకు సాత్త్వికాదిభేదమునఁ ద్రైవిధ్యముగలదు. దానిం దెలిపెద నాకర్ణింపుము. త్రివిధమగు నాతపస్సు నుత్కృష్ట శ్రద్ధాయుక్తుఁడై ఫలాపేక్షమాని సిద్ధియందు నసిద్ధియందుసములై యనుష్ఠించినచో నది సాత్త్వికతపస్సనంబడును. (౧౮) కౌంతేయా! తన్ను మానవులెల్ల సత్పురుషుఁ డనుకొనవలయుననియు, గౌరవించుచుండవలయుననియుఁ, బూజించుచుండవలయుననియుఁ, గోరుచు దంభముతో నే తపస్సుచేయఁబడునో యాతపస్సు రాజసమనందగును. ఇది నియతముగానిదియు క్షణికమునునగునని యెఱుంగుము. (౧౯) అవివేకకృతదురాగ్రహముచేత స్వదేహాదులను బీడించుకొనుచు నేతపస్సుచేయఁబడునో, పరవినాశనార్థ మేదిచేయఁబడునో, యాతపస్సు తామసమనఁబడునని యెఱుంగుము. (౨౦) ఇఁకఁ ద్రివిధమగు దానిస్వరూపము నాలకింపుము. దానము చేయవలయునని విధి కలుగుటవలన నీవలసినదియేకాని దానఁగలుగుఫలము నాకు వలదని నిశ్చయముతోఁ బుణ్యదేశమునందును బుణ్యకాలమునందును బాత్రములగువారికిఁ, బ్రత్యుపకారము చేయనివారికి నేదానము చేయఁబడునో యది సాత్త్వికదానమని చెప్పంబడును. (౨౧) ప్రత్యుపకారము నపేక్షించి యో స్వర్గాది

---

౧౬. శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః, అఫలాకాంక్షిభిర్యుక్తైస్సాత్త్వికం పరిచక్షతే. ౧౭. సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్, క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువం. ౧౮. మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః, పరస్యోత్సాదనార్థంవా తత్తామసము దాహృతం. ౧౯. దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే, దేశే కాలే చపాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతం. ౨౦. యత్తుప్రత్యుపకారార్థం ఫల

ఫలము నాకాంక్షించియో, యింతధన మీయవలసివచ్చెఁగదా
యనుఖేదముఁగూడియో, యేదాన మీఁబడునో యది రాజ
సదానమని నిర్ణయింపఁబడును. (౨౨) దానార్హములుకాని దేశ
కాలములయందు నాదేశకాలదోషములను బరిగణింపక యే
దానము చేయఁబడునో, పాత్రములుకాని నటవిటప్రముఖుల
కేది యీఁబడునో, దేశకాలపాత్రములు దొరకినపుడు పాత్ర
భూతులగు ప్రతిగ్రహముచేయువారిని దిరస్కరించుచు నేది
యీయఁబడునో యాదానము తామసదానమని చెప్పఁబడును.
(౨౩) "ఓంతత్సత్" అను మూఁడునామములచే వేదాంతముల
యందు బ్రహ్మవేత్తలు పరబ్రహ్మమును సంస్మరించిరి ఆత్రివిధ
నామముననే తొల్లి విప్రులును వేదయజ్ఞములును నిర్మింపఁ
బడినవి. కావున నీమూఁడు నామములలో దేనినిగాని స్మరించి
యేకర్మముల నొనరించినను సాద్గుణ్యము నొందును. (౨౪) ధనం
జయా! ఆకారణమున వేదాధ్యయనసంపన్నులగువారు తమ
రొనరించునట్టి శాస్త్రవిహితము లగుయజ్ఞములు దానములు
తపస్సులు లోనగుకర్మముల నెల్లపుడు 'ఓం' మ్మను బ్రహ్మనాదము
నుచ్చరించియే చేయుదురు. (౨౫) "తత్" అనఁబడు నాబ్రహ్మ
నామము నుచ్చరించి ముముక్షువులు ఫలాపేక్షమాని పలు

---

ముద్దిశ్య వా పునః, దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతం. ౨౧. అదే
శకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే, అసత్కృత మవజ్ఞాతం తత్తామస
ముదాహృతం. ౨౨. ఓంతత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధ స్స్మృతః,
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. ౨౩. తస్మాదోమిత్యు
దాహృత్య యజ్ఞదానతపఃక్రియాః, ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మ
వాదినాం. ౨౪. తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః, దానక్రియాశ్చ

విధము లగుయజ్ఞములను, దపస్సులను. దానముల ననుష్ఠింతురు. (౨౬) పార్థా! లేదని శంకగలిగినతఱిఁ గలదనుటయందును, అసాధు వనుశంకగలిగినపుడు సాధు వనుటయందును సత్తను నీబ్రహ్మనామము ప్రయోగింపఁబడుచున్నయది. అట్లు ప్రశస్తవివాహాదికర్మమునందును సచ్ఛబ్దము ప్రయోగింపఁబడుచున్నది. (౨౭) యజ్ఞమునందును, దపస్సునందును, దానమునందును నిష్ఠ యేదిగలదో యదియు సచ్ఛబ్దముచేఁ జెప్పఁబడును. వానిని దగినట్లు నెఱవేర్చుటకుఁ జేయుకర్మముగూడ, మఱియు నీశ్వరార్పణ మగుఁగాక యనుబుద్ధితోఁ జేయుకర్మముగూడ సచ్ఛబ్దముచేతనే చెప్పంబడును. (౨౮) ఓపార్థా! శ్రద్ధావిహీనముగాఁజేసిన హోమదానతపస్సులు నితరకర్మములేవిగలవో యవియన్నియు నసత్తని చెప్పంబడును. అవియన్నియు నించుకేఁ బరలోకమునను ఫలింపవు. ఈలోకమునందును ఫలింప వని యెఱుంగుము.

ఇది శ్రద్ధాత్రయవిభాగయోగము.

మహానుభావులారా! శ్రద్ధాత్రయవిభాగయోగ మనుపదునేడవయధ్యాయమును బఠించితిరి. దానిసార మేమని

---

వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః. ౨౫. సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే, ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థయుజ్యతే. ౨౬. యజ్ఞే తపసి దానే చ స్థితి స్సదితి చోచ్యతే, కర్మచైవ, తదర్థీయం సదిత్యేవాభిధీయతే. ౨౭. అశ్రద్ధయా హుతందత్తం తప స్తప్తంకృతం చ యత్, అస దిత్యుచ్యతే పార్థ! న చ తత్ప్రేత్య నో ఇహ. ౨౮.

ఇతి శ్రద్ధాత్రయవిభాగయోగః.

యుంచుక మనసుఁ దెలిపినంతదనుక విమర్శించుట తప్పుకాదు. ఆపనికిం గడంగుదము. దైవాసుర సంపద్విభాగయోగము వినియర్జునుఁడు శ్రీకృష్ణపరమాత్మతో నిట్లు ప్రశ్నించెను. పరమేశ్వరా! లోకమున నెవ్వరు శాస్త్రవిహితమార్గమును వదలి దేవాదులనారాధింతురో వారియారాధనము సాత్త్వికమా. రాజసమా తామసమా నాకు నెఱిఁగింపుము. ఇదియే ప్రశ్నార్థము. అనఁగా శాస్త్రము ననుసరింపకయుండరాదని భగవంతుఁడుపదేశింపఁగా నొకప్పుడద్దాని నాశ్రయింపక చేసిన దేవతాపూజాదికము పూర్వోక్తరీతులలో దేనియందుఁ జేరుననికదా యర్జునుని యూహ? శాస్త్రము ననుసరింపక యెవ్వరేనెట్లో దేవతల నారాధించువారుండిన వారిగతియేమని ప్రశ్నసారము. శ్రద్ధ యనునది పరిశుద్ధమని భగవంతుఁడే యింతకుముదుగాఁ దెలిపియుండెను. శాస్త్రము ప్రధానమనియును నెఱిఁగించెను. ఈ రెండును ప్రధానములే యని యేర్పడెను. వీనిలో నొకదానిని (శాస్త్రమును) మాని శ్రద్ధతోఁ గర్మముల నాచరించుట యసంభవము కాదుకదా? కావున నట్టివారిగతి యేమని ప్రశ్నించుట సంగతము కాదు. కావున నర్జునునిశంక యుక్తమే యని యెంచి భగవంతుఁడు సమాధాన మొసంగెను. శాస్త్రమునుమాని కర్మ మాచరింపవలనుపడును గాని శ్రద్ధలేక యది యాచరింప వలనుపడదు. కావుననే భగవంతుఁ డాశంక తొలంగ సమాధాన మొసంగెను.

ఆలస్యము లోనగుదోషకారణములచేత శాస్త్రము నాదరింపక శ్రద్ధాపూర్వకముగాఁ బెద్దలు వ్యవహరించినమార్గమునే యనుసరించుచుఁ బ్రవర్తించువారు శాస్త్రము నాదరిం

పకయుండుట యసురధర్మ గాన దాని సాధర్మ్యముచేతను, శ్రద్ధా పూర్వకమగు ననుష్ఠానము దేవధర్మము కావున దత్సాధర్మ్యముచేతను అసురులా? లేక దేవతలా యనుశంకను రాజసతామసశ్రద్ధాపూర్వకముగా రాజసతామసయజ్ఞాదుల ననుష్ఠించువారసురు లనఁబడుదురు. వారు శాస్త్రవిహితజ్ఞానసాధనమునం దధికారులుకారు. సాత్త్విక శ్రద్ధాపూర్వకముగా సాత్త్వికయజ్ఞాదుల నాచరించువారుమాత్రము దేవత లనఁబడుదురు. వారు శాస్త్రీయజ్ఞానసాధనమునం దధికారముకలవార లగుదురు. అని యాశ్రద్ధనుఁ మూఁడువిధములని ప్రదర్శించి దానిమూలమున నాహారము మూఁడువిధములుగా నుండుననియుఁ గనఁబఱచి యాశంకను దొలఁగించెను. ఇదియే సమాధానసారము.

శ్రద్ధ పవిత్రపదార్థమేయైనను సత్త్వగుణప్రధానమయ్యేనేని యాకర్మము నాచరించువారు దేవతాంశసంభూతులనియు నది రజస్తమోగుణప్రధానమయ్యేనేని కర్మము నాచరించువారు రాక్షసాంశజనితులనియు మన మూహింపవచ్చును. ఎల్లరకు శ్రద్ధ సమానమేయైనను, ఆహారాదుల ననుసరించియు వారు చేయుకర్మములు పరహితములు పరబాధాజనకములు నగుచుండుననియు మన మెఱుంగవలయును. సత్త్వగుణసహిత శ్రద్ధ తనకు నితరులకు హితముచేయుననియు రజస్తమోగుణయుక్తశ్రద్ధ తనకు నితరులకునహితము చేయుననియుఁ గావున నట్టికర్మములఫలము లిట్టివని యెఱింగి తత్కార్త లీతెగవారనియు మనమూహించి మానఁదగినపద్ధతుల మాని గ్రహింపఁదగుమార్గముల నెఱింగి కృతకృత్యులము గావలయును. మఱియు మనము గ్రహించునాహారములనుబట్టియు మన

యందు సత్త్వరజస్తమోగుణములయం దేది ప్రధానముగా నుండుననియు గ్రహింపవచ్చును. కావున నాహారపదార్థములు కూడ నిట్టివి గ్రహింపరానివనియు నుపదేశించి పరాత్పరుండగు శ్రీకృష్ణమూర్తి తనకరుణను దెల్పెను. సాత్త్వికాహారనియతి గలిగి సత్త్వగుణప్రధానుఁడై యజ్ఞతపోదానములను జేయవలయుననికదా యీయుపదేశసారము. తొలిజన్మమున నేయే మానవు లెట్టికర్మముల నాచరించియుందురో వానికిందగినయట్లు ప్రవృత్తియు నాహారము తపస్సు లోనగువాని నాచరించునూహయుం గలుగును. వారియలవాటులంబట్టియే యితరులిట్టికర్మముల వీరాచరించియుందురని యూహింపవచ్చును. కొంతకాలమునకు వారియలవాటులు మార్పునొందును. అప్పుడాకర్మఫలము ముగిసినదనియు నింకొకకర్మఫల మనుభవమునకు వచ్చినదనియు మన మూహింపఁదగును. దుష్పదార్థములను గ్రహించుచు వేదాంతార్థముల నుపన్యసించువారు జగద్వంచకు లనఁదగుదురు. దాన వారలకుఁ గలుగులాభ మేమనఁగాఁ దమజీవితమును బాడుచేసికొనుటయు నిట్లు చేసికొనుచున్నారముకదా యని యాలోచింపకుండుటయు ననుటకంటె వేఱొండెద్దియుఁ గానరాదు. ఫలమునుగోరి యజ్ఞముల నాచరింపక ప్రతిష్ఠనుగోరి దానమీయక లోకులమర్యాదనుగోరి తపస్సుచేయక శ్రీకృష్ణపరబ్రహ్మ ముపదేశించినమార్గము ననుసరించి వాని నొనరించి కృతకృత్యులుగావలయు ననుటయే యీయుపదేశసారము. ఇఁకఁ దరువాతి యుపదేశమును బరికింతము.

## మోక్షసన్న్యాసయోగము.

(౧) ఈవిధముగాఁ బరాత్పరుఁడు శ్రద్ధాత్రయవిభాగయోగము నుపదేశింపఁగా సన్న్యాసము, త్యాగము నను నీరెండువిషయములే యీయుపదేశసారసర్వస్వమని యర్జునుఁడెఱింగి వానిస్వరూప మింకను దెలిసికొనఁగోరి యిట్లు ప్రశ్నించెను. (ఇంతకుముం దుపదేశించినదానియందు శ్రద్ధాత్రైవిధ్యము, ఆహారయజ్ఞతపోదానత్రైవిధ్యముకలదు. వానిమూలమునఁ గర్మములకుఁ ద్రివిధత్వము చెప్పఁబడినది. సాత్త్వికములు గ్రహింపఁదగినవనియు రాజతామసములు త్యజింపవలయుననియు సారము. ఇట్లుపదేశించి యిఁక సన్న్యాసత్రైవిధ్యమును బ్రతిపాదించి సన్న్యాసులకుఁ ద్రైవిధ్యముగలదని ప్రతిపాదింప శ్రీహరి పూనెను. అందుఁ దత్త్వజ్ఞానము తెలిసిన తర్వాతనే యేది ఫలభూతకర్మసన్న్యాసముగలదో యది యీావఱకే పదునాల్గవయుపదేశమునఁ బ్రతిపాదింపఁబడినది. దానియందు సాత్త్వికరాజసతామసభేదము సంభవింపదు. మఱియుఁ దత్త్వజ్ఞానమునకుఁ బూర్వమేది తదర్థకర్మసన్న్యాసము తత్త్వజిజ్ఞాసచే వేదాంతవాక్యవిచారముకొఱకు నగునో యదియు నింతకుముందే నిర్గుణంబని తెలుపఁబడినదియే. ఇఁక నేయది తత్త్వబోధము కలుగనివారికిని, మఱియుఁ దత్త్వజిజ్ఞాసయుఁ బుట్టనివారికిని, సన్న్యాసము గౌణముగఁ జెప్పఁబడినదో

---

మోక్షసన్న్యాసయోగః.

అర్జున ఉవాచ. సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుం,

దానికిఁ ద్రివిధత్వము గలదు. దాని నెఱుంగఁగోరియే యర్జునుఁ
డిట్లు ప్రశ్నించెనని యెఱుంగవలయును. ఓమహాబాహూ!
కేశిదానవసంహారకా! శ్రీకృష్ణా! సన్న్యాసశబ్దార్థమునకుఁ
ద్యాగశబ్దార్థమునకును బ్రత్యేకించి తత్త్వముగలదని తెలిసి
కొంటిని. దాని నిపు డెఱుంగఁగోరుచున్నవాఁడను. నాకు నుప
దేశింపుము. (౨) అని ప్రశ్నింపఁగా భగవంతుఁ డిట్లు సమా
ధానము తెల్పెను. ధనంజయా! యీవఱకే యందందు సన్న్యా
సత్యాగశబ్దము లుపదేశింపఁబడినవి. వాని నిష్కృష్టార్థ మటఁ
దెలుపలేదు. దాని నిందుఁ దెలిపెదను. అవహితుఁడవు కమ్ము.
అశ్వమేధాదికానేకకామ్యకర్మముల ననుష్ఠింపక వానివదలుట
సన్న్యాసశబ్దమున కర్థమని కొందఱు పండితులయాశయము.
నిత్యనైమిత్తికకర్మముల నాచరించి తత్ఫలముల భగవదర్ప
ణముచేయుట అనఁగా వానిని వదలుట త్యాగశబ్దమున కర్థ
మని కొందఱుపండితులు పలుకుచున్నారు (౩) అర్జునా! బుద్ధి
శక్తిగలవారు కొందఱు సాంఖ్యాదిమతముల నాశ్రయించి
కర్మములు బంధకములు కావున దోషవంతములుగ నుండును.
ఆకారణమునఁ గర్మాధికృతులుగూడ సర్వకర్మములను బరిత్య
జింపవలయునని పలుకుచున్నారు. రాగాదిదోషముల నెట్లు
వదలిపెట్టఁదగునో యట్లే సర్వకర్మములను విడఁవవలయు
ననియుఁ బలుకుదురు. ఇంకను గొందఱు పండితులు యజ్ఞ
దానతపోరూపము లగుకర్మములను వదలఁగూడదని చెప్పు

త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన. ౧. శ్రీభగవానువాచ.
కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః, సర్వకర్మఫల
త్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః. ౨. త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ

దురు. విద్వాంసులుకానివారలకు ఫలత్యాగమాత్రమే త్యాగ శబ్దార్థముకాని కర్మత్యాగము కాదను నీవిషయమునే యితర మతములను నిరాకరించి చెప్పఁదలఁచి యీవిషయములను దెలిపితినని యెఱుంగుము. (౪)ఓపార్థా! ఇట్లు చెప్పిన యీపక్ష ములయందు నానిశ్చయమును దెల్పెదను. ఆలకింపుము. త్యాగ సన్న్యాసశబ్దముల కొక్కటియే యర్థముకాని వేఱువే అర్థము లు గలవని తలంపకుము. పురుషవరేణ్యా! త్యాగమనునది తా మసాదిభేదములచే మూఁడువిధములని శాస్త్రములయందుఁ జెప్పఁబడినది. (౫) యజ్ఞము దానము, తపస్సనను నీకర్మములను వదలనేకూడదు. వీనిని దప్పక యాచరింపవలయును. ఎందుల కందువో ఈమూఁడును ఫలాంకాక్షలేనివారలకు నంతఃకరణ శుద్ధి కలిగించును. (౬) పార్థా! యజ్ఞదానతపస్సు లనునీసత్కర్మములను వానియందుసంగమును దత్ఫలములనువదలి ముము క్షువుచేయవలయునని నానిశ్చయము. ఇది యుత్తమమగుమ తము (కావున నీవ ట్లనుష్ఠింపుము.) (౭) నిత్యకర్మపరిత్యా గము యుక్తముకాదు. అజ్ఞానమువలన దానివదలుట యను నది తామసత్యాగమని చెప్పంబడును. (౮) కర్మము దుఃఖాత్మక

---

ప్రాహుర్మనీషిణః, యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే. ౪.నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ, త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః. ౫. యజ్ఞో దానం తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్, యజ్ఞో దానం తపశ్చైవ పావనానిమనీ షిణాం. ౬. ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ, కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమం. ౭. నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే, మోహా త్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః. ౮. దుఃఖమిత్యేవ యత్కర్మ కాయ

మని దేహకష్టమునకోపక దానివదలుట యనునది రాజసత్యాగము. అట్టిత్యాగము నొనరించినపురుషునకు జ్ఞానపూర్వకసన్న్యాసఫలము కలుగనే కలుగదు. (౯) అర్జునా! నిత్యకర్మము కర్తవ్యమే యనునిశ్చయమున దానిఁజేయుచు నందాసక్తిని ఫలమునువదలుట యనున దేదో అసంగఫలత్యాగము సాత్త్వికత్యాగమని చెప్పఁబడినది. (౧౦) ఏమానవుఁడు సంగమును ఫలాకాంక్షను మాని నిత్యకర్మము ననుష్ఠించుచున్నాఁడో వాని యంతఃకరణము ఫలరాగాదికముచేత నకలుషముగాఁ జేయఁబడినదగుచు నిత్యకర్మములచే సంస్కరింపఁబడుచుఁ బరిశుద్ధమగుచున్నది. విశుద్ధము ప్రసన్నమై యాత్మావలోకక్షమం బగుచున్నది. నిత్యకర్మముల నొనరించుటచేత విశుద్ధాంతఃకరణుఁడై యాత్మజ్ఞానాభిముఖుఁడైనవానికి వరుసగా నేరీతిగాఁ దన్నిష్ఠ కలుగునో యది వక్తవ్యమగునుగాన వచించెద వినుము. ఇట్లు సంగముల వదలి నిత్యకర్మముల ననుష్ఠించుట యనుసాత్త్వికత్యాగము కర్మయోగము ననుష్ఠించి చిత్తశుద్ధి నొందినవాఁడై క్రమముగా నాత్మజ్ఞానలక్షణ మగుప్రజ్ఞనుబొంది యద్దానిచే నవిద్యాకృతములగు సర్వసంశయములను వదలినవాఁడే మానవుఁడగునో యాతఁ డశుభమగుకామ్యకర్మమునందు ద్వేషము వహింపఁడు. కుశలరూప మగునిత్యకర్మమునందును బూర్ణకాముఁడగుటచేఁ బ్రీతినివహింపఁడు. ఇట్టి లక్షణములఁ బరికించి

---

క్లేశభయాత్త్యజేత్, సకృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. ౯. కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున, సంగం త్యక్త్వా ఫలం చైవ సత్యాగ స్సాత్త్వికో మతః. ౧౦. న ద్వేష్ట్యకుశలంకర్మ కుశలే

సాత్త్వికత్యాగపరినిష్ఠితుఁ డని యెఱుంగవలయును. (౧౧) దేహమునం దాత్మాభిమానముకలిగి తాను కర్తనని తలంచువాఁడు సర్వకర్మములను సన్న్యసింపశక్తికలవాఁడుకాఁడు. కాఁబట్టి యతఁడునిత్యకర్మముల నాచరించుచు వానిఫలములయందుఁ గాంక్షనుమాత్రము విడువవలయును. ఆస్థితియందున్నవాఁడు కర్మముల నాచరించుచున్నను సన్న్యాసి యని వినుతింపఁబడును. ఇట్లులగుటచేతనే యజ్ఞునకుఁ గర్మత్యాగము సంభవింపదు.౧౨. నరకము నొందుట తిర్యగ్యోనిని బ్రాపించుట లోనగునిష్టఫలమును, దేవశరీరప్రాప్తి మున్నగునిష్టఫలమును మనుష్యత్వప్రాప్తిరూపమగు మిశ్రఫలమును అను నీత్రివిధకర్మఫలము పరమార్థసన్న్యాసులుకాని కర్మయోగులకు దేహము వదలినపిమ్మటఁ గలుగక తప్పదు. పరమార్థసన్న్యాసులకుమాత్ర మెప్పుడును గలుగనేరదని గ్రహింపుము. దేహధారియై పరమాత్మజ్ఞానశూన్యుఁడునై కర్మయయ్యును గర్మఫలాభిసంధిత్యాగముచేసిన గౌణసన్న్యాసికిని బరమాత్మజ్ఞానవంతుఁడై దేహాభిమానరహితుఁడై సర్వకర్మత్యాగియగు ముఖ్యసన్న్యాసికిని ఫలమునందు విశేషమేమి? ఏయది లభింపకుండుటచే నొకటి గౌణమగునో ఏయది లభించుటచే రెండవది ముఖ్యమగునో ఆవిశేషమేమి? సర్వకర్మఫలత్యాగిత్వమో యిద్దఱయందును సమానమే. కావున మఱియొకవిశేషము చెప్పవలయునని యూహించియే చెప్పితిని. (౧౩) ఓయిమహాబాహూ! సర్వక

---

నానుషజ్జతే, త్యాగీసత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. ౧౦. న హి దేహభృతాం శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః, యస్తు కర్మఫలత్యాగీసత్యాగీత్యభిధీయతే. ౧౧. అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలం, భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్. ౧౨. పంచైతాని మహా

ర్మములను సిద్ధినొందుటకు గారణములని కర్మపరిసమాప్తిహే
తువగు నాత్మజ్ఞానమును దెలుపునట్టి వేదాంతమునందుఁ జెప్పఁ
బడిన యీయైదింటిని జెప్పెద వినుము.(౧౪) శరీరము బుద్ధ్యా
దులగునుపాధులతోఁ గూడినభోక్తయు శ్రోత్రాదీంద్రియద్వా
దశకము, ప్రాణాపానవ్యానోదానసమానములను పంచవాయు
వులు ఈనాలుగుఁగాక వీనికైదవదియుఁ జక్షురాద్యనుగ్రాహక
మగు నాదిత్యాదిదైవము ఈయైదును కర్మకారణములు.౧౫
కౌంతేయా! మానవుఁడు వాఙ్మనఃకాయములమూఁడింటిచేత
నేకర్మమును జెయుచున్నాఁడో యది ధర్మోపేతమైనను ఆసర్వక
ర్మమునకు నీయధిష్ఠానాదులైదే హేతవులగునని యెఱుంగు
ము.౧౬ ధనంజయా! ఇట్లు సర్వకర్మమునకు నధిష్ఠానాదులే
కర్తలగుచుండఁగా శాస్త్రమువలన నాచార్యోపదేశమువలన
సంస్కారమునొందనివాఁ డగుటచేతనే మానవుఁ డాయధిష్ఠా
నము లోనగు వానియందుఁ దన నభేదమునఁ గల్పించుకొని యవి
యనుష్ఠించుకర్మములను దా నొనరించుచున్నానని పరిశుద్ధుఁ
డగునాత్మనే కర్తనుగాఁ దలఁపోయుచున్నవాఁడో యాతం
డాత్మతత్త్వమునుగాని కర్మతత్త్వముగాని యెఱుంగఁడు. సర్వ
దా జననమరణప్రాప్తి హేతువగుబుద్ధిగలవాఁ డగుటవలన,

---

బాహో! కారణాని నిబోధ మే, సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వ
కర్మణాం. ౧౩. అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధం, వివిధా చ
పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమం. ౧౪. శరీరవాఙ్మనోభి ర్య త్కర్మ
ప్రారభతే నరః, న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. ౧౫.
తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః, పశ్యత్యకృత బుద్ధిత్వాన్న స

నాతఁడు దుర్మతియనంబడునని నిశ్చయింపుము. (౧౭) ఇఁక సుమతి యనఁగా నెవ్వాఁడో వచియించెద. వినుము. నేను గర్త ననునహంకార మెవ్వరికిని లేకుండునో, ఎవ్వానియంతః కరణమునందు నేను గర్మము ననుష్ఠించితి ననుభావము కలుగ కుండునో యట్టివాఁడు సర్వప్రాణులనుజంపినను వధింపనివాఁడే యగును. తత్ఫలములతో సంబంధము లేనివాఁడగును. (౧౮) ఎఱుంగుట జ్ఞానమనంబడు. ఎఱుంగఁదగినది జ్ఞేయమనంబడును. ఎఱుంగువాఁడు పరిజ్ఞాత యనఁబడును. అవిద్యాకల్పితుఁ డగు భోక్త యనియు వానికే పేరు అని మూఁడుప్రకారములు కర్మములకుఁ బ్రవర్తకము గలుగును. బాహ్యశ్రోత్రాదికము నాం తరబుద్ధ్యాదికము కరణము. కర్త కీప్సితతమమును జేయఁబడు నది కర్మము. చేయువాఁడు కర్త ఉపాధిలక్షణుఁ డనఁబడును. అని మూఁడువిధములు కర్మసంగ్రహము. సకలకర్మములు నీ మూఁడింటినే యాశ్రయించి ప్రవర్తించును. ఇంతకుము న్నధి ష్ఠానాదిపంచకమే క్రియాహేతువగుటచే నాత్మ సర్వకర్మాఽసం స్పర్శి యని చెప్పఁబడినది. ఇపు డాయభిప్రాయమునే జ్ఞానేం ద్రియాదిప్రక్రియా రచనచేతను త్రైగుణ్యభేదవ్యాఖ్యానము చేతను వివరింపఁబడినదని తెలిసికొమ్ము. (౧౯) జ్ఞానముకర్మము కర్తయు సత్త్వరజస్తమో గుణభేదముచేత మూఁడువిధములే యగునని కపిలముని రచియించినసాంఖ్యశాస్త్రమునందు విధింపఁ

---

పశ్యతి దుర్మతిః. ౧౭. యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే, హత్వాపి స ఇమాఀల్లోకాన్నహంతి న నిబధ్యతే. ౧౮. జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా, కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసం గ్రహః. ౧౯. జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః, ప్రోచ్యతే

బడినది. ఆజ్ఞానాదులను,గుణకృతములగు వాని భేదములనుగూడ శాస్త్రముననుసరించి తెలిపెదను. అవహితుఁడవుకమ్ము. (౨౦) ధనంజయా! అందు మొదటి దగుజ్ఞానము త్రివిధములుగలదిగా నుండును. ఎట్లనఁగా, అవ్యక్తముఁ మొదలు స్థావరాంతములగు సకలభూతములయందును, అవి ప్రతిదేహమునందును, విభక్తములై యున్నను విష్ణుపదముభాతి నిరంతరమై యవిభక్తమై వ్యయమే లేకయున్న యాత్మవస్తువు నొక్కదానినే యేజ్ఞానముచేఁ దెలియుచున్నాఁడో యట్టి యద్వైతాత్మజ్ఞానము సాత్త్వికమని తెలిసికొమ్ము. (దానినే సంపాదింపఁ బ్రయత్నింపవలయునుజుమీ!) (౨౧) సర్వభూతములందును. వానిభిన్నలక్షణములనుబట్టి యాత్మలును నానాప్రకారములుగా భిన్నములుగా నున్నవని భేదమున నేజ్ఞానముచేత నెఱుంగుచున్నాఁడో యాజ్ఞానము రాజసమని తెలియుము. (౨౨) దేహముగాని ప్రతిమాదికముగాని యొక్కకార్యమునే పూర్ణముగాఁ దలంచి దేహమే యాత్మయగునని, ప్రతిమాదికమే యీశ్వరుండగునని యంతకంటె నుత్కృష్టము లేదని దానియందే యాసక్తమును, యుక్తిశూన్యమును, బరమార్థవిరహితమును, అల్పమునునగు నేజ్ఞానముగలదో యదియే తామసమని చెప్పంబడును. (౨౩) ఇఁకఁ గర్మమునకుఁగల త్రైవిధ్యము

గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి. ౧౯. సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే, అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికం. ౨౦. పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్, వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్. ౨౧. యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకం, అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతం. ౨౨.

నెఱింగించెద నాకర్ణింపుము. ఆసక్తిగాని రాగద్వేషములుగాని లేక ఫలాభిసంధిలేక యుండుపూరుషుఁడు చేయునిత్యకర్మము సాత్త్వికమని చెప్పంబడును. (౨౪) కుంతీనందనా! ఫలాపేక్షయు నేను సత్కర్మనిరతుఁడ ననునహంకారమునుగలవాఁడు మిగుల నాయాసముతోఁ జేయునట్టికర్మము రాజసమని యెన్నంబడు (౨౫) ముందుఁగలుగఁబోవుకష్టమును, జేయఁబూనినకర్మమునుండి కలుగఁబోవుశక్తిక్షయమును, అర్థక్షయమును, ప్రాణిహింసను, స్వశక్తి నూహింపక యవివేకమువలననేకర్మ మారంభించి చేయఁబడునో యది తామసకర్మ మనంబడును. (౨౬) సంగవర్జితుఁ డగువాఁడును, కర్తను నేనని వ్యవహరింపనివాఁడును, ధైర్యోత్సాహములుకలవాఁడును, ఫలముగలిగినను గలుగకున్నను వికారము నొందకయుండువాఁడు నగుకర్త సాత్త్వికుఁడని పిలువంబడును. కర్త త్రైవిధ్యమున నిది మొదటిదని యెఱుంగుము. (౨౭) తాఁజేయుకర్మమునందుఁ గామాదులచే వ్యాకులచిత్తముగలవాఁడును, దానిఫలమును గోరువాఁడును, బరద్రవ్యమునందుఁ బేరాశగలవాఁడును, స్వీయధనమును ధర్మకార్యార్థము వదలనంగీకరింపనివాఁడును, బరులనెప్పుడు బాధించువాఁడును, శాస్త్రోక్తమగు శౌచములేనివాఁ

---

నియతం సంగరహిత మరాగద్వేషతః కృతం, అఫలప్రేప్సునా కర్మ యత్త త్సాత్త్విక ముచ్యతే. ౨౩. యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః, క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతం. ౨౪. అనుబంధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషం, మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసము తే. ౨౫. ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః, సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. ౨౬. రాగీ కర్మఫల

డును, ఇష్టానిష్టప్రాప్తులయందును, కర్మసిద్ధ్యసిద్ధులయందును హర్షశోకములను బొందువాఁడునగు కర్త రాజసుఁడనఁబడును. (౨౮) ధనంజయా! తాఁజేయవలసినకార్యములయందుఁ జంచలస్వభావుఁడును, శాస్త్రసంస్కారమిసుమంతయేని లేనివాఁడును, పెద్దలయందు నమ్రతలేనివాఁడును, వంచకుఁడును, బరులవృత్తిని బాడుచేయువాఁడును, దప్పక చేయఁదగుకార్యములయందుఁ బ్రవృత్తిలేనివాఁడును, సర్వదా దుఃఖించుస్వభావము గలవాఁడును. దత్కాలముననే చేయవలసినకార్యము నెంతకాలమునకో చేయువాఁడును, నగుకర్త తామసుఁడని చెప్పంబడును (౨౯) ఇఁక బుద్ధికిని ధైర్యమునకును గలత్రైవిధ్యమును దెలిపెదను. ధనంజయా! అభేదము సత్త్వాదిగుణములవలనఁ ద్రివిధమై యుండును. దానిని సాకల్యముగా విభజించి చెప్పెదను. చక్కఁగా నాలకింపుము. (౩౦) ఓపార్థా! బంధహేతువగుకర్మమార్గమును, మోక్షకారణమగుసన్న్యాసమార్గమును, దేశకాలాదులననుసరించి కార్యాకార్యములను జేయుటయును, చేయక యూరకుండుటయును, భయకారణమును, అభయకారణమును, సహేతుకబంధమోక్షములను, ఏబుద్ధిచే నెఱుంగునో యాబుద్ధి సాత్త్వికమనంబడును. (౩౧) పార్థా! ధర్మ

---

ప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః, హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. ౨౮. అయుక్తః ప్రాకృతస్స్తబ్ధశ్శఠో నైకృతికోఽలసః, విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. ౨౯. బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు, ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ. ౩౦. ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే, బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ. ౩౧. యయా ధర్మమధర్మంచ కార్యం చాకార్య

మును, వానినిజేయుట, చేయకుండుట, సాకల్యమున ననిశ్చిత ముగా నేబుద్ధిచేతఁ బూరుషుఁడు తెలియుచున్నాఁడో యది రాజసమని చెప్పంబడును. (32) పృథాపుత్త్రా! విశేషజ్ఞాన విరోధియగుదోషముచే నావరింపఁబడిన యేబుద్ధిచేత నధర్మ మును ధర్మమని, అట్లే జ్ఞేయపదార్థముల నన్నింటినిగూడ విపరీ తములుగా నేపురుషుఁ డెఱుంగుచున్నాఁడో యాబుద్ధి తామ సమని పిలువఁబడును. (33) కుంతీనందనా! సర్వదా బ్రహ్మవిష యమగు నేకాగ్రతతోఁగూడియుండు నేధృతిచేత మనోవ్యా పారములను, బ్రాణవ్యాపారముల, నింద్రియవ్యాపారములను శాస్త్రవిహితమార్గమును దాఁటకయుండ నియమించుచున్నాఁ డో యాధృతి సాత్త్వికమని ప్రసిద్ధిగాంచినది. (34) ఓయర్జు నా!ఏధైర్యముచేత ధర్మకామార్థములను వానివానిని ధరించు ప్రసంగమున వానిఫలములఁగోరి మనస్సునందుఁ బురుషుఁడు నిత్యకర్తవ్యములుగా నిశ్చయించుకొనుచున్నాఁడో యాధై ర్యము రాజస మనంబడును. (35) నిద్రను భయమును శోకవి షాదమదములనేధైర్యముచే దుర్మతియగుపురుషుఁడు వదలక ధరించునో యది తామసధైర్యమని యెఱుంగుము (36) ఓభర

---

మేవ చ, అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థరాజసీ. 32. అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసా వృతా, సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ. 33. ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియ క్రియాః, యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ సాత్త్వికీ. 34. యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున, ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సాపార్థ రాజసీ. 35. యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ, న విముంచతి దుర్మేధాః ధృతిస్సా పార్థ తామసీ. 36. సుఖం

తశ్రేష్ఠా! ఇపుడు గుణభేదముచేతఁ ద్రివిధముగ నున్నసుఖ
మును దెలిపెదను. సావధానముగా నాలకింపుము. ఒక్కప
ర్యాయ మనుభవించినసుఖమును మరలఁ బొందినపుడు పురు
షునకు సంతోషము దుఃఖశాంతియుఁ గలుగును. కావున సకల
వ్యవహారములకు ఫలభూతమగుసుఖభేదముల నవశ్యము తెలి
యవలయును. (౩౭) ధనంజయా! ఏసుఖము మొదట జ్ఞానవై
రాగ్యప్రభృతులయభ్యాసకాలమునందు విషమువలె దుఃఖా
త్మకమగునో, ఆవెనుకఁ దత్పరిపాకావస్థయం దమృతతుల్యమ
గునో, ఆసుఖ మంతఃకరణనైర్మల్యమువలనగాని ఆత్మజ్ఞానప్రక
ర్షమువలనఁగాని కలుగునది. కావున సాత్త్వికమని చెప్పఁబడి
నది. (౩౮)విషయముల నుపభోగించుటవలనఁ బ్రసిద్ధమగు నేసు
ఖము కలుగుచున్నదో ఆసుఖ ముపభోగావసరమందు నమృత
సమానమై యుపభోగాంతమునందు బలవీర్యాదిహానికి హేతు
వగుటవలన నధర్మమునకు నరకాదిప్రాప్తికి హేతువగుటవల
నను విషతుల్యమగును. కావున నాసుఖము రాజసమగును.
(౩౯) తత్కాలమునందు నుత్తరకాలమునందుఁ బురుషునకు
మోహముకలిగించునదియు, నిద్రాలస్యప్రమాదజనితము నగు
సుఖమేదియో యది తామస మనఁబడును. (౪౦) భూలోకము

---

త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ, అభ్యాసాద్రమతే యత్ర దుః
ఖాంతం చ నిగచ్ఛతి. ౩౭. యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమం,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజం. ౩౮. విషయేంద్రియ
సంయోగా ద్యత్త దగ్రేఽమృతోపమం, పరిణామే విషమివ తత్సుఖం
రాజసం రాజసం స్మృతః. ౩౯. యదగ్రే చానుబంధే చ సుఖం మోహన
మాత్మనః, నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతం. ౪౦. న తదస్తి

నందు మానవులు లోనగువారియందుఁగాని దేవలోకము నందు నమరులయందుఁగాని ప్రకృతిసంభవములగు నీసత్త్వాది గుణములు మూఁడింటిచే శూన్యమగువస్తువు స్థావరజంగమ ములలో నేదియు లేదని తెలియందగును. (౪౧) పరంతపా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకును శూద్రులకును వారివారిస్వభావ ముచేతఁ గలిగినసత్త్వాదిగుణములనుబట్టి వేఱువేఱుగాఁ గర్మ ములు శాస్త్రముచేత విధింపఁబడినవి. ఎట్లనఁగా బ్రాహ్మణస్వభా వమునకు సత్త్వగుణము ప్రభవము. క్షత్రియస్వభావమునకు సత్త్వోపసర్జనమగు రజోగుణము ప్రభవము. వైశ్యస్వభావము నకుఁ దమోగుణోపసర్జనంబగురజోగుణము ప్రభవము. శూద్ర స్వభావమునకు రజోగుణోపసర్జనమగు తమస్సు ప్రభవము. ప్రశాంతి, ఐశ్వర్యము, ఆశ, మూఢత్వము.ననుస్వభావము లీజా తులయందుఁ బ్రధానముగాఁ గనఁబడుటంబట్టి యీగుణములు నిశ్చయింపఁబడియెను. స్వభావమనఁగా జన్మాంతరమునందుఁ జేయఁబడుసంస్కారము ప్రాణులకు వర్తమానజన్మమునందు స్వకార్యాభిముఖమై యభివ్యక్త మగునది యని యర్థము. అది యేగుణములకుఁ బ్రభవమగునో యది స్వభావప్రభవ మగుగు ణము. ఇట్లెఱుంగుము. (౪౨) శమము, దమము, శారీరాదిత్రి విధ తపస్సు బాహ్యాభ్యంతరశౌచము, క్షమయు, ఋజుత్వము, నిష్కాపట్యము, జ్ఞానవిజ్ఞానములు, ఆస్తికతయు ననునివి బ్రాహ్మ

---

పృథివ్యాం వా దివి దేవేషు వా పునః, సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభి స్స్యాత్త్రిభిర్గుణైః. ౪౦. బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప, కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః. ౪౧. శమో దమస్తపశ్శౌచం క్షాంతిరార్జవమేవ చ, జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజం.

ణులకు స్వభావములగుకర్మము లగును. (౪౩) పరాక్రమము, ప్రాగల్భ్యము, ధైర్యము, దక్షతయు, యుద్ధమున శత్రువులకు వెన్నిచ్చి పాఱిపోకుండుటయు, దానము, ప్రభుత్వము నను నివి క్షత్త్రియజాతికి స్వభావము లగుకర్మము లగును. (౪౪) కృషియు పశుపాలనము, క్రయవిక్రయాదికమునను నివి వైశ్య జాతికి స్వభావకర్మములు. శూద్రునకుఁ బరిచర్యాత్మకకర్మము స్వభావముగా నగును (౪౫) స్వస్వవర్ణాశ్రమములకు విహితమగు కర్మమును దప్పక ఫలాపేక్షమాని యాచరించుపురుషుఁడు పరి శుద్ధచిత్తుఁడై జ్ఞాననిష్ఠకుఁ దగినవాఁడగును. వాఁడు స్వకర్మాను ష్ఠానముచే నేవిధముగా సిద్ధినొందునో ఆపద్ధతి నెఱింగించెద. ఆకర్ణింపుము. (౪౬) అర్జునా! సర్వభూతములకు నేయీశ్వరుని వలన నుత్పత్తి కలుగుచున్నదో, వానికి సర్వవిధములగు వ్యా పారములు అంతర్యామి యగు నెవ్వనివలనఁ గలుగుచున్నవో, యీసర్వప్రపంచము నేపరమేశ్వరునిచే వ్యాపింపఁబడియు న్నదో అట్టి యీశ్వరుని స్వీయకర్మములమూలమున నారాధించి మనుష్యుఁడు జ్ఞాననిష్ఠకుఁ దగుసిద్ధిని బొందుచున్నాఁడు (౪౭) ఆకారణమువలన యథాశాస్త్రముగా నాచరించినస్వధర్మముల

---

౪౨. శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం, దానమీశ్వర భావశ్చ క్షాత్త్రం కర్మ స్వభావజం. ౪౩. కృషిగోరక్ష్యవాణిజ్యం వైశ్య కర్మ స్వభావజం, పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం. ౪౪. స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః, స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. ౪౫. యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం, స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. ౪౬. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్, స్వభావనియతం కర్మ కుర్వన్నా

కంటెను స్వధర్మము గుణహీనమైనను దానినే యథాశక్తిగా నాచరించుటయే క్షేమము. స్వభావనియతమగుకర్మము నాచరించుటంజేసి పుణ్యము కలుగునుగాని పాపము కలుగదని యెఱుంగనగును. (౪౮) ఓకౌంతేయా! స్వభావనియతమగు కర్మము దోషయుక్తమైనను దానిని విడువఁగూడదు. ఎందులకనఁగా సర్వకర్మములును త్రిగుణాత్మకము లగుటవలన స్వకర్మములు పరకర్మములుఁగూడ నగ్నిహోత్రుఁడు ధూమావృతుఁడగునట్లు దోషయుక్తములుగనే యున్నవి. కాఁబట్టి స్వధర్మమును విడిచి పరధర్మము నాచరించినను దోషము మాత్రము తప్పదు. అందువలననే స్వధర్మము నెంతమాత్రము వదలఁకూడదు. విహితమగుహింసాదికము ఏకారణమునఁ బ్రత్యవాయహేతువు కాదో పరధర్మము భయావహ మగునో సామాన్యదోషమున సర్వకర్మములును దుష్టములే యగునో అక్కారణమున సహజకర్మమును మానరాదని యెఱుంగుము.(౪౯) ఈరీతిగా స్వకీయకర్మాచరణముచేతఁ బరమేశ్వరు నారాధించుచు నాజగదీశ్వరుని యనుగ్రహమున నంతఃకరణశుద్ధిని గాంచి పుత్త్రకళత్త్రాదులయందు స్పృహ లేనివాఁ డగుచు నింద్రియముల జయించి యాత్మను వశీకరించుకొని దేహమునందును జీవితభోగములందును స్పృహయే లేనివాఁడునగుచు నాత్మవేత్త సర్వకర్మసన్న్యాసముచే సద్యోముక్తిరూపమగు నైష్కర్మ్యసిద్ధిఁ బొందుచున్నాఁడు. అనఁగా నేకారణమునఁ గర్మముల నాచ

---

ప్నోతి కిల్బిషం. ౪౮. సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్, సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః. ౪౯. అసక్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః, నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధి

రించునపుడు దోషాంశము లేక గుణాంశముమాత్రమే సిద్ధించు నని ప్రశ్నింతువేమో యని యూహించి యీసమాధానము చెప్పితిని. (౫౦) కౌంతేయా! స్వకర్మముచేతఁ బరమాత్మను బూజించి తదనుగ్రహమున జ్ఞాననిష్ఠాయోగ్యతారూపమగు సిద్ధి నొందినవాఁడే వరుసగా బ్రహ్మమును బ్రాపించుచున్నాఁడో యాక్రమమును సంక్షేపమునఁ జెప్పెదను వినుము. ఆపరబ్రహ్మ ప్రాప్తియే జ్ఞానమున కాత్యంతికమగుపరిసమాప్తి కావున దానిని దప్పక నీవు నిశ్చయంబునఁ దెలిసికొనవలయును. (౫౧ (౫౨) సందేహవిపర్యయరహితమగు బ్రహ్మతత్త్వనిశ్చయము గలవాఁడై ధైర్యముచే దేహాదికమును వశీకరించి శరీరస్థితికిఁ గావలసినవితప్పఁ దక్కినశబ్దాదివిషయముల నన్నింటిని విడిచి శరీరస్థితికి లభించినవానియందును రాగద్వేషములు వహింపక యేకాంతములును, పవిత్రములు నగు నరణ్యాదిప్రదేశముల నాశ్రయించి లఘ్వాహారముంగొని వాక్కు కాయము మనస్సును నియమించుకొనుచు నెల్లకాలము ప్రధానముగా నాత్మస్వరూపవిచారము, నాత్మవిషయమునందే యేకాగ్రతయు నభ్యసించుచు దృఢవైరాగ్యముకలవాఁడై యుండవలయును. (౫౩) మఱియును దేహేంద్రియాదులయం దహంకారము, కామరాగాదియుక్తమగుబలమును దర్పమును, కామక్రోధ

---

గచ్ఛతి. ౪౯. సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే, సమాసే నైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా. ౫౦. బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ, శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. ౫౧. వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః, ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. ౫౨. అహంకారం బలం

ములను, పదార్థపరిగ్రహణమును మాని దేహమునందు జీవ
నాదులయందు మమత్వము లేనివాఁడగుచు నేమాత్రమైన
నాయాసములేక యుపరతుఁడై సర్వదా ధ్యానయోగనిష్ఠగలి
గినయతి బ్రహ్మభావమునకు నర్హుఁ డగును. (౫౩) ఈచెప్పిన
విధముగా బ్రహ్మమే నేనని, పరమానందముగలవాఁ డెట్టి
యాపద సంభవించినను బరితపింపఁడు. ఎట్టిమంచిపదార్థమును
గాని కోరఁడు. సర్వభూతములయందును దనయందుంబోలె
సుఖదుఃఖములయందు సమదృష్టి గలిగియుండును. అట్టి
జ్ఞాననిష్ఠుఁడును సమాధిపరిపాకముచేత జ్ఞానలక్షణమైన నాభ
క్తిని నాల్గవదిగా ననువదింపఁబడినదానిని బొందుచున్నాఁడు.
(౫౪) కౌంతేయా! జ్ఞానలక్షణమగుభక్తిచే సోపాధికుఁడనైన
నేనెంతటివాఁడనో, నిరుపాధికుఁడనగు నేనెంతటివాఁడనో,
నావాస్తవమగు చైతన్యమాత్రైకరసస్వరూపమును దెలిసి
కొనుచున్నాఁడు. అవ్వల నేనే యాతఁ డగుచున్నాఁడు. (౫౫)
నిత్యము నైమిత్తికము ననుకర్మములను మాత్రము కాక
కామ్యములు నిషిద్ధములు నగుకర్మములను సర్వదా చేయుచు
న్నను నాయందే సర్వాత్మభావము సర్పించియుండుభక్తుఁడు
నాయనుగ్రహమున నిత్యము నవ్యయము శాశ్వతమునగు
నాపదము నొందుచున్నాఁడు. (౫౬) అర్జునా! ఆకారణమువలన

---

దర్పం కామం క్రోధంపరిగ్రహం, విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయా
య కల్పతే. ౫౩. బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి, సమ
స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరాం. ౫౪. భక్త్యా మామభిజానాతి
యావాన్ యశ్చాస్మి తత్త్వతః, తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే
తదనంతరమ్. ౫౫. సర్వకర్మాణ్యపిసదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,మత్ప్ర

వివేకముచేత సకలవిధకర్మముల నాయందే సమర్పించి నన్నే పరమాత్మనుగాఁ బ్రాప్యతమునిగా నెఱింగి యాశ్రయించిన వాఁడయి యనన్యశరణత్వమనుబుద్ధియోగమునే యాశ్రయించి యెల్లకాలమునందు నాయందే చిత్తము నిలిపియుండుము. (౫౮) కుంతీనందనా! నాయందే చిత్తము నిలిపియుందువేని నాయనుగ్రహమువలన నవిద్యాకామకర్మాదులగు దుస్తరములైనసంసారకారణముల నెల్లను దరింపఁగలవు అట్లుగాక నీవు నేనెఱుంగని దేమున్నదని నాయుపదేశము నాలకింప కున్నయెడలవినాశమును బొందుదువు (౫౯)అర్జునా!ఇపుడు నీవహంకారము చేత యుద్ధముచేయనని యే నిశ్చయముగలవాఁడ వగుచున్నావో, ఆనిశ్చయము నెఱవేఱదు నీక్షత్రియస్వభావము నీ చేతయుద్ధము చేయింపకమానదు(౬౦)ఓకౌంతేయా!నీక్షత్రియజాతికి స్వభావమగుకర్మముచేత బంధింపఁబడినవాఁడ వగుచున్నాఁడవు. నిన్ను బంధించిన యాకర్మమును నీవు మీఱిపోవ శక్తుఁడవు కావు. కాఁబట్టి యవివేకమున నీవు యుద్ధము చేయనొల్లకయున్నను క్షత్రియజాతిస్వాభావికకర్మమునకు నీవు లోఁబడియే యుద్ధముచేయుదువు. (౬౧) అర్జునా! పరమేశ్వ

---

సాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్. ౫౬. చేతసాసర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః, బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ. ౫౭. మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి, అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి. ౫౮. యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే, మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి. ౫౯. స్వభావజేనకౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా; కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపితత్. ౬౦. ఈశ్వరస్సర్వభూతానాంహృద్దేశేఽర్జునతిష్ఠతి,భ్రామయన్

రుఁడు సర్వప్రాణులహృదయమునం దంతర్యామియై యంత్రమునఁ జిక్కినట్లు పరవశములయిన సర్వభూతములను, యంత్రమునకుఁ దగిలించినదారువులను సూత్రధారుఁడు త్రిప్పుచందమున మాయచేఁ దత్తత్స్వాభావికకర్మమునందుఁ బురికొల్పుచున్నాఁడు. కావున నీవు యుద్ధకార్యమును సాగింపక విరమింపఁజాలవు. (౬౨) ఓభారతా! ఈసంసారతాపము శమించుటకొఱకు నీ వాపరమేశ్వరునే మనోవాక్కర్మములచే నాశ్రయనుగా భజింపుము. ఆసర్వేశ్వరుని యనుగ్రహమున సంసారోపరతినిబొందినవాఁడవై నిత్యమగువిష్ణుస్థానమనంబడుపరమపదమును బొందెదవు (౬౩) అర్జునా! ఈవిషయము రహస్యవిషయములలో రహస్యమగు శాస్త్రము. దీని నెల్లవిషయముల నెఱింగిననేను నీకుఁదెల్పితిని. ఈశాస్త్రమంతయు మఱియు నేఁజెప్పినయర్థమంతయుఁ జక్కఁగా విమర్శించి నీకుఁ దోఁచినట్లాచరింపుము. విమర్శింపక యేవిషయమునందును బ్రవర్తింపరాదు ఈశాస్త్రమునందుఁ గలవిషయసంగ్రహమును వచించెద. పరిశుద్ధముకాని యంతఃకరణముగల ముముక్షువునకు మోక్షసాధనమైనజ్ఞానముదయించునట్టి యోగ్యతగలుగుటకు నడ్డముగానుండుపాపములు నశించిపోవుటకు ఫలాపేక్షను నశింపఁజేయుటచేఁ బరమేశ్వరార్పణబుద్ధిసంయోగమున వర్ణాశ్రమధర్మానుష్ఠానము, పిదప శుద్ధమగునంతఃకరణముకలవాఁడుకాఁగా జిజ్ఞాసకలిగినతరుణమున గురువు నాశ్రయించి జ్ఞానసాధనమగువే

---

సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. ౬౧. తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత, మత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. ౬౨. ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా, విమృ

దాంతవాక్యవిచారముకొఱకు బ్రాహ్మణునకుఁ గర్మసన్న్యాసము, తరువాతఁ బరమేశ్వరైకశరణత్వముచేత విజనదేశసేవ మొదలయినజ్ఞానసాధనాభ్యాసమువలన శ్రవణము మనననిదిధ్యాసములనువానిచే నాత్మసాక్షాత్కార ముదయింపఁగా మోక్షము, సన్న్యాసమునం దధికారములేని క్షత్రియాది ముముక్షువునకుమాత్రము, అంతఃకరణశుద్ధి గలిగినతర్వాతఁగూడ భగవదాజ్ఞను బరిపాలించుకొఱకు లోకసంగ్రహార్థము. ఏవిధముననైనను గర్మములు చేయుచున్నవానికిని భగవదేకశరణత్వముచేతఁ బూర్వజన్మకృతసన్న్యాసాదిపరిపాకమునఁగాని హిరణ్యగర్భునకుంబోలె సన్న్యాసానపేక్షమునఁగాని పరమేశ్వరానుగ్రహమాత్రమున నీజన్మమునందే తత్త్వజ్ఞానప్రాప్తిచేతఁగాని, భావిజన్మమునందు బ్రాహ్మణజన్మలాభమునం జేసి సన్న్యాసపరిగ్రహణపూర్వకజ్ఞానప్రాప్తిచేఁ గాని మోక్షము లభించును. అని యీరీతిగా విచారించినచో మోహ మొందునవకాశమే లేదు. అనునదియే యీశాస్త్రసంగ్రహము. ఇంతకంటె రహస్యమగుశాస్త్రమే లేదు. కావునఁ జక్కఁగా నాలోచించుకొనుము. ఏది చేయఁదగునో దాని నాచరింపుము. (౬౪) గుహ్యావిషయము లేవేవి గలవో వానిలోనెల్ల గుహ్యము, సత్యోత్తమము నగునావాక్యమును ఇదివఱకు నీకుఁ బెక్కుసారులు చెప్పితిని. ఐనను మఱియు వచించెదను. వినుము. అర్జునా! నీవు నాకు మిక్కిలిప్రియుఁడవు. కావున నీకు మిగులహితమగు జ్ఞానప్రాప్తిసాధనమును జెప్పెదను. (౬౫) ధనంజయా! నీవు నాయందే

---

మ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు. ౬౩. సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః, ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే

మనస్సును నిలుపుము. నాయందే భక్తిగలవాఁడవుకమ్ము. నన్నే యారాధింపుము. నన్ను ధ్యానించియే నమస్కరింపుము. ఈరీతిగా నాచెప్పినప్రకారము చేయుదువేని నన్నే పొందఁగలవు. నీవు నాకెంతయుఁ బ్రియుఁడవు. కావున సత్యముగాఁ బ్రతిన చేయుచున్నాఁడను (౬౬) పార్థా! ధర్మాధర్మముల నన్నింటిని వదలిపెట్టి కర్మములనెల్ల సన్న్యసించి సర్వాత్మయు సర్వేశ్వరుఁడు ననఁబడునేనొక్కఁడనే కాని మఱియొకటి లేదని నిశ్చయించి యాత్మాభేదమున శరణుపొందుము. ఇట్లు నిశ్చితబుద్ధి గలనిన్ను నేను ధర్మాధర్మబంధనరూపములైన సర్వపాపముల నుండి ముక్తుని గావించెదను. శోకింపవలదు. (౬౭) కుంతీసంతానమా! ఇప్పుడు నేను నీకుపదేశించినయీగీతాశాస్త్రమును దపస్సుచేయనివానికిని, భక్తుఁడుకానివానికిని, గురుశుశ్రూష చేయ నిచ్ఛయింపనివానికిని, భగవంతుఁడనగునాయం దసూయగలవానికి నెట్టిసమయములందును దెలుపఁదగదు. ఇందుఁ దెల్పినగుణములలో నొక్కటి యుండినంతనే యోగ్యుఁడని తెలుపరాదు. తపస్సుచేసి భక్తుఁడై గురుశుశ్రూషానిరతుఁడై నాయందు నసూయలేక యుండువాఁ డెవ్వఁడో యట్టివానికే తెలుపవలయును. (౬౮) ప్రత్యక్షమోక్షసాధనము, మిగుల

---

హితమ్. ౬౫. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు, మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. ౬౬. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః. ౬౭. ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి. ౬౮. య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి, భక్తిం మయి ప రా

రహస్యము గీతారూపము నగునీసంవాదమును నాభక్తులని యెఱింగి వారికిఁ దెలియఁజేయుటయే పరమకారుణికుఁడు గురూత్తముఁడు నగుపరమేశ్వరునకు శుశ్రూషచేయుట యని తలంచి నాయందు భక్తిగలిగి యెవ్వఁడు మద్భక్తులకుఁ జక్కఁగాఁ దెలుపునో యతఁడు తప్పక ముక్తినొందును. సందియమే లేదు. (౬౯)పార్థా! ఈశాస్త్రమును నాభక్తులకు నుపదేశించు వానికంటె మానవులలో నెవ్వఁడు నా కత్యంతప్రియుఁడు కలుగఁడు. వర్తమానకాలమందే యిట్లుండఁగా నిఁక భవిష్యత్కాలమున నాతనికంటె మిక్కిలిప్రియుఁడు మఱియొక్కరుఁడు మర్త్యలోకమున నుండఁబోవఁడు. (౭౦) అర్జునా! మన యిరువురియొక్కసంవాదరూప మయి ధర్మ్యమునగు నీగీతోపదేశము నేమానవుఁడు పారాయణము చేయునో యాపురుషుఁడు జ్ఞానయజ్ఞముచేత నన్నారాధించుచున్నాఁడనియే నా నిశ్చయము. (౭౧) శ్రద్ధగలవాఁడగుచు నాయందసూయలేనివాఁడగుచు భక్తిచేత నేమానవుఁడీగీతాశాస్త్రమునువినునో, శ్రవణమాత్రమైనను జేయునాపురుషుఁడుకూడ నగ్నిహోత్రాది పుణ్యకర్మములు చేసినవా రొందునట్టి పుణ్యలోకములను బొందును. (౭౨) ఓధనంజయా! నేఁజెప్పిన యీగీతాశాస్త్ర

---

కృత్వా మామేవైష్యత్యసంశయః. ౬౯. న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః, భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి. ౭౦. అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః, జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టస్స్యామితి మే మతిః. ౭౧. శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః, సోఽపి ముక్తశ్శుభాఀ లోకాఀ ప్రాప్నుయాత్పుణ్యకర్మణాం. ౭౨. కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా, కచ్చిద

మును నీవేకాగ్రచిత్తమునఁ దెలిసికొంటివా? లేక యనవధాన మునఁ బరిగ్రహింప వైతివా? నీకుఁ బొడసూపినయజ్ఞానమోహము తుదముట్ట నశించెనా? లేదా? తెలుపుము. సంశయము లున్న నింకను దీర్చెదను. (౭౩) అని యిట్లు పరమకారుణికుం డగు శ్రీకృష్ణపరమాత్మ ప్రశ్నింపఁగాఁ దద్భావము నెఱింగిన వాఁడు కావున నర్జునుం డిట్లు పలికెను. ఓయచ్యుతా! నీయనుగ్రహమువలన నాయజ్ఞానము నశించినది. ఆత్మస్మృతి కల్గినది. ఇఁక నీయానతి దాఁటను. సంశయములు వదలిపోయెను. నీవు చెప్పినమాటను దప్పక చేసెదను. అంతకంటె నాకు వేఱొకటి చేయఁదగినదియే లేదు. (౭౪) అని కృష్ణార్జునులసంవాదమును దెలిపి ధృతరాష్ట్రునకు సంజయుఁ డిట్లు పలికెను. రాజా! ఈ ప్రకారముగా నేను బార్థవాసుదేవులసంవాదమును గగుర్పాటు గలిగించుదానిని విస్మయమును గల్గించుదానిని విన్నాఁడను. (౭౫) వ్యాసులు నాకుఁ బ్రసాదించిన దివ్యదృష్టివలన యోగేశ్వరుఁడగు శ్రీకృష్ణుఁడు తనపరమేశ్వరరూపమునఁ జెప్పుచుండఁగాఁ బరమగుహ్యము యోగప్రతిపాదకము నగునీసంవాదమును నేను సాక్షాత్తుగా విన్నాఁడను. (౭౬) రాజా! ఈసంవాదమును విన్నంతనే పాపముల హరించుదాని విస్మయ

---

జ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ. ౭౨. అర్జునఉవాచ.—నష్టో మోహస్స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ. ౭౩. సంజయఉవాచ.—ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః, సంవాదమిమమశ్రౌషమద్భుతం రోమహర్షణమ్. ౭౪. వ్యాసప్రసాదాచ్ఛ్రుతవానిమం గుహ్యతమం పరం, యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతస్స్వయమ్. ౭౫. రాజన్ సంస్మృత్య సంస్మృత్య

మును గల్గించుదానిని విని ప్రతిక్షణము నేను సంతోషించు చున్నాను. (౭౭) ధృతరాష్ట్రభూపాలా! అత్యద్భుతమై భగవంతునిదగువిశ్వరూపమును దలంచుకొన్నచో నాకు నింతింతనరాని యచ్చెరువు కలుగుచున్నది. మాటిమాటికి సుప్పొంగుచున్నాఁడను. (౭౮) రాజా! విశేషించి చెప్పనేల? ఏపక్షమందు యోగముల కన్నింటికి నీశ్వరుఁడును సర్వయోగబీజము నగు శ్రీకృష్ణమూర్తియు, గాండీవనామకధనుర్ధారి యగునర్జునుఁడు నుందురో, ఆపాండవపక్షమందు శ్రీవిజయములు, నందే భూతియు నందే శ్రీ విశేషవిస్తారము, చలింపనిదియు నగు నీతియుఁ దప్పక యుండును.

ఇది పదునెనిమిదవయధ్యాయము.

భగవద్గీతాశాస్త్రము సంపూర్ణము.

---

సంవాదమిమమద్భుతం, కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః. ౭౬. తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునఃపునః. ౭౭. యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః, తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువానీతిర్మతిర్మమ. ౭౮.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే మోక్షసన్న్యాసయోగో నామాష్టాదశోఽధ్యాయః.

శ్రీభగవద్గీతా సమాప్తా.

ఉదారధీవిభవులగు భక్తవర్యులారా! మోక్షసన్న్యాస యోగ మనుపదునెనిమిదవయధ్యాయమును బఠించితిరి. ఇది గీతాసర్వస్వమని మనమూహింపవలయు. ఇందు భగవంతుఁ డర్జునునకుఁ జెప్పఁదగినముఖ్యవిషయములను దెల్పుటయే కాక చేయఁదగిన విషయమునుగూడఁ జెప్పెను. ఈయధ్యాయమే కొసది. ఇఁక యుద్ధము కావలయును. కావున జ్ఞాన ముపదేశించి సన్న్యాసివి కమ్మనెనా? యుద్ధము చేయుమూయనియాజ్ఞాపించెనా యని మనమూహింపవలయుఁగదా? లోపలనే తెలుపఁదగినవిషయముల నన్నింటిని దెల్పెను ఐనను దుట్టతుదినేమి యుపదేశించెనో పరికింతము. దానింబట్టిగీతాశాస్త్రము ప్రధానముగా దేనిని దెల్పునని మనము నిశ్చయించుకొనవచ్చును.

శ్రద్ధాత్రయవిభాగయోగ మనుదాని నుపదేశించినపిదప నర్జునున కొక్కసంశయము గలిగెను. కావుననే సన్న్యాసమునకుఁ గలలక్షణమనఁగాఁ దత్త్వము నెఱుంగఁగోరుచున్నాఁడ నని ప్రశ్నించెను. ఈప్రశ్నమును వినఁగానే యర్జునుని మనస్సు ఎట్లు పరిపక్వమైనదో భగవంతుఁ డూహించెను సన్న్యాసతత్త్వమును, త్యాగతత్త్వము నడుగఁగనే కర్తవ్యమెఱుంగఁగోరి ప్రశ్నించెనని యెల్లరకుఁ బోడకట్టక మానదు. ఈరెండువిషయముల నెఱిఁగించిన నిస్సంశయచిత్తుఁ డగునని భగవంతుఁ డాతత్త్వముల నెఱింగించెను. అర్జునా! శిఖాయజ్ఞోపవీతత్యాగమే సన్న్యాసమనుకొనరాదు. కామ్యకర్మముల వదలుటయే సన్న్యాసము. ఫలప్రాప్తినిగోరి చేయునశ్వమేధాదియజ్ఞముల మానుటయే సన్న్యాసము. అనఁగా ఫలమును గోరక కర్మములు చేయవలయును. దీనిసార మేమి? నిత్యకర్మములు

తప్ప స్వర్గాదిఫలములను గోరి కర్మములు చేయరాదనియే. నిత్యకర్మములు ఫలమునుగోరి చేయునవి కావు. చేయకయున్న దోషము. అని సన్న్యాసలక్షణమును దెల్పెను. త్యాగమనఁగా సర్వకర్మఫలత్యాగము. తాఁజేసినకర్మములఫలములు తన్ను జెంద నభిముఖము లగునుగాన వానిని వదలుటయే త్యాగ మనిసారము. అని త్యాగతత్త్వమును దెలిపి యీలక్షణము పెద్దలకు సమ్మతమని హెచ్చరించి నీయభిప్రాయ మేమని మరలఁ బ్రశ్నించునేమో యని యూహించి యర్జునా! నానిశ్చయ మేమనఁగాఁద్యాగము మూఁడువిధములుగా నుండును అందు యజ్ఞదానతపస్సులు వదలఁదగవు.అవియే పావనములు. అనఁగా మానవులను బరిశుద్ధాంతఃకరణులనుగాఁజేయునవి. వానిని గూడ నాసక్తిమాని ఫలములనుగోరక మానవుఁడగు వాఁడెల్లఁ జేయఁదగినవనియే చేయవలయును. ఇదియే నానిశ్చయము. ఇది యుత్తమ మగునామతమని నమ్ముము. నామతమను టకుం గలహేతు వేమనఁగా శాస్త్రములకుఁ దోఁచినట్లెల్ల నర్థము చెప్పుదురు. ఆయాయికర్మములు చేసినవారి కాయాయ ర్థము లనుకూలములుగాఁ దోఁచుచునే యుండును. అందేది నిశ్చయ మనుశంక యర్జునునిమనస్సునఁ గలుగక యుండ సకల శాస్త్రతత్త్వ మగు నామత మిది యని శ్రీహరి యొఱిఁగించెను. త్యాగము ముమ్మిధములని వానిలక్షణములఁ దెల్పెను. ఇట్లు త్యాగము చేయుట యెల్లరకు శక్యమా యని యడుగునేమో యని యాశంకించుకొని శ్రీహరి ధనంజయా! దేహధారుల కందఱకు నిట్లు కర్మముల నెల్ల సన్న్యసింప శక్యము కాదు. కావున నట్టివారు నిత్యకర్మముల నాచరించుచు వానిఫలము

లను బొందువాంఛను మానిన నట్టివారు కర్మములు చేయు చున్నను సన్న్యాసులనంబడుదు రని తెల్పెను. తరువాత జ్ఞాన కర్మకర్తలను వానిలక్షణములఁ దెలిపెను.

పిదప యుద్ధాదులు ప్రతిఫలాభిసంధి గలవిగనుక వానిని సన్న్యసించుటయే మేలని యర్జునుఁడు భావించునేమో యని యూహించి యాశంకను గల్గకయుండఁ జేయందలంచి యిట్లు తెలిపెను. బ్రాహ్మణక్షత్రియ వైశ్యులకును శూద్రులకును గర్మములు వేఱువేఱుగ మున్నే నాచేత విభజింపఁబడినవి. అవి యాయాజాతిస్వభావముచేఁ గల్గిన సత్త్వాదిగుణభేదములను బట్టియే వేఱుగా నుండును. అనివానినెల్ల వరుసగాఁ దెలిపెను. ఎట్టివారికిం గాని జాతిస్వభావగుణము గల్గి యుండకపోదు. సంస్కారము సనాతనము. అది మాఱుట మిగులఁ గష్టము. కావున నని తప్పక యాయాయి జాతికిఁ జెందినవారి ననుసరించియే యుండును అని శ్రీహరిభావము.

ఈఘట్టమున నాల్గుమాటలు వ్రాయక తప్పదు. మూఁడు జాతులకును గుణములు తెలిపి శూద్రులకుఁ బరిచర్యాత్మకమగుకర్మము నిర్ణయించెను. ఇది పక్షపాతము కాదా యని యీకాలపువారు ప్రశ్నింతురు. ఆక్షేపించువారు దానియర్థమును జక్కఁగా నాలోచించి యుండరని భావింపవలయును. దానితత్త్వ మేమనఁగా బ్రాహ్మణులు వేదాధ్యయనాదులు చేయవలయును. క్షత్రియులు రాజ్యపాలనాదులు చేయవలయును. వైశ్యులు కృషిగోరక్షణాదుల నొనర్పవలయు. శూద్రులు పరిచర్యాత్మకమగుకర్మము చేయవలయును. బ్రహ్మక్షత్రియవైశ్యులకు సేవచేయుటయని దానియర్థము. పరిచర్యాత్మక

కర్మమనఁగా నేమో వారికి నేయేవిషయములయం దధికారము కలదో స్మృతులను బురాణముల నించుక పరిశీలింతము.

పరాశరస్మృతి.—

"శూద్రస్య ద్విజశుశ్రూషా పరమో ధర్మ ఉచ్యతే,
అన్యథా కురుతే కించిత్తద్భవేత్తస్య నిష్ఫలమ్."

ఆచారకాం. ౬౮. శ్లో.

"అథ శూద్రస్యాసాధారణధర్మానాహ.—శూద్రస్యేతి. అత్ర ద్విజశబ్దో బ్రాహ్మణపరః. తచ్ఛుశ్రూషాయాః పరమత్వం నామ నిశ్శ్రేయసహేతుత్వాత్". అని మాధవాచార్యులు వ్యాఖ్యానము చేసిరి. అనఁగా నిందుఁ జెప్పఁబడినవి శూద్రులకు సాధారణధర్మములు గావు. అసాధారణధర్మములు. జ్ఞానసంపాదనార్థము వేదవేదాంతవేత్తయగుబ్రాహ్మణుని గురువుగాఁ దలంచి సేవింపవలయును. ఇందుఁ దప్పేమి? గురుసేవ యెల్లరకు ధర్మమేకదా. ఈసేవ కాక మఱి యేయేధర్మములు శూద్రజాతికిం గలవో పరికింతము.

విష్ణుపురాణమునందు

శ్లో. "ద్విజశుశ్రూషయైవైష పాకయజ్ఞాధికారవాన్,
నిజాన్ జయతి వై లోకాన్ శూద్రో ధన్యతరస్తతః."

దేవలస్మృతియందు

"శూద్రధర్మాః త్రివర్ణశుశ్రూషా కళత్రాదిపోషణకర్షణపశుపాలనభారోద్వహనపణ్యావ్యవహారచిత్రకర్మనృత్తగీతవేణువీణామురజమృదంగవాదనానీతి"

యాజ్ఞవల్క్యస్మృతి

శ్లో. "భార్యారతశ్శుచిర్భృత్యభర్తాశ్రాద్ధక్రియాపరః,
నమస్కారేణ మంత్రేణ పంచయజ్ఞాన్నహాపయేత్."

ఆనుశాసనికపర్వము

శ్లో. "అహింసకశ్శుభాచారో దేవవద్ద్విజపూజకః,
శూద్రో ధర్మఫలైరిష్టైస్స్వధర్మేణైవ యుజ్యతే."
"న కేవలం విప్రశుశ్రూషా అపితు వృత్తిరపి"

ఇట్లు స్మృతులు పురాణములు తెలుపుచున్నవి. శుశ్రూషచే సద్బ్రాహ్మణుల నారాధించుట జ్ఞానసంపాదనార్థము. వృత్తులు కృషి పశుపాలనము. గోనెయెద్దులపై వస్తువులఁ దీసికొనిపోయి విక్రయించుట, శిల్పములు, నృత్యము, గానము, వీణావేణుప్రముఖవాద్యములులోనగునవి జీవనాధారములు. అన్నియు మాని బ్రాహ్మణశుశ్రూషగాని క్షత్రియవైశ్యులకు సేవచేయుటగాని విధింపఁబడలేదు.

బ్రాహ్మణులు స్వవృత్తిచే జీవింపఁజాలకపోయి వైశ్యవృత్తిచే జీవించునెడల లవణాదివస్తువుల నమ్మరాదని నిషేధింపఁబడినది. శూద్రుల కట్లు నిషేధింపఁబడక

శ్లో. "లవణం మధుతైలంచ దధితక్రం ఘృతం పయః,
న దుష్యేచ్ఛూద్రజాతీనాం కుర్యాత్సర్వేషు విక్రయం."
(పరాశరస్మృతి.)

శ్లో. "సద్యఃపతతి మాంసేన లాక్షయా లవణేన చ
త్ర్యహేన శూద్రో భవతి బ్రాహ్మణః క్షీరవిక్రయీ,
శూద్రస్తు లవణాదీని విక్రీణన్నహి దుష్యతి."
(మనుస్మృతి.)

ఈస్మృతులు లవణాదివస్తువుల శూద్రులు విక్రయింపవచ్చునని విధించుచున్నవి. వ్యాపారము వారికి నిషేధ మగునని విధించుపక్షమున నీనిషేధ మేల? శూద్రులు కూడ విక్రయింపఁ దగినవస్తువు లివియని పరాశరస్మృతి తెలుపుచున్నది.

శ్లో. "విక్రీణన్మద్యమాంసాని హ్యభక్ష్యస్య చ భక్షణమ్,
కుర్వ౯ గమ్యాగమనం శూద్రః పతతి తత్క్షణాత్.
కపిలా క్షీరపానేన బ్రాహ్మణీగమనేన చ,
వేదాక్షరవిచారేణ శూద్రస్య నరకం ధ్రువమ్." ౬౭

దీనింబట్టి విక్రయింపఁదగనిపదార్థము లివి యని చేయఁ దగనికార్యము లివియని స్పష్ట మయ్యెడిని. "శూద్రః పతతి" అనఁగా జాతిభ్రష్టుఁ డగునని యర్థము. "నాస్తి తు పంచమః" అనుస్మృతివాక్యమునుబట్టి చూడఁగా జాతులు నాలుగనియే తెలును. అకార్యములు చేసినశూద్రుఁడు జాతిభ్రష్టుఁడగుననఁగా నైదవజాతియే లేదు కదా. ఎందుఁ జేరును? అనుశంక కలుగవచ్చును శూద్రశబ్దము గంభీరార్థము కలది. పావనుఁ డనునర్థమిచ్చును. ఇప్పుడు కనఁబడు బ్రాహ్మణక్షత్రియవైశ్యులు కానివారెల్ల శూద్రు లనఁబడుచున్నవారు. అది కేవలము పొరపాటు. సచ్ఛూద్రు లెవరు? అని నిర్ణయింపవలయును. ఆవిషయము నాపనికాదు. వారే పర్యాలోచింపవలయు. ఆజాతిలోఁ గలయవాంతరభేదములందుఁ జేయఁదగనిపనులు చేసినశూద్రుఁడు చేరుననియే భావము. వేదము శూద్రులు చదువరాదని యుందును, ఇతరస్మృతిపురాణములయందును గలదు. అట్లు నిషేధించుట పక్షపాతముకాదా యనుప్రశ్నము రావచ్చును. కాని ఆప్రశ్నము చేయువారు మహర్షులభావ

మేమని యాలోచించినవారు కారనక తప్పదు. ఎందులకనఁగా నిట నాలుగుమాటలు వ్రాసెదను.

బ్రాహ్మణులకు వేదపాఠము యజ్ఞములు చేయుట యను నివి విధింపఁబడినవి. అనఁగాఁ ద్రివర్ణములమేలుగోరి బ్రాహ్మణుఁడు పాటుపడవలయునని మహార్షులభావము. క్షత్రియుఁడు రాజ్యపాలనము చేయవలయునని విధి. అదియుఁ దనప్రాణములు పరులకై వ్యయించి వారికి బాధలు లేకయుండఁ జేయవలయునని తెల్పెడిని. ఈయిరువురు స్వకార్యములు మానరాదని తాత్పర్యము వైశ్యుఁడు వ్యాపారము చేసి ధనము నార్జించి ధాన్యమును సంగ్రహించి పశువులను సేకరించి కృషియుఁ జేయుచుండవలయునని విధి. పై రెండుజాతులు చేయ ననుకూలము లేదుగాన నీతఁడీకార్యములను జేయవలయును. ఇదియు నెల్లర కుపకరించునదియే కదా. శూద్రుఁడు సేవావృత్తి చేయుచుఁ గృషిచేయుట, పశువులను బాలించుట, వ్యాపారము చేయుట లోనగుపనులు చేయవలయునని విధి. ఈపనులు చేయకున్నఁ బ్రపంచమే సాగదు. ఇట్లు నాలుగు జాతులు నొక్కొక్కకార్యమును బ్రధానముగాఁ జేయుచుండ వలయుననియు దాన నెల్లరకు మేలుకలదనియు వారూహించిరి. వారియూహ సత్యసహితమే కాని యసత్యము కానేరదు. వేదార్థశూన్యునకు నెట్లు ముక్తి కలుగును? శూద్రులకది లేదుకదా. ఇది పక్షపాతము కాదా యని కొంద ఱందురేని వారికి స్మృత్యర్థము చక్కఁగాఁ దెలియ దనవచ్చును. పంచయజ్ఞములు శూద్రునకును గలవు. అమంత్రకముగా నమస్కారమంత్రము చేతనే వాని నొనరింపవలయును. ఫలము

సమానమే. మంత్రములతోఁ బంచయజ్ఞముల నాచరించిన బ్రాహ్మణునకును, నమస్కారమంత్రముతోఁ బంచయజ్ఞముల ననుష్ఠించిన శూద్రునకును ఫల మొక్కటియే. పౌండరీకాదియజ్ఞములు విప్రులకు విధించినపుడు శూద్రునకు విధింపవలదా యని ప్రశ్నింపవచ్చును. పెద్దలు విధించిరో లేదో యించుక పరిశీలించినఁ దేటపడును.

శూద్రజాతికిఁ గృషి విధింపఁబడినది కదా. కృషియందొక్కపాపము సంభవించును. అట్టిపాపము నశించుటకై శూద్రునకు యజ్ఞము చెప్పఁబడినది. చూడుఁడు.

శ్లో. "సంవత్సరేణ యత్పాపం మత్స్యఘాతీ సమాప్నుయాత్,
అయోముఖేన కాష్ఠేన తదేకాహేన లాంగలీ. ౮
పాశకో మత్స్యఘాతీ చ వ్యాధశ్శాకునిక స్తథా,
అదాతా కర్షకశ్చైవ పంచైతే సమభాగినః. ౯
వృక్షాన్ ఛిత్వా మహీం భిత్వా హత్వాతు క్రిమికీటకాన్,
కర్షకః ఖలయజ్ఞేన సర్వపాపైః ప్రముచ్యతే." ౧౦
(పరాశరస్మృతి)

"తేషాం సర్వేషాం ఖలే ధాన్యదానం ప్రతీకారః." (ఈయన్ని పాపములకును కళ్లమున దోసిట ధాన్యదాన మొనర్చినఁ బరిహార మగును.)

శ్లో. "భూమిం భిత్వౌషధీశ్ఛిత్వా హత్వా కీటపిపీలికాన్,
పునంతి ఖలయజ్ఞేన కర్షకా నాత్ర సంశయః.
యూపోఽయం విహితో మధ్యే మేధిస్నామహి కర్షకైః,
తస్మాదతంద్రితో దద్యాత్తత్ర ధాన్యార్థదక్షిణాం."
(హారీతస్మృతి).

"యో న దద్యాద్ద్విజాతిభ్యో రాశిమూలముపాగతః,
స చోరస్స చ పాపిష్ఠో బ్రహ్మఘ్నం తం వినిర్దిశేత్."
(పరాశరస్మృతి)

"ఖలయజ్ఞాకరణే ప్రత్యవాయమాహ.—యఇతి. కర్షకస్యాయంఖలయజ్ఞో నిత్యః కామ్య ఇతి వచనద్వయబలాదవగమ్యతే. అకరణే ప్రత్యవాయా న్నిత్యత్వం. ఛేదనాది పాపనివర్తకత్వాత్కామ్యశ్చ. ఖలయజ్ఞస్య నిత్యత్వం శివపురాణే దర్శితం. 'అదత్వా కర్షకో దేవి యస్తు ధాన్యం ప్రవేశయేత్, తస్య తృష్ణాభిభూతస్య దేవి పాపం బ్రవీమ్యహం. దివ్యం వర్షసహస్రంతు దురాత్మా కృషికారకః, మరుదేశే భవేద్వృక్షస్సపుష్ప ఫలవర్జితః. తస్యాంతే మానుషో భూత్వా కదాచిత్కాలపర్యయాత్,దరిద్రో వ్యాధితో మూర్ఖః కులహీనశ్చ జాయతే' ఇతి."

ఈస్మృతిపురాణవాక్యసార మేమనఁగా. బ్రాహ్మణునకుఁ బంచమహాయజ్ఞములు నిత్యము లనియు, నగ్నిష్టోమాదులు ఫలమునుగోరి చేయఁబడుటంబట్టి కామ్యము లనియు, నట్లే క్షత్రియులకును విశేషించి వారి కశ్వమేధము విధింపఁబడిన దనియు, వైశ్యులకు బ్రాహ్మణులకువలె యజ్ఞములు నిత్యములు కామ్యములు విధింపఁబడినవనియు, నట్లే శూద్రులకు నమస్కార మంత్రనిమంత్రితములుగాఁ బంచయజ్ఞములునిత్యము లనియు, విశేషించి కృషికర్మమునఁ దగులుదోషముల నిర్మూలించుకొొఱకు ఖలయజ్ఞము (కళ్లమున దానము చేయుట) విహితమనియు, దాన సకలదోషములు తొలఁగు ననియు, ఖలయజ్ఞము విధియగుటంజేసి నిత్యమగుననియు, దోషాపనోదనఁటుతరఫలము గలుగుటంజేసి కామ్య మగుననియు, నద్దాన యజ్ఞఫలము

గలుగుననియు సారము. బ్రాహ్మణులుయజ్ఞము చేసిన నేఫలము కలుగునో యాఫలమే ఖలయజ్ఞమున శూద్రులు పొందుదు రని యెందున్నది? పైనుదాహరించిన స్మృతిపురాణవాక్యముల యందుఁ జెప్పఁబడలేదే యని కొందఱాక్షేపింపవచ్చును. కాని వారు స్మృతులను నిష్పక్షపాతబుద్ధిం జదివినవారు కారేమో యనుశంక యుదయించెడిని. చూడుఁడు.

శ్లో. "భార్యారతిశ్శుచిర్భృత్యభర్తాశ్రాద్ధక్రియారతః,
నమస్కారేణ మంత్రేణ పంచయజ్ఞాన్నహాపయేత్." ౧౨౧
(యాజ్ఞవల్క్యస్మృతి, ఆచారకాండము.)

వ్యా. "నమఇత్యనేన మంత్రేణ పూర్వోక్తాన్ పంచమహాయజ్ఞాన్ అహరహర్నహాపయేదనుతిష్ఠేత్. నమస్కారమంత్రంచ కేచిత్ 'దేవతాభ్యః పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవచ, నమస్స్వాహాయై స్వధాయై నిత్యమేవ నమోనమః' ఇతి వర్ణయంతి. నమ ఇత్యన్యే. తత్ర వైశ్వదేవం లౌకికాగ్నౌ కర్తవ్యం. న వైవాహికేఽగ్నావిత్యాచార్యాః"

అని విజ్ఞానేశ్వరకృతమితాక్షరావ్యాఖ్య.

అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియనిగ్రహః,
దానం దమో దయా క్షాంతిస్సర్వేషాం ధర్మసాధనమ్. ౧౨౨
(యాజ్ఞవల్క్యస్మృతి.)

దీనింబట్టి మనమూహింపవలసిన దేమనఁగా వైశ్వదేవము పంచమహాయజ్ఞములు ఖలయజ్ఞము ననునివి శూద్రునకు విహితము లైనపుడు బ్రాహ్మణక్షత్రియులకు వైశ్యులకు వలె ఫలముగలదనియే. లేకున్నఁ బంచమహాయజ్ఞములు వైశ్వదేవము శూద్రుల కేల విధింతురు. అందును వీనిని వదలరాదని శాసించియుండుట పరికింపవలదా.

ఆయాయిజాతులకుఁ దగినకర్మములు నిత్యనైమిత్తిక ములు విధింపఁబడినవి. వాని నాచరించినపుడు ఫలము సమాన మగును. కావున వేదవిహితకర్మములు శూద్రులకు లేవే. మహర్షులు పక్షపాతము చేసిరే యని నిందింప నవకాశమే లేదు. వేద మేల చదువరాదనిరి? అనియందురేమో. అనవసర పరిశ్రమము లాభకారికాదనియే. శూద్రులు కృష్యాదికర్మములు చేయవలయును. దానఁ దక్కినజాతులు బ్రదుకుదురు. ఇట్టి మహోపకర్తలగుశూద్రులకు సులభములై మహాఫలప్రదము లగుకర్మము లుండవలయునని, యతీంద్రియజ్ఞానసంపన్నులగు మహర్షు లాలోచించిరి. ఇది సామాన్యవిధి. విశేషవిధులు గలవు. మనుస్మృతి రెండవయధ్యాయమునందు

శ్లో. "శ్రద్ధధానశ్శుభాం విద్యామాదదీతావరాదపి,
అంత్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి." ౨౩౮

పరిశుద్ధుఁడై విధినిషేధముల మానినయోగికి జాతిధర్మము లక్ష్య ఆయే లేదని స్మృతులే విధించుచున్నవి.

"అంత్యశ్చండాలస్తస్మాదపి జ్ఞాతిస్మరాదేర్విహితయోగ ప్రకర్షాత్ దుష్కృతదోషోపభోగార్థమవాప్తచండాలజన్మ తః పరం ధర్మం మోక్షోపాయమాత్మజ్ఞానమాదదీత. తథా అజ్ఞానమేవోపక్రమ్య మోక్షధర్మే ప్రాప్యజ్ఞానం బ్రాహ్మణాత్ క్షత్రియాద్వైశ్యాచ్ఛూద్రాదపి నీచాదభీక్ష్ణం శ్రద్ధాతవ్యం శ్రద్ధధానేన నిత్యం."అనికుల్లూకభట్టు వ్యాఖ్య. పూర్వజన్మమున యోగాభ్యాసాదు లొనర్చి యేదో యొకదుష్కృతవిశేష మునఁ జండాలత్వమున జన్మించినను దత్పాపశేష మనుభవించు టకే యాజన్మమెత్తినను నీచుఁడని భావింపక మోక్షధర్మము

నాతఁడెఱింగినట్లు తెలిసినచో వానినుండి దాని గ్రహింప వచ్చునని మనుస్మృతిభావము. సామాన్యవిధులను విశేషవిధి బాధించును. ఇట్లు పరమకారుణికులగుమహర్షులు విధించి యుండుటం జూచియుఁ బక్షపాతమున శూద్రులకు వేదపఠనము నిషేధించి రనుట మిగులఁ బొరపాటు. సులభమార్గమున స్వజాతిధర్మములమూలమున ఫలము లభించుచుండ మఱొకజాతికి విధించియున్నధర్మముల నవలంబింపనేల? ఈవిషయమునే శ్రీకృష్ణపరమాత్మయుఁ దెలిపెను.

"స్వేస్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు."

అని. కొందఱు కులములు ప్రధానములు కావు. కల్పితము లందురు. గుణములే ప్రధాన మందురు. ఆవిషయము ముందే వ్రాయఁబడినది. మరలఁ జర్చించుటుత్తమము కాదు. ఆయాయిజాతిధర్మముల ననుసరించి భగవంతు నారాధించినచో ఫలము సమానముగాఁ గల్గునని భగవంతుఁడే తెల్పెను.

"యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః."

అని. సర్వజనకుఁ డగుపరాత్పరుని స్వనియతకర్మముచేత నారాధించిన సిద్ధిని అనఁగా జ్ఞాననిష్ఠాయోగ్యతాలక్షణ యగుసిద్ధిని బొందుచున్నాఁడు. ఈశ్లోకమునకు శ్రీశంకరాచార్యవర్యులు శ్రీరామానుజాచార్యవర్యులు భాష్యము వ్రాసిరి. ఏకాభిప్రాయమే యనవచ్చును. శ్రీమధ్వాచార్యవర్యులు భాష్యము వ్రాయ రైరి. భిన్నాభిప్రాయ ముండిన వ్రాసియే యుందురు.

భగవంతు నేజాతిమానవుఁ డాజాతికి విహితములగు ధర్మములనే యాశ్రయించి నన్నారాధించినచో వారిని దరింప

జేయుదునని విధించి యుండ నాయుపదేశమం దేల విశ్వాస మునుపరాదో తోఁపకున్నయది. భగవంతు నారాధించినఁగాని ముక్తి లేదన్నమాట శాస్త్రమునుండియే నేర్చుకొంటిమి. అందుఁ దెల్పియున్నవిషయములఁ గొన్నింటిని విశ్వసింపక యుండు టుత్తమమార్గము కానేరదు. విజాతిధర్మముల నాశ్రయించిన ముక్తి లేదని భగవంతునితాత్పర్యమని స్పష్టమగుచున్నది. ఎట్లనఁగా,

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్."

అని విధించుటయే పైయూహకుఁ గారణము. జాతిభేదములే తుచ్ఛము లనువారియసంగతాలాపములకు గీతాశాస్త్రము తలవంచుకొనుచున్నది. భగవంతుఁడే లేఁడనుట యావాద మునకంటె నుత్తమ మనవచ్చును. ఏల యనఁగా సర్వము మిథ్య యనువారు రెండవవారు. మొదటివారికి శాస్త్రమునఁ గలవిశ్వా సముదృశ్యాదృశ్య మనవచ్చును. కొందఱు శ్రీకృష్ణోపదేశమున కుఁగాలోచితమగునర్థము కల్పించువారును గలరు గీతల కర్థము ప్రాచీనోక్తము పనికిరా దనియు, నీకాలమునకుఁ దగినట్లర్థము చెప్పవలయుననియు నుద్ఘోషింతురు. శబ్దార్థము పనికిరాద నియు రహస్యార్థము మాకు మహర్షులు తెలిపిరనియు నింకఁ గొందఱు పలుకుదురు. పాప మీడాంబికులకు మహర్షులు కనఁ బడి "లోకము మునిఁగిపోవుచున్నది నీ వీయర్థము నుపదేశిం పుము. లేకున్నఁ జాల హానికల్గును" అని మొట్టపెట్టుకొనిరి కాఁబోలు. మహర్షులు వేదార్థమును మార్చువారు కారు. అవి వేకులును గారు. కావున వారిపల్కు లివియనుట సర్వా సంగతము.

మఱికొందఱు సర్వమానవసోదరత్వమును నెలకొల్పఁ బ్రయత్నింతురు. అది కేవలము పొరపాటు. సర్వమానవసోదరత్వము నెలకొల్ప శక్యమా? ఏనాటికిని గాదు. అట్టివాఁడీలోకమున నొక్కఁడుకూడ నుండఁడు. భగవంతుఁ డొక్కఁడే యనవలయును. సర్వసమత్వము సామాన్యమా? కేవల గౌరవమును గోరియే యట్లుపన్యసింతురు. కాని వారికే యామాటకర్థము తెలియదు. ఇవ్విషయము నింతట వదలి భగవంతునుపదేశమును మాత్రమే తెలిసికొందము. వీరియుపదేశవాక్యములు జల్పములని త్రోసివేయుదము.

భగవంతుఁడు సదోషమే యైనను వదలఁగూడదనఁగా నర్థమేమని యించుక విచారింతము. భగవంతుఁడే దాని కర్థమును దెలిపెను.

"సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః."

సర్వకర్మములు దోషసహితములే. సత్త్వరజస్తమోగుణ భేదములవలన నని హేతువు చెప్పఁబడినది. ధూమమగ్ని నావరించి యున్నట్లు అని యుదాహరణ మీయఁబడినది. స్వధర్మమును మాని పరధర్మము నాశ్రయించిన నదియు దోషయుతమే కావున నిర్దోషముకాని పరధర్మము నేల యాశ్రయింపవలెనని భగవంతుఁ డడుగుచున్నవాఁడు. దీనింబట్టియే స్వజాతిధర్మముల వదలరాదని యర్థము కాలేదా. ఇఁక సారమేమనఁగాఁ దనజాతికి విధింపఁబడినకర్మములు నిస్సారము లనియుఁబరజాతిధర్మము లుత్కృష్టములని తలంపక తాఁజేయుచున్నకర్మములను శ్రద్ధమై నాచరించుచు వానిఫలములనుమాత్ర మాశింపక భగవత్ప్రీ

త్రికాలకర్మలు చేయుచున్న వాఁడనని సంకల్పించుచునున్న భగవంతునను గ్రహమున నాతఁడు కృతార్థుఁ డగును. ఇంత కంటె నీవిషయమున సార మెంత యోజించినను గానరాదు.

కర్మయోగమున సిద్ధుఁ డెట్టివాఁ డనువిషయము నాలోచింతము. జ్ఞానసిద్ధునకు లక్షణములే యన్వయించును. భగవదర్పణముగాఁ దాఁజేయుకర్మముల నాచరించి జ్ఞానసిద్ధి నొందిన వాఁడు విజనప్రదేశమున నుండి మితముగ ననఁగా దేహస్థితికి మాత్ర మనుకూలముగా భుజించుచు వాక్కును దేహమును మనస్సును నియమమున నునిచి సర్వదా ధ్యానయోగనిష్ఠుఁడై సర్వవస్తువులయందు మమకారమును వదలి యుండునని భగవంతునిపలుకు. అహంకారాదుల మాని నిర్మముఁడై పరమశాంతుఁడై యుండుననియుఁ దదుపదేశము. ఎవ్వఁడు దృఢమనస్కుఁడో వాఁ డిట్టులుండును. ఈలక్షణములను బరిశీలించి వీఁడు వైరాగ్యవంతుఁడని మన మూహింపవచ్చును. అట్లుగాక సర్వదా మానవులలోఁ గలిసియుండి వాక్కాయమానసము లనియతము లగుచుండఁగా మాటలే ధ్యానముగాఁ బరదూషణమే జ్ఞానముగా స్వభూషణమే కర్మయోగముగా నుండు డాంబికు లజ్ఞాను లనఁదగుదురని భగవద్వాక్యమునుబట్టి మనము నిర్ణయింపవచ్చును ఇక్కాలమున నిట్టివా రెందఱో వంచకులు గలరు.

ఇట్లు భగవంతుఁడు శ్రీవిభుఁ డుపదేశించి కడపట నర్జునున కిట్లు తెల్పెను. అర్జునా! నాయందాసక్తుఁడవు కమ్ము. సంసార వారిధిని దరింతువు. దానికి నాయనుగ్రహమే కారణ మగును. వేఱొకటి కానేరదు. నీవు నామాట నమ్మక యహం

కారము నాశ్రయించి యుద్ధము చేయనని తలంచితివేని నీయూహా నిష్ఫలమగును. నీ స్వభావకర్మము నిన్ను నిర్బంధింపఁగలదు. అనఁగాఁ గౌరవులు మారొక్కని బాణముల నొప్పింపనీ కిపుడున్న శాంతము తొలఁగి యహంకారము కల్గునుజుమీ యని భగవంతుని యాశయము. జాతి స్వభావముగు కర్మము నిన్ను నిర్బంధింపఁగలదు. నీవిష్టపడకున్ననదియే నీచేతఁ జేయించును. భగవంతుఁడు నీహృదయమున వసించియున్న వాఁడు. సకలభూతములను జంత్రపుబొమ్మలవలె నాడించును. కావున నీయహంకారము కార్యకారి కానేరదని భావము. ఇంకనైన నాపరమాత్మను శరణు పొందుము. తత్ప్రసాదమున శాశ్వతపదము నీకు దొరకును.

ఆర్యులారా! దీనింబట్టి గట్టిగా నాలోచింపఁగా శ్రీకృష్ణుఁడు జాతిస్వభావకర్మములను వదలితి మన్న నవి నిర్బంధించుననియు నవశుఁడై వాని నాచరించుననియు సారమని తెలుసుగదా. అజ్ఞానులు జాతు లిటీవలఁ గల్పితము లనుట పొల్లు గాదా. వారికి జాతిస్వరూపము తెలియు నన నవకాశము గలదా. అల్పబుద్ధులై తమకేమో యనుభవము లున్నట్లు వ్యభిచరించుట వంచింపఁ గోరియే కదా. వారు తమమేలును బాడుచేసికొనునంతటి యవివేకులు గారా. తుట్టతుదకు శ్రీకృష్ణుఁ డర్జునున కేమని సారభూతోపదేశము చేసెను? అర్జునా! నాయందే మనస్సుంచుము. సర్వవిధముల నన్నే యారాధింపుము. నాకే నమస్కరింపుము. నన్నుఁ జెందుదువు. అనఁగా సర్వమునకు నన్నే నమ్ముకొనియుండుమని భావము. అని పలికి మఱొక్కయుపదేశము చేసెను.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."

అని. ఈశ్లోకమునే కొందఱు చరమమంత్రమని యందురు. ఈమంత్రము సోమరిపోతులకు మహోపకారము. సర్వధర్మములను జేయుట మాని నన్నే శరణము నొందుము. సర్వదురితములు తొలఁగునట్లు చేయుదును. నిశ్చింతముగా నుండుము. అని దీని కర్థము చెప్పుచుఁ గర్మముల వదలుమార్గ మన్వేషించువారల కీశ్లోకము ప్రాణపదమువంటి దగును. భాష్యవిరుద్ధమైనను సకారణముగనే యిట్లర్థము చెప్పఁదలంచినాఁడను.

అర్థము: సర్వధర్మాన్=సకలవిధధర్మములను, పరిత్యజ్య=వదలిపెట్టి, ఏకంమా=ఒక్కనన్నే. శరణం=రక్షకునిగా, మావ్రజ=ఆశ్రయింపకుము. సకలధర్మములను జాత్యుక్తముల నాచరించుచు, వానిఫలములను నాకర్పించుచు నన్ను శరణుపొందుము. నీ వట్లుచేసిన పాపములను దొలఁగింతును. దుఃఖింపకుము. అని. ఈయర్థము వక్తవ్యమగునా యన్న నించుక సమాధానము వ్రాసెదను. "కురు కర్మైవ" యని కర్మసిద్ధాంతమును బెక్కుతావుల స్థాపించెను. జాతిధర్మములను విధించెను. వాని నాచరించి తరించుటెట్లో తెల్పెను. ఇన్నియుపదేశములను బోఁద్రోలి యిట్లుపదేశించునాయని యాక్షేపింప నవకాశము కలదు. సకలవిధముల నాతనిమనస్సును బరీక్షించి సకలసంశయములు తీర్చి తుదిమార్గము తన్నాశ్రయించుటెగాన దాని నుపదేశించె ననునదియే దానికి సమాధానము. అంతియగాని లోపలియుపదేశములు వ్యర్థములనియుఁ బ్రొద్దుపోక యుపదేశించితిననియు నిదియే నాభావమనియుఁ దరణో

మామేకం=ఇచటఁ బ్రై యర్థమందు వృద్ధ్యభావ మార్షమనవలయును.

పాయ మిదియే యనియుఁ గాదు. సకలకర్మములు విధియుత ముగా నాచరించి తత్ఫలములను భగవదర్పణము చేయుటయే కదా భక్తునిలక్షణము. భగవంతు నాశ్రయించుటనఁగా నదియే. కావున సకలధర్మములను మాని నన్నాశ్రయింపుమా యను దానికి విపరీతార్థము చేయరాదు. చేయుచున్న ధర్మము లన్నియు నాకర్పింపుమాయనియు వానిఫలములఁ గోరకుమా యనియుఁ జేయుచుండియు నాసక్తిలేకయుండుటే యనఁగాఁ దత్ఫలములఁ గోరకుండుటే వానిని వదలుట యనియు దానిసారము. సకల ధర్మములను బరిత్యజించి భగవంతునే యాశ్రయించువాఁడు ముక్తుఁడే యగును. ఆస్థితియం దుండువానికిఁ బ్రపంచమంత యు భగవద్రూపముగనే కనఁబడును. కాని వేఱువిధముగాఁ గనంబడదు. అట్టివాఁడు చేయఁదగుకర్మ మేదియు నుండదు. ఆస్థితియం దుండదఁగనివారెల్ల నాశ్లోకము నమ్మి కర్మములు వదలుట యనఁగాఁ దమతరణోపాయమును వదలుటే యనియ ర్థము. దుర్మతులై పరద్రవ్యాభిలాషు లగువారు గురువుల మని పేరుపెట్టుకొని యీచరమమంత్రము నుపదేశింతురు. తమ్ము నమ్మినపామరులను సంసారాంధువున ముంచి తమరు మునుంగుదురు. అట్టిగురువుల నమ్మిమోసపోవక స్వజాతివిహిత కర్మముల నాచరించి ఫలము నాశింపక భగవత్ప్రీతికొఱకై వానిని దారవోసి సర్వశరణ్యుఁడు కరుణాసముద్రుఁడు భక్త రక్షణబద్ధదీక్షుఁడు నగుశ్రీకృష్ణపరబ్రహ్మము నాశ్రయింపవల యును. ఇదియే గీతాశాస్త్రసారము. ఇంతకంటె సారతరమగు విషయము వెదకిచూచినను గానరాదు.

ఇఁక నుపసంహరించుచు భగవంతుఁ డేమిచెప్పె నను దానిం బరికింతము. అర్జునా! యీశాస్త్రము రహస్యము. తపో

రహితునకును,భక్తుఁడు కానివానికిని,గురుశుశ్రూషానిరతుఁడు గాకుండువానికిని, నన్ను ద్వేషించువానికి నుపదేశింపరాదు. అనఁగా నీనాలుగుగుణములుగలవానికే యుపదేశింపవలయు నని కృష్ణపరమాత్మ తెల్పెను. ఏల? తపోనిరతుఁడు గానివానికి శ్రద్ధ యుండదు.కష్టములకోర్చుపట్టుదలయుండినఁగాని వాఁడు. యోగ్యుఁడు కాఁడు భక్తుఁడు కానివాని కాయుపదేశమునం దుఁబ్రీతియుండదు.పరమప్రీతియుండినఁగాని విన్నదానిని మరల మరల మననము చేయునాసక్తి యుండదు.గురుశుశ్రూష చేయని వాని కహంకారమునశింపదు.నాకన్న నధికులు గల రనుభావమే నిరహంకారలక్షణము.అట్టి యహంకారము వదలినఁగాని చెప్పి నదానియందు విశ్వాసము గుదురదు. ఈమూఁడును గుదిరినను భగవంతునికల్యాణగుణములను విననిష్టపడనిదుర్గుణముండిన నేయుపదేశముఫలింపదు. కావున నీనాలుగుగుణములు కలవాఁ డెవ్వఁడో వాని కుపదేశించిననే ఫలించును. లేనిచో నాయుపదే శకాలమువ్యర్థము చేసినట్లగును.ఇదియే శ్రీహరిభావము.కొంద ఱు ప్రార్థించి ప్రార్థించి గీతార్థము నుపదేశింతురు. కాని యుపదే శించువారికిఁగాని వినువారికిఁగాని గీత ఫలము నీయదని మన మూహింపవలయును. కీర్తికాములై కొందఱు గీతార్థమును జెప్పుచుందురు. ప్రార్థించి వినఁ గోరిన పాత్రుఁడగుశ్రోత దొర కినఁగాని వేదాంతవిషయములను బలుకరాదు. తుదకవి యప హాస్యమునకుఁ దావలము లగును. కనుకనే పరాత్పరుఁ డిట్టి లక్షణములుగలవానికి నుపదేశింపఁ దగునని యాజ్ఞాపించెను. భక్తులెల్లరును భగవంతునియాజ్ఞను శిరసావహించి గీతాశాస్త్ర మును బఠించి దానియర్థమును భక్తిభావమునఁ దెలిసికొని

తెలిసికొంటిమి ఇఁకఁజాలునని తృప్తిపడక యనుకూలమున్నంత దనుక దాని నాచరింపఁ బ్రయత్నింపవలయును.

## శ్రీభగవద్గీతాహృదయము.

నిష్పక్షపాతమతులారా! సత్యాన్వేషణతత్పరులారా! భక్తిభావభూషితులారా! భగవద్గీతాశాస్త్రము పదునెనిమిద ధ్యాయములు పఠించితిరి. నా వ్రాసినయభిప్రాయమును జదివితిరి. ఇఁక గీతాశాస్త్రహృదయ మేమని సంగ్రహించి వ్రాసెదను. ఇందెందేని ప్రాగుక్తవిషయములు రావచ్చును. అవి పునరుక్తిదోషలక్ష్యములుగాఁ దలంపకుఁడు. అభిప్రాయభేదము లున్నంతన నను దూఱకుఁడు. ఏకాభిప్రాయ మెల్లరకు నుండుటసంభవము. ఇందేమేని సారము కలదా యని విచారించుట సుజనులధర్మము. దానిని వదలక పఠించినయెడల సత్య మేది యని తోఁచును.

భగవంతుఁ డీశాస్త్రమునఁ గర్మసిద్ధాంతమునే బోధించెనని వ్రాసియుంటినిగదా. మొదటియాఱధ్యాయములు కర్మమును దెలుపుననియు, రెండవషట్కము భక్తిని దెలుపుననియు, మూఁడవ షట్కము వైరాగ్యమును దెలుపుననియుఁ గొందఱిమతము. ఈపదునెనిమిదధ్యాయములచేతను శ్రీహరి యర్జునునకుఁ గర్మము చేయఁదగినదని బోధించెననియు, నవాంతరములగు భక్తిజ్ఞానములు కర్మస్వరూపము దృఢపడుటకే దెలుపఁబడినవనియు నాయాశయము. ఇదియే యాసమయమున నుపదేశింప నర్హమనియుఁ గార్యరూపమునఁ గర్మసిద్ధాంతమే పరిణమించెననియు నీరెండుకారణములను బట్టి యాలోచింపఁగా నాయాశయమే దృఢపడుననియు నాసిద్ధాంతసారము.

యోగము భక్తి యనువిషయముల నేల వచించెననఁగా నర్జునుని చిత్తము వ్యాకులమైయుండుటంబట్టి తాఁ దెల్పెడుబూనువిషయమును జక్కఁగా గ్రహింపఁ జాలఁడనియు, గ్రహించినదానిని నిలుపుకొనఁ జాలఁడనియుఁ దలంచి శ్రీహరి నాలుగుమాటలు యోగమును గుఱించియు నాలుగుమాటలు భక్తినిగూర్చియుఁ దెల్పెను. భక్తిలేనిచో భగవంతునారాధింప వీలులేదనియు, భక్తిలేక చేసినకర్మము నిష్ఫలమే యనియు నాహరియాశయము. భక్తియనఁగా నిరతిశయప్రీతి. అది కలిగి చేసిననేకార్యము సఫలమగును. అది విడిచి చేసినది నిష్ఫలమగును. భక్తియందు శ్రద్ధయు నంతర్భూతమయి యుండు. కావున వాని స్వరూపమును దెలిపి శ్రీహరి యర్జునుఁడు చేయఁదగినకర్మమును దెలిపెను. ముక్తికాముఁడర్జునుఁ డని హరి తలంచెనా? అట్టి యూహ పరాత్పరున కేలగలుగును? పోనిండు. కర్మముగాక మఱిద్దానిని బ్రధానమని తెల్పెనో ఫలమద్దానికిఁ బ్రతికూలముగ నుండఁదగునా? అర్జునునొకసాధనముగాఁ గొని మహావీరుల వధింపనెంచిన శ్రీకృష్ణమూర్తి యర్జునుని సన్న్యాసిగానో యోగిగానో చేయనెంచునా? ఇన్నివిషయములుపదేశించి తుట్టతుదకు నీజాతిస్వభావకర్మము నిన్ను నిర్బంధించి చేయించును. కావున నాయుపదేశమును జక్కఁగా విమర్శించి యేది చేయఁదగునో దానిని జేయుమని తెల్పెనుగదా! నీవు యుద్ధము చేయమానినను నీచే నది చేయింపక వదలదని యేల పలికెనో. ఇంచుక యూహించినఁ దోఁపకపోవునా? కావుననే యిందుఁ బ్రతిమానవుఁడు తనజాతిస్వభావానుగుణము లగు కర్మములను విధియుతముగా నాచరింపక తప్పరాదనియే తెల్పె

నని నే నభిప్రాయపడితిని. దానిని సమర్థించు ప్రమాణముల నుదాహరించుచున్నాఁడను. ఆశ్లోకముల నన్నింటిని నుదాహరించిన గ్రంథవిస్తరమగునన్నభీతిచేతను, ఈగ్రంథమువనే మూలమంతయు నుండుటం జేసియు నాయాయధ్యాయముల సంఖ్యయు, శ్లోకాది పాదమును వ్రాసెదను.

## రెండవయధ్యాయము.

| | శ్లో. | | శ్లో. |
|---|---|---|---|
| అంతవంత ఇమే దేహాః | ౧౮ | బుద్ధియుక్తో జహాతీహ | ౫౦ |
| స్వధర్మమపి చావేక్ష్య. | ౩౧ | కర్మజం బుద్ధియుక్తాహి | ౫౧ |
| యదృచ్ఛయా చోపపన్నం | ౩౨ | **మూఁడవయధ్యాయము.** | |
| అథ చేత్త్వమిమం ధర్మ్యం | ౩౩ | లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా | ౩ |
| అకీర్తిం చాపి భూతాని | ౩౪ | న కర్మణామనారంభాత్ | ౪ |
| భయాద్రణాదుపరతం | ౩౫ | న హి కశ్చిత్ క్షణమపి | ౫ |
| అవాచ్యవాదాంశ్చ | ౩౬ | యస్త్వింద్రియాణి మనసా | ౭ |
| హతో వా ప్రాప్స్యసిస్వర్గం | ౩౭ | నియతం కురు కర్మత్వం | ౮ |
| సుఖదుఃఖే సమే కృత్వా | ౩౮ | యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర | ౯ |
| ఏషా తేఽభిహితా సాంఖ్యే | ౩౯ | సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా | ౧౦ |
| నేహాభిక్రమనాశోఽస్తి | ౪౦ | ఇష్టాన్ భోగాన్ హి వో దేవాః | ౧౨ |
| వ్యవసాయాత్మికా బుద్ధిః | ౪౧ | | |
| కామాత్మానస్స్వర్గపరాః | ౪౩ | యజ్ఞశిష్టాశినస్సంతః | ౧౩ |
| కర్మణ్యేవాధికారస్తే | ౪౭ | అన్నాద్భవంతి భూతాని | ౧౪ |
| యోగస్థః కురు కర్మాణి | ౪౮ | కర్మ బ్రహ్మోద్భవం విద్ధి | ౧౫ |
| దూరేణ హ్యవరం కర్మ | ౪౯ | ఏవం ప్రవర్తితం చక్రం | ౧౬ |

| | శ్లో. |
|---|---|
| **పదునొకండవయధ్యాయము.** | |
| తస్మాత్త్వముత్తిష్ఠ | ౩౩ |
| ద్రోణం చ భీష్మం చ | ౩౪ |
| మత్కర్మకృన్మత్పరమః | ౫౫ |
| **పండ్రెండవయధ్యాయము.** | |
| యే తు సర్వాణి కర్మాణి | ౬ |
| అభ్యాసేఽప్యసమర్థోఽసి | ౧౦ |
| శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ | ౧౨ |
| **పదునాల్గవయధ్యాయము.** | |
| కర్మణ స్సుకృత స్యాహుః | ౧౬ |
| సత్త్వాత్సంజాయతే జ్ఞానం | ౧౭ |
| ఊర్ధ్వంగచ్ఛంతిసత్త్వస్థాః | ౧౮ |
| **పదునేడవయధ్యాయము.** | |
| అఫలాకాంక్షిభిః | ౧౧ |
| అభిసంధాయ తు ఫలం | ౧౨ |
| విధిహీన మసృష్టాన్నం | ౧౩ |
| దేవద్విజగురుప్రాజ్ఞ | ౧౪ |
| అనుద్వేగకరం | ౧౫ |
| మనఃప్రసాద సౌమ్యత్వం | ౧౬ |
| శ్రద్ధయా పరయా తప్తం | ౧౭ |
| సత్కారమానపూజార్థం | ౧౮ |
| మూఢగ్రాహేణాత్మనః | ౧౯ |
| దాతవ్య మితి యద్దానం | ౨౦ |
| యత్తు ప్రత్యుపకారార్థం | ౨౧ |
| అదేశకాలే యద్దానం | ౨౨ |
| ఓం తత్సదితి నిర్దేశః | ౨౩ |
| తస్మాదోమిత్యుదాహృత్య | ౨౪ |
| తదిత్యనభిసంధాయ | ౨౫ |
| సద్భావే సాధుభావే చ | ౨౬ |
| యజ్ఞే తపసి దానే చ | ౨౭ |
| అశ్రద్ధయా హుతం దత్తం | ౨౮ |
| **పదునెనిమిదవయధ్యాయము.** | |
| యజ్ఞోదానం తపః కర్మ | ౫ |
| ఏతాన్యపి తు కర్మాణి | ౬ |
| నియతస్య తు సన్న్యాసః | ౭ |
| దుఃఖమిత్యేవ యత్కర్మ | ౮ |
| కార్య మిత్యేవ యత్కర్మ | ౯ |
| న హి దేహభృతాం కర్మ | ౧౧ |
| అనిష్టమిష్టం మిశ్రం చ | ౧౨ |
| జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా | ౧౮ |
| జ్ఞానం కర్మ చ కర్తా చ | ౧౯ |
| సర్వభూతేషు యేనైకం | ౨౦ |
| నియతం సంగరహితం | ౨౩ |
| యత్తు కామేప్సునా కర్మ | ౨౪ |
| అనుబంధం క్షయంహింసా | ౨౫ |
| ముక్తసంగోఽనహంవాదీ | ౨౬ |
| రాగీ కర్మఫలప్రేప్సుః | ౨౭ |

| | శ్లో. | | శ్లో. |
|---|---|---|---|
| అయుక్తః ప్రాకృతస్స్తబ్ధః | ౨౮ | అసక్తబుద్ధిస్సర్వత్ర | ౪౯ |
| బ్రాహ్మణక్షత్రియవిశాం | ౪౧ | సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మా | ౫౦ |
| శమో దమ స్తప శ్శౌచం | ౪౨ | సర్వకర్మాణ్యపి సదా | ౫౬ |
| శౌర్యం తేజో ధృతిః | ౪౩ | చేతసా సర్వకర్మాణి | ౫౭ |
| కృషిగౌరక్ష్యవాణిజ్యం | ౪౪ | యద్యహంకార మాశ్రిత్య | ౫౯ |
| స్వేస్వే కర్మ ణ్యభిరతః | ౪౫ | స్వభావజేన కౌంతేయ | ౬౦ |
| యతః ప్రవృత్తి ర్భూతానాం | ౪౬ | మన్మనా భవ మద్భక్తో | ౬౫ |
| శ్రేయాన్ స్వధర్మోవిగుణః | ౪౭ | సర్వధర్మాన్ పరిత్యజ్య | ౬౬ |
| సహజం కర్మ కౌంతేయ | ౪౮ | నష్టో మోహః | ౭౩ |

మహానుభావులారా! యీ ప్రమాణములం బరికించి
తిరి కదా! గీతాశాస్త్రము నుపసంహరించుచు భగవంతుఁ డను
గ్రహించిన దేమని "యర్జునా! అహంకారమూని యుద్ధము
చేయనని నీవంటివేని నీజాతిస్వభావకర్మము నిన్ను నిర్బంధించి
నీచేతనే యుద్ధము చేయించుఁ జుమీ. అవశుఁడవై నీవే యపు
డు యుద్ధము చేయుదువు. కావున సర్వేశ్వరుఁడ నగునన్ను
శరణు నొందుము. నావాక్యము ననుసరించి కర్మము నొనరిం
పుము. ఫలమును గోరకుము. ధర్మ మనుబుద్ధిచేఁ గర్మమును
జేయుము. సర్వఫలముల నాకర్పింపుము." అని కదా యుపదే
శించెను. అర్జునునకు వైరాగ్యమును గల్గించునూహయే శ్రీహ
రికి నుండిన విజనప్రదేశమున 'ముక్కుమూసికొని తపస్సు
చేయుమా' యని యడవులకేల పంపియుండఁడు? ప్రతిమాన
వుఁడు జాత్యుక్తకర్మమును ధర్మమనియే నిశ్చయించి యాచ
రింపవలయుననియుఁ, దాను కర్త ననునహంకారమును గాని

యీఫలము నాకు రావలయునన్న వాంఛయుఁ బొందక నిర హంకారుఁడై నిర్మముఁడై తాఁజేయుకర్మములను భగవదర్ప ణముచేయవలయుననియు, నదియే తన్ను సేవించుమార్గమనియు శ్రీకృష్ణమూర్తిభావ మనవలయును. ఆయుపదేశము నాలకించి సకలసంశయములు దూరముగఁ దొలఁగిపోవఁగా నర్జునుఁడు నీవాక్యముచొప్పునఁ జేసెదనని బదులు చెప్పెను నీచెప్పినట్లు నేఁగా యుద్ధమును జేసెదను. కర్తను నే ననునహంకారము తొలఁగినది. అనియే కదా యర్జునునిభావము. ఈ రెండు విషయ ములను బరిశీలించినఁ దేలెడి సిద్ధాంతమేమి? పైఁజెప్పినదియే కాక మఱియొకఁడగునా. కావుననే గీతాశాస్త్రము ప్రతిమా నవుఁడు జాతికిఁ దగినకర్మముల నాచరింపవలయుననియు, జాతిని వదలరాదనియుఁ, బరకీయధర్మములు తనజాతిధర్మములకంటె నుత్తమములని యాశపడి వాని నాచరింపరాదనియు, నట్లాచ రించిన భగవదనుగ్రహమునకు బాత్రుఁడు కాడనియుఁ, దనజాతి ధర్మములు నీచములను భావమే యుండరాదదియు, నేవాఁడు కాని స్వజాతిధర్మముల నాచరించిన భగవదనుగ్రహము నొందు ననియు, భగవత్కరుణయెల్లరకు సమానముగాఁ బొందునవకా శము కలదనియు స్పష్టపఱచుచున్నది. శ్రీహరికరుణకుఁ బా త్రుఁడు బ్రాహ్మణుఁడేయనుభావ మూని యాధర్మములనే మనము కూడ నాచరింపవలయుననుభావము న్యాయ్యము కాదని శ్రీ కృష్ణమూర్తియే స్పష్టీకరించెను. పరజాతిధర్మము భయావహమే యగునని తేటపఱచెను. జాతిస్వభావకర్మములు నడుమ నెవరిచే తనో కల్పింపఁబడినవి కావనియు, సర్వజ్ఞుఁడనగు నాచేతనే కల్పిం పఁబడెనని తేటతెల్లముగఁ బలికెను. నాకరుణను గోరువారు స్వజాతిధర్మముల విడువరాదని హెచ్చరించెను. ఏకర్మముల

నాచరింతురో వానిఫలములను మాత్రము కోరరాదని యెఱిఁగించెను శాస్త్రములనేనమ్మి తదుక్తప్రకారము నడువవలయును గాని తోఁచినట్లెల్లఁ బ్రవర్తింపరాదని హితము తెలిపెను. అట్టివారిహపరములకు దూరులగుట తప్పదని నచ్చఁజెప్పెను. నాల్గుజాతులలో స్వజాతిధర్మముల నాచరించుచు నన్నారాధించువారికి ఫలము సమానమేయనునదినాభావమనివిశదీకరించెను. జాతులు ధర్మములు నడుమ నెవరిచేతనో కల్పింపఁబడె ననుమాటలు తుచ్ఛములని యనువదించెను. తనకుఁ దోఁచినట్లే ప్రవర్తింపరాదని వాక్రుచ్చెను. శాస్త్రమే శరణమని నమ్మకపోయిన నాభక్తుఁడు కానేరఁడనుభావ ముచ్చైచ్ఛర్నాదమునఁ బలికెను. ఆర్యులారా! ఇవ్విధమున నీగీతాశాస్త్రము వర్ణాశ్రమధర్మముల బోధించుచు యోగాభ్యాసము ముఖ్యతమమని తేటపఱచుచు జ్ఞానాశ్రితకర్మములను భక్తిసాంద్రుఁడై యాచరింపవలయునని యుపదేశించుచుఁ గడ తేఱునుపాయమును స్పష్టపఱచుచున్నది. కావుననే యిది యుపనిషత్తనఁ బ్రఖ్యాతిఁ గాంచెను. భగవంతునిచెంతకుం జేర్చునది యనియే యుపనిషచ్ఛబ్దార్థ మని ప్రాక్తనులభావము. కావున నెల్లరు భక్తిభావమున దీనిం బఠించి యంతతోఁ దృప్తినొందక దానియర్థమును జక్కఁగా నెఱింగి చాలునని తనివిచెందక దాని నాచరించుటకుఁ బ్రయత్నించి శ్రీపరాత్పరునికృపకుఁ బాత్రులు కావలయునని కోరుచున్నాఁడను. ఇంతట నీగీతాశాస్త్రవిషయమును బరిసమాప్తి నొందించుచున్నాఁడను.

ఓం తత్సత్ శ్రీ. శ్రీ. శ్రీ.

---

## భారతయుద్ధము శ్రీహరికృత్యము.

మహాశయులారా! తర్వాతికథకుం గడంగుదము. భారతయుద్ధము ప్రకృతవిషయమునకు సంబంధించినది కాదనరాదు. శ్రీహరి యం దేయే కార్యముల నొనరించెనని మన మెఱుంగవలయుంగదా! కావున నాయుద్ధమున శ్రీహరి తాను సాక్షిమాత్రుండై యర్జునుం డనుసాధనముమూలమున నే యే కార్యములు చేయించె ననువిషయము వ్రాసెదను. గీతోపదేశానంతర మాయర్జునునిచిత్తము మార్పునొందెను. తాను గర్తను గాననియు, సర్వము భగవంతుండే చేయుటకుం గర్తయనియుం దమతమకర్మములకుం దగినఫలముల వారే పొందుచున్నవారనియుం, దాను నిమిత్తమాత్రమే యనియు, నాతనిచిత్తమునం గల్గినమార్పని గ్రహింపవలయును. శ్రీకృష్ణమూర్తియు నతనిభావ మెఱింగి సంతోషించెను

అర్జునుండు రథమెక్కెను. దేవదత్తమును బూరించెను. పాండవసేనలు యుద్ధమునెప్పు డారంభింతుమా! యని యూహించుచుండెను. కౌరవసేనలు నట్టియూహయే కలవయ్యెను. కొంత ప్రొద్దెక్కెను. ఆతరుణమున ధర్మరాజుసోదరులు కృష్ణుండు వెంటరా నిరాయుధుండై యరిగి భీష్మద్రోణాదులకు నమస్కరించి వారనుజ్ఞనీయ మరలి రథమునధిరోహించెను. యుద్ధమారంభమయ్యెను. ఒక్కరినొక్కరు చంపుచున్నామని తలంచియే యప్పనిఁజేయుచుండిరి. శ్రీహరిమాయచే నర్జును నాచ్ఛాదించెను. కావునం దానునొకటియే యనునూహతోఁ దనపరాక్రమము నెఱపుచు నాహవమొనరించెను. భీష్ముండు తనపరాక్రమమును బక్షపాతము లేక చూపుచుండెను. ఆనాఁ డెవ్వరెవ్వరి

కాయువంతమయ్యెనో వారెల్ల మడిసిరి. సాయంసమయమున యుద్ధ మాపఁబడియెను. సాయంకాలము కాఁగా యుద్ధమాప వలయునని యార్యులమతము. నిత్యకర్మానుష్ఠానములకు బాధ కల్గించుపని చేయరాదని వారలమత మైనట్లు స్పష్టము కాదా!

ఆరాత్రి ధర్మరాజు సోదరులం బిలిపించుకొని భీష్ముని ప్రతాపమును గూర్చి ముచ్చటించి వారిందోడ్కొని శ్రీహరి శిబిరమునకుం బోయి చేతులు మోడ్చి "శ్రీహరీ! భీష్ముని ప్రతాపమును దలంచుకొన్న గుండెలు బ్రద్దలగుచున్నవి. యముని వజ్రిని వరుణుని గుబేరుని గెల్వవచ్చుంగాని గాంగేయుని గెలువ శక్యము కానే కాదు. నాయోధు లామహామహుని శరాగ్నుల కాహుతి యైరి. ఇఁకఁ గొలఁదిదినములలోనే నిశ్శేషము చేయంగలండు." అని పెక్కుభంగుల మొఱ్ఱయిడెను. ఆమాటలు విని శ్రీహరి; "ధర్మనందనా! ఏల వగచెదవు నీ సోదరు లీప్రపంచమునంతయు నోర్వఁజాలుదురు. నీకై ద్రుప దాదులు ప్రాణము లర్పింప నున్నవారు. నామాట యిఁకఁ జెప్పనేటికి? నీవు నిశ్చింతగా నుండు"మని నచ్చఁ జెప్పెను. పాస మాధర్మరాజాపలుకుల నూఱడిల్లి యెల్లరం బ్రోత్సహించెను. రణయజ్ఞమునం దెల్లవారలను హోమము నేయ నూహించి శ్రీహరి యున్నవాఁడని యెఱుంగఁడు. ఆతనిమాట యేటికి? కన్నులారఁ గాంచినయర్జునుఁడే మాయాసమాచ్ఛాదితుఁ డగుట నెఱుంగకపోయెను.

రెండవదినమున నుదయముననే తమతమకృత్యములం దీర్చుకొని సమరాంగణమున నెల్లవారు గూడిరి. యుద్ధ మారంభింపఁబడియెను భీష్మాదులు పరాక్రమము నెఱపిరి. భీష్ముఁడు

నర్జునుఁడును బోరాడిరి. ధర్మరాజు నుత్సాహము పెంపొందింప భీముఁడులోనగువారును విక్రమించిరి. ద్రోణధృష్టద్యుమ్నులు మార్కొనిరి. బ్రాహ్మణతేజ మజేయమగుటఁ బాండవసేనాధిపతి యోర్వఁజాలఁ డయ్యెను. సాయంకాలమున కెవ రెవ్వరు జీవితాంతము నొందఁదగువారో కర్మానుసార మట్లే గైరి మిగిలినవారెల్లరు తమతమ విడిదిపట్లకుం బోయిరి. మూఁడవనాఁడుదయమున యథాపూర్వముగా యుద్ధమారంభింపఁబడియెను. దుర్యోధనుఁడు తానొకవీరునివలె భీమునిం దాఁకి పోరాడెను. కాని మూర్ఛమునుంగవలసినవాఁ డయ్యెను. తుదకెట్లో మూర్ఛనుండి తెల్వినొందెను. సేనానాయకుఁడగు కురుపితామహునిపాలికిం బోయి యంగలార్చెను. 'పాండుకుమారులిట్లు పరాక్రమించుట మీమర్యాదకు భంగము కాదా' యనియె. మీరు తెగరుకాని వారవ నెంతయుని పురికొల్పెను మీమాటలు నమ్మికదా కర్ణుని విడిచి వచ్చితిని. ఐనదైనది. ఇంకనైన నామేలు మఱువక యుద్ధమును సాగింపుఁడని కఠోరముగాఁ బలికెను. ఆపలుకులను నాగ్రహించియుఁ బ్రసంగించుట న్యాయముకాదని భీష్ముఁ డాలోచించి నవ్వుచు నిట్లు పలికెను. "కుమారా! పెక్కుసారులు పాండవులజయింప నింద్రుఁడేని చాలఁడని మున్నే వచించితిని. అల్పమతులమాటలునమ్మి వారితో నీవు పగఁగొంటివి. అదియట్లుండనిమ్ము. అంతయు నీవెఱుంగ ముదుసలినయ్యుఁ బెనంగెదచూచుచుందుము. పాండుసూనుల నిలువరింతును." అట్టివానింబుచ్చి తనపనిఁ దాఁ జేయుచుండెను.

గాంగేయుండు కౌంతేయులకుఁ దనశక్తి నించుక చూపఁదలంచెను. కృతజ్ఞతను కౌరవులకుం గనఁబఱుపనెంచెను. అందును నిర్జితేంద్రియుఁడు. అస్ఖలితబ్రహ్మచారి. అట్టులగుట

భీష్మునిప్రతాప మోర్వరానిదే యగును. కాని ధర్మపక్షపాత మాతని నరికట్టక మానదు. ఆనాఁడుప్రతాపమును గనఁబఱుపఁ బూనఁగా నొక్కఁడైన మార్కొనఁజాలకుండిరి. కాలికి బుద్ధి చెప్పువారే కాని నిలిచి పోరాడుదమనువా రగపడకుండిరి. శ్రీహరి యర్జునునియహంకార మడఁపఁదలంచి కాఁబోలు భీష్మునిపై కడరఁ బురికొలిపెను. 'అర్జునా! సమయము వచ్చినది. ఈవఱకెన్నియో బీరములు పల్కుచుందువు. భీష్మునిపై వానిం బ్రయోగింపుము. ఊరకుండనదని నిది కాదు.' అన విజయుం డహంకార మూని తేరు నడుపుము. దేవత లగ్గింప ననిచేసెద. చూతువుగాక యని బీరములు పలికెను. గీతోపదేశ మేమయ్యెనా? నేనెంతవాఁడను. నీవాడించినట్లెల్ల నాడుచున్నాఁడఁ గదా. అనియైనా లేదు. నాపరాక్రమమును జూపెదననియె. భగవంతునిమహామాయ యాతని నెట్లు వశునిం జేయంగల్గెనో చూచితిరిగదా.

## శ్రీకృష్ణుఁడు చక్రముపూని భీష్మునిపైకిఁ బరుగిడుట.

అర్జునుం డంత మహాహవము భీష్మునితోఁ జేయఁబూను టెఱింగి హరిరథము గడపెను. భీష్ముఁడు తనపైకి వచ్చుధనంజయుని మార్కొని పరాక్రమము నెఱప నెంచెను. ఇరువురును మార్కొనిరి. భీష్ముఁడు విజయభావ మెఱుంగునుగానఁ దానే ముందుసింహనాద మొనరించి శరవృష్టిముంచెను. పిదప నర్జునుఁడు నట్లే యొనరించెను. ఆసంగరమును జూచుచు సేన లూరకుండెను. హెచ్చుతగ్గులు గానరాకయుండ నిరువురు పోరాడుచుండిరి. అర్జునుఁ డెంత నిర్భరవయస్స్ఫురితుఁడైనను భీష్మునిముందు నిలువఁజాలనిస్థితికి వచ్చెను. విధిలేక బాణములు

వైచుటయే గాని యవి తిలప్రమాణశకలములుగా భీష్మశర తతిచేఁ జేయఁబడుచుండెను. సారథి యగుశ్రీహరి యవయవములు చిల్లులు పడసాగెను తన్ను రక్షించుకొనఁ జాలని ధనంజయుఁడు సారథిని రక్షింపఁజాలునా. విజయునిసేన లంతఁ బరుగిడ సాగెను శ్రీకృష్ణుఁ డావిధముం గాంచి యింక రవంతసే పూరకుంటినా యీభీష్ముఁ డెల్లరఁ దునుమక మానఁడు. ఈతని బాణములు వజ్రనిశితములు. ప్రాణవాయువులఁ బీల్చుకాల భుజంగము లనఁజను. ఇఁక నాలసించుటనువుగాదని యూహించుచుండఁగా ద్రోణాదు లిదేసమయమని యర్జునునిదాఁక నెంచిరి పాండవసేనలు పాఱిపోవుచుండెను. క్రమక్రమముగా విజయుప్రతాపము తగ్గసాగెను. భీష్మప్రతాప మినుమడింపఁ జొచ్చెను. సాత్యకి యెలుంగెత్తి పాఱిపోవుట క్షత్రియజాతిధర్మము గాదని పురికొల్పుచుండెను. అర్జునుఁ డేమియుఁజేయఁజాలక యుండుటయుఁ గౌరవు లుర వడించుటయు నెంచి సాత్యకితో "సోదరా! పాఱిపోవు వారిఁ బోవనిమ్ము. నిల్పిన నిల్చునే. వీరినిల్పినను లాభము లేదు. ఇపుడు పాండవు లనిచేయఁజాలరు. నేనొక్కఁడన చక్రాయుధమును ధరించి సంగర మొనరించెదను. ఈభీష్మునిప్రతాపమడంచి ధనురాచార్యుని బొలియించి సుయోధనాదుల నుగ్గాడి యింద్రాదు లగ్గింపఁగా ధర్మరాజునకు సామ్రాజ్యమును సంపాదించెదను. ఊరక యేల యీపిఱికిపందల నిలిపెదవు. చూచుచుండుమా."

అని తమ్మునిప్రయత్నము నాపి చక్రంబుఁ దలంపనయ్యది సన్నిహితం బగుటయు దాని దక్షిణహస్తంబునం దాల్చి యుగ్యంబులపగ్గంబులు వదలి రథంబునుండి యిలకు

లంఘించి మదగజంబుఁ గాంచి దానిపైకిఁ జనుపంచాస్యంబు పగిది భూతలంబు గ్రక్కదల శ్రీహరి భీష్మునిపైకిఁ బరువెత్తెను. ఆవేగమున నామహాత్మునిపీతాంబరాంచలము సంచలింపసాగెను. పాణిపద్మమునఁ జక్రము నిరుపమానప్రకాశమనోహరలీలారవిందమువలెఁ గనుపట్టెను. చక్రముం దాల్చి భీష్మునిపైకి శ్రీహరి పరుగిడుచుండఁ గాంచి యాతనిభీకరాస్యమును నిప్పుకలనురులఁజేయునేత్రగోళములను దిలకించి సకలభూతములు కంపించెను. హరికరసరసిజమున మెఱయుసుదర్శనము గిరగిరఁ దిరుగసాగెను. భీష్ముఁడు మడిసెనని యెల్లవారును దలంచిరి. కాని పరమభక్తుఁడు సకలధర్మవేత్త జ్ఞానఖనియు నగుగాంగేయుఁ డట్లూహించునా భయంపడునా. మోముదమ్మి చిఱునవ్వు మొలకలెత్తఁగా ధనుశ్శరములట్టె * మెఱయు

---

* అసంభ్రమాత్కార్ముకబాణపాణీ రథే స్థితశ్శాంతనవోఽభ్యువాచ, ఏహ్యేహి దేవేశ జగన్నివాస నమోఽస్తు తే శార్ఙ్గగదాసిపాణే. ౯౭. ప్రసహ్యమాం పాతయ లోకనాథ రథోత్తమాద్భూతశరణ్య సంఖ్యే, త్వయా హతస్యేహ మమాద్య కృష్ణ శ్రేయః పరస్మిన్నిహ చైవలోకే. ౯౮. సంభావితోఽస్మ్యంధకవృష్ణినాథ లోకైస్త్రిభిశ్చ ప్రథితప్రభావః, శ్రుత్వా వచశ్శాంతనవస్య కృష్ణో వేగేన ధావంస్తమథాభ్యువాచ. ౯౯. త్వం మూలమస్యేహ భువి క్షయస్య దుర్యోధనం చాద్య సముద్ధరిష్యసి, దుర్ద్యూతదేవీ నృపతిర్నివార్యస్సుమంత్రిణా ధర్మపథస్థితేన. ౧౦౦. త్యాజ్యోథ వా కాలపరీతబుద్ధిర్ధర్మాతిగో యః కులపాంసనస్స్యాత్, భీష్మస్తదాకర్ణ్య యదుప్రవీరం రాజా పరం దైవతమిత్యువాచ. ౧౦౧. త్యక్తస్తు కంసో యదుభిర్హితార్థే సంబోధ్యమానో న బుబోధ రాజా, క్లేశాయ దైవాద్విపరీతబుద్ధిశ్శ్రోతా హితం యస్య న కశ్చిదస్తి. ౧౦౨. భీష్మపర్వము ౫౯ అధ్యాయము.

చుండఁగా శూరధర్మము, భక్తాగ్రేసరధర్మము కనంబడు
చుండఁగా సంభ్రమింపక యించుకయేజంకక యోజగన్నివాసా!
రమ్ము రమ్ము. జనార్దనా! నీపాదారవిందములకు నమస్కరించె
దను. గదాసిచాపధరా! నన్నీయుద్ధమునఁ జంపుము. నిన్ను
మార్కొని నీచేఁ జచ్చుభాగ్యమే నాకు దొరకినఁ ద్రిలోకము
లయందు వినుతిం గాంతును. ముక్తినొందుదును. త్వరగా
రమ్మని ప్రార్థించుచుండునంతలో శ్రీహరి త్వరగాఁ బరుగిడి
గంగానందును జేరంజనుచు నిట్లు పలికెను. గంగానందనా!
నీవు ధర్మమార్గమునువదిలితివి. లోకబాధాకరుఁడైన దుర్యోధ
నుపక్షమూని వానినిలువఁబెట్ట నెంచితివి. రాజన్యాయమునఁ
బ్రవర్తించినఁ దెలివిగలమంత్రులు మరలింపవలదా? నీమాట
వినఁడేని వానింబొలంగుట న్యాయము. అనుటయు శ్రీహరి
భావమెఱింగి కురుపితామహుఁడు 'దేవా! కులనాశకరుఁ
డీదుర్యోధనుఁడు నామాటల వినఁడు. మున్ను యాదవులు
హితము తెలిపితెలిపియే కంసునెడఁబాసిరి. కాలము మూరికొలు
పఁగా మేలుతెలుపుమిత్రులనుడువుల నాలకింపరు. ఆవలదుఃఖ
పడుదురు. మీరెఱుంగనివిషయము లేవిగల'వను చున్నంతలో
నర్జునుండరుదెంచి భగవంతుని బ్రార్థించి పిలుచుకొనిపోయెను.

మహాశయులారా! శ్రీకృష్ణుఁడాయుధము ధరింపనని
మున్నే తెలిపియుండెఁగదా. ఇపు డాయుధమును ధరించుటచే
స్వోక్తివ్యాఘాతముకాలేదా! యనవచ్చు. కాని శ్రీహరి భావ
మేమియని యాలోచించిన స్వోక్తివ్యాఘాతముకాదు. యుద్ధ
రంగమునందుఁ బరమభక్తాగ్రేసరుఁ డగుగాంగేయునకుఁ దన
పూర్వరూపమున దర్శనమిచ్చె నని మనమూహింపవలయును.
సాత్వికి లోనగువారికి యథాప్రకారమే కనఁబడుచుండెను.

భీష్మునకుఁ జతుర్భుజములతో లలితపీతాంబరముతోఁ గనఁబడి యెను. కావుననే గాంగేయుఁడు 'చాపఖడ్గగదాపాణీ!' యని సంబోధించెను. చక్రము మెఱయుచుండెను గదా భగవద్దూరి పము చేతఁ జస్ఫుటకంబు శ్రీయశస్సు వేఱొండుకలదా యని ప్రశ్నించెను. శాంతనవునకు మనస్సున భీతి కలుగలేదు. తన ప్రతాపమును, మెచ్చుకొని తనచెంత కరుదెంచినట్లే యతఁడు భావించెను. భయముచెందియే యుండిన సంభ్రమము లేక యుండఁగలఁడా. మహాత్మా! రమ్మనుటయే గాక జగన్నివాసా రమ్మనియే. విశ్వరూపము భీష్మునకుఁ గనఁబడియె నని మనమూ హింపవచ్చు. భారతమున నట్టియూహకుఁ దగినసాధనములు కానంబడు. మేమెల్ల నీలోనివారమే రమ్మని భీష్ముఁడన్నమా టలో సారమేమి. అందఱము నీలో నుండువారము. అర్జునుని యందు నీకుఁ బక్షపాతము కలుగ నవకాశము లేదు. నాయందు నతనియందు సమభావమే నీకుఁ గల దనుభావము నాసంబో ధనమే తెలుపును. చెంతకుం బోయి కర్తవ్య ముపదేశించెను. తాను భీష్మునే చంపఁబూనుచో రథముననుండియే చక్రము ప్రయోగింపరాదా ఏల యట్లు చేయలేదు. భక్తజనపక్షపాతి కావున నర్జునునిమూలమునఁ దాఁ జేయుపని నెఱవేర్పఁబూని యతఁడు చేడ్పడియుండ నింకను త్సాహమును గల్గింపక యున్నఁ గార్యము కాదనియే రథమునుండి ధరణికి లంఘించె నని మన మూహింపవలయును. నాల్గుహస్తములయందు నాయుధము లుండుట భగవంతుని కలంకారము. ఆయుధధారణ మది కాదనియు భీష్మునిపైఁ గలదయాతిరేకమున నాతనిచెంత కరిగె ననియు మన మెఱుంగవలయును. ఇఁకఁ దరువాతికథను బరి కింతము.

అర్జునుని ప్రార్థన మంగీకరించి మరలి రథ మెక్కెను. అర్జునుఁడు మహోగ్రహంబున విక్రమించి శత్రుసేనల నుఱుమాడెను. ఆగ్నేయాస్త్రమును బ్రయోగించి యెల్లవీరుల నలయించెను. సాయంకాలము కాఁగాఁ దమతమ శిబిరముల కెల్లవారునుబోయిరి. నాల్గవదినమున మరల యుద్ధమారంభమయ్యెను. భీముఁడభిమన్యుఁడు సాత్యకి లోనగువా రాదినము తమపరాక్రమమును గనఁబఱచి కౌరవులనోడించిరి. ఆనాటిరాత్రి దుర్యోధనుఁడు భీష్మునిశిబిరమునకరిగి తన యోటమికి వగచెను. భీష్ముఁడాతని నాక్షేపించి నరనారాయణుల మాహాత్మ్యం బెఱిఁగించి వారి జయింపఁ దరమా యని తెలిపి వారిని భక్తిభావమున భజింపుమని యుపదేశించి సాగనంపి, తాను శయనించి మఱునాఁడరుణోదయమున రణరంగమునకుఁబోయి తనయోపినంత పోరాడుచుండెను. నాఁడు ద్రోణాశ్వత్థామలు తమశౌర్యములఁ గనఁబఱచిరి. ఆఱవదినమున నిరువెగలవారును బోరాడిరి. ఏడవదినమున నట్లే సంగరము సాగెను. ఎనిమిదవదినయుద్ధము నట్లే సాగెను. దుర్యోధనుఁ డాదినమునఁ దనబలమున బెక్కండ్రు మడియుటం జేసి చింత త్వరపెట్టఁగా భీష్మునితో నిష్ఠురము లాడెను. ఆతఁడు పాడినపాటనే పాడి నరనారాయణులను జయింప శక్యమా యనియె. తొమ్మిదవదినమున మరల యుద్ధమారంభింపఁబడియెను. అభిమన్యుఁడు పరాక్రమించెను. ద్రోణార్జునులు తలపడిరి. గెలుపోటములు లేవయ్యెను. దుర్యోధనుని మనస్సున కించుక శాంతి గల్గింపఁబూని భీష్ముఁడు చెలరేఁగి పరాక్రమమును జూపసాగెను. సేనలు పాఱఁజొచ్చెను.

*కృష్ణుఁడు రథంబునిలిపి గాండీవికా సేనలదురవస్థం దెలిపి బీర ములు పల్కినట్టు కాదు. కార్యమునఁ జూపవలయుఁగదా యని హెచ్చరింప నతండు సిగ్గుపడి తలవంచి యిట్లనియెను. కృష్ణా! చంపఁదగనివారలజంపితిని నరకము గల్గనున్నది. ఇట్టిరాజ్య మును సంపాదించుటో, అడవులకుఁబోవుటో, యేది కృత్య మని విచారించుచున్నవాఁడను. నే నేమనివిన్నవింతును! నీచి త్తమునకు వేట్లోకరీతిగాఁ దోఁచునేని నీమాటయే వేదమని నమ్మెద. రథము నడుపుము. అరుల వధించెద అనియె.

## శ్రీకృష్ణుఁడు రథము దిగి భీష్మునిపైకిఁ బోవుట.

శ్రీహరియు నర్జుననిభావ మెఱింగి శాంతనవునిరథమున కభిముఖముగా రథమునడపెను. సేనలు మరలెను. భీష్ముండు సింహనాద మొనరించి సంక్రందననందనునిరథముపై శరవృష్టిని గురియించెను ఆబాణముల నెట్లో తప్పించుచు హరి తనసా రథ్యచాతుర్యము మెఱయించుచు రథము నడపుచుండెను. అర్జునుఁడెంతపరాక్రమించినను భీష్ముని మీఁఱఁ జాలఁడయ్యెను. భీష్మః డత్యుగ్రసాయకంబులం బ్రయోగించుచు నర్జుననియా టోపంబు తగ్గించుచు సేనాసముదయము నుగ్గాడుచుండెను. కృ ష్ణుఁడావిధ మెఱింగి యర్జునుఁడు మెత్తపడియున్నవాఁడు కావున నీతనిఁ బ్రోత్సహింపఁదగునని మది నెంచి మీఁదమీఁద గాంగే

---

*క్షత్రధర్మ మనుస్మృత్యా యుద్ధ్య స్వవిగతజ్వరః. 32-శ్లో. ౧౦౭-అధ్యాయము. ఇది చేయఁదగనిపని యనుతాపమునొందక క్షత్రియ జాతిస్వభావధర్మమునే యాశ్రయించి యుద్ధము చేయుము. అని గీతోప దేశమునే మరలఁజేసెనని దీని భావము.

యుని తీవ్రాశుగములు నిగుడం గాంచి యింక నూరకుండ రా
దని యూహించి పట్టరానికోపంబున రథము డిగ్గ నుఱికి
మునికోలంగొని భీష్మునిచెంతకుం బోయెను. ఆకృష్ణుని గాంచి
నీజనులు భీష్ముఁడు చచ్చెఁ జచ్చెనని యాక్రోశించిరి భీష్ముఁ
డించుకయు సంభ్రమింపక యిట్లు పలికెను.

> "ఏహ్యేహి పుండరీకాక్ష దేవదేవ నమోఽస్తు తే. ౬౩
> మామద్య సాత్వతశ్రేష్ఠ పాతయస్వ మహాహవే,
> త్వయా హి దేవ సంగ్రామే హతస్యాపి మమానఘ. ౬౪
> శ్రేయ ఏవ పరం కృష్ణ లోకే భవతి సర్వతః,
> సంభావితోఽస్మి గోవింద త్రైలోక్యే చాద్యసంయుగే."
> (౧౦౬ అధ్యా.)

పుండరీకాక్షా! రమ్ము రమ్ము. దేవదేవా! నీకు నమస్కా-
రము. సాత్వతశ్రేష్ఠా! ఈమహాహవమున నన్నుఁ బడఁ
జేయుము. యుద్ధమున నీచేఁ జచ్చుభాగ్యము గల్గిన నంతకంటె
శ్రేయస్సేమికలదు? ఇహలోకముననే గాక పరలోక శ్రేయస్సు
గలుగు. ముల్లోకములయందు నే సన్మానింపఁబడుదును. అనిరెను.

అంతలో నర్జునుఁ డరుగుదెంచి పట్టుకొని పదియడుగు
లలో నిలిపి యనునయించుచుఁ గ్రోధ ముడుగుము. సత్యవా
క్యమును బాలింపుము. నీవే దానిని మార్చిన నింక దానిని
బాలించువా రెవ్వరు? త్వరగా భీష్ముని వధించెద. అని ప్రార్థించి
శపథము చేసిన హరి యింక నాపని యయ్యెనని వెనుకకు మరలి
రథమెక్కెను. పోరు ఘోరముగా సాగెను. గెలుపోటములు
నిర్ణయింపరాని వయ్యెను. కాని భీష్మునిమించుశక్తి యర్జును
నకు లేదనుట స్పష్టమయ్యెను. సాయంకాలమునఁ దమతమశిబి
రములకుఁ జేరిరి. ఆరేయి ధర్మనందనుఁ డనుజులంగూర్చుకొని

శ్రీకృష్ణునిపాలి కరిగి దేవవ్రతునిపరాక్రమంబుఁ దెలిపి యది దుస్సహంబనియు నెఱిఁగించి యిందఱను జంపుకొనుటకన్న నడవుల కరిగి తపముండుటె మేలని నాకుఁ దోఁచెడు నని విన్నవించెను. శ్రీహరియుఁ దగురీతి మాటలాడుచు భీష్ముని వధించి విజయము నీకుఁ జేకూర్పఁ జాలుదు. ఐన నుపప్లావ్యమున నర్జునుఁడు చేసినశపథము గాపాడ నూరకున్నవాఁడ నని పెక్కు భంగులఁ బలుక యుధిష్ఠిరుండు శ్రీకృష్ణా! కురుపితామహుండు నాతో దుర్యోధనునిపక్షంబునం బోరుదును. విజయము నీకుఁ జేకూర్తును. సమయ మిది కాదు. ఇపుడు పొమ్ము వేఱొకసమయమున నన్నుఁ జూడుమనియె. కావున నాతనికడకుఁ బోయి ప్రార్థింతును.ఆతఁ డేమి హితము దెలుపునో యవ్విధమునఁ జేయుదమని తోఁచెడిని. ఈవిషయమున నీయానతి యెట్టిదో యెఱుంగఁగోరెదను. అనఁగా శ్రీకృష్ణుఁడు కౌంతేయాగ్రజా! నీయూహ కడుంగడు నాకు రుచించెను.*సర్వకార్యసమర్థుఁడు. దేవవ్రతుని మార్కొనఁ దరముకాదు క్రోధవీక్షణములచేతనే శత్రువులఁ గాల్పఁగలఁడు. మనమందఱ మరిగి యతనివధోపాయ మభ్యర్థింతము. ఆతఁ డేమి చెప్పునో యట్లే చేయుదము. అని పలికి వారింగలిసిపోయెను.

పాండవు లేవురు శ్రీహరియు నిరాయుధులై భీష్ముని శిబిరంబున కరిగిరి. ఆయనపాదముల కభివాదన మాచరించిరి.

---

*రోచతే మే మహాప్రాజ్ఞ రాజేంద్ర తవ భాషితం.౫౨. దేవవ్రతః కృతీ భీష్మః ప్రేక్షితేనాపి నిర్దహేత్, గమ్యతాం స్వవధోపాయం ప్రష్టుం కురుపితామహం. ౫౩. గత్వా శాంతనవం వృద్ధం మంత్రం పృచ్ఛామ భారత, స మో దాస్యతి మంత్రం యం తేన యోత్స్యామహే పరాన్. ౫౪. భీష్మ. ౧౦౭ అధ్యా.

శరణము వేఁడిరి. దేవవ్రతుండు వారినాదరించి మీవాంఛితముగు దెల్పెఁడు. తప్పక నెఱవేర్తును. అనునంతనే వెలవెలఁబాఱినమోముతో ధర్మరాజు మాకు సామ్రాజ్యమెట్లు లభించునో యావిధ ముపదేశింపుము. నాసేనాసంక్షయము కాకయుండఁజేయుము. నీవధోపాయ మెఱిఁగింపుము. నిన్నెదిరించి పోరదరముగాదు నావిని గాంగేయుఁడు నీవన్నమాట యథార్థమే. నాచేత విల్లుండఁగా నను జయింపరాదు. నేశస్త్రాస్త్రములు వదలినతఱి ననుఁ జంపఁదగును స్త్రీపూర్వునితో యుద్ధము చేయను శిఖండి యట్టివాఁడు కదా. వాఁడు నీపాలఁ గలఁడు. వాని నే నేయను. కాన వాఁడు నన్నేయఁ జాలియుండును. ఆయంతరమున నరుఁడు నన్నేయంజను. నేఁ బడుదు. నరనారాయణులు తప్ప నీలోకమున నెవ్వాఁడును నన్నేయఁజాలఁడు. అట్లు చేసిన నీకు విజయము గలుగును. అని హితనుపదేశింప మహాప్రసాదంబని సెలవంది తమయిరువుల కందఱు చనుదెంచిరి.

పదియవనాఁటి యుద్ధము.

మఱుదిన మాంచోప్పుననే చేయువారలై పాండవులు రణరంగమునకు వెడలిరి. ఎల్లవారును తమతమపరాక్రమములఁ జూపుచుండిరి. శిఖండి యర్జునురథంబుపైనుండఁగాంచి ధనురాచార్యుం డశ్వత్థామను భీష్మునకు సాయపడంబంపెను. ఎందఱో సాయపడ నుండిరి. శిఖండిం బురస్కరించుకొని విజయుఁడు భీష్ముని మార్కొనియెను. భీష్ముఁడు గ్రీష్మాదిత్యునిం బోలి సేనారణ్యమును దపింపంజేసెను. అర్జునునిబాణములు శిఖండిమఱుగుననుండివచ్చుటంజేసి శరతల్పగతుం డయ్యెను. ఎల్లరు నాతనిం జూడం బోయిరి. దుర్యోధనున కిక యుద్ధము

మానుకొను మని యుపదేశించెను. సాయంకాలము కాఁగా నెవ్వారియిరవులకు వారుపోయిరి.కర్ణుఁడు భీష్మునిం జూడంబోయి మహాత్మా! నేను గర్ణుఁడ నన్ననుగ్రహింపు మనియె. భీష్ముఁ డాతనిం జేరం బిలిచి పాండుపుత్త్రుండవని తెలిపి యెన్నియో కార్యముల నెఱింగించెను. కర్ణుఁ డందుల కంగీకరించి నరునిచేఁ దనకుఁ జావుగలుగునని యొప్పుకొని యదియే కర్జమని సెల వంది పోయెను.

మహాశయులారా! వ్రాయఁదగినమాట యొక్కఁ డున్నది. ధర్మరాజు రహస్యముగా భీష్మునికడకుం బోవనుంకించి శ్రీహరితోఁ దనవిపద్దశఁ జెప్పి యంగలార్చెను హరియు భీష్మునిఁ జంపుదునని బీరములు పల్కెను. భీష్ముని గానంబోవుదమా యన భీష్మునిప్రతాప మప్రతిమానమని పొగడెను. ఏల? అని ప్రశ్నించిన సమాధాన మేమనఁగ. నరుఁడు శిష్యుఁడు.భీష్ముఁడు భక్తుఁడు. ధర్మరాజు న్యాయపక్షపాతి. వీరిలో నెల్లరను సమానముగాఁ జూడకుండ నెవ్వనినే నల్పముగాఁ జూడ నయితి కాదు. ధర్మరాజు మనస్సు నొప్పింపకుండ నర్జునుఁడు సిగ్గునొందక యుండ భీష్మునిపైఁ గలయనురాగమునకు భంగము రాక యుండ మాటలాడెను. ఏపనిచేసినను జేయఁగలఁడు. కావున వారిం గలిసిపోయి భక్తునకు దర్శనమిచ్చెను. ఎవ్వరెవ్వరిచేత నేయే కార్యమెట్లెట్లు చేయింపఁదగునో యట్లేచేయించెను. తాను సర్వసాక్షి యై యుండెను. భీష్మునిహృదయమువనుండి హితము ప్రకించెను. ధర్మరాజుహృదయమువనుండి యడిగించెను. అర్జునుని హృదయమువనుండి శరములఁ గురియించెను.

శ్లో. "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అన్నట్లోపదేశమును సార్థకముచేసెను. కావున నెవరిచేత నేయే కర్మ మేయేరీతిగాఁ జేయింపవలయునో యారీతిగాఁ జేయించి తన సర్వనియంతృత్వమును స్థిరపఱచెను. ఆపరాత్పరునకు నమస్కారము లొనరించి సర్వాపరాధములను క్షమింపుమా జగదీశ్వరా! యనివేఁడి యవ్వలిహరిచరితమును బఠింతము.

భీష్ముఁడు తనకృత్యమును దా నిర్వహించి భగవదాజ్ఞ చొప్పునఁ దనతనువును శరతల్పమునఁ జేర్చెను. సకలసుఖాకర మగుశరీరము శరతల్పగత మగునపుడు కష్టముగాఁ దోఁపదా యన్నఁ దోఁప దనవలయు. మనోభావమునే యనుసరించి దేహము కష్టసుఖముల ననుభవించునుగాని దానికి స్వాతంత్ర్యమన్నదియే లేదు. ఇష్టమగుకార్యము కష్టమైనను సుఖముగాఁదోఁచుట యందఱ కనుభవమున నున్నదియే కాని క్రొత్తది కాదు కదా. కావునఁ దనశరీరమును శరతల్పమునఁ జేర్చి యాభీష్ముఁడు మనస్సును శ్రీకృష్ణునిపాదారవిందములయందుఁ జేర్చెను. ఇఁక నామహాత్మునకుఁ గావలసినదేమి? భగవంతునియందైక్యమేకాని వేఱొకటి కాదు. కావున నీలోకసంబంధ మేదియు నామహామహునిమనస్సునఁ బొడమ దయ్యెను. మహానందమన నదియేకదా.

భీష్మశరతల్పగమనానంతర మెల్లవారు తమతమ శిబిరములకుం జని యారాత్రి సంతోషపరితాపములఁ బాండవులును దుఃఖాతిరేకమునఁ గౌరవులును బుచ్చిరి. ఇఁకఁ దమకు సేనాధిపతి యెవ్వరనువిచారము కౌరవులకుం గలుగ ధనుర్వేదాచార్యుని నిర్ణయించుటయే మంచిదని యెల్లవా రంగీకరింప దుర్యోధనుఁ డట్లు కార్యము నడపెను. ద్రోణాచార్యుఁడు బ్రాహ్మణుఁడు యుద్ధమాతనిజాతికిం దగినవృత్తి కాదు. స్వజాతివృత్తివలన జీవ

నము సాగనపుడు దానియనంతరజాతివృత్తివలన జీవనము సాగింపవచ్చునని స్మృతులు బోధించెడిని.

శ్లో. "వేదాభ్యాసో బ్రాహ్మణస్య క్షత్రియస్య చ రక్షణం,
వార్తాకర్మైవ వైశ్యస్య విశిష్టాని స్వకర్మసు. ౮౦
అజీవంస్తు యథోక్తేన బ్రాహ్మణస్స్వేన కర్మణా,
జీవేత్క్షత్రియధర్మేణ సహ్యాస్య ప్రత్యనంతరః. ౮౧
ఉభాభ్యామప్యజీవంస్తు కథం స్యాదితి చేద్భవేత్,
కృషిగోరక్షమాస్థాయ జీవేద్వైశ్యస్య జీవికామ్. ౮౨
వైశ్యవృత్త్యాపి జీవంస్తు బ్రాహ్మణః క్షత్రియోఽపి వా,
హింసాప్రాయాం పరాధీనాం కృషిం యత్నేన వర్జయేత్."
మనుస్మృతి. ౧౦ అధ్యాయము.

కావున ద్రోణాచార్యుఁడు క్షత్రియవృత్తి నంగీకరించెను; కృపాశ్వత్థామలు నట్లే దానినే యవలంబించిరి. కావున వారు క్షత్రియోపాధ్యాయులు కావలసివచ్చెను. స్వవృత్తి నప్రధానముగా రెండవజాతివృత్తియగు శస్త్రపరిగ్రహణము ప్రధానముగాఁ జేసికొని కౌరవుల నాశ్రయించిరి కాని స్వవృత్తి ననఁగాఁ బంచమహాయజ్ఞములులోనగువానిని వదలకయుండిరి.

ద్రోణాచార్యుఁడు సేనాధిపతి కాఁగానే దుర్యోధనునకు ధర్మరాజును బట్టి యిచ్చునట్లు వాగ్దానము చేసెను. కాని ద్రోణున కందఱికంటె విజయునియందుఁ బ్రీతి మెండు అతనికిని గురువునందు భక్తి యతిశయమే. కావుననే ధనంజయుఁడు లేని తఱిఁ బట్టియిత్తునననియె. ఆప్రతిన విన్నంతనే పాండునందనులు యుధిష్ఠిరుని గాపాడుటకుం బ్రయత్నపరులు కావలసివచ్చెను. ద్రోణుఁ డైదుదినములు సంగర మొనరించి పాండవవాహిని నిలుపుదుననియుండెను. తొలిదినము యుద్ధమున నాచార్యుఁడు

పరాక్రమించెనుగాని తనయసమాన ధనుర్విద్యాకౌశలమును జూపఁడయ్యెను. పాంచాలురఁ బొలియించు టాతనిపనిగా నుండెను. రెండవదినమున నాచార్యుఁడు పెక్కండ్రఁ బాంచాల వీరులం బొలియించెను. అర్జునుఁడు సంశప్తకులను వారిపై నురవడించెను.

## భగదత్తునివిషయము.

భీముఁడు దుర్యోధనుఁడు తలంపడి పోరాడసాగిరి. దుర్యోధనుఁడు నొచ్చుటంగని భగదత్తుఁడు ప్రభురక్షార్థ మాతని మార్కొనియెను. వానికి సుప్రతీక మను నేనుఁగు కలదు. దాని నెక్కినచో వాని నోర్చుట కడిఁది. అదంతి సామాన్యశక్తి కలది కాదు. భీముఁడు నాగాయుతబలుఁడు కావున దానిని సామాన్య గజ మనుకొని గజఘటల నొంచుటయం దుత్సాహముకలవాఁడు కావునఁ బోరాడెను. కాని భీమునిచే నది చచ్చునది కాదు. భీముఁడు దానిచేఁ జావకుండ నెట్లో తప్పించుకొని పాఱిపోవలసినవాఁ డయ్యెను. ఆతఁడు తప్పించుకొనిపోవు టెవ్వరెఱుంగక యతఁడు చచ్చెననియే తలంచిరి. కావున నాతనిరక్షణార్థము ధర్మరాజాదులు పోయి భగదత్తుని మార్కొనిరి. ప్రాగ్జ్యోతిషేశ్వరుఁ డగుభగదత్తుఁడు వారిం జీకాకుపఱచుచుండెను. అభిమన్యుఁడు సాత్యకియు మఱియుం బెక్కండ్రు మహారథాతిరథు లురవడించిరి కాని దానికొల్లలకు నిలువఁ జాలక పరుగిడిరి. భీముఁ డెన్నియోసారులు మార్కొని యోడి పోవలసివచ్చెను. దానియుద్ధతి దుర్నివారముగా నుండెను. ఎవ్వరును దానిమార్కొన నుంకింపకుండునంతటిస్థితి వచ్చెను.

శ్రీకృష్ణమూర్తి యాగజముచేఁ జావఁదగినవారు చచ్చునంతదనుక నూరకుండియుఁక దానికిని గాలము సమీపించు

ఱెఱుంగు గాన సంశప్తనాయకుఁడు మూర్ఛపోవునట్లు చేసెను. నరుఁ డాదిక్కు చూచునట్లు చేసెను. పాఱెడుసేనలం గని కపి ధ్వజుండు శ్రీకృష్ణా! యదేమి మనసేనలు పాఱుచున్నవి. ఏమి విపత్తు గలిగినదో తెలియఁజాలక యున్నాఁడను. రథ మచ్చ టికిం దోలుమని దీనతమైఁ బ్రార్థించెను. శ్రీహరి యట్లే చేసెను. నరుఁ డరుదెంచి భగదత్తుని మార్కొని సంగరమును సాగిం చెను. చాలసేపు వారిరువురు పోరాడిరి. తుదకు భగదత్తుఁడు తనకడ నప్రతిహతం బైయుండు వైష్ణవాస్త్రమును బ్రయో గింప నెంచి తనయంకుశమునం దామంత్రమును సన్నిహితము గావించి నియతిమై నభిమంత్రించి యర్జునునిపైఁ బ్రయోగిం చెను. దానిచే నర్జునుఁడు చావవలసినవాఁడే. ఏయస్త్రముగాని దాని నాపఁజాలదు. ఆయస్త్ర మర్జునునికడ లేదు. అది యర్జు నుని పై కడరఁగా శ్రీహరి తనప్రభావమే యందుఁ గలదు గావునఁ దనదేహమును బెంచి యర్జునున కడ్డముగా నిలిపెను. అర్జునున కారహస్యము తెలియదు. శ్రీహరి చేసినపని తన కవ మానమును గల్పించెననియే తలంచి యిదియేమి కృష్ణా! పలు మాఱులు మాట తప్పుచున్నావు? నీ కిది తగునా? అని యిం చుక యసూయ తోపఁ బలికెను. "నిమిత్తమాత్రం భవ సవ్య సాచిన్" అను గీతోపదేశమును మఱచెను. తానే కర్తనని భావించునంతటిమాయచే నర్జునుని శ్రీహరి కప్పియున్నాఁడు కదా. పాపము! అర్జునుఁ డేమి చేయంగలఁడు. ఆమాయను దాఁటఁగలఁడా? అంతతో నూరకుండక నాశక్తి యెఱుంగవా కృష్ణా! యనియుఁ బలికెను నేను శరచాపములు దాల్చి సమర మున నిల్చిన ముల్లోకములు నిలువఁజాలవను ఱెఱుంగవా యని శ్రీకృష్ణునాక్షేపించెను. కాని హరియు నామాటలకుఁ గినుకపూ

నునా. మనస్సున నవ్వుకొనుచు నర్జునా! వినుము ఒక్కరహస్య మెఱింగించెదను. లోకరక్షణార్థము నేను మున్నే నాల్గురూపము లం దాల్చితి. అందొక్కమూర్తి భూలోకమునఁ దపము చేయు చుండును. వేఱొక్కమూర్తి జనులమంచిచెడ్డలఁ గనిపెట్టుచుం డును. ఇంక నొక్కమూర్తి మనుష్యులు చేయఁదగినకర్మములఁ దానొనర్చుచు వారి కుపదేశించుచుండును. మఱియు నొక్క మూర్తి యోగనిద్రయందు సహస్రవర్షములు గడపి లేచును. ఒక్కప్పు డామూర్తి యోగనిద్రనుండి మేలుకొనఁగా నది వరము లిచ్చునదికాన భూదేవి యాంతరుణమున నామూర్తికడ కుం బోయి నాసు సురాసురులకు వధింపఁదగక వైష్ణవాస్త్రస్ఫురి తుఁడై తగుకొమరుఁడు కావలయునని వరమడిగెను. నరకా సురురక్షార్థము వైష్ణవాస్త్ర మిచ్చిపంచితిని. నరకాసురుం డద్దా ననే యజేయుం డయ్యెను. ఆతనివలన భగదత్తుఁడు వీఁ డద్దా నింబడసె. అయది దుస్సహం బై యుండు. ఆరహస్య మేనెఱుం గుదును చూడు మాయస్త్రము నాహృదయఫలకమునఁ బూల మాలిక యై యున్నది. నీపై నడరిన నీవు జీవింపఁజాలవు. నీవు కాదు సురాసురులం దెవ్వఁడైనను నిలువఁజాలఁడు. ఇది యెఱిం గియే యిట్లొనరించితిని ఈకార్యము చేయుట నిన్న వమానింపఁ గాదు. వత్సా! వేఱొకరీతిఁ దలఁపకుము. ఇపుడు వైష్ణవాస్త్ర విహీనుఁడై యున్నవీనిం బొలియింపుమని తనదేహమునుయథా పూర్వముగా నొనరించెను. అర్జునుం డతనశ్రమంబున వానిని దద్గజేంద్రమును బొలియించెను.

మహాశయులారా! భగదత్తునిచరిత్రమునుగూర్చి పది మాటలు వ్రాయవలసియున్నది. భగదత్తునికడ వైష్ణవాస్త్రము కలదు. సుప్రతీకమను గజము కలదు. దానినెక్కి పరాక్రమిం

చుటకు వాని నెదిరించ నితరు లాతరుణమున సమర్థులుగాని యట్లు వరము గలదు. ఆవైష్ణవాస్త్రము పునఃప్రయోగమున కర్హము కాదు అది వరప్రదానకాలకృతసమయము.దివ్యాస్త్రములు మరలమరలఁ బ్రయోగింప నర్హములు గాకయుండు.ఏల యనఁగా నించుక వినుండు. ఉపాసకుఁ డాత్మాభీష్టము నెఱవేఱుటకై యొకమంత్రము సమాహితచిత్తుఁడై జపించును. ఆయస్త్రదైవతమాయుపాసకునినిష్ఠచే నాహూతమగును. ఆమంత్రబీజవర్ణ మాదైవతమునకు నెఱింగించునని భావము. ఆదేవత యాతనిభాగ్యము నెఱుంగును. తనవలన నెంతమేలు పొంద నర్హుఁడో యంతఫలము నీయఁదలంచును. కాని యాతనికోర్కి దానినిమించియుండును. అట్టి యిక్కట్టు సమయమున నొకమిషఁ బెట్టి యాఫలము నొసంగును ఈమిష యేలయని యాతఁ డడుగఁజాలఁడు. ఏలయనఁగా దేవతావశీకృతహృదయుఁడై యుండుటే దానికిఁ గారణము. ఇదియే తపముచేసి వరము నొందువారిపద్ధతి జ్ఞానియగుభక్తుఁడు దేవతాసాక్షాత్కారము కాఁగా వరమడుగఁడు. కరుణయే చాలుననును. అట్టితఱి నా దేవత యాతనిమనస్సు పరిపక్వమని యెఱింగి యెట్టివరముల నొసంగినను లోకులకు బాధ కలుగదని తలంచి యొసంగును. వానినెల్ల నాతఁ డుపయోగించుకొనక పరమపదమునకై ప్రయత్నించును. ప్రకృత మనుసరింతము. భగదత్తుఁడు రక్కసుఁడు. వానికడ వైష్ణవాస్త్రము పునఃపునః ప్రయోగమున కర్హమయియే యుండిన నెన్నియేనపకారములు లోకులకుఁ గలుగు. కాన నది యొక్కమాఱే ప్రయోగింప నర్హమయియుండెను. ఆనాఁడు వాఁడు కాలమాసన్న మగుట విక్రమించెను. భీమాదులపై దానిం బ్రయోగించెనా. లేదు. ఏల? వారి కాయువు

న్నది. కాన నతని కాబుద్ధి పుట్టదయ్యెను అర్జునునిఁ జంపఁగోరి యద్ధానిం బ్రయోగించెను. అస్త్ర మనఁగాఁ గల్పితమగునొక యాకృతివిశేషము కాదు. ఆమంత్ర మెద్దానిపై నభిమంత్రించి నను బనిసాగును. కావునఁ దనయంకుశమునం దామంత్రము నావహింపఁ జేసెను. ఆమంత్రప్రభావమున ననఁగా నాదేవత యం దావేశించినందున నది దీప్తాగ్నివలె వెలుంగుచు నడ రెను. శ్రీకృష్ణుఁ డాతేజస్సు నితరులపైఁ బడినరూపుమాపునని యెఱుంగును. ప్రయోక్త తనయరినామము నుచ్చరించి తద్వ ధార్థ మీవు పొమ్మని మారణబీజసంపుటితముగఁ జేసిపంపును. అది నిగుడునపుడు హరి నరుని కడ్డముగఁ దనమేను పెంచెను. అది తనతేజమే కావున నేమియుఁ జేయఁజాలక పోయెను. అది మరలి పోవఁజాలదు. పాదరసముశకలము తనశకలములలో నడంగిపోవునట్లు వైష్ణవతేజము విష్ణువునందుఁ గలసిపోయెను. ఆతేజఃప్రతాపము పోవ హీనశక్తియై యున్నభగదత్తుని వధింపుమని ధనంజయుని హరి పురికొల్పెను. ఈవిషయ మెఱుం గఁడు కాన నర్జునుఁడు పరాభవించెనని తలంచి హరి పరమేశ్వ రుఁడనని యంతకు మునుపు తెలిపియున్నను మాయాచ్ఛా దితుఁ డగుట మఱచి యాక్షేపించెను. పంకజాక్షుఁ డాతనిద ద్విధిఁ దెల్పి సంతుష్టుం జేసెను. ఇది యస్త్రమహిమము. ప్రయోగ మననిదియే ఉపాసనాపద్ధతియు నిదియే. ఇదియే యీవిషయ మునఁ దెలుపఁదగినవిధము. ఇఁకఁ దరువాతికథ నాలకింపుఁడు.

### అభిమన్యువధము.

ఆవల యోధులందఱు పరాక్రమించి తమతమ విక్ర మముఁ జూపి కాలము ముగిసినవారినెల్లఁ దత్కర్మప్రేరితులై

వధించితి మనుకొనిరి. వారు తొలుతనే కాలముచే వధింపఁబడి యుండ వధింపఁబడనట్లున్నవారలే కర్ణార్జునులును; బోరాడిరి. ఆనాఁటి యుద్ధము గెలుపోటములు నిర్ణయింపఁ దగినయంత కాన్పింప వయ్యెను. మఱునాఁడరుణోదయమున మేల్కాంచి ధనురాచార్యుఁడు పెక్కండ్రు కర్మములు తన్నుఁ బురికొలుప రణభూమికిం జనిపద్మవ్యూహము పన్నెను. దానికిం గారణము ధర్మరాజును బట్టి యిత్తునన్న తనప్రతిన నెఱవేర్పఁ దలంచియే. సంశప్తకు లర్జునుని దూరముగాఁ బిలుచుకొనిపోవునట్టులే ధనురాచార్యుని సమయము. వారట్లే యుద్ధమునకు నర్జునుని బిలిచిరి. శ్రీకృష్ణుఁడు సర్వ మెఱుంగునుగాన నర్జునుఁడచటికిఁ బోవఁ నుంకింప దానును సమ్మతించెను. ఆయొద్దు ఛేదింప నర్జునుఁడు సమర్థుఁడు. ఆతనివెనుకఁ దత్పుత్త్రుఁడు సమర్థుఁడగును. పాండవులు నలువురు దానిం గాంచిరి. దానికిఁ గన్నాకుగా ద్రోణాచార్యుఁడుండుటం దిలకించిరి. ఆతని నోడించుట మొదటికష్టము. లోపలం జొచ్చినఁ దమకు సహాయముచేయువారు రాఁ జాలరనుట రెండవకష్టము. ప్రవేశింపక యున్న నవమాన మనుట పై రెండింటిని మించినకష్టము. ఈసంశయములతోఁ జూచుచుండ ధర్మరాజు దాని ఛేదింప నొరులు సమర్థులు గామి నూహించి దనంజయపుత్త్రునిం బిలిచి దాని ఛేదింపఁ బంచి మేమెల్ల నీవెంటన వత్తుమని చెప్పి పురికొల్పెను. ఆతనిం గృతాంతుఁ డంతకుముందే తత్కర్మప్రేరితుఁ డై పురికొల్పుచునే యున్నందున నాతఁ డామాటల కుబ్బి యట్లేచేసెదనని దాని ఛేదించి లోపలఁ బ్రవేశించెను. వానితోడన ప్రవేశింప నెల్లరుంకించిరిగాని చాపాచార్యప్రభృతు లోపినంతబలము చూపఁగా నప్పునికిం జాల రైరి. నరునితనయుఁడు విక్రమాఢ్యుఁడు

గాన నాయొద్దను జించి చెండాడ సాగెను. కర్ణాదు లాతని కో_ర్తలకు నిలువఁజాలకపోయిరి.

పాండవులు నలువురు సాత్యకియు నాతనికి నెట్టులైనఁ బ్రయత్నించి సాయపడంబోవ నుంకించిరి. ఆసమయమున సైంధవుఁడు వారి కడ్డుపడి నిల్వరించెను. సైంధవుఁడు వారి నిల్వరించు నంత విక్రమశాలి కాఁడు కాని వరప్రభావమున నాదినమున నప్పనికిం జాలెను. దాని నెఱుంగు టుచితము. పాండవు లడవుల నుండ నొకనాఁడు సైంధవుఁ డాదారిఁ బోవుచుండి పాండవు లుండనికాలమున ద్రౌపదిని బట్టికొనిపోవ నంతలోఁ బాండవు లరుదెంచి వెదకుచుం బోయి సైంధవుని బట్టుకొని పరిభవించి పంపిరి. ఆయవమానమునఁ బరితపించి తనతప్పునకుఁ దగుప్రాయశ్చిత్తముఁ జరగెననుకొనక పాండవుల జయించునూహతో మహాదేవునిగూర్చి తపస్సొనరించెను. శివుఁడు ప్రత్యక్షమయ్యెను. పాండవులనెల్ల నేనొక్కఁడన యుద్ధరంగమున నిలువరింపవలయు. ఈవరమనుగ్రహింపుమని వేఁడెను. పరమశివుఁ డాతనిభావమెఱింగి రాఁగలకాలరీతి నాలోచించి యొక్కనాఁడు ధనంజయుం దక్కఁ దక్కినవారి నిలువరింపఁ గలవని వరమొసంగె కావున నావరప్రభావమున నాఁడు ధర్మజవాయుపుత్త్రనకుల సహదేవులను బద్మవ్యూహంబుఁ జొరఁజాలకయుండ నిల్వరింపఁ జాలెను. ఈవిక్రమమేతత్కార్యప్రేరితమై యతని చావునకు మూలకారణమయ్యెను.

పాండవులు సాయపడఁ జాలకయుండిరి. అభిమన్యుఁడు పోరాడి తుదకు మృతినొందెను. ఆవార్త కౌరవులజయజయ నినాదముల నెల్లయెడల వ్యాపించెను. పాండవు లవ్వార్త వినిరి. ధర్మరాజు మిగుల వగచెను. సేన లార్తినొందెను.

ధర్మజునివగ నడఁగింప వేదవ్యాసుఁడు దర్శనమిచ్చి హితముప దేశించెను. ఈఘట్టమునఁ గొందఱు తోఁచినట్లెల్ల వ్యాసముని పాండవపక్షపాతి యని తూలనాడుదురు. వారికింగలకారణ ములలో నొక్కదాని నే తెల్పెదను. అభిమన్యునిచేత దుర్యో ధనతనయుఁ డగులక్ష్మణకుమారుఁడు చచ్చెను. పుత్త్రదుఃఖ మెల్ల రకు సమానమే ధర్మరాజును బుత్త్రదుఃఖము నొందకయుండఁ జేయఁ బోడసూపినవ్యాసముని దుర్యోధనునకుం బొడసూపి హిత ముపదేశింపరాదా. పక్షపాతము దీనఁ గానరా లేదా. ఇదియే యిటుఁ గారణము. ఇట్లాక్షేపించువారు దూరదృష్టిచే విషయము నాలోచింపరు. భగవంతునకును సాధువులకును బ్రీతి ధర్మమునం దుండును. వ్యక్తియందుండదు. ఏవ్యక్తి ధర్మ మార్గము ననుసరింపదో దానియందు వారికిఁ బక్షపాతము కలుగదు. "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృ తాం, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి" అన్నప్రతిజ్ఞ యెల్ల రకు విదితమేకదా. వ్యాసముని దుర్యోధనున కెన్నియోరీతులఁ దొలుత బోధించెను. రాఁగలహాని నెఱిఁగించెను. వాఁడు వినఁ డయ్యెను. ఇఁక లాభము లేదని వదలుకొనియెను. అంతియకాని పాండవపక్షపాతమునఁగాదు. పాండవపక్షపాతి యనఁగా ధర్మ పక్షపాతి యని తాత్పర్యము. అది యుండఁదగినదే. ధృతరా ష్ట్రునియం దామహాత్మున కాదృతి లేకపోలేదు. ఎంతదనుక సాయము చేయఁదగునో యంతయుపకారము చేసియే యున్న వాఁడనుట భారతమును బఠించినవారలకు సువ్యక్తము. ఇఁకఁ దరువాతి విషయమును బఠింతము.

అర్జునుఁడు సంశప్తకులం బొలియించి హతశేషులు పాఱి పోవఁగాఁ దనసేనలప్రక్కకు దృష్టి మరలించెను. ఏదో యొక

యాపద మూఁడినట్లూహించెను. వారిం గాంచఁగనే యర్జు
నునిమోము వెలవెలఁబోయెను. దిగులు తోఁచెను. శ్రీకృష్ణా!
నామనస్సు తల్లడిల్లుచున్న దేమనియడిగెను. శ్రీహరి యేమియు
నెఱుంగనట్లు తత్కాలోచితముగ మాటలాడుచుండెను.
రథము దోలుకొని ధర్మరాజుకడ కిరువు రరుదెంచిరి. ధర్మరాజు
మ్రాన్పడియుండఁ గాంచిరి. విశేషించి యుధిష్ఠిరుఁడు చింతా
క్రాంతుఁడై యుండెను. తనప్రోత్సాహమున నాతఁ డద్దాని
భేదించెననియుఁ దమసాయ మాతనికిం గలుగక దిక్కులేక
చచ్చెననియు ధర్మరాజు తాత్పర్యము. అంతియకాని యాతని
యాయు వాదినముతో సరి యయ్యెననియుఁ దాను నిమిత్త
మాత్రమే యనియు నాతఁ డెఱుంగఁజాలఁ డయ్యెను. సర్వ
ప్రాణుల కిట్టు లుండుట నైజము. అర్జునునిం జూడఁగనే మఱింత
దుఃఖము హెచ్చెను. ఏమని యడిగిన బదు లేమని చెప్పుదునా
యని యాతనియాశయము. అంతియకాక మృదుమానసుఁడు.
నాగారాబుబిడ్డ నెట్లు పంపితివయ్యా యనివిజయుఁ డడిగిన బదు
లేమి చెప్పఁగలను?అనువిచార మాతనిని బాధించుచుండెను.ఆరీ
తిగానే యర్జునుఁ డన్నతో మీరింత చింతనొందఁ గారణమేమో
తెలియకున్నది. పద్మవ్యూహమును భేదింపు మని నాకొడుకును
బంపలేదు గదా.యనియే ప్రశ్నించెను.పలుభంగులఁ గొడుకుం
బొగడి యాతఁడు మృతినొందెనా యనియే యడిగెను.
"సందేహపదేషు వస్తుషు ప్రమాణమంతఃకరణప్రవృత్తయః"
అన్నసూక్తి యథార్థ మేల కాకపోవును? యుధిష్ఠిరుఁడు
దాఁపక పూసగ్రుచ్చినట్లు జరగినదంతయుఁ దెలిపెను. సైంధవుఁ
డడ్డపడుటచేతఁ దమసాయ మాతనికిం గలుగమిఁ జచ్చెనని
యర్జునుఁ డెఱుంగునట్లు పల్కెను. ఆమాట విన్నయంతనే

యర్జునునాగ్రహ మాసైంధవునిపైకి వ్యాపించెను. ద్రోణాదు లందఱిద్దానికిఁ గారణభూతు లైయున్నవారని యాలోచింపఁ డయ్యెను. పద్మవ్యూహమును బన్నినది ధనురాచార్యుఁడు. మొననిలిచినది యాతఁడే. తనకొడుకుం జంపినది ద్రోణుఁడే యైయుండునని యించుకయు నాలోచింపఁ డయ్యెను. ఏల? అనియడుగుదురేమో కారణము వినుఁడు.

ఆమఱుదినము పెక్కండ్రు మృతినొందువారు గలరు. దానికొక్క హేతువు కావలయును. మృత్యువు వక్త్రబిలము విస్తృతముగావించి యందఱ మ్రింగఁ బ్రయత్నించుచున్నది. నిమిత్తము కావలయును. సైంధవున కాయువు మూడినది. కర్మము ననుసరించి పెక్కండ్ర కతఁడు మృత్యువును గల్పింపఁ జాలును. వానిమూలమునఁ జావఁదగినకర్మము నొనరించిన వారు బహుసంఖ్యాకులు గలరని దీనిసారము ఈవిషయమే గీతాశాస్త్రమునందు "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అని శ్రీహరి వక్కాణించెను. భారతరణమున కర్జునుఁ డెట్లు మృత్యురూపుఁ డగుభగవంతున కెట్లు నిమిత్తమాత్రమో సైంధవుఁ డామఱుదినము యుద్ధమునకు నిమిత్తమాత్రమే యని మన మూహింపవలయును. కావున నర్జునునిమనస్సున సైంధవుఁడే దీనికి మూలమని యూహింపఁజాలుమార్గము గలిగెను. అద్దానిని గల్గించిన భగవంతుఁ డాతనిప్రక్కననే యుండి తనలోఁ దాను నవ్వుకొనుచుండెను. ఆనవ్వు చింతించుచున్న యట్లే యుతరులకుం దోఁచును జూఁడీ! గీతోపదేశము నించుకంతయు స్మరింపక యర్జునుఁడే తానే కర్తననుకొని క్రోధావేశమున నొడలెఱుంగక యెల్లవారును వినుఁడీ యని సంబోధించి శ్రీహరిని ధర్మరాజును బ్రదికింపుమని వేఁడుకొనినఁ దప్ప

సైంధవుని రేపు సూర్యుఁ డస్తమింపక మునుపే వధించె దను. అట్లు చేయలేనైతినేని గాండీవముతోఁడ ననలునిం జొత్తును అని ఘోరప్రతిజ్ఞ చేసెను. మహాశయులారా! భగవంతుఁడే గీతాశాస్త్రము నుపదేశించెను గదా. అత్తరుణమున నర్జునునిమనస్సున గీతోపదేశసహస్రాంశఫలము గలిగినదా కలుగలేదు. తమతమకర్మము ప్రేరేపింప నెల్లరు మృత్యువక్త్రమును జొచ్చుచున్నయట్లు తాను జూచియుఁ దనకుఁ గర్తృత్వము లేదని యెఱింగియు నాయుపదేశమును మఱచి తానే కర్తనని గర్వించి ప్రతిన చేసెను. ఆప్రతిన విని శ్రీహరి నవ్వకుండునా? దీనింబట్టి యాలోచింపఁగాఁ గర్మము బలవత్తమమని సిద్ధాంతము చేసికొనక తప్పదుగదా.

ఆప్రతినతో నెల్లర దుఃఖము మాసెను. దుఃఖమునకు బదులు పౌరుషము మదుల నెలకొనియెను. క్షణకాలమున నెట్టి మార్పు కర్మముకలిగించెనో చూచితిరా. ఏమియుఁ దోఁపక యున్న పాండవుల కాదుఃఖము మఱపునకు వచ్చుటయే గాక రేపెట్లు పరాక్రమింపవలయునా యన్నయుత్సాహము ప్రబలెను. కర్తవ్యమాలోచించుచుండిరి. ఆప్రతిన గూఢచారుల మూలమున సైంధవునికర్ణవివరములఁ జొచ్చెను. అతఁ డులికి పడెను. ఇదియేమియందఱుండగా నర్జునునిక్రోధము నాపై వ్యాపించెను? హేతువేమి? అతనిప్రతిజ్ఞ వ్యర్థము కాదు. కావునఁ దొలఁగిపోవుట న్యాయము. యుద్ధరంగమున నుండకయున్న నాతఁడు పలాయితుం డని వధింపఁడు. యుద్ధరంగమున నున్న నన్ను వదలఁడు. ఇఁక నేల యాలస్యము చేయవలయును? అని చింతించి దుర్యోధనునికడ కరిగి యావార్త నెఱింగించి కొలువున నున్నవారలు వినుచుండఁగా సెలవడిగెను. పదివేలు వచ్చెనను

కొందును. త్వరగా సెలవిండు. బ్రదికియుండిన శుభములు
పడయవచ్చు నన్నమాట యున్నదియే కదా. మీకెల్లరకు శుభ
ము గలుగుంగాక ద్రోణకర్ణాదులు పెక్కండ్రు కలరు. యము
నినోటం బడువానినైన విడిపింపఁగలరు. నీ కభయమిచ్చిన
నుండుదు. లేకున్న నిపుడే యెందైనఁ బోయెదను. అని సైంధ
వుం డార్తుండై పెదవులు దడుపుకొనుచు నభ్యర్థింప విని
దుర్యోధనుండు సాపేక్షపరుండుగావున సింధురాజా! ఏల యిట్టు
లార్తినొందెదవు? మహావీరులు గలుగ వెఱవఁ జనునా? వీరి
సాయము కలుగఁగా నిన్నుఁ దేఱిచూచువాఁ డీలోకమున
నొక్కఁ డుండునా నీవు సత్కులప్రసూతుఁడవు రాజధర్మము
నెఱుంగుదువు నీ విట్లు పలుకుట న్యాయము కాదని హెచ్చ
రించెను. కాలము పురికొలుపుచున్నందున నంతకుముందున్న
భయ మాతనియొద్ద సెలవు గైకొనియెను. కావున దుర్యోధ
నునిమాటలయం దాతనికి విశ్వాసము కలిగెను. వెంటనే యాత
నింగూడి ధనురాచార్యునిసాలికిం బోయి నమస్కరించి వృత్తాం
తంబాతయుఁ దెలిపెను. అంతియకాక శస్త్రాస్త్రవిద్యయం దర్జు
నునకు నాకుం గలతారతమ్య మేమేనుండిన నెఱిఁగింపుమని
వేడెను.

ఆమాటలు విని ధనుర్గురుఁడు యోజించి సింధురాజా!
మీయిరువురకు నాచార్యకత్వము సమానమే కాని యర్జు
నుఁడు కడుశ్రమముల కోర్చి తపోనిష్ఠ సలిపి దివ్యాస్త్రములఁ
బెక్కింటిని సాధించెను. కాన వానిగెల్వ నీకుఁ దరంబు
కాదు ఆమాట యటుండనిమ్ము. నేనుండఁగా నీవేల భీతిల్లె
దవు! నాబాహువులచాటున నున్న నిన్నుఁ గన్నెత్తి యర్జునుఁడు
కాఁడింద్రాదులైనఁ జూడఁగలరే. రేపు విజయునకభేద్యంబగు

మహావ్యూహంబొక్కండు పన్నెదను. నీవు ధర్మమార్గము నూని వృద్ధాచారముం బాటించి భయంబూనక యుండుము. సైంధవా! వేదశాస్త్రములను బఠించి యజ్ఞముల నొనరించి లోకవృత్తము నెఱింగి పేరుం గాంచితివి. చావన్న నిటు భయంపడ నేల? సకలభోగముల ననుభవించితివికదా? ప్రాణికెల్లం జావు నిక్కము. దాని మీఱరాదు. ఈకౌరవులు పాండవులు యాదవులు నీవునేను బరలోకమున కరుగ సిద్ధముగా నున్నారము. ఇది నీవెఱుంగనిది కాదు. ఉత్తమమార్గము నరయు టుచితము. శస్త్రమరణము రాజులకు నుత్తమము కదా. దైవముపంచినట్లు పోవుటొప్పు. భీతిల్లక సుఖముండుము. పొమ్మని వీడుకొల్ప నతఁడు నిర్భయుఁడై తనశిబిరమునకుఁ బోయెను.

సాధుమతులారా! కర్మ మెంత బలిష్ఠమో కనుఁగొంటిరి కదా. "గహనా కర్మణో గతిః" అన్నగీతోక్తి యెంతయుక్తముగ నున్నదో పరికింపుఁడు.

శ్లో. "స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్.
ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అన్న శ్రీకృష్ణోపదేశ మెట్లనుభవమునకు వచ్చుచున్నదో కనుఁగొనుఁడు. సైంధవునికర్మ మర్జునునిఁ బురికొల్పి ప్రతిన చేయునట్లు చేసెను. అంతట వదలినదా? లేదు. ద్రోణాచార్యుని దుర్యోధనుని బురికొల్పెను. సైంధవుని బోవనీయకుండులాగున వారిచేఁ బల్కించెను. సైంధవునిమదిలో భయమును గల్గించినకర్మమే మరల నాతనికి ధైర్యము కలిగించెను. అనాఁ డెందఱు

మృతినొందవలయునో వారి నెల్లఁ బౌరుషమునఁ బోరాడఁ బ్రోత్సహించెను. ఔరా! బొమ్మలవలె నెల్లవారి నాడించునది కర్మ మనకతప్పునా! ద్రోణుఁడర్జునుని శక్తినెఱింగియునాసాయము గలనిన్ను సురాసురులు తేఱిపాఱఁ జూడఁగలరా యని పలికెను. అర్జునుఁడు లేనితావున ధర్మరాజును బట్టియిత్తునన్న ద్రోణుఁడే యర్జునుఁ డేమిచేయఁగలఁ డనియె. ఎందుచేత? కర్మ ప్రోత్సాహముచేత? వేఱుకారణము గలుగునన నవకాశము కలదా? లేనే లేదు. దీనింబట్టి చూడ "నేను గర్తను." అనువాని యంతటిమూర్ఖుఁ డింక నొకఁ డుండునా. కెడనక తప్పునా. ఇందఱి నిన్నివిధములఁ ద్రిప్పుచుఁ దనపనిని దానొనరించుచు నితరులకుఁ జూడ నిజము విచారింప సాక్షిమాత్రుఁడుగా నుండు నట్టిపరాత్పరుఁడు సర్వనియంత యాపార్థసారథి శరణ్యుఁడని నమ్మి భజించినఁగాని భవబంధములు తెగవు. అనుటొక్కటియే మనము నేర్చుకొనవలయును. మనశక్తివలనఁ దరింతుమని ప్రయత్నింపరాదు. అశక్తులమగుమమ్మెటులైన నుద్ధరింపుమా యని వేఁడుకొనవలయును. వేఱొక్కమార్గమునఁ గర్మమును మీఱఁజాలము. అది బలవత్తమము. భగవచ్ఛరణులగు వారి నదియే కాపాడును. ఏలయనఁగా నదియు బ్రహ్మస్వరూపమే కదా. కావునఁ గర్మము బలవత్తరమని నమ్మి దానిని భగవత్స్వరూపమని భావించి దానిని విధివిహితముగా నొనరించుచు దానిఫలమును గోరక దానినారాధించి కృతకృత్యులము గావలయును. ఇఁకఁ దరువాతికథకుఁ బోవుదము.

ఆరాత్రి తొలిజామున శ్రీకృష్ణార్జునులు సంభాషించుచుఁ బ్రతిజ్ఞానిర్వహణపద్ధతి యాలోచించిరి. సుభద్రనూఱ

డించి శ్రీహరి దారుకునితోఁ బ్రసంగించి కొంతసేపు శిబిరమును
నుండి కాఁగలకార్యము నాలోచించుచుండెను. అర్జునుండు
విషణ్ణుండై మహాకార్యం బెట్లు సాగునో యనుచింతం బూని
భూమిపై శయనించి తదేకాగ్రహృదయుండై యుండెను.
ఆకార్యము సులభసాధ్యము కాదని శ్రీహరి యెఱుఁగును.
అర్జునుఁడు కూడఁ బ్రతినచేసినపు డొడలెఱుంగక యేమో
పలికెనుగాని పిదప నది భగవత్సహాయమునఁ గాని నెఱవేఱ
దని నిశ్చయించుకొనియెను. భగవంతుఁ డగు శ్రీకృష్ణుఁడు సమ
యము వేచియుండెను.

### శ్రీకృష్ణార్జునులు స్వప్నమునఁ గైలాసమున కరుగుట.

అర్జునుఁడు భూమిని శయనింప నిద్ర యాతనిఁ గర్తృప్రేరి
తమై యాక్రమించెను. అంతలోఁ గలవచ్చెను. కమలాక్షుఁ
డంతఁ బ్రత్యక్ష మయ్యెను. ధనంజయుఁ డుచితరీతి సపర్య
లొనరించి విషణ్ణవదనుండై యుండ నాతనికి వాసుదేవుం
డిట్లు బోధించెను. ధనంజయా! సర్వభూతముల బంధించునది
కాలము అది యలంఘనీయము. కష్టసుఖములఁ గలిగించు
నదియు నదియే. కావున శోకములఁ బొందరాదు. అది కార్య
నాశము. నీ విపుడు దుఃఖింపఁ గారణం బేమి? నావిని యర్జునుం
డిట్లనియె. మహాత్మా! బాలఘ్నుఁ డగు సింధురాజుం జంపుదునని
ప్రతిజ్ఞ యొనరించితిని గదా. దాని విని కౌరవులు సర్వసేనలం
బురికొలిపి యొక వ్యూహము పన్ని సైంధవుని బృష్ఠభాగమునఁ
బెట్టి పోరాడ నూహించినట్లు తెలిసెను. ప్రొద్దుగ్రుంకిన నేను
నస్తమింతును. ఈ యాపద యెట్లు తరింతునా యని చింతించు
చున్నవాఁడ ననియెను.

శ్రీహరియు నతనిశోకకారణం బెఱింగి జలముల స్పృశించి తూర్పుమోముచేసి కూరుచుండి *విజయా! పాశుపతాస్త్ర ముండినచో నొక్కక్షణకాలమున దాన సైంధవుని వధింపఁజాలుదువు. నీవందులకై యావృషభధ్వజుని భజింపుము. తత్ప్రసాదపాత్రుఁడ వగుదువు. అనఁగా నాతఁడు త్వరపడి యాచమనముచేసి మహాదేవుని మనస్సున ధ్యానించెను. భక్తి యుత్తరుణేందుశేఖరునిపైఁ గుదిరెను. అంతఁ దనహస్తము బట్టుకొని పుండరీకాక్షుఁడు రాఁగా నతఁ డంబరవీథి నుత్తరమార్గమున వాయుగమనంబునం బోయి హిమాలయాదిపర్వతములెల్ల దాఁటి కైలాసమునకుం బోయి యందుఁ బరమేశ్వరుం గాంచెను. సాష్టాంగనమస్కారములాచరించి వివిధవినుతులఁ బొగడెను. శరణము వేఁడెను. మహాదేవుఁడు నరనారాయణులం జూచి ప్రసన్నహృదయుఁడై మందహాస మొనరించుచు స్వాగతం బడిగి మీరాకకుం గతం బేమి? ఎఱిఁగింపుఁడు. మీకుఁ బ్రసన్నుఁడ నైతిని†అనుటయు వారిరువురు మరల నమస్కరించి యనేకభంగుల సంస్తుతించిరి. మహాదేవుఁడు కడుఁ

---

*పార్థ పాశుపతం నామ పరమాస్త్రం సనాతనం, యేన సర్వాన్ మృధే దైత్యాన్ జఘ్నే దేవో మహేశ్వరః. ౧౯. యది తద్విదితం తేఽద్య శ్వో హంతాసి జయద్రథమ్, అథాజ్ఞాతం ప్రపద్యస్వ మనసా వృషభధ్వజం. ౨౦. తం దేవం మనసా ధ్యాత్వా జోషమాస్స్వ ధనంజయ, తతస్తస్య ప్రసాదాత్త్వం భక్తః ప్రాప్స్యసి తన్మహత్. ౨౧. ద్రోణపర్వము. ౮౦ అధ్యా.

కృష్ణార్జునకృతశివస్తుతిః.

†భక్త్యా స్తవేన దివ్యేన మహాత్మానమనిందితౌ, నమో భవాయ శర్వాయ రుద్రాయ వరదాయ చ. ౫౫. పశూనాంపతయే నిత్యముగ్రాయ

ప్రసన్నుఁ డయ్యెను. నరనారాయణులారా! మీమనోవాంఛి తము నెఱింగితిని. దాని నొసంగెదను. తొల్లి నేను వెక్కండ్ర రక్కసులం ద్రుంచి యాపాశుపతాస్త్రము ధనుస్సు నిచ్చటికిఁ జెంతనే యుండునమృతమయసరస్సున నునిచితిని. మీరు దానిం గొనిరండు. అని సెలవీయఁగనే వారిరువురు పార్షదులం గూడి యరిగి తత్సరోవరోదకంబుల సూర్యమండలమువలె వెలుంగుచు వేయిఫణంబుల నగ్నిజ్వాలలం గ్రక్కుచున్నయుగ్ర పన్నగవర్యంబుల రెండింటిని దర్శించి యాచమనము చేసి వేద వేత్తలు గావున దోసిలు లొగ్గి శతరుద్రీయమున నుపస్థానంబు చెప్పినంతనే దానిమహత్త్వమున సర్పరూపంబు వదలి ధను

---

చ కపర్దినే, మహాదేవాయ భీమాయ త్ర్యంబకాయ చ శాంతయే. ౫౬. ఈశానాయ మఖఘ్నాయ నమోస్త్వంధకఘాతినే, కుమారగురవే తుభ్యం నీలగ్రీవాయ వేధసే. ౫౭. పినాకినే హవిష్యాయ సత్యాయ విభవే సదా, విలోహితాయ ధూమ్రాయ నిత్యాయ నపరాజితే. ౫౮. నిత్యం నీలశిఖండాయ శూలినే దివ్యచక్షుషే, హోత్రే పోత్రే త్రినేత్రాయ వ్యాధాయ వసురేతసే. ౫౯. అచింత్యాయాంబికాభర్త్రే సర్వదేవస్తుతాయచ, వృష ధ్వజాయ ముండాయ జటినే బ్రహ్మచారిణే. ౬౦. తప్యమానాయ సలిలే బ్రహ్మణ్యాయాజితాయ చ. విశ్వాత్మనే విశ్వసృజే విశ్వమావృత్య తిష్ఠతే. ౬౧. నమోనమస్తే సేవ్యాయ భూతానాం ప్రభవే సదా, బ్రహ్మవక్త్రాయ సర్వాయ శంకరాయ శివాయ చ. ౬౨. నమోస్తు వాచాంపతయే ప్రజా నాం పతయేనమః, నమో విశ్వస్య పతయే మహతాం పతయే నమః. ౬౩. నమస్సహస్రశిరసే సహస్రభుజమన్యవే, సహస్రనేత్రపాదాయ నమో సంఖ్యేయకర్మణే. ౬౪. నమో హిరణ్యవర్ణాయ హిరణ్యకవచాయ చ, భక్తానుకంపినే నిత్యం సిధ్యతాం నో వరః ప్రభో. ౬౫. ద్రోణపర్వము. ౮౦. అధ్యా.

ర్బాణంబులుగఁ గనఁబడియెను. భక్తిభావంబున వానిం గొని తెచ్చి మహాదేవునిచెంత నునిచిరి. వెంటనే నీలలోహితుఁ డొక బ్రహ్మచారి వచ్చి ధనుస్సును సజ్యముచేసి నారి సారించి బాణము సంధించి చూపినం గని యర్జునుఁడు మౌర్వీముష్టిస్థాన లక్ష్యంబులం దెలిసికొని శంకరప్రోక్తమంత్రంబుతోడ నాకో దండంబు గైకొని శరసంధానపద్ధతి యలవాటుచేసికొని యీశ్వరానుమతి నెప్పటిచందంబున నాసరోవరంబునం బెట్టి వచ్చి యామహాదేవునివలనఁ బూర్వమరణ్యమునఁ దాను గ్రహిం చిన పాశుపతంబు మరలం గ్రహించి కృతార్థుఁడై శివానుమ తిం గొని శ్రీకృష్ణుండు తానును శిబిరంబులను జేరిరి. ఇట్లర్జు నుండు కలంగాంచెను శ్రీకృష్ణుండు దారుకునితో మాటలాడు చునే యుండఁగాఁ బ్రభాతం బయ్యెను.

మహామనీషులారా ! పాశుపతాస్త్రలాభవిషయమున నించుక వ్రాయవలయును. శ్రీకృష్ణమూర్తి యాయాపత్కాల మున శంకరునికడకు బిలుచుకొనిపోయి పాశుపతం బీయనేల ? అనున దొకప్రశ్నముకదా. దీనికి సమాధానమునువినుఁడు.చక్ర మీయక పాశుపత మేల యిప్పింపవలయు ననుశంక కలుగక మానదుకదా. చక్రమున నున్నశక్తికంటెఁ బాశుపతమున కధిక శక్తికలదా యన్నప్రశ్న మొకటిఁడుకలదు. కాని ఈప్రశ్నముల నొనరించువారూహించినచో సమాధానముతోఁపకపోదు. సైం ధవుఁడు స్వకర్మవశమున నర్జుననిచేఁ జావవలసినవాఁడయ్యెను. ఈతనితండ్రి తనకొడుకుమూలమునఁ జావవలసినవాఁడు. ఎవ్వని మూలమున నేసాధనమున నేచోట మృతినొందవలయునని విధి కర్మానుసారము వ్రాసెనో యాతీరున నయ్యది సాగవలయును. ఈవిషయము సర్వజ్ఞుఁడగు శ్రీకృష్ణమూర్తియెఱుంగును. కావునఁ

దనయుపాస్యదైవ మగుశంకరునికడకుం బిల్చుకొనిపోయెను. శంకరుఁడు హరిభక్తుఁడు. హరి శంకరభక్తుఁడు. అనఁగా నిరువు రొక్కటతత్త్వమే. భక్తానుగ్రహార్థ మిట్లు రూపభేదములం దాల్చిరి. కనుక శ్రీహరి యర్జునునిస్వప్నమునఁ గైలాసమునకుం బిలుచుకొనిపోయెను. శంకరుఁడు వారిరాక నెఱింగి వారి కా పాశుపత మొసంగిపంపెను. దీనింబట్టిగూడ హరిహరుల కుండు మైత్రియు నేకత్వము నెఱుంగుట మంచిది. ఈకథను గొందఱు కల్పితమందురు. వారు వీరవైష్ణవు లనఁబడుదురు. భాగవత మునఁగల భస్మాసురకథ కల్పితమని మఱికొందఱందురు. వారు వీరశైవులు. ఈయిరుదెగలవారినే సమత్వబుద్ధిగలవారు పాషండు లందురు.

"మద్భక్తాశ్శంకరద్వేషీ మద్వేషీ శంకరప్రియః
తా వుభౌ నరకం యాతో యావచ్చంద్ర దివాకరౌ."

అన్నప్రాచీనోక్తి యుండెడిగదా. ఇట్టి వెన్నియేని కల్పింప వచ్చును. కాని యీప్రమాణముల కేమికాని సర్వపురాణముల బరిశీలింప హరిహరు లొక్కరే యని స్పష్టము కాకమానదు. పాశుపతాస్త్రము దొరకినపిదప నర్జునుఁడు తన ప్రతిన నెఱవేఱి నట్లే భావించెను మఱునాఁ డుదయము యుద్ధారంభమయ్యెను. ద్రోణాచార్యుఁడు స్వోక్తివ్యాఘాతముకాకయుండ నద్భుత వ్యూహముపన్ని సైంధవునిఁ బృష్ఠభాగమున నునిచి తాను మొన నిలిచెను. అర్జునుఁడు గురుభక్తిపరాయణుఁడుగాన, గురు ననుజ్ఞవేఁడి గొట్లో తప్పించుకొనిపోయి పెక్కండ్రందు నిమిత్తము విక్రమింపఁ బోలియుంచి హరి రవిబింబమునకుఁ జక్రము నడ్డుపెట్టి నది యస్తమయ మనుకొని సైంధవుఁడు తల చూపఁగా నర్జునుం డాతనిశిరంబుఁ ద్రుంచి యాశిరమును బాశు

పాతాస్త్రప్రభావమునఁ దండ్రియంకమునఁ బడవైచి యతండు లేవఁగా శీర్షము శకలము లయ్యెను. సైంధవునిమూలమున నెన్నిలక్షలసేనయో పొలిసెను. "నహి కారణం వినా కార్యస్యోత్పత్తిః" యన్నసూక్తి సార్థకమయ్యెను. ఆరాత్రి యుద్ధము సాగెను. పెక్కుండ్రు మడిసిరి.

## ధర్మరాజుసత్యము.

* మఱునాఁడు యథాపూర్వముగ సంగర మారంభమయ్యెను. ద్రోణుం డాదినమునఁ దనపౌరుషము కనఁబఱచెను. పాంచాలవీరు లించుమించుగా నుగిసిరి. మధ్యాహ్నమునకు ద్రోణునిపౌరుషము దుస్సహమయ్యెను. కర్ణాశ్వత్థామాదులు

---

*మతిమాన్ శ్రేయసే యుక్తః కేశవోఽర్జునమబ్రవీత్. ౯. నైష యుద్ధేన సంగ్రామే జేతుం శక్యః కథంచన, స ధనుర్ధన్వినాం శ్రేష్ఠో దేవైరపి సవాసవైః. ౧౦. న్యస్తశస్త్రస్తు సంగ్రామే శక్యో హంతుం భవేన్నృభిః, ఆస్థీయతాం జయే యోగో ధర్మముత్సృజ్య పాండవాః. ౧౧. యథా నస్సంయుగే సర్వాన్న హన్యాద్రుక్మవాహనః, అశ్వత్థామ్ని హతే నైష యుధ్యేదితి మతిర్మమ. ౧౨. తం హతం సంయుగే కశ్చిదస్మై శంసతు మానవః, ఏతన్నారోచయద్రాజన్ కుంతీపుత్రో ధనంజయః. ౧౩. అన్యే త్వరోచయన్ సర్వే కృచ్ఛ్రేణ తు యుధిష్ఠిరః, తతో భీమో మహాబాహురవధీత్స్వే మహాగజం. ౧౪. జఘాన గదయా రాజన్నశ్వత్థామానమిత్యుత, పరప్రమథనం ఘోరం మాలవస్యేంద్రవర్మణః. ౧౫. భీమసేనస్తు సవ్రీడ ఉపేత్య ద్రోణమాహవే, అశ్వత్థామా హత ఇతి శబ్దముచ్చైశ్చకార సః. ౧౬. అశ్వత్థామేతిహి గజః ఖ్యాతో నామ్నా హతోఽభవత్, కృత్వా మనసి తం భీమో మిథ్యావ్యాహృతవాంస్తథా. ౧౭. భీమసేనవచశ్శ్రుత్వా ద్రోణస్తత్పరమాప్రియం, మనసా సన్నగాత్రోఽభూద్యథా సైకతమంభసి. ౧౮. శంకమానస్స తన్మిథ్యా వీర్యజ్ఞస్స్వసుతస్య వై, హతస్స ఇతి చ

విజృంభించి పోరసాగిరి. పాండవసేనయం దొక్కరుండును ద్రోణుని మార్కొనువీరుఁడు కంటి కగపడకుండెను. ధర్మజ భీమాదులు మార్కొన భీతిల్లిరి. ద్రోణుండు మృత్యువు చెలరేఁగినట్లు విజృంభించి పాండవసేనాసముద్రము నింకింపఁ జొచ్చెను. నిశ్చేష్టులై యెల్లవారలుండ శ్రీకృష్ణుండు వారలం జేరంజని *వీరులారా! ధనుర్ధారియగు నీయాచార్యుని మార్కొని నిలువరింప మీకు కాదు. సురేంద్రునకైనం దరంబు గాదు. ఒక్కమందు గలదు. దాన నాతఁ డస్త్రసన్న్యాస మొనరించు. అపు డాతనిం జంపవచ్చు. కొడు కశ్వత్థామ చచ్చెనని నచ్చఁజెప్పిన నాతఁ డాయుధంబుల విడుచు. అర్జునుం డీమాట

---

శ్రుత్వా నైవ స్థైర్యాదకంపత. ౧౯. స లబ్ధ్వా చేతనాం ద్రోణః క్షణేన నైవ సమాశ్వసత్, అనుచింత్యాత్మనః పుత్రమవిషహ్యమరాతిభిః. ౨౦. ద్రో. ౧౯౧. అధ్యాయము.

తతో నిష్పాండవాముర్వీం కరిష్యంతం యుధాంపతిం, ద్రోణం జ్ఞాత్వా ధర్మరాజం గోవిందో వ్యథితోఽబ్రవీత్. ౪౬. యద్యర్ధదివసం ద్రోణో యుధ్యతే మన్యుమాస్థితః, సత్యం బ్రవీమి తే సేనా వినాశం సముపైష్యతి. ౪౭. స భవాంస్త్రాతు నో ద్రోణాత్సత్యాజ్జ్యాయోఽనృతం వచః, అనృతం జీవితస్యార్థే వదన్న స్పృశ్యతే త్వనృతైః. ౪౮. కామినీషు వివాహేషు గవాం భక్తే తథైవ చ, బ్రాహ్మణాభ్యుపపత్తౌ చ అనృతే నాస్తి పాతకం. ౪౯. ద్రోణ ౧౯౧ అధ్యా.

తస్య తద్వచనం శ్రుత్వా కృష్ణవాక్యప్రచోదితః. ౫౫. భావిత్వాచ్చ మహారాజ వక్తుం సముపచక్రమే, తమతథ్యభయే మగ్నో జయే సక్తో యుధిష్ఠిరః. ౫౬. అశ్వత్థామా హత ఇతి శబ్దముచ్చైశ్చకార హ, అవ్యక్తమబ్రవీద్రాజన్ హతః కుంజర ఇత్యుత. ౫౭. అధ్యాయము. ౧౯౧.

కంగీకరించిన ధర్మజుం డంగీకరించును. ఇది యాపద్ధర్మము. అని హిత ముపదేశించెను. అర్జునుం డంగీకరింపకపోయెనుగాని యెట్ట కేల కంగీకరించెను. భీమాదు లంగీకరించిరిగాని ధర్మజుం డంగీకరింపక తుదకెల్లరు ప్రోత్సహింప నెట్లో యంగీకరించెను.

భీమసేనుఁ డంతకుమున్నే మాళవాధిపతి యగునింద్రవర్మ కడనుండు నశ్వత్థామనామకగజమును గదాఘాతమునఁ బొలియించెను. అది యొకహేతువుగా ద్రోణాచార్యుఁడు వినుచుండ నశ్వత్థామ చచ్చెనని గట్టిగాఁ బలికెను. ఆమాట లాలకించిన యాతనిచిత్తము కలవిలపాటొందెను. ఇంచుకతడ వనుమానించి మిథ్యావాక్యగాఁ భావించెను. కాన నధైర్యము నొందఁడయ్యెను. క్షణమాత్రమునఁ గొడుకు శౌర్యము స్ఫురింపఁగా నతఁడు శత్రుదమనుఁడుగాని శత్రుహస్తగతుఁడు కాఁడని నిశ్చయించి యథాపూర్వముగా విక్రమించి చెంతనున్న దృష్టద్యుమ్నుని బెక్కుకాండంబులనో నేసెను. ఆయుద్ధము మహాఘోర మయ్యెను. కాని ధనురాచార్యునినారాచముల నతఁ డోర్వఁజాలక తొలంగవలసినవాఁడయ్యెను. ఆక్రోధముననింకను మిగిలినపాంచాలకుమారుల వారిసేనల మారిమసంగినచందమున నస్త్రగురుం డంతకుచెంత కనిపెను.

## మహర్షులు ద్రోణునకు హితముచెప్పుట.

దృష్టద్యుమ్నాదులు దూరముగాఁ బాఱఁగా నిదియె సమయమని యగ్నిహోత్రపురస్సరులై అత్రిగౌతమవిశ్వామిత్ర వసిష్ఠజమదగ్ని భారద్వాజప్రముఖులగుమహర్షులు నభంబునఁ బొడసూపి భారద్వాజా! వేదముల నేర్చితివి. బ్రాహ్మణకులమునఁ బుట్టితివి. సత్యధర్మమార్గముల నెఱింగితివి. ఇట్టి నీవధర్మముగఁ

క్రోధమూని యుద్ధముచేయ న్యాయమా. ఇంక మాయను మతిం బాటించి యాయుధపరిగ్రహణమును మానుము. విప్రునకుం గ్రూరకర్మముపోలదు. మాసమక్షముననే యాయుధముల వదలి శాశ్వతసుఖకరమగుపదమును గాంచఁబొమ్ము. కాలముకూడ సమీపించుచున్నది. మోసపోకుము. మోహపాశమునకుఁ గట్టుపడకుము. అని పెక్కుభంగులబోధించి యంతర్ధానమునొందిరి.

ద్రోణుఁడు వారిపలుకులం దలంచుకొనుచు భీముని పలుకులు తలంచి ధర్మనందనుం డసత్యమాడఁడు కాన నాతని నడిగెదనని యశ్వత్థామ మృతుండగుట నిజమా. అసత్యమా అని ప్రశ్నించెను. చెంతనున్న శ్రీకృష్ణుఁడు పాండవాగ్రజునిం గాంచి రాజా! నాచెప్పినయట్లు చేయుము ఈవిప్రుం డాగ్రహించియున్నవాఁడు. ఈపూట యూరకుండ మనుకొంటివా మనసేనలో నొక్కరుఁడు మిగులఁడు. ముప్పెల్లఁ గాపాడుమా. సకలవినాశనకాలమందు సత్యమునకంటె నసత్యమే శ్రేష్ఠము. దానఁ బాపము పొసఁగదు. అఖిలజీవితార్థమునందు, స్త్రీలయందు, వివాహములయందు, బ్రాహ్మణులకు గోవులను రక్షణముచేయఁ బూనునపుడు పలుకు నసత్యము పాపఫలము నీఁజాలదు. అని హరి యుక్తిపలికిన వృకోదరుండు నట్లే పలికెను. అన్నిమాటలు విని యసత్యభీతియు జయాశయు మనమునఁ బెనఁగొనుచుండఁగా ధర్మరాజు గట్టిగా నశ్వత్థామ మడిసెననియు మెల్లఁగాఁ గుంజర మనియెను. ధర్మరాజునోట నుండి యావాడిమాట వెడలఁగనే ద్రోణుఁడు మహర్షుల వాక్కులం దలంచి పుత్త్రమరణవార్తాజనితశోకంబున జీవితమందు నిరాశుఁడై యస్త్రసన్న్యాసమొనరించి యోగబలంబున దేహత్యాగ మొనరించెను. ఆదేహమునుండి వెడలినదివ్యతేజ

స్సు సూర్యమండలముచెంత కరుగఁగా నిద్దఱుసూర్యు లున్న ట్లుండెను. ఆదివ్యతేజస్సును ధృతరాష్ట్రా! నేనును నరనారాయణులు ధర్మరాజు కృపాచార్యుఁడును గనుఁగొంటిమి. ఇతరుల కది యదృశ్యమే. కొలఁదినిమేషముల కాతేజస్సు కనఁబడక పోయెను. అతనిశవమును ధృష్టద్యుమ్నుఁడు ఖండించెను. అర్జునుఁడు లోసగువారు వలదనుచున్నను దురాత్ముఁడు గావున నాధృష్టద్యుమ్నుఁ డప్పని గావించెను

## అశ్వత్థామ విక్రమించుట.

ఇట్లు నిర్వక్రపరాక్రమంబునఁ దనతో మార్కొనువీరులే లేక సమరము సాగించి ద్రోణుఁడు బ్రహ్మపదమును బ్రాపింపఁగాఁ గురుబలంబులెల్ల నిరుత్సాహముల మోములు వ్రేలవైచుకొని పరుగిడసాగిరి. ఆవిధ మెఱింగి యశ్వత్థామ యెందో సంగరము చేయుచుండి మరలి సేనలంగాంచి వచ్చి దుర్యోధనుకడ కరిగి హేతువడిగిన నాతండు చెప్పనొల్లక కన్నీరువాఱ నూరకుండెను. ద్రౌణి శారద్వతుం గాంచి యడుగుటయు నాతం డావృత్తాంతంబంతయు నెట్లో యెఱింగించెను. కృపాచార్యుఁ డిట్లు పితృవధప్రకారంబంతయుం దెలుపఁగా విని ద్రోణనందనుండు పట్టరానియాగ్రహంబున దుర్యోధనుంగాంచి యక్కటా! సకలాస్త్రవేత్తయై జగత్పూజ్యుండగుద్రోణుం డొక్కనీచునిచే నిట్టి కుమార్గంబున వధింపఁబడియెఁగదా. సత్యవంతుఁ డనుఖ్యాతినొందిన ధర్మరా జెంత నీచకార్యమున కొడిగట్టెను. యుద్ధరంగమునఁ జచ్చుట బ్రముకాదు. నాతండ్రి క్షణభంగురమగుదేహమును నీడి దివ్యదేహమును దాల్చి స్వర్గమునకుం బోయెను.

దానికై చింతింపను. కాని యొకనీచుఁ డట్టిమహాత్ముని నట్లు
చేయుటకే యార్తిమునింగెదను ఇందఱు వీరులు చూచు
చుండఁగా నేను జీవించియుండఁగా నాతండ్రి నిట్లు నీచుఁ
డొకఁడు తలదునుముటకై యడలెదను. ఇఁక నాప్రాణములు
పోవునంతలో నీనీచుల నందఱ వధించెద. శ్రీకృష్ణుఁడు లోనగు
వారు నన్ను గెలువఁజాలరని నమ్ముము. నారాయణాస్త్రముఁ
బ్రయోగించి వీరినెల్ల భస్మమొనరించెద. అని ప్రతినచేసి
యప్పుడే జలోపస్పర్శనంబుచేసి నారాయణాస్త్రంబును సమంత్ర
కంబుగావించి ప్రయోగించెను. దానిమహత్త్వ మపారము.
అది పాండవసేనల భస్మముచేయ నారంభించెను. శ్రీకృష్ణుఁడు
తత్ప్రభావం బెఱుంగుం గావున నంతకుమున్న ద్రోణాచార్య
వధకై పరితపించుచు ధృష్టద్యుమ్నుని దూఱుచు నాతండు
బదులిడ నాగ్రహించుచున్న పాండవులం గాంచి యెల్లరు నా
యుధంబులవిడిచి వాహనంబులడిగి నమస్కరింపుఁడనియె. ఎల్ల
వారు నట్లే చేసిరి. భీముఁ డమ్మాటల కియ్యకొనక మొఱకుఁ
దనంబు చూప నరనారాయణు లాతని కాయస్త్రప్రభావంబు
తెలిపి యెట్లో దిగునట్లు చేసిరి. ఆయస్త్ర మంత శాంతించెను.

దుర్యోధనుం డాదివ్యాస్త్రంబును మరలఁ బ్రయోగిం
పుమనుటయు నది పునః ప్రయోగంబున కర్హంబుగాదని యుపేక్షిం
గించి పాంచాలవీరులం దాఁకి చిందఱవందఱచేయుటయు
భీమాదులు మార్కొని యోడిపాఱుటయు నర్జునుండు
మార్కొని పోరాడెను. అంత నశ్వత్థామ యాగ్నేయా
స్త్రంబు సంధించి ప్రయోగించెను. తత్ప్రభావమున నొక్కక్షణ
కాలమున నక్షౌహిణీసేన భస్మంబయ్యెను. అర్జునుండు సర్వా
స్త్రముల నడంపంజాలు బ్రహ్మాస్త్రమును బ్రయోగించి యాగ్నే

యాస్త్రమును శాంతి నొందఁజేసెను. అశ్వత్థామ యా యస్త్ర రాజంబులవలనఁ గృష్ణార్జును లేకీడును బొరయకుండుటకు ఖేద పడి యీయస్త్రంబులు గాల్పనే యని విల్లు పాఱవైచి పోవు చుండఁగా వ్యాసముని సాక్షాత్కరించెను. ద్రౌణి నమస్క రించి మునీంద్రా! ఆగ్నేయాద్యస్త్రంబు లేలొకో కృష్ణార్జునుల దహింపఁజాలవయ్యెను. నాయపచార మేమికలదో తెలియఁ జాలకున్నాఁడను. అనుటయు నామునివర్యుండు ద్రోణనందనా! నామాట లాలకింపుము *విష్ణువు ధర్మునిపుత్త్రుఁడై పుట్టెను. హిమ గిరిశిఖరమున నూర్ధ్వబాహుఁడై వాయుభక్షణంబుచేయుచు నఱువదియాఱువేలవత్సరములు శంకరుంగుఱించి తపస్సుచేసె ను. ఆతపస్సున కలరి శంకరుఁడు ప్రత్యక్షమయ్యెను. శివుంగాంచి నారాయణుండు సాష్టాంగనమస్కారము లాచరించి బహు విధంబుల వినుతించెను. నాకు వరము లొసగుమా యని ప్రార్థిం

---

నారాయణకృతశివస్తుతిః.

*పద్మాక్షస్తం విరూపాక్షమభితుష్టావ భక్తిమాన్. నారాయణః. త్వత్సంభూతా భూతకృతో వరేణ్య గోప్తారోఽస్య భువనస్యాదిదేవ, ఆవి శ్యేమాంధరణీం యేఽభ్యరక్షన్ పురా పురాణీ తవ దేవ సృష్టిః. ౬౧. సురాసురాన్నాగరక్షఃపిశాచాన్నరాన్ సుపర్ణానథ గంధర్వయక్షాన్, పృథ గ్విధాన్ భూతసంఘాన్ సవిశ్వాంస్త్వత్సంభూతాన్ విద్ధి సర్వాంస్తథైవ. ౬౨. ఐంద్రం యామ్యం వారుణం వైత్తపాల్యం మైత్రం త్వాష్ట్రం కర్మ సౌమ్యం చ తుభ్యం రూపం జ్యోతిశ్శబ్ద ఆకాశవాయూస్పర్శం దివ్యం సలిలం గంధ ఉర్వీ. ౬౩. కాలో బ్రహ్మ బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ త్వత్సం భూతం స్థాస్నుచరిష్ణు చేదం, అద్భ్యస్తోకా యాంతి యథా పృథక్త్వం తాభిశ్చైక్యం సంక్షయే యాంతి భూయః. ౬౪. ఏవం విద్వాన్ ప్రభవం చాప్యయం చ మత్వా భూతానాం తవ సాయుజ్యమేతి, దివ్యా వృత్తా

చెను. ఆప్రార్థనను నంగీకరించి సదాశివుఁడు నారాయణా! నాయనుగ్రహమున నీవు దేవగంధర్వాదుల కజేయుఁడవుకమ్ము ఎట్టియస్త్రశస్త్రములు నిన్ను నొంపఁజాలవు. చరాచరప్రపంచమునందు నీకు శ్రమ మించుకంతయుఁ గలుగదు. యుద్ధమున నన్ను మార్కొనినను గెల్వఁగలవు. అని వరము లొసంగెను. ఆనారాయణుఁడే యీకృష్ణుఁడని నమ్ముము. ఆతనిసఖుఁడే నరుఁడు. వారలిద్దఱు లోకయాత్రార్థము తమతపోమహిమంబునఁ బ్రతియుగంబునం బుట్టుచుందురు ఈయుగమున శ్రీకృష్ణార్జునులై పుట్టిరి. నీవుకూడ భవదీయతపఃప్రభావము చేతఁ దేజోమన్యువులను రెండింటిం దాల్చి రుద్రాంశసంభూతుఁడవైతివి. అశ్వత్థామాచార్యా! నీవు ప్రపంచమెల్ల నీశ్వరమయమ్మని పార్థివలింగమును గ్రహించి నిశ్చలభక్తి శంకరుం బూజించితివి. తొలి పుట్టువున నీచేసిన యాపూజను మెచ్చి శంకరుఁడు పావనతరవరముల నీకొసంగెను తత్ప్రభావవశతనే జన్మకర్మములు నీకుఁగల్గెను. సకలస్వరూపుఁ డభవుఁడని యెఱ

---

మానసౌ ద్వౌ సుపర్ణౌ వాచాశాఖాః పిప్పలాస్సప్తగోపాః. ౭౯. దశ చాన్యే యే పురం ధారయంతి త్వయా సృష్టాస్త్వం హి తేభ్యః పరశ్చ, భూతం భవ్యం భవితా చాప్రధృష్య త్వత్సంభూతా భువనాని హి విశ్వా. ౮౦. భక్తం చ మాం భజమానం భజస్వ మారీరిషోమహితా హితేన, ఆత్మానం త్వామాత్మనా నన్యబోధం విద్వానేవం గచ్ఛతి బ్రహ్మశుక్రం. ౮౧. అస్తౌషం త్వాం తవ సన్మానమిచ్ఛన్ విచిన్వన్ వై సదృశం దేవవర్య, సుదుర్లభాన్ దేహి వరాన్ మమేష్టాన్ నభిష్టుతః ప్రవ్యకార్షీశ్చ మాయాం. ౮౨. ద్రోణపర్వణి. ౨౦౨ అధ్యాయః.

శ్రీభగవాన్. మత్ప్రసాదాన్మనుష్యేషు దేవగంధర్వయోనిషు, అప్రమేయబలాత్మా త్వం నారాయణ భవిష్యసి. న చ త్వాం ప్రసహిష్యంతి

లంకుఁడగుననియు నరనారాయణులు సద్భక్తింగొల్చి లింగార్చకులైరి. ఆకారణమున వారు నీకంటె నధికులైరి. ప్రతిమార్చన మొనరించుటకంటె భావార్చనము శ్రేష్ఠము. కావున నాశితిగళుఁ డాయిరువుర నెక్కుడుగఁ బ్రేమించెను. ఇదియ యిందలి సత్యము. అని పరాశరాత్మజుం డెఱిఁగించిన నాపరమ శివభక్తుఁడు పులకితగాత్రుఁడై శంకరునిహృదయఫలకమునం దలంచి నమస్కారమొనరించి శ్రీకృష్ణుని బహూకరించి పారాశర్యునకు వందనం బాచరించెను. వ్యాసమునియు నంతర్ధానము నందెను. ద్రోణపుత్త్రుండు మరలి రణరంగంబున కరుదెంచెను. సాయంకాలమగుటచే యుద్ధము చాలింపఁబడియె. ఎవరిశిబిరములకు వార లరిగిరి.

మహామతులారా! ఈభాగమునుగూర్చి నాలుగుమాటలు వ్రాసెదను. ద్రోణుఁడు తనప్రతాపము తీవ్రతమమగునట్లు చేయఁ బాండవులును దద్బలంబులు భీతినొందవలసివచ్చెను. శ్రీహరి యాతనిమృతికాలము సమీపించు టెఱింగి ధర్మరాజు

---

దేవాసురమహోరగాః, న పిశాచా న గంధర్వా న నరా న చ రాక్షసాః. ౧౫. న సుపర్ణాస్తథా నాగాః న చ విశ్వే వియోనిజాః, న కశ్చిత్త్వాం చ దేవోఽపి సమరేషు విజేష్యతి. ౧౬. న శస్త్రేణ న వజ్రేణ నాగ్నినా న చ వాయునా, న చార్ద్రేణ న శుష్కేణ చరేణ స్థావరేణ చ. ౧౭. కశ్చిత్తవ రుజం కర్తా మత్ప్రసాదాత్కథంచన, అపి చేత్సమరం గత్వా భవిష్యసి మమాధికః. ౧౮. ఏవమేతే పురా లబ్ధా వరా వై విద్ధి శౌరిణా, స ఏవ దేవశ్చరతి మాయయా మోహయన్ జగత్. ౧౯. తస్యైవ తపసో జాతం నరం నామ మహామునిం, తుల్యమేతేన దేవేన త్వం జానీహ్యర్జునం సదా. ౨౦. తావేతౌ పూర్వదేవానాం పరమౌ ప్రథితావృషీ, లోకయాత్రావిధానార్థం సంజాయేతే యుగేయుగే. ౨౧.

లోనగువారిం బ్రోత్సహించెను. ఒక్కయబద్ధము చెప్పినఁగాని యాతఁడీల్గఁడనియు వేఱుపాయము లేదనియుం దెల్పెను. తుద కెట్టిన నేమి ధర్మరాజుకూడ నబద్ధముపలికి తనమనస్తృప్తికొఱకు "కుంజరః" అనియెను ఈమాట వినంబడక యాతఁడు తనకొడుకు మడిసెననియే తలంచి యస్త్రసన్న్యాస మొనరించి యోగమునఁ బ్రాణముల వదలెను. మహర్షు లంతకుముందే యింకేల యుద్ధమనియుఁ దెల్పిరి. సత్యము పలుకకున్నను బాపము రానివిషయములఁ గొన్ని శ్రీహరియే తెల్పెను.

"కామినీషు వివాహేషు గవాం భక్తే తథైవ చ,
బ్రాహ్మణాభ్యుపపత్తౌ చ అనృతే నాస్తి పాతకమ్."

అనునదియే భగవదుక్తి. ఈన్యాయము భగవత్ప్రతిపాదితమగుటఁ బైపైఁ ద్రోసివేయరాదు. ఇందేదో మహత్తర విషయము కలదనియే యాలోచింపవలయును. సత్యస్వరూపము స్మృతు లెట్లు నిర్ణయించినవో యనృతము నెట్లు గర్హించినవో సత్య మనునది యెప్పుడు పలుకరాదో విచారించుట ముఖ్యముకదా.

శ్లో. "యజ్ఞోఽనృతేన క్షరతి తపః క్షరతి విస్మయాత్,
ఆయుర్విప్రాపవాదేన దానం చ పరికీర్తనాత్. ౨౩౭

(మను ౪ అధ్యా.)

సత్యపూతాం వదేద్వాచమ్ మనఃపూతం సమాచరేత్. ౪౬

(మను ౬ అధ్యా.)

సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం, ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః." ౧౩౮ (మను. ౪ అధ్యా.)

ఇట్లే పెక్కుతావులంగనఁబడును. అనృతమునకంటెఁ బాపము వేఱొకటిలేదని స్పష్టము. ఇట్టులుండఁగా భగవత్స్వరూపమగు సత్యమునకొక కళంకము రారాదుకదా. భగవంతుఁడే యీయీకార్యములయం దసత్యముపల్కినను దోషములేదనియె. ఇందేది యథార్థము? అనునదియే ప్రశ్నము. ప్రతివిధివాక్యమునకు నొకానొకచో వ్యాఘాతముకలదు. అది యాపద్విషయమయియేయుండును. ద్రోణునకుఁ గాలమాసన్నమయ్యెనని హరియెఱుంగును. ఆతఁ డస్త్రసన్న్యాసము చేయకయున్న నెవ్వారికి గెలువశక్యముకాదనియు నెఱుంగును. అసత్యమువల్కి యుధిష్ఠిరుఁ డించుక యపవాదము ననుభవించుకర్మము చేసినాఁడనియు నెఱుంగును ఇవన్నియు నాలోచించి కర్మానుసారమే పలుకుమని ప్రోత్సహించెను. స్త్రీలయందు వివాహములయందు నింకనుంగొన్నిచోడలను బాపములేదన్న విషయము రెండవపక్షమని నావిశ్వాసము. ఆకార్యములయందుం గూడ హరిశ్చంద్రునిభంగిఁ జలింపకయుండుటే ముఖ్యపక్షము. దానఁ జలించువార లీకార్యములయందు మాత్రము గత్యంతరముఁ లేనిచోఁ బల్కినను నితరకాలములయందైనఁ బలుకకయుందురు గాక యని శ్రీకృష్ణమూర్తి యాశయమైనట్టు కనుపట్టును. ఏకాలమునందును సత్యము వదలకయుండువారలకిది యన్వయింపదనియు సమయోచితముగా సత్యము నాశ్రయింపవలయునన్న రెండవతరగతివారలకీ కార్యములయందు మాత్రము పల్కినను దక్కుంగలకాలములయందుఁ బలుకరాదని నిషేధమనియు నిందలి సారమనవచ్చును. యుధిష్ఠిరుఁడు రెండవతెగలోఁ జేరఁదగినవాఁడనియు స్పష్టమగును. ఇఁక నవ్వలికథకు మరలుదము.

## వ్యాసమహర్షి యర్జునునకు దర్శనమిచ్చి హితముపదేశించుట.

కౌరవులు పాండవులు తమ తమ శిబిరములకరిగిరి. ఆవల వ్యాసమహర్షి విజయునకు దర్శనమిచ్చెను. నరుండామునీంద్రుంబూజించి యిట్లు ప్రశ్నించెను. మహాత్మా! ఒక్కయద్భుత విషయమును దమకుం దెలిపి సంశయమును దీర్చుకొనంగోరెద. దయమెయి నుత్తర మనుగ్రహింపవలయును. నేను యుద్ధమునకుం బోయియుండఁగ నొక్కమహాపురుషుఁడు త్రిశూలమును దాల్చి నాముందుండును. ఆమహాత్తరాయుధంబుతో నాతఁడు ముందు వధించును. ఆవల నాబాణము లాశత్రువులం దును మును. ఆమహాపురుషుండెవ్వఁడో. మఱియు నామహాత్ముఁడు పృథ్విపై నడుగుపెట్టక దావాగ్నివలెఁ బ్రజ్వరిల్లుచుఁ ద్రిశూలమును బ్రయోగింప దానినుండి పెక్కుత్రిశూలము లావిర్భవించి శత్రువులఁ జెండుచుండును. ఆమహానుభావుఁ డెవఁడో నాకెఱింగింపుమాయని యడంనువమీాఱఁ బ్రార్థించెను. వ్యాసమునివరుఁడు పాండునందనా. * సృష్టికర్తలయందాద్యుఁడు. పూజ్యుఁడు. జ్ఞానులకే తెలియువాఁడు. అణిమాదిసిద్ధిసేవితుఁడు భూతేశ్వరుఁడు. శితికంఠుఁడు. అష్టమూర్తి. చంద్రకలాధరుఁడు

---

*ప్రజాపతీనాం ప్రథమం తేజసాం పురుషం ప్రభుం, భువనం భూర్భువం దేవం సర్వలోకేశ్వరం ప్రభుం. ౯. ఈశానం వరదం పార్థ దృష్టవానసి శంకరం. తం గచ్ఛ శరణం దేవం వరదం భువనేశ్వరం. ౧౦. మహాదేవం మహాత్మానమీశానం జటిలం శివం, త్ర్యక్షం మహాభుజం రుద్రం శిఖినం చీరవాససం. ౧౧. మహాదేవం హరం స్థాణుం వరదం భువనేశ్వరం, జగత్ప్రధానమధికం జగత్ప్రీతమధీశ్వరం. ౧౨. జగద్యోనిం జగద్వీపం జయినం జగతోగతిం, విశ్వాత్మానం విశ్వసృజం విశ్వమూర్తిం యశస్వినః. ౧౩. విశ్వేశ్వరం విశ్వవరం కర్మణామీశ్వరం ప్రభుం, శంభుం స్వయంభుం

పార్వతీనాయకుఁడు. వృషభవాహనుఁడు ఏమనివర్ణింతు. అనేక
వేదములు పొగడఁజాలకున్నవి. ఆమహాత్ముఁడే శంకరుఁడు
సుమీ. నీయందుఁగల ప్రీత్యతిశయమున వచ్చి నీముందు నిల్చి
తా నేచంపుచుండును. ఆవల నీబాణములు వారలఁజంపుచున్న
ట్లుండును ఏవారుగాని శ్రీకంఠు నామహాత్ముని సేవించినచో నిహ
పరసుఖములవారుగాంతురు. ఆమహాత్మునకనేకనామములుగలవు
అవన్నియు వేదప్రతిపాదితములు సుమీ. ఆమహాదేవుని ప్రభా
వంబించుక వినుము. తొలుదొలుత దక్షప్రజాపతి తపస్సుచేసి
సిద్ధుండై పెక్కండ్రఁగన్యకలంబడసి యింద్రాదులకు భార్యలు
గా నొసంగి సతియనుకొమరిత శంకరునకు నొసంగెను. కాలాం
తరమున శంకరుని ద్వేషించి యాతనింబిలువక యితరులనంద
ఱం బిలిచి యొక్కయజ్ఞము చేయుచుండెను. ఈశ్వరుం డనా
హూతుఁడయ్యుఁ గోపం దలంచియు నాతఁడల్పమతియని
మానుకొనియెను సతీదేవి స్త్రీచాపలంబునఁ బోవఁబూని వల
దను శంకరువాక్యములఁ బాటింపక ప్రయాణముసాగించి యందవ

---

భూతేశం భూతభవ్యభవోద్భవం. ౧౪. యోగం యోగేశ్వరం శర్వం సర్వ
లోకేశ్వరేశ్వరం, సర్వశ్రేష్ఠం జగచ్ఛ్రేష్ఠం వరిష్ఠం పరమేష్ఠినం. ౧౫. లోక
త్రయవిధాతారమేకం లోకత్రయాశ్రయం, సుదుర్జయం జగన్నాథం జన్మ
మృత్యుజరాతిగం. ౧౬. జ్ఞానాత్మానం జ్ఞానగమ్యం జ్ఞానశ్రేష్ఠం సుదుర్విదం
దాతారం చైవ భక్తానాం ప్రసాదవిహితాన్వరాన్. ౧౭. ౨౨౩ అధ్యా.
ఈదృశస్స మహాదేవః పూజ్యమానో మహేశ్వరః. స శివస్తాత తే
జస్వీ ప్రసాదాద్యాతి తేఽగ్రతః. ౨౦. తస్మిన్ ఘోరే సదా పార్థ
సంగ్రామే రోమహర్షణే, ద్రోణికర్ణకృపైర్గుప్తాం మహేష్వాసైః ప్రహారిభిః.
౨౧. కస్తాం సేనాం తదా పార్థ మనసాపి ప్రధర్షయేత్, ఋతే దేవాన్మ
హేష్వాసాద్బహురూపాన్మహేశ్వరాత్. ౨౨.

మానితయై తండ్రికిఁ గర్తవ్యముపదేశించి లాభంబుగానక యవమానానలంబునఁ దపించి యోగాగ్ని భస్మీభూత యయ్యెను. అంతర్దృష్టి నావృత్తాంత మెఱింగి శంకరుండాగ్రహించి యొక జటం బెఱికివైచిన నందొక్క మహాపురుషుండు భయంకరాకృతిం బొడమి పనియేమి యానతీయవే యనిప్రార్థించిన దక్షాధ్వరధ్వంసముగావింపుమని యానతిచ్చె. ఆయాజ్ఞను మహాప్రసాదంబని దక్షమహాయజ్ఞవాటంబున కరిగి యెల్లవారలతో దక్షుని వధించిన దేవతలు పాదంబులపైఁబడి ప్రార్థింప శంకరుండు వారల నాశ్వాసించి దక్షునొకరీతిని బ్రదికించె. అని మఱియు శంకరుని మహత్త్వంబు నెఱింగించి పార్థా! యామహాదేవుఁడే నీయగ్రభాగమునంబోవుచు నరివీరులంజంపుచున్నవాఁడని యెఱుంగుమని యుపదేశించి యదృశ్యుండయ్యెను.

ఆర్యులార! ఈకథయందు వ్రాయఁదగినవి మూఁడుమాటలే యనవచ్చును. కృష్ణార్జునులకుముందుఁ ద్రిశూలపాణియై యీశ్వరుఁడుపోవుచు శత్రువులదెగనేయుచుండ నర్జునునిబాణములు వెనుకనెపోయి వారలందగిలినట్లు వారు పడిపోవుచున్నయట్లు కనంబడెను. ఈవిషయమునకు

"కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. 32
తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. 33

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాన్యానపి యోధవీరాన్
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్." 34

(గీత ౧౧ అ.)

అను నీశ్లోకములే సమాధానములు. శ్రీకృష్ణమూర్తియే శత్రుహనన కార్యమున నారూపమునుదాల్చెనని యెఱుంగునది. దీనిచేతనే శంకరునకు శ్రీకృష్ణునకు భేదమే లేదని స్పష్టమయ్యె డిని. ఇట్టివెన్ని చూచినను బహుపాతమతులు తాంబట్టినకుందేలికి మూఁడేకాళ్లనునట్లు వారిపట్టుదలను మానుకొనరు. బుద్ధిబల మున నాలోచించినచో నేపురాణము చూచినను శంకరుఁడు శ్రీహరి, శ్రీహరియే శంకరుఁడు రూపము వేరు భేదమేగాని యొక్కతత్త్వమే యని కనఁబడుచున్నది. వారిబుద్ధిని ధరించి యూహించిన నీశ్లోకము లగపడవేమో యింతకంటెఁ బెంచి వ్రాయను. తర్వాతికథ నాలకింపుఁడు.

ద్రోణమరణానంతరము కర్ణుని సర్వసేనాధిపతిగా నిర్ణ యించిరి? ఎల్లవారి యనుమతి నాతని నభిషిక్తుగా నొనరించిరి. ఆతఁడు వాగ్యదోషస్ఫారము కనఁబఱచి కృతజ్ఞతంగొని భార్గవా స్త్రప్రభావమునఁ బెక్కండ్ర నుక్కడంపఁజాలెను. దుశ్శాసనాదు లప్పుడే మడిసిరి. రెండవదినమున విశేషించి కర్ణుఁడు నర్జునుఁ డును బోరాడిరి సాయంకాలమున ద్వంద్వయుద్ధము చెల్లెను. గెలుపోటములు నిర్ణయింప శక్యముగాకయుండెను. కొంత సేపు యుద్ధము సాగఁగాఁ గర్ణుఁడు చిరకాలమునుండి యర్చిం చుచున్న సర్పముఖశరమును బ్రయోగింపనెంచి యద్దానిని బుచ్చుకొని సమంత్రకంబుగా ధనువునంగూర్చి కంఠంబునకుం

గాక యపాంగప్రదేశంబు లక్ష్యంబుగాఁ బ్రయోగింపనెంచు
చుండ సారథి శల్యుఁ డప్పుడాతనికిఁ జిత్తవైకల్యమాపాదింప
నెంచి యీలక్ష్యంబు కంఠంబుఁ దునుమఁగాదు. వేఱొండుభం
గిని సంధింపుమని హెచ్చరించెను. కర్ణుండల్గి నావంటిశూరునకు
హితముపదేశించునంత నీకుంగలదే. కర్ణుండు రెండుసూఱులు
శరంబుసంధించునేయని పలుకుచు నర్జునుంబిలిచి*ఫల్గునా యిఁక
బ్రదుకవనుచుఁ బ్రయోగించెను. †ఆయస్త్రము రాక నెఱింగి
శ్రీహరి యది యర్జునునకు మరలింపఁ దరముగామి నాలోచించి
రథము నడంగఁద్రొక్కెను. ఆసర్పముఖశర మర్జునుకిరీటము
నెత్తుకొనిపోయెను. ఆయస్త్రమద్దాని నేలంగలిపి మరలివచ్చుటం
గాంచి హరి యర్జునునకుఁ దెలుప నాఱు తీవ్రబాణముల దానిఖం
డించెను. ఆవల శాపకారణంబునఁ గర్ణునిరథంబు భూమింగ్రుం
గెను. భార్గవాస్త్రంబు తోఁపకుండెను. కర్ణుండు తనయస్త్రంబులు
వికలంబులగుటయు రథంబు క్రుంగుటయుఁ దలంచి కరమువిదు
ర్చుచు ‡ధర్మప్రధానవాదులు ధర్మము రక్షించునందురు.
ధర్మనిరతినుండునాకు ధర్మము సాయమొనరించుటలేదు. కావున
ధర్మముకూడ భక్తులను గాపాడదని తలంచెదను అని పెక్కు
భంగుల ధర్మమును దూఱుచు యుద్ధముచేయుచుండ నర

*హతోఽసి వై ఫాల్గున ఇత్యువాచ త్వరన్ స రాజన్ విజయార్థ
ముద్యతః. అనిమూలము. † తం ప్రేక్ష్యదీప్తం యుధి మాధవస్తు త్వరాన్విత
స్త్వరయైవ లీలయా, పదావినిష్పిష్య రథోత్తమం స ప్రావేశయత్పృథివీం
కించిదేవ. అనిమూలము. ‡ ధర్మప్రధానం కిల పాతి ధర్మ ఇత్యబ్రువన్
ధర్మవిదస్సదైవ, వయం చ ధర్మే ప్రయతామ నిత్యం యథా బలం శక్తి
యథా శ్రుతంచ. స చాపి నిఘ్నాతి న పాతి భక్తాన్ మన్యే న నిత్యం
పరిపాతి ధర్మః. అని. మూలము.

దంబు మఱింత భూమింగ్రుంకెను. లక్ష్యభంగమగుట శరసంధా నమొనరింపఁజాలక కర్ణుండరదంబుదిగి యర్జునుంగాంచి *పార్థా! దైవవశమున నాయరదముచక్రము ధరలో డిగినది. దాని నెత్తునంతకు బాణములఁ బ్రయోగింపకుము. నీవు రథమున నున్నవాఁడవు. నేను భూమియం దున్నవాఁడను. నీవు సత్పురుషులకు సమ్మతమగుమార్గమునే యనుసరింపుము. కా పురుషసమ్మతమగుమార్గము ననుసరింపకుము. యుద్ధధర్మములను జక్కఁగా నెఱుంగుదువు. కావునఁ బెద్దలమార్గమునే యనుస రింపఁ దగుదువు. జుట్టువిరియఁబోసికొనినవానిని, విముఖుఁడగు

---

*భోభో పార్థ మహేష్వాస ముహూర్తం పరిపాలయ, యావచ్చ క్రమిదం గ్రస్త ముద్ధరామి మహీతలాత్. ౧౧౫. సవ్యచక్రం మహీగ్రస్తం దృష్ట్వా దైవాదరిందమ, పార్థ కాపురుషాచీర్ణమభిసంధిం విసర్జయ. ౧౧౬. న త్వం కాపురుషాచీర్ణం మార్గమాస్థాతుమర్హసి, ఖ్యాతస్త్వమసి కౌంతేయ విశిష్టో రణకర్మసు. ౧౧౭. విశిష్టతరమేవ త్వం కర్తు మర్హసి పాండవ, ప్రకీర్ణకేశే విముఖే బ్రాహ్మణేఽథ కృతాంజలౌ ౧౧౮. శరణాగతే న్యస్తశస్త్రే యాచమానే తథార్జున, అబాణే భ్రష్టకవచే భ్రష్టభగ్నాయుధే తథా. ౧౧౯. న విముంచతి శస్త్రాణి శూరాస్సాధువ్రతే స్థితాః, త్వం చ శూర తమో లోకే సాధువృత్తశ్చ పాండవ. ౧౨౦. అభిజ్ఞో యుద్ధధర్మాణాం వేదాంతావభృథాప్లుతః, దివ్యాస్త్రవిదమేయాత్మా కార్తవీర్యసమో యుధి. ౧౨౧. యావచ్చక్రమిదం గ్రస్తముద్ధరామి మహాభుజ, న మాం రథస్థో భూమిష్ఠం వికలం హంతుమర్హసి. ౧౨౨. న వాసుదేవాత్త్వత్తోవా పాండవేయ బిభేమ్యహం, త్వం హి క్షత్రియదాయాదో మహాకులవివర్ధన. ౧౨౩. అతస్త్వాం ప్రబ్రవీమ్యేష ముహూర్తం క్షమ పాండవ. అని మూలము. కర్ణ ౯౨. అధ్యా.

వానిని, దోసిలొగ్గినవానిని, బ్రాహ్మణుని, శరణాగతుని, ఆయుధములను వదలినవానిని, యాచించుచువానిని, బాణములు లేనివానిని, గవచవిహీనుని, భగ్నాయుధుని శూరులు కొట్టం బూనరు. నీవు శూరులలో నుత్తముఁడవు. సాధువృత్తి గలవాఁడవు. పండితుఁడవు. వేదాంతజ్ఞానము గలవాఁడవు. దివ్యాస్త్రవేత్తవు. పరిపక్వముగునాత్మ కలవాఁడవు. రణరంగమునఁ గార్తవీర్యునకు సమానుఁడవు. కావున నే నీచక్రము నెత్తునంతదనుక నన్నేయకుండుము. ఇపుడు నేను వికలాయుధుఁడను. ఇట్లు పలుకుట రణధర్మములను దెలుపుటకే కాని వాసుదేవునకు నీకును భయంపడి కాదుసుమీ యని పెక్కుభంగులఁ దెలిపెను.

అత్తరుణమున శ్రీకృష్ణుఁడు రాధేయుం గని యేమీ కర్ణా! ఈన్యాయము నేఁడే పుట్టినట్లున్నది. గర్వమును దురభిమానము నేటికి మఱచితివి? పరమధర్మపరులగు పాండవులను సకలశుభములు పొందును. అవినీతులగు ధార్తరాష్ట్రులను గష్టములే పొందును. అనిపలుకుచు ధార్తరాష్ట్రులు పాండవులకు మున్ను చేసినద్రోహములనెల్ల వెల్లడించెను. ఆమాటల కాగ్రహంబు పెంపొంద నర్జునుండు నిశితశరములం బ్రయోగించెను. కర్ణుండును బ్రతిశరము లేయుచుండెను. అంత నర్జునుం డొక్కదివ్యబాణము సంధించి నియతిమీఱ.

"తపోఽస్తి తప్తం గురవశ్చ తోషితా
మయా యదిష్టం సుహృదాం శ్రుతం తథా,
అనేన సత్యేన నిహంత్వయం శర
స్సుసంశ్రితం కర్ణమరిం మమోర్జితమ్."

క. "ఏను దపశ్చరణంబున
దానంబున గురుజనాభితర్పణమున ని
త్యానూనవ్రతశీలుఁడ
నేనియుఁ గర్ణుతలఁ ద్రెంచు నీశరమనియె౯." తిక్కయజ్వ.

అని సత్యముపై నొట్టుపెట్టి ప్రయోగింప నాశర మా సూర్యతనూభవునితలఁ ద్రెంచెను. సూర్యాస్తమయమగునప్పటికిఁ గర్ణుఁడు ధరఁబడియె. ఆతనితనువునుండి యొకదివ్య తేజంబు సూర్యబింబమును బ్రవేశించెను.

"దేహాచ్చ కర్ణస్య నిపాతితస్య
తేజస్సూర్యం ఖం వితత్యావివేశ."

(అని మూలము.)

కర్ణునిపాటు చూచి ధార్తరాష్ట్రులు దీనవదనముల నిండ్లకుం బోయిరి. పాండవు లత్యంతానందంబునఁ దమశిబిరముల కరిగిరి.

మహాశయులారా! ఇం దించుక యెఱుంగఁదగువిషయముకలదు. శాపవశమునఁ గర్ణునియరదముధరఁ గ్రుంగి వ్యత్యాసముగ నుండెను. అత్తఱిఁ గృష్ణమూర్తి నరునకుఁ గోపంబు దీపించునట్లు కర్ణాదు లొనరించినదుష్కార్యములఁ దెలిపెను. కర్ణుఁడు ధర్మము రక్షించు ననుమాట కల్లయని దాని నాక్షేపించెను. శల్యుఁ డట్టి యిక్కట్టుసమయమునఁ గర్ణునకు మనోవైకల్యమును గలిగించెను. ఏల? అనునదియే యిటఁ గలప్రశ్నము. ఒక్కనిచావునకుఁ బెక్కండ్రు కారణభూతులయ్యెదరు. కర్ణునిదుష్కర్మము శల్యునిం బ్రోత్సహించెను అర్జునున కంతకుముం బెన్నుఁడును రానియాగ్రహమును గల్గించెను. తుదకు శాస్త్రనియమములఁ గర్ణుఁడు తలంపునకుఁ దెచ్చినను గూడ

నర్జునున కవి న్యాయసమ్మతములని అనుష్ఠానార్హములని తోఁపక యుండఁజేసెను. కర్ణుఁడు చేసినమహాదానములు వేఱొక మార్గమున ఫలము నీయఁదగినట్లు తత్సమయమున నించుకేని ఫలమునీయక యుండునట్లు గావించెను దీనింబట్టి యాలోచింపఁగా

"గహనా కర్మణో గతిః"

అన్నసిద్ధాంతము స్మృతిగోచర మయ్యెడిని. కర్మమును మీఱఁగాని యెఱుంగఁగాని శ్రీపరమేశ్వరునకుం దక్క నన్యులకు శక్యము కాదనియుఁ దేలెడిని. శ్రీహరి తాఁజేయఁగలకార్యమనఁగా మృత్యురూపమునఁ గర్ణునింజంపఁబూనినపనిని నిమిత్తమాత్రముగనున్నయర్జునునిమూలమున సాగినట్లు లోకమునకుఁ గనఁబఱుపవలయునని ప్రోత్సహించెను. అర్జునుఁడు డస్సియున్న వాఁడు. కర్ణుఁ డింకతుణమైన భూలోకమున నుండ రాదు. కాలము ముగిసినది. ఆవిషయమును శ్రీహరి యొక్కఁడే యెఱుంగును. ఒరు లెఱుంగరు. ఆకాలమునకు మృత్యువు పాశములం దగిలించుచున్న జాడ కనఁబడెను. కావున నర్జునుని మూలమున నాకార్యము సాగినట్లుండవలెను. అందులకే ప్రోత్సహించి యాప్రతిన విజయుఁడు చేయునట్టు లొనరించి కార్యమును ముగించెను. కావున నిందు సర్వకార్యమును జేయించినది కర్మమే యని స్పష్టమయ్యెడిని. ఆకర్మముభగవత్స్వరూపమే కాఁబట్టియే కర్మమును మీఱరాదని మహాత్ము లంగీకరించిరి. కొందఱంగీకరింపనట్లు నటింతురుగాని చెడుఫలము లనుభవించునపుడు పురాకృతకర్మ మందురు. ఎప్పుడైన దాని నంగీకరింపక యుండవలనుపడదనియే యిట గ్రహింపఁదగుసారము. ఇఁక నవ్వాలికథకు మరలుదము.

కర్ణునితో భారత మందురుకదా. ఆన్యాయము ననుస రించి కర్ణవధానంతరము దుర్యోధను లొకచోటం జేరి యా లోచించిరి. కృపాచార్యుఁడు దుర్యోధనునకు హితముపదేశిం చెను. అది వానిమనస్సునకు నెక్కదయ్యెను. వారెల్లనా రేయి సరస్వతీతీరమున కరిగిరి. కర్తవ్య మాలోచించిరి. శల్యుని సేనాధీశునిగా నిర్ణయించిరి. ఆతఁడు నంగీకరించెను. ఏల? ఆస మీపకాలముననే యతనియాయువు పూర్ణము కానున్నది. మఱుదినము యథాపూర్వముగాఁ గౌరవులు యుద్ధసన్నద్ధు లైరి. శల్యకృపాశ్వత్థామలు కృతవర్మయు ననునలువురు తప్పఁ గౌరవులయందు మేటివీరులు లేరనవచ్చును పాండవులవీటం గూడఁ బంచపాండవులు తత్పుత్రులు సాత్యకియుఁ దప్ప మేటి శూరులు లేరనవచ్చును. శల్యునింజంపుభారము ధర్మరాజుదిగా నిర్ణయించిరి. ఏలయనఁగా శల్యునికర్మమే వారందఱ నట్లనుఁడని పురికొలిపెను. ఆమహాహవమున శల్యుఁ డోపినంతమట్టు యు ద్ధముచేసి కృతజ్ఞతం జూపెను ధర్మజునకు భీమనకులసహదేవ సాత్యకిప్రభృతులు సహాయులుగ నుండిరి. ఎట్టొ మూఁడవ జాముున ధర్మరాజు ప్రతిజ్ఞచేత శల్యునింజంపఁజాలెను.

శల్యునిమరణానంతరము కురుసేన పాండవులపక్షమునఁ గలవారిచేఁ జంపఁబడియెను. కృపాశ్వత్థామలు కృతవర్మయు దుర్యోధనుఁడు మిగిలిరి. సంజయుండు దుర్యోధనుని గాంచి దుఃఖమున నోటమాట రాకుండిన నెట్లో ప్రయత్నపూర్వక ముగా మాటలాడ నాతఁ డెల్లవారు మడిసిరని తండ్రితోఁ జెప్పుమని పల్కి ద్వైపాయనంబనుమడువులో డాఁగియుండి పిదపఁ బగఁ దీర్తుననియుం జెప్పుమని యందుఁ డాఁగెను. కృపా దిత్రయము మాటలాడి వెనుక నెచ్చటికో విశ్రమింపఁబో

యెను. రారాజు ప్రాదమున నుండెను. హరి యెట్లో యాతని జాడఁ దెలియునట్లు చేయ ధర్మరాజు పోయి రారాజున కాగ్రహము పౌరుషము కలుగమాట లాడెను. దుర్యోధనుఁడు వెడలి వచ్చి యుద్ధమునకు సన్నద్ధుఁ డయ్యెను. పాండవులలో నొక్కనిం గోరుకొని యతనితో యుద్ధము చేయవలయు ననియు, నతనినోడించిన నెల్లర నోడించినట్లే యనియు, నాతనికి నోడిన నోడినట్లే యనియు నియమ మేర్పఱుపఁబడెను. కర్మప్రేరితుఁడై దుర్యోధనుఁడు భీముని గోరికొనియెను.

ఆయిరువురు బలరామునిశిష్యులు. గదాయుద్ధము నేర్పిన దతఁడే. కావున నాయుద్ధము చూడఁగోరి బలదేవుఁ డచ్చటికి వచ్చెను. యుద్ధ మారంభ మయ్యెను. దుర్యోధనుఁడు గదాయుద్ధమునఁ గుశలుఁడు. భీముఁడు బాహుబలశాలి. కావున నిరువురు పోరాడునపుడు గెలుపోటములు నిర్ణయింప నవకాశము లేకుండెను కృష్ణానుమతంబున నర్జునుండు దుర్యోధనునూరువులఁ గొట్టుమని భీమునకు సంజ్ఞ చేఁ దెల్పెను. ఆతఁ డారీతిం జేయ నాతండు పడియెను. బలదేవుం డది యధర్మమని హలాయుధము నెత్తుకొని భీమునిపైకి రాఁగా శ్రీహరి యడ్డము వొచ్చి శాంతస్వాంతుం జేసి కార్యము ముగించెను. పాండవులు శిబిరమున కరిగిరి. దుర్యోధనుఁడు ప్రాణావశిష్టుఁడై పడియుండెను. అర్జునునరదంబు మండిపోయెను. ఇంతదనుక భీష్మాదుల దివ్యాస్త్రజ్వాలలఁ గాలకయుండఁ గాపాడితినని హరి తెలిపి యర్జునున కహంకారము గలుగకయుండఁ జేసెను.

పిదప శ్రీకృష్ణుండు కరిపురంబున కరిగి ధృతరాష్ట్రుని గాంధారి నూఱడించి వచ్చెను. సంజయుఁడు దుర్యోధనుం గన బోయిన విధికృతంబునకు వగవంబని లేదనియు నధర్మము యుద్ధ

మున ఫలించెన యని యాతండు పలికి తన్నుం జూడవచ్చినజనుల
కెల్ల నస్త్రీ యాలింగించెను. వారు కన్నీరు గ్రమ్మ నందుండఁ
జాలక పోయిరి. అందుఁ గొంద అశ్వత్థామాదు లున్న దెసకుం
బోయి దుర్యోధనునిదురవస్థం జెప్ప వారగ్గలికంబగుదుఃఖంబున
నరుదెంచి రథంబులు డిగి రారాజుం గని దుఃఖించిరి. అశ్వ
త్థామ విశేషించి యాతనియాకృతిం గొనియాడిన దుర్యో
ధనుం డెట్లో కన్నులు విప్పి కన్నీరొలుక నాయ్యా! మనుజుల
కీగతి రావలసినదే. సుఖదుఃఖములయందు సమబుద్ధి యుండవ
లదా యని తనయుద్ధప్రకారంబు చెప్పెను. అశ్వత్థామ యాగ్ర
హమున రాజేంద్రా! నా ప్రతిన నాలకింపుము. పాంచాలురాది
గాఁగలబంధుకోటిని మిగులకుండఁ గృష్ణుఁడు చూచుచుండఁ
దునిమెదను. ఆజ్ఞ యిమ్మనిన నారాజు తన్నుం జూడవచ్చిన
మునికుమారులం బ్రార్థించి కలశంబుఁ దెప్పించి కృపాచార్యునిచే
జలంబు దెప్పించి యశ్వత్థామ నభిషేకించెను. అశ్వత్థామయుఁ
గృపకృతవర్మలు తోడుగాఁ బ్రయాణము సాగించెను.

పాండవులశిబిరములసమీపమునకు వారు పోవునప్పు
టికి రాత్రి యయ్యెను. అందలివారెల్ల మహోత్సాహంబునం
బొదలుచుండిరి. ఆసరవడి యడఁగినతరువాతఁ బోవుదమని
యందుండిరి. అశ్వత్థామ యందఱు శయనించినపిదప మార్కొని
ప్రారంభింప నెంచెను కృపాచార్యుఁడు మేనయల్లునకుఁ బెక్కు
నీతుల నుపదేశించెను. కాని పాపకృత్యముననే వారలఁ జంప
నెంచిన యతని కూఱట కలుగదయ్యెను. మామతోఁ బాండ
వులు భీష్మద్రోణాదులఁ గపటంబునఁ జంపలేదా యని యతఁడు
నొక్కిచెప్పెను. అతఁ డేమియు ననఁజాలక యూరకుండెను.
కృపకృతవర్మలు నిదురించిరి. అశ్వత్థామ మేలుకొనియుండెను.

కొంతసేపటికి కతఁడు వారి మేలుకొలిపి పయనము సాగించెను. ముువ్వురును శిబిరములకడ కరిగిరి.

అచ్చోట నశ్వత్థామకు శివుఁడు భూతాకృతిద్యు తోఁచెను. ఆయాకృతి మహాభయంకరముగా నుండెను. వ్యాఘ్రాజినాదులు శివునిచిహ్నములఁ దెల్పుచుండెను. ఇట్లాభూతాకృతి తోఁచిన నామహాభూతము వదనకుహరమునుండియు నాసికావివరములనుండియుఁ జెవులనుండియు నేత్రములనుండియు దావాగ్నిజ్వాలలు వెలువడఁగా నాతేజస్సులయందు శంఖచక్రగదాహస్తులై హృషీకేశు లనేకులు వెలువడిరి. అశ్వత్థామ యాభూతంబు గాంచి హృదయమున నించుకేఁ గలంగక తీవ్రాశుగములఁ బఱఁగించెను. ఆభూతము వానినెల్ల మ్రింగెను. కోపించి యావీరుఁడు శక్తి ప్రయోగింపఁగా నది దానిం దాఁకి శకలము లయ్యెను. ఖడ్గాదివివిధసాధనంబులం బ్రయోగింపఁగా నవియు వ్యర్థము లయ్యెను నిష్ఫలుఁడగుచు నేమిచేయం దోఁపక యుండఁగా భీకరవిష్ణురూపములు పెక్కులు కనఁబడియెను. అశ్వత్థామ తనయక్రమప్రవృత్తికది ఫలమని చింతించి భావము నిశ్చలతంగాంచఁగాఁ జేసి యాపద్ధ్వాంతభానుఁడయి భక్తుల పాలిటి కల్పవృక్షమగు శంకరునిగొలిచి నాకోరికం దీర్చుకొందు నని నిశ్చయించెను. వెంటనే యరదంబు డిగి భూతలంబునం గూరుచుండి హృదయపీఠమునఁ బరమశంకరుని నిలిపి ధ్యానించెను. మఱియు మహాత్మా! శంకరా! నేనీయాపద దాఁటుదునేని ఆత్మోపహార మిచ్చెదను. అని ధ్యానించుటయు నాహూర వరునిముం దొక్క యగ్నికుండము తోఁచెను. అందనేకరూపంబులు గనఁబడియెను. ఆభూతంబులెల్ల ద్రోణిసాహసముఁ బరికింపఁగోరి యుండెను. కాని యశ్వత్థామ మనసున నించుకం

తయుఁ గలఁగక మోమునఁ జిఱునవ్వుతోఁపఁగా రథముమీఁద నున్నకోదండము నందుకొని యందుఁజొచ్చెను. ఆయగ్నికిఁ దన దేహ మాహుతిగా నీయఁదలంచుకొని యంబుల నెల్ల నింధనములుగాఁ జేర్చి పరమేశ్వరు నుద్దేశించి *శ్రీకంఠా! ఏమార్గము తోఁపకున్నది. ఆత్మోపహారము నీకొసంగెదను. పరుల గెలువ పరమౌసంగుము. ఈశరీర మాంగిరసకులజనితము. దీని నాహుతిగా నీయ నోఁచితిని కృతార్థజన్ముఁడనే యైతిని. అని యనేక భంగులఁ బ్రార్థించుచు నూర్ధ్వబాహుఁడై వేదికపైఁ గూరుచుండెను. ఆయగ్నిజ్వాలలోనుండియు మనస్సునఁ జాంచల్యము గాంచక కందక యున్నయశ్వత్థామకు హరుఁడు ప్రత్యక్షమై నిలిచెను.

శివుఁ డాతనిపై దయావలోకనములు వ్యాపింపఁ జేయఁగాఁ గమలాకరమున నున్నచందమున నతఁడుండఁజాలెను. †నా కీయణుప్రియుం డతని కిట్లు పలికెను. ఆమాటలు సుస్మితపరిమిళితములై యుండెను. వత్సా! నిరంతర మనేకరీతుల శ్రీ

* ఇమమాత్మానమద్యాహం జాతమాంగిరసే కులే, స్వగ్నౌ జుహోమి భగవన్ ప్రతిగృహ్ణీష్వ మాం బలిం. భవద్భక్త్యా మహాదేవ పరమేణ సమాధినా, అస్యామాపది విశ్వాత్మన్నుపాకుర్మి తవాగ్రతః. త్వయి సర్వాణి భూతాని సర్వభూతేషు చాపి వై, గుణానానాం ప్రధానానామేక త్వం త్వయి తిష్ఠతి. సర్వభూతాశ్రయవిభో హవిర్భూతమవస్థితం, ప్రతిగృహాణ మాం దేవ యది వధ్యాః పరే మయా. గీ.

† అబ్రవీద్భగవాన్ సాక్షాన్మహాదేవో హసన్నివ. సత్యశౌచార్జవత్యాగైస్తపసా నియమేన చ, క్షాంత్యా మత్యా చ ధృత్యా చ బుద్ధ్యా చ వచసా తథా. ఉ.౨. యథావ మహామారాద్ధః కృష్ణేనాక్లిష్టకర్మణా, తస్మాదిష్ట

కృష్ణుఁడు నన్నారాధించును. నే నాతని కనురక్తుఁడను. ఆతనికి సన్మానము చేయునూహచే భూతాకృతిం దాల్చితిని. పాంచాలురపైకి నీవరుగుచుండ సృష్టపడితిని. నీమనస్సును బరీక్షింప ననేకమాయలు పన్నితిని. కృష్ణసన్మానము చూపఁబడియెను. పాంచాలురకును గాలము సమీపించెను. వారెల్ల నీచేఁబడుదురు. నీవు నాయనుగ్రహమును బడసితివి. ఇదిగో ఖడ్గ మిచ్చెదను. కైకొనుము. అని ఖడ్గము నొసంగుచు నాతనికిం దెలియక యుండఁ దన తేజోరూప మాతనితనువునఁ జొనిపెను. దాన నాతఁడు వేయిమడుంగు లెక్కుడుగఁ బ్రకాశించెను. అంతఁ గృపకృతవర్మలు తోడ రాఁగా శిబిరములం జేరి వాకిట వారి నునిచి తానొక్కఁడే యరిగెను. తొలుదొలుత ధృష్టద్యుమ్ను మందిరంబున కరిగెను. అంతకుముందే శిబిరముల నెఱింగి యుండెను. కావున బాణబాణాసనపాణియై ప్రవేశించి గురుద్రోహి యగునాతనిం బడవైచి దుష్కృతికి లక్ష్యంబుగాఁ బొలియించి శిఖండిప్రభృతులం బొలియించెను. పాండవులను సాత్యకిని బిలుచుకొని శ్రీకృష్ణుఁ డశ్వత్థామకుఁ బాపమ మాత్మగోచరం బగుటం జేసి దూరముగా నొకనదీతీరమ్మున కరిగి యుండెను. ధృష్టద్యుమ్నసారథి తప్ప నింకెవ్వ రాశిబిరముల మిగులక యుండ

---

తమః కృష్ణాదన్యో మమ న విద్యతే. ౬౩. కుర్వతా తాత సమ్మానం త్వాం చ జిజ్ఞాసతా మయా, పాంచాలాస్సహసా సృష్టా మాయాశ్చ బహుశః కృతాః ౬౪. కృతస్తస్యైవ సమ్మానః పాంచాలాశ్చ పరీక్షితా మయా, అభిభూతాస్తు కాలేన నైషామద్యాస్తి జీవితమ్. ౬౫. ఏవముక్త్వా మహాత్మానం భగవా నాత్మనస్తనుం, ఆవివేశ దదౌ చాస్మై విమలం ఖడ్గముత్తమమ్. ౬౬. అథావిష్టో భగవతా భూయో జజ్జ్వాల తేజసా, వేగవాంశ్చాభవద్యుద్ధే దేవసృష్టేన తేజసా. ౬౭. సౌప్తికపర్వము. ౭ అధ్యా.

నశ్వత్థామచే రూపడంగిరి. కరితురగాదులుకూడ హతము
లయ్యెను. తుదకుఁ బాండవు లేవురు లేరని యెుఱింగి కృపకృత
వర్మలం గలిసికొని త్వరగాఁ బోయి దుర్యోధనుం గాంచి తమ్మె
ఱింగింప నాతఁ డెట్టకేలకు స్మృతి కలుగఁగా వారలఁ బలుక
రించిన నశ్వత్థామ తన పౌరుషంబు నెఱింగించి యెుల్లర నఱికి
తిని. పాండవు లేవురు మురారియు సాత్యకియు నాబారిఁ బడ
రని తెలిపెను. ఆమాటల కానందించి యాతనికృతజ్ఞతం గొని
యాడి యమ్మువ్వురం జక్కఁగాఁ గాంచి యిఁకఁ బ్రాణంబుల వద
లెద పునర్దర్శనంబు త్రిదివంబున నయ్యెడు మని పలికి వారలఁ
గౌఁగిలించుకొని ప్రాణంబుల వదలెను. ఆమువ్వు రాతని వల
గొని కౌఁగిలించుకొని దుఃఖించుచు నరదంబు లెక్కి యరిగిరి.

మహామనీషులారా! ఈవృత్తాంతమునుండి యొక్కవిష
యము నెఱుంగవలయును. దాన శ్రీకృష్ణునిసర్వసాక్షిత్వము
స్పష్టమగును. విశేషించి శివకృష్ణు లొక్కతత్త్వమే యనియుఁ
దేటపడును. దుర్యోధనుమరణము కాఁగానే మహోత్సవము
లాశిబిరముల సాగఁజొచ్చెను శేషించినవారి కాయువు మూడె
నని యెుఱుంగుటం జేసి హరి పాండవులను సాత్యకిని బిలుచు
కొని నదీతీరమునకుం బోయెను. తక్కినవారందఱు శిబిరముల
నుండిరి. ద్రౌపదీపుత్త్రు లేవురు నుపపాండవు లనంబడుదురు.
వారు కూడఁ జావవలసినవారే యని హరి యెుఱుంగును.
మనమే యేల పోవలెనని పాండవులుగాని ద్రౌపదిగాని ప్రశ్నింప
రైరి. ఏల! తదంతర్వర్తి శ్రీహరియే కదా. శిబిరముల నుండు
వారెల్ల నశ్వత్థామచేఁ జావఁదగినవారు. అనఁగా నశ్వత్థామ
వ్యాజమునఁ దానే చంపఁదగినవాఁడని భావము. ఈభావ మా
హరితప్ప నన్యు లెఱుంగరు. కావుననే తా నేమియు నెఱుంగ

నట్లుండవలయునని వారిం బిలుచుకొని పోయెను. సర్వజ్ఞత్వము
దీన స్పష్టము కదా. సర్వకర్తృత్వము విస్పష్టమే. సర్వసాక్షి
త్వము రూఢమే కదా.

అశ్వత్థామ దుర్యోధనుని మాటకు గలుగం బలికి పాండ
వులపైకిఁ జనెను. అంత సాహసము నాతనికిం గలిగించినది శిబి
రముల నివసించి యాయువు తుదముట్టిన వారికర్మమే యనక
తప్పదు. అది ప్రోత్సహింపఁగనే యంతకుమున్నే పాండవు
లజేయులని యెఱింగియుండిన యశ్వత్థామ వారి నొక్కఁడుగ
జంపఁగఁబోవుట కేమి హేతువు కలదు? వారందఱు చేసినకర్మము
ప్రోత్సహించెననుటతప్ప వేఱొకసిద్ధాంత మిటఁ బనికిరాదు.
"నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అని కృష్ణభగవానుఁడు
తెలిపెను గదా. లోకమున కుదాహరణార్థ మొక్కవ్యక్తి
నిలువఁబడును. అంతియతప్పఁ దక్కినకార్యమంతయుఁ గర్మమే
తీర్చును. అశ్వత్థామ యాకార్యమునకుం బూని మేనమామ
యగు కృపాచార్యుఁడు నిద్రాసక్తులఁ జంపరాదని ధర్మోపదేశ
మొనరించెను. కాని యానీతి యాతనిమది కెక్కునా? మృత్యు
రూపమగుశిబిరవాసులకర్మ మాతనిహృదయమును పట్టిఁబట్టుచు
కొని రాజుగానుండఁగా నతఁ డెట్లంగీకరించును?

శ్లో. "ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే"

అన్నగీతావాక్య మాతరుణమున నాద్రౌణికి స్మృతిగోచరము
గాకయుండెను. ఏల? శ్రీకృష్ణుఁడు తద్హృదయమును గర్మవశము
చేసెను. ఆతత్త్వమెఱుంగఁజాలనిస్థితియం దున్నద్రౌణి తా
నెల్లెని వారిం బొలియింపఁగడంగెను. పయనము సాగించెను.
శిబిరములకడఁ జేరెను. ద్రోణనందనునిశిక్షకై నిలించిన వా రందఱుఁ

గలరు. కావున శ్రీహరి భూతాకారమున నాతనికిం దోఁచెను. సహజధైర్యమున నాతఁడు జంకలేదు. పెక్కండ్రు విష్ణుమూర్తులగపడిరి. ఇదేదో పరులమోసమనుకొని కోఁబోలు దివ్యాస్త్రములఁ బ్రయోగించెను. వ్యర్థయైన నాతఁ డింక నేమో సాహసము చూపఁబూనెను. తనప్రవృత్తి వ్యర్థము కాఁగాఁ దుదకాతఁ డిది యీశ్వర తేజస్సని భావించి నియతుఁడై ప్రార్థించెను. అంతలో నాభూత మొకయగ్నికుండముగఁ గనఁబడియెను. మంటలు గనంబడియెను. ద్రోణసూనుఁడు తనదేహము నుపహారమీయ నిశ్చయించి శంకరు ధ్యానించి నిర్భీతుఁడై తన బాణాసనాదిక మాయగ్నికుండమువం జేర్చి వేదికగా నొనరించి యందుఁ గూరుచుండి మహాప్రభూ! శంకరా! మహాదేవా! ఈతనువు నాహుతిగా గ్రహించి నాకు వరమిమ్ము. రిపుల నాశనము చేయ ననుగ్రహింపుమని వేఁడెను. నిశ్చల భక్తిచేఁ గొలుచునాతనికి శంకరుఁడు ప్రత్యక్షమయ్యెను.

"యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః."

అన్నగీతావాక్యమును సార్థకము చేసెను. ద్రౌణి శంకరునకు నమస్కరించెను. శంకరుఁడు తాను శ్రీకృష్ణునిచే విశేషించి పూజింపఁబడితి ననియుఁ గావున నాతనికి బాసటయై యుందు ననియు నీవు వారలపైఁ బోవ నడ్డపడితి ననియుఁ బలికెను. ఖడ్గమొసంగుచుఁ దనశక్తి నాతనితనువునం జొనిపెను. అనఁగా నెవరికాలమున నెవరికి మృతి రాఁదగునో యతనియందు మృత్యుదేవతాంశను ప్రవేశించుననియు నతఁ డాతనిం జంపు ననియు భావము. అంతకుముందు లేనియూహ యాతనికిం దోఁచును. మృతినొందఁదగువానికర్మ మాతనిం బురికొల్పి

సాహసమును గల్పించి వానిం జంపఁజేయును. చంపుకాలమున నాతఁడు వానింజంపుటకుం దగినకారణము లన్నియుఁ జక్కఁగా స్ఫురించును. కావుననే వాఁడు చంపును. ఆచావునకుఁ గారణము వానిదుష్కృత్యమని భావింపక లోకులు లోకనియంతదారోపింతురు. అశ్వత్థామయు నిమిత్తమాత్రుఁడే. మృత్యురూపమును దాల్చిన శ్రీకృష్ణుఁడే యాతనియం దావేశించి వారలం జంపి తనయవతారమును ఫలవంతముగఁ జేసెనని మన మెఱుంగవలయును. ఇదియే యిందలి సారము. ఈవిషయమునే మన మెఱింగి దృఢముగా నిలుపుకొనవలయును. ఇఁకఁ దరువాతి వృత్తాంతము నెఱుంగవలయును.

ఆరేయి నదీతీరమునఁ గడపి ధర్మరాజు సంతోషమున సోదరులు సాత్యకి శ్రీహరియుఁ జెంత నుండఁగా నిష్టగోష్ఠి నుండఁగా ధృష్టద్యుమ్నసారథి యరుగుదెంచి యశ్వత్థామ సంగంభమంతయుం దెలిపెను. ద్రౌపదేయులు లోనగువారు పొలియుట కెల్లరు తల్లడిల్లిరి. దుష్కార్యమనియుఁ దలంచిరి. కాని ద్రోణాచార్యుని వధించుటలోనగుతమకార్యములవంటి దేయది యని యోజింపరైరి. ద్రౌపది యెంతయు వగచెను. ఆయశ్వత్థామం బరిభవింపుమని భీమసేనునిబురికొలిపెను. ఆతఁడట్లేయని పరుగిడెను. కృష్ణున కాతనిశక్తి తెలియునుగాన నర్జునుం బ్రోత్సహించి యరద మెక్కి భీమునిపిఱుందఁ దానునుబోయెను, అశ్వత్థామయాయుదయముననే నదీతీరంబుననునివృత్తి నవలంబించెను. భీమాదు లతనింగాంచి యదలించిరి బ్రహ్మశిరోనామకాస్త్రవర్య మభిమంత్రించి యొకయిషీకంబునం దాయస్త్రశక్తి నావహింపఁజేసి యపాండవం బయ్యెడుమని ప్రయోగించెను. శ్రీకృష్ణప్రేరణంబున నర్జునుండు నాయస్త్రమునే ప్రయోగించె.

సు. ఆ రెండును లోకంబులం గాల్పఁబూనఁగా నారదమునియు
వ్యాసమునియుఁదోఁచి వారినడుమనిలిచి యోయికల్మషులారా!
ఈయస్త్రములను మానవులపైఁ బ్రయోగింపఁ దగునా. యను
మాట లాలించి యర్జునుండు వారలకు నమస్కరించి యశ్వ
త్థామాస్త్రము శాంతినొందించునూహతో దీనిం బ్రయోగించి
తిని. నాయస్త్రమునుడిపెద అశ్వత్థామాస్త్రంబు నుడుగునట్లొ
నరింపుఁడీ యని తానాయస్త్రమును శాంతినొందఁజేసెను. అశ్వ
త్థామ తనయస్త్రము నుపశమింపఁ జేయఁజూచెఁ గాని యది
శక్యంబు గాకుండెను. ఆవిషయ మెఱింగి యతఁడు వారలతో
మునులారా! నాకు లజ్జగలుగునట్లు భీముఁడు కురురాజును
జంపెను. అంతఁ బోవక నాప్రాణము తీయవచ్చెను. పరిభవ
రోషము ప్రాణభయము నన్నుఁ బురికొలుప దీనిం బ్రయోగిం
చితిని ఇది పాండుతనూభవవర్గము దహించిగాని మరలదు.
అది పాపమందురో దాని కంగీకరింతును. నా విని సాత్యవతే
యుఁడు ధర్మంబులం దెలిపి నీ విట్లు చేయరాదు. పాండవులు
న్యాయమున నిలిచినవారు. కావున నీశిరోమణి వారల కిమ్ము.
దాన వారు తృప్తినొందుదు రని దాని నిప్పించెను. అద్దాని
నిచ్చుచు నశ్వత్థామ నాయీయస్త్రంబు పాండవులకు హాని
గల్పింపక తద్దారలగర్భముల నశింపఁజేసి శాంతిం బొందుఁ గాక
యనియెను. శ్రీకృష్ణుఁడా ద్రోణితోఁ బాండుపౌత్రుల నెల్లందుని
మితివి వారిదారలగర్భములం దొక్కదానిఁ దొలఁగింపుము.
నేనొక్కని పాండుసంతతి కాధారముగా నిలుపువాఁడ. కావున
నొక్కదాని నిలిపి తక్కినవానిని దహింపు మనియె. ఆమాటలు
విని ద్రోణనందనుఁడు కృష్ణా! పక్షపాతమున నీవట్లు పలికిన నేనేల
యట్లు లొనరింతును నీవుత్తరాగర్భంబును గాపాడం జూచెదవు.

నే నద్దాని నాయస్త్రంబున దగ్ధంబు గావింతును. అనఁగా విని శ్రీహరి నీవద్దానిం దునిమిన నే బ్రదికింతును. ద్రౌణియు నాతని మాటలు విని యట్లే బ్రదికింపుము. చూచెదఁ గాక అని పాండవసంతానసకలగర్భధ్వంసనము చేసి యాయస్త్రంబు శాంతించు నట్లు చేసెను. వ్యాసముని యశ్వత్థామం గని నీవు బ్రాహ్మణుఁడ వయ్యుఁ గ్రూరత్వమునకు నేవగింపక నామాటల నాదరింపక యిట్లు చేసితివనునంతలో శ్రీహరి బాలఘాతకుఁడవగు నోయశ్వత్థామా! *నీ వశనంబు దుర్లభంబు గాఁగా నిస్సహాయుఁడవై దుర్గంధరక్తంబున నంగంబు మునింగి యుండ మూఁడు వేలయేఁడ్లుండుమని శాపంబిచ్చెను. వ్యాసమునియు నీవీ శ్రీహరి పలికి నట్లే యుండు మనిరి. ద్రోణనందనుఁడా వ్యాసునిం జూచి †నీవు మనుజులలో నుండు వాఁడవు. నిన్నెడఁబాయక నేనుందును. శ్రీకృష్ణవాక్కు సత్యమే యగుఁగాక యని ప్రతిజ్ఞాం బొసంగెను. ఎల్లవారును దమతమయిరవుల కరిగిరి.

### శివప్రభావమును గృష్ణుఁ డుపదేశించుట.

ధర్మనందనుఁడు పుత్త్రవ్యామోహమునఁ బీడితుఁడై కృష్ణునితో మహాత్మా! దుర్జయులగు ద్రౌపదేయుల నొక్కరుండే యశ్వత్థామ యెట్లు పొలియింపఁజాలెను ? ధృష్టద్యుమ్నుఁ

---

* తస్మాత్త్వమస్య పాపస్య కర్మణః ఫలమాప్నుహి, త్రీణి వర్షసహస్రాణి చరిష్యసి మహీమిమాం. అప్రాప్నువన్ క్వచిత్కాంచిత్సంవిదం జాతు కేనచిత్. నిర్జనా న సహాయస్త్వం దేశాన్ ప్రవిచరిష్యసి, భవిత్రీ న హి తే క్షుద్ర జనమధ్యేషు సంస్థితిః, పూయశోణితగంధీ చ దుర్గకాంతార సంశ్రయః. విచరిష్యసి పాపాత్మా సర్వవ్యాధిసమన్వితః. ౧౭. అని మూలము.

† సహైవ భవతా బ్రహ్మన్ స్థాస్యామి పురుషేష్విహ, సత్యవాగస్తు భగవానయం చ పురుషోత్తమః. ౨౦. అని మూలము.

డన్నింటఁ గుశలుండయ్యు నాతని నోర్వఁజాలక పుండు పెట్లు? అని యడిగిన శ్రీహరి యాతని కిట్లనియె. కుంతీనందనా! ద్రోణ పుత్త్రుఁడు శంకరు నారాధించెను. పరమేశ్వరుఁ డవంబరఁగి దయార్ద్రహృదయుఁ డై యమేయాకృతియై తనరారు నిండు మహాళిని దృఢభక్తి నారాధించి యనపాయమగు బలాతిశేక మున విట్టనీఁగుటం జేసి శిబిరమునఁ గలవారలనెల్లఁ దెగటా ర్పఁజాలెను. ధర్మనందనా! శంకరుఁడు ప్రసన్నుఁడైన యెడల నమరత్వము లభించును. దేవేంద్రాదుల గెల్వఁజాలు శక్తియు నలవడును. శిబిరముల నున్నవారి గెల్చుశక్తి లభించు టొక యబ్బురము కాదుసుమీ. ఒక్కమాట చెప్పెదను. చక్క నాలకింపుము. *శంకరుమహిమము నే నెఱుంగుదును. ఆమ హాత్ముఁడు ప్రపంచముల సృజింపఁ జెంపసంరక్షింపఁ గర్తయగు. మనస్సునఁ దలంచినంతన బ్రహ్మాండము లుత్పత్తిల్లు. భక్తికి నాదే వుఁడు విధేయుఁ డని యెఱుంగుము. ఆశంకరులీలలను గొన్నిం టిని మాత్రమే తెల్పఁజాలుదు. అవధరింపుము. బ్రహ్మదేవుఁడు సృజించునిచ్ఛఁగొని యామహాదేవుని కడ కరిగెను. భగవంతుని సందర్శించి తనయుద్దేశమును విన్నవించెను. ఆతలం పెఱింగి సకలకార్యములకుఁ దపస్సే సాధనమని యాలోచించి జలనిమ గ్నతనుండై యుండెను. బ్రహ్మయుఁ జిరకాలము వేచియుండి తనతపోమహత్త్వమున దక్షునిఁ బుట్టించెను. ప్రజలఁ బుట్టింపు మని యాజ్ఞాపించెను. దక్షుండు నాకంటెఁ బెద్దలెవ్వరు లేరేని

*జిరాహం హి మహాదేవం తత్త్వేన భరతర్షభ, యాని చాస్య పురాణానికర్మాణి వివిధాని చ. ౧. ఆదిరేషహి భూతానాం మధ్యమంతశ్చ భారత, విచేష్టతే జగచ్చేదం సర్వమస్యైవ కర్మణా. ౯. అనిమూలము. సౌప్తికపర్వ. ౧౭ అధ్యాయము.

యట్లు సృజింతు ననిరి. బ్రహ్మయుఁ బరమేశ్వరుఁడు జలనిమగ్నుఁడై యున్న వాఁడు. కావున నేను నిన్ను నియోగించుచున్నాఁడను. ఇంకొక పెద్ద కానరాఁడు. నీవే సృజింపుమని హెచ్చరించెను. అట్లే యాదక్షుఁడు నిర్మించెను ఆభూతగణము లెల్ల నాఁకలిబాధ కోర్వఁజాలక దక్షుని మ్రింగ నుంకింప నాతఁడు విరించికడ కరిగి భూతములు నన్ను భక్షింపకయుండఁ గాపాడుమా యనుచు వాని కాహార మనుగ్రహింపవే యని వేఁడెను. బ్రహ్మ యోషధులను ఫలమూలాదులను బుట్టించి యివి వాని కాహారంబు లగును. మఱియు బలిష్ఠభూతంబులకు దుర్బలభూతంబు లాహారంబు లగును గాక యని యాజ్ఞాపించెను దాని కాభూతములు ప్రీతములై యట్లే వానిం దినుచు వృద్ధినొందెను. చిరకాలము గడువఁ జంద్రరేఖాలంకృతమస్తకుఁ డగుశంకరుఁడు జలంబుల వెడలి వచ్చి భూతవ్రాతము నాలోకించి యాగ్రహించి నిజలింగమును నేల నిడినం జూచి బ్రహ్మ యాశంకరుని బ్రశంసించి చేరఁబోయి యీలింగము నిట్లేల చేసితివని ప్రశ్నింప నాదేవదేవుఁ డిట్లు పలికెను.

పంకజాసనా! భూతవ్రాతమును సృజింపఁ గోరి జలంబుల మునిఁగి యుండితిని. తపస్సు చక్కఁగా నెఱవేఱెను. వెడలి వచ్చితిని ఇంకొకఁడు సృజించినందున నిట్లు చేసితిని. ఈలింగము భూతసృష్టికిం గాక మఱెందులకు? అని పలికి త్వరపడి మాల్యవంతమ్మునకుం బోయి తపోనిష్ఠమై నుండెను. ఆతరుణమున నాలింగము మనోహరప్రకాశమున విలసిల్లెను. దానిం గాంచి బ్రహ్మాదు లారాధించిరి. దేవతలా పూజయందుఁ బాల్గొనిరి. పిదప దేవతలొకమహామఖము చేయఁబూని ద్రవ్యములఁ

వెక్కింటిని సేకరించిరి. యజ్ఞము నారంభించిరి. కాని శంకరుని మహాత్త్వం బెఱుంగఁజాలని వారొట రుద్రునకు భాగము కల్పింపక యే చేయుచుండిరి. అవిధ మెఱింగి యీశ్వరుఁ డమరులఁగరువము పోఁ ద్రవడఁగఁ జేయ నుంకించి తపోమయంబయి యద్భుతాకృతిం దనరారుచు దైర్ఘ్యంబున నతిశయిల్లి బాలభానుదీప్తంబయియుండు శరాసనంబొండు నిర్మించెను. దానికి నల్లెత్రాడులోనగుసాధనములను యజ్ఞాంగములచేఁ గల్పించి యాగ్రహాగ్నిజ్వాలలు మైకొన నాకృత్తివాసుఁడు దేవతలు యజ్ఞము చేయుచున్న తావునకుఁ బోయెను. శంకరుఁ డాగ్రహించినంతనే లోకంబు లాకులంబు లయ్యెను. దేవతలాభూతేశుం గాంచి నిశ్చేష్టులై యూరకయుండిరి శంకరుఁడు బాణప్రయోగము చేయ యజ్ఞము మృగమువలెఁ బాఱిపోయెను. అగ్నియు దాని వెంటఁ బరుగిడ సాగెను. యజ్ఞము పాఱిపోవఁగా దేవతలు చేయునది లేక ఖిన్నులైరి. అంత శంభుఁడు సవితబాహువులు, పూషునిదంతములు, భగునినేత్రములు తన కోదండాగ్రమునఁ బొడిచివైచెను. దివిజులుయజ్ఞాంగములతోఁ బాఱిపోయిరి వారింబోనీయక కోదండాగ్రమునఁ బొడుచుచు నిలిపి వారలపై బాణప్రయోగము చేయనిష్టపడక వారిని దూలపుచ్చఁగా వారాధనుష్కోటి పెక్కుశకలము లగుఁగాక యని పల్కినది యట్లులే యయ్యెను. త్రిదశులు యజ్ఞముతో శంకరు శరణువొచ్చిరి శివుఁడు ప్రసన్నుఁ డయ్యెను. తనకోపమును వెలువరించి జలాశయమున వైచి యమరుల నాదరమున వీక్షించెను. ఆకోపమా జలముల నుండి యొకయాకృతిం దాల్చి వచ్చెను. తాను దుల్చినబాహువులులోనగువానిని వారలకు మరల నాశివుఁ డనుగ్రహించెను. దేవతలు పార్వతీ

జానికి భాగము యజ్ఞమునఁగల్పించిరి. హరుఁడుసంతోషించెను. వారెల్లఁ దమయిరవులకరిగిరి. కావున నోధర్మరాజా! శంకరుఁ డాగ్రహించిన లోకంబు లాకులంబు లగు. అనుగ్రహించిన సుఖించును. మహాదేవునియనుగ్రహంబునను బాత్రుండగు గురుతనయుఁడు శిబిరంబుం బ్రవేశించి యిట్టిఱంగు చేయం జాలెను. అనిపలికిన ధర్మరాజు శంకరువినుతించి ఖేదము మాని యుండెను.

భక్తవర్యులారా! శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకుం దెల్పిన విషయమును బరికించితిరి కదా. శంకరునిమహత్త్వము నేనె ఱుంగుదు ననియెను. సకలమునకు నాహరుఁడే కర్తయని యుప దేశించెను. దీనింబట్టి శైవులుబట్టి తబ్బిబ్బులు కారాదు. విష్ణువు శివుని, శివుఁడు విష్ణువును బ్రధానులనుగాఁ జెప్పుచుందురు. అది వారికి నైజము. మేమిరువురు మొక్కటియే కాని వేఱు కాదని దీనిసారము. కూర్మపురాణాదులు తామసములని వా దించువారు భారతమునఁ గలుగుయీవిషయమును గాంచిన నేమందురు? భారత మితిహాసముగానఁ బ్రమాణము కాదం దురా? భగవద్గీతలుకూడ నట్టి యగునే? హ్రస్వదృష్టింజూచు వారలకు హరిహరులయందు భేద మగపడును. అది వారిప్రార బ్ధకర్మమునకు ఫలము. వారియందు దించుకంతయు, భేదము లేదు. కల్పించుకొని విష్ణువే సర్వేశ్వరుఁడు. శివుఁడు తత్పాదసేవకుఁ డనుకొన్నందున నితరులకు బాధ లేదు. కాని శివుఁడు సర్వే శ్వరుఁడు. విష్ణువు తత్పాదసేవకుఁ డనుకొనువారలను గాంచి వైష్ణవు లాగ్రహింపరాదు. తమ కెట్లు తోఁచినదో వారికట్లు తోఁచినది. దీనిఁ గనల నేల? ఈయిరువురిని గాంచి జ్ఞానులు నవ్వవలయునే కాని యిందెవ్వరి నాక్షేపింపరాదు. ఏలయన

సత్పక్షజ్ఞానము వారల కింకను గలుగ లేదనునదియే చక్కనిసమాధానము ఇంకను బెంచివ్రాయను. తరువాతికథ నాలకింపుఁడు.

శ్రీహరి తనభూభారహరణకృత్య మర్జునునిమూలమునఁ బూర్తి గావించి యవ్వలికృత్యమునకుం బూనెను. ధర్మరాజాదుల నాశ్వాసించి ద్రౌపది నూఱడించి యుత్తరకు మనశ్శాంతిని గల్పించి యశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్రము నుండి సంతానము రక్షించెదనని ప్రతినచేసి యెల్లరకు నూఱటఁ గల్పించెను. అటఁ గరిపురమున ధృతరాష్ట్రాదులను విదురాదు లూఱడించిరి. ఏట్లో మనశ్శాంతిని బొందియుండినధృతరాష్ట్రునికడకు ధర్మరాజు సోదరులతోడను, శ్రీకృష్ణమూర్తితోడను బయనము చేసెను. యథాన్యాయముగా వారల నూఱడించెను గాంధారియు నూఱడిల్లక ధర్మరాజును శపించి తనపుత్త్రమరణదుఃఖమును వోలఁగించుకొనఁ దలంచెను. జ్ఞానదృష్టి నావిధ మెఱింగిన వ్యాసముని సాక్షాత్కరించి యందఱు చేయుచుండు నవ్యాదల నంగీకరించుచుఁ గోడలిం జేరంబోయి యోహాహో శపింపకుము శపింపకుమని పలికి ధర్మరాజుచిత్తవృత్తి నెఱింగించి యామెయాగ్రహము నాపెను. ఆమెయు నూఱడిల్లి పాండవులను గుంతీదేవి కడకుఁ బోవ ననుమతీయఁగా వార లట్లు చేసిరి.

## గాంధారి కృష్ణుని శపించుట.

గాంధారీధృతరాష్ట్రులు మృతపుత్త్రులశరీరములను జూడఁగోరి ధర్మరాజాదులం గూడి పోలికలనున కరిగిరి. శ్రీకృష్ణుఁడును వారిచెంత నుండెను. గాంధారికోడండ్రును గూడ నుండి తమతమ భర్తృకళేబరములం గాంచి దుఃఖించుచుండిరి. గాం-

గాంధారియుఁ బుత్త్రశవములను భీష్మాదులను జూచుచు శోకము నాపుకొనఁ జాలక శ్రీకృష్ణుని జేరం బిలిచి యొక్కొక్కని వృత్తాంతము నెఱిఁగించుచు వగచుచుండెను కొంతసే పుండి యీపనియెల్ల శ్రీహరివలననే జరగినదని యూహించి కోపోద్దీపితయై *పద్మనాభా! నాకుమారులు పాండవులు తమలోఁ దారు కలహించుచుండ నీవడ్డపడ వైతివి. సమస్తకార్యములు చేయశక్తిగలవాఁడ వయ్యును మాననీయచరిత్రుఁడ వయ్యు నుపేక్ష చేసితివి. నాకొడుకుల నశింపఁజేయఁబూనియే రాయబారము నడపితివి. రాజులను వారిసేనలను నామమడంచితివి. రాజ్యములెల్లఁ బాడయ్యెను. దానిఫలము ననుభవింపఁగలవు నిన్ను శాపాగ్నిజ్వాలాపరిదగ్ధమూర్తిం జేసెదను. కృష్ణా! పాతివ్రత్యపుణ్యఫలమునఁ గొంతతపము నార్జించితిని. దానిసాయమున నొకమాటఁ జెప్పెద. అవధరింపుము ఉత్తమజ్ఞాతులను దమలోఁ దమరు కలహించి చంపుకొనఁ జేసితివి. కావున నీజ్ఞాతులెల్ల నొకరినొకరు కొట్టుకొని చత్తురు. నేఁడు మొదలుకొని ముప్పదియాఱవసంవత్సరమున నీదినమునందే దిక్కెవ్వరును లేని

---

* పాండవా ధార్తరాష్ట్రాశ్చ క్రుద్ధాః కృష్ణ పరస్పరం, ఉపేక్షితా వినశ్యంత స్త్వయా కస్మాజ్జనార్దన. ౩౯. శక్తేన బహుభృత్యేన విపులే తిష్ఠతా బలే, ఉభయత్ర సమేనాపి శ్రుతవాక్యేన చైవహి. ౪౦. ఇచ్ఛతోపేక్షితో నాశః కురూణాం మధుసూదన, యస్మాత్త్వయా మహాబాహో ఫలం తస్మాదవాప్నుహి. ౪౧. పతిశుశ్రూషయా యన్మే తపః కించిదుపార్జితం, తేన త్వాం దురవాపేన శప్స్యే చక్రగదాధర. ౪౨. యస్మాత్పరస్పరం ఘ్నంతో జ్ఞాతయః కురుపాండవాః, ఉపేక్షితాస్తే గోవింద తస్మాత్ జ్ఞాతీన్ వధిష్యసి. ౪౩. త్వమప్యుపస్థితే వర్షే షట్త్రింశే మధుసూదన, హతజ్ఞాతి ర్హతా

కుత్సితమరణము నీకుఁ గల్గఁగలదు. నీభార్య లందఱు నాకోడం
డ్రం బోలి తమవారలఁ జేర్కొనుచు నేడువఁగలరు.

అని మహాఘోరంబుగా శపించిన నాగాంధారిపలుకులు
విని మందహాస మొనరించి శ్రీహరి యాగాంధారితో నిట్లు
పలికెను. మునిశాప మీరీతిని మున్నే తెలిపెను.నీవేల మరలఁ
జర్విత చర్వణము నొనరించితివి? ఏమి లాభము నీకుఁ గలిగెను?
యాదవుల కందఱకు వినాశనము తప్పదు సుమా. పతివ్రతా
మణీ! వారిని దేవతలుగూడఁ జంపఁజాలరు. శాపకారణముననే
వారొండొరులఁ జంపుకొనుదురు. ఆరణము దారుణముగఁ
జెల్లఁగలదు. అని కృష్ణుండు పలుకుచుండఁ బాండవులు వెల్లు
భీతిల్లి ముందేమిసాగునో యనివిచారింపసాగిరి. ఆవిధ మెఱింగి
శ్రీకృష్ణుఁడు గాంధారీ! లెమ్ము. మృతులగు వారికెల్ల నగ్నికా
ర్యములు చేయింపవలయునని ప్రోత్సహించెను. ధృతరాష్ట్రుఁడు
ధర్మరాజుం బురస్కరించుకొని తిలోదకము లిచ్చుచుండెను.
ఆశవములను బ్రోవుగాఁ బెట్టించి క్రియాపురస్సరముగా నగ్నిం
జూనిపిరి. ధర్మరాజాసమయమునఁ దనతండ్రినిగూడి స్త్రీజనమును
దోడుకొని బంధువులను బిలుచుకొని పోయి గంగాస్నాన
మాచరించి తిలోదకప్రదానము చేయుచుండెను.కుంతీదేవియా
చోటి కరిగి కన్నీరుమున్నీరుగాఁ బ్రవహించుచుండ నెల్లవారు
వినుచుండ ధర్మనందనున కిట్లు తెలిపెను. వత్సా! ఎవ్వానిసాయ
మునఁ గౌరవులు యుద్ధమునకుఁ బూనిరో మీరెల్ల నెవ్వాని
పౌరుషమునకు భయంపడుచుంటిరో దేవత లెవ్వానికదనమును

---

మాత్యో హతపుత్రో వనేచరః. ౪౪. కుత్సితేనాప్యుపాయేన నిధనం సమ
వాప్స్యసి, తవాప్యేవం హతసుతా నిహతజ్ఞాతిబాంధవాః. ౪౫. స్త్రియః
పరిపతిష్యంతి యథైవ భరతస్త్రియః. స్త్రీపర్వము. ౨౫. అధ్యా.

గాంచి యచ్చెరువందిరో యాకర్ణుని నెల్లవారు రాధేయుం డని పిలిచినను మీరు సూతనందనునిగా నెంచినను నిక్కముగా నామహనీయమూర్తి నాతొలికొడుకే యగును. మీకెల్లరకు నగ్రజన్ముఁడు. భాస్కరునను గ్రహంబున సహజకవచ కుండలమండితుఁడై యవతరించెను. కావున నాయగ్రపుత్త్రునకుఁ దిలోదకము లిమ్ము.

ఆమాటలు దుస్సహము లయి చెవులు సూఁడిన ట్లయ్యెను. పాండవులు దుస్తరశోకసాగరమున మునింగిరి. అందు భీమాదులు నివ్వెఱపడిరి. ధర్మనందనుఁడు దల్లడిల్లుచుఁ దల్లితో నిట్లు పలికెను. అమ్మా! ఎంతపని చేసితివి? మమ్మందఱ సంగర రంగమునఁ జిక్కుపఱచెను. నిఖిలరాజులను భీతాత్ములను జేసెను. అట్టికర్ణుని గొంగున నగ్నిని దాఁచిన ట్లిట్లు దాఁచితివి? నాను నెంచింగింపుము. ఒక్కయర్జునుఁడుతప్ప నాతనిమార్కొని నిలువరించునేర్పరుఁడు కలఁడా? తల్లీ నీవే చెప్పుము. ఆకర్ణుని దొలుచూలుగా నేటికిఁ గంటివి? నీమంత్రమిది మాకెల్ల విషాదావహం బయ్యెఁగదా. అభిమన్యుఁడు మరణించినప్పుడు నిట్టి శోకము మది నాటినది కాదు. ఆతఁడు మాయన్న యని యించుక తెలిసియుండినఁ గురుకులమున కిట్టి యనర్థము రాక సుఖం పడుదుము కదా. అని భోరున నేడ్చుచు విషాదము పెర్మి నక్షరము లస్పష్టము లగుచుండఁ గర్ణునిగోత్రనామంబు లుగ్గడించి తిలోదకము లిచ్చెను. ఆకార్యము లెల్ల ముగియఁగా నెల్లరం గూడి నివాసము చేరెను.

ఆర్యులారా! ఈవిషయమున నాలుగుమాటలు వ్రాయఁ దగియుండును. గాంధారి శ్రీకృష్ణుని శపించెను. శాపమిచ్చు టకుఁ దనకుఁ గలశక్తిని దెలుపుకొనుచు మహితమగుభర్తృ

శుశ్రూషామహిమమున నార్జించినతపస్సహాయమున నిన్ను శపింతునని యె. స్త్రీలకు భర్తృశుశ్రూషయే తపస్సని దీనిభావమనవలయుఁగదా. పతివ్రతయన నెట్టిస్త్రీయని విమర్శించుచు మనువు,

శ్లో. "పతిం యా నాభిచరతి మనోవాగ్దేహసంయతా,
సా భర్తృలోకమాప్నోతి సద్భిస్సాధ్వీతి చోచ్యతే. ౧౬౫
వ్యభిచారాత్తు భర్తుస్స్త్రీ లోకే ప్రాప్నోతి నింద్యతాం
శృగాలయోనిం ప్రాప్నోతి పాపరోగైశ్చ పీడ్యతే. ౧౬౪
అనేన నారీవృత్తేన మనోవాగ్దేహసంయతా,
ఇహాగ్ర్యాం కీర్తిమాప్నోతి పతిలోకం పరత్ర చ." ౧౬౬
౬ అధ్యా.

అని శాసించెను. దేహవ్యభిచారము లేకున్నంతమాత్రమునఁ బతివ్రత యనఁబడదు. మనస్సుచేతను వాక్కులచేతను గూడ సంయతురాలు కావలయునని భావము. ఇట్టినియమముకలనారీమణి శాపమీయఁజాలు. భర్తయుండులోకమున నుండఁదగును. సజ్జనులామెనే సాధ్వియని పిలుతురు. పలువురతో సరసములాడుచుఁ గరముకరమునఁ బెనచుచు నిష్టాగోష్ఠి ప్రసంగములఁ జేయుచు మనస్సున నితరుని పొత్తుగోరునది పతివ్రత యనఁబడదు. ఆమెవాక్కు ఫలింపదు. ఎవ్వతె శాపము ఫలింపదో యామె కట్టియోగ్యత యుండునని యెట్లూహింపనగును? గాంధారీచరిత్ర మీవిషయమును దృఢపఱచుచున్నయది. శాపమిచ్చుటకుఁ దనకుఁ గలశక్తి పాతివ్రత్యజనితమే యని గాంధారి దృఢపఱచెను. తపశ్శక్తి భగవంతునిగూడ శపించునంతటిమహిమ గలదనుట కిది దృష్టాంతమగును. పాతివ్రత్యమన నంతటిది. అద్దానిని బలువురతో సావాసము చేసిన లభించుదాని

నిగా నూహించుటకంటెఁ బొరపాటు వేఱొకటి కానరాదు. స్త్రీలందఱట్టిశక్తిగలవార లగుటకుం బ్రయత్నింపవలయుఁ గాని స్వేచ్ఛగాఁ బ్రవర్తింపఁ బ్రయత్నింపరాదు. శ్రీకృష్ణుఁ డాశాపమును విని మందహాసము చేసెను. అవతారఫలము కాఁగానే గోలోకమున కరుగక యీలోకమున నుండఁ దలంచుకొన్న వాఁడు కాఁడు. కావుననే మునిశాపమున యాదవులు మ్రందుదురు. ఆమాటనే నీవేల పలికితివని యాక్షేపించెను. చర్వితచర్వణము కదాయని యుల్లసమాడెను. కృష్ణుఁడు తనువు నేనాఁ డీలోకమున వదల నిశ్చయించి యుండెనో యానాఁడే నీవు నశింతువుగాక యనుశాపాక్షరములు వెలువడెను. కర్మసిద్ధాంతమునే యీవిషయము తేటపఱచెడిని. ఎవ్వరెవ్వరానాఁడు మృతినొందఁదగువారో వారెల్ల నాగాంధారీశాపరశ్మిబద్ధులైరి. ముప్పదాఱవయేట నెల్లరుయాదవులు చత్తురుగాక యనియె. ఆనాఁడే వారెల్ల సంఘాతమరణమొందఁగలకర్మమొనరించియుండిరి. వారికర్మము గాంధారియందుఁ బ్రవేశించి యాసమయమునే పలుకునట్లొనరించెనని గ్రహింపఁదగును. కర్మమెంతబలవత్తమమో గ్రహింపవచ్చును. ఇఁకఁ దర్వాతికథ నాలకింపుఁడు.

## ధర్మరాజుపట్టాభిషేకము.

తరువాతఁ బాండవులు శ్రీహరియు గంగాతీరమున నొకపావనస్థలమున నుండిరి. మహర్షులెల్ల నచ్చటి కరుదెంచి ధర్మరాజునకు మనశ్శాంతిని గలిగించిరి. ధర్మరాజు తల్లి చేసిన కార్యమునకుఁ జాలవగచి యాగ్రహము పట్టఁజాలక స్త్రీలకు రహస్యరక్షణము లేకయుండుఁగాక యని శపించెను. నాకు రాజ్యము వలదని పలుకసాగెను. భీమాదులందఱు హితముప

దేశించిరి. ద్రౌపదియు హితము తెలిపెను. మహర్షు లెందఱో మంచిమార్గముం దెలిపిరి. శ్రీకృష్ణుండును గృష్ణద్వైపాయనుం డును బెక్కుధర్మంబు లుపదేశించిరి. కుంతి యొనరించినపని మంచిదని తెలిపిరి. ఎల్లవారలు సమ్మతింపు మనఁగా ధర్మరాజు ఎట్టకేలకు సమ్మతించెను. శ్రీకృష్ణాదులయనుమతంబునఁ బట్టాభి షేకసంభారములు సేకరింపఁబడియెను. ధౌమ్యుఁడు ప్రాగుదక్ప్ల వనంబగు వేదికాతలం బత్యంతశృంగారవంతము గావింపఁజేసి యావేదికాతలంబునందు జాతరూపనవరత్నఖచితంబును, సుదృ ఢపాదంబునగు భద్రపీఠంబును బ్రతిష్ఠించి బెబ్బులిచర్మ మద్దాని పయి నమరించి పూజించి కాంచనదామజుష్టంబగు నుత్కృష్ట ఘనశంఖమును స్థండిలంబున నిలిపి విధియుతంబుగాఁ బూజించి దాని కన్నిదిక్కులఁ బార్థివంబులు హైమంబులు రాజతంబులు రత్నమయంబులు నగుకుంభంబులనునిచి వానిని గాంగములగు సలిలంబుల నింపి వానికన్నింటికి రత్నములచేతను, మంగళ ద్రుమత్వక్పల్లవకుసుమంబులచేతను బంచగవ్యములచేతను సమం త్రకముగా సంస్కారంబు కల్పించెను. తరువాత వీర్యవంతము లగుమంత్రములతోడ ధర్మరాజును సద్బ్రాహ్మణులతోడఁ బిలు చుకొనిపోయి యాభద్రపీఠంబునం గూరుచుండఁజేసెను. పిదప మంగళాభరణాలంకృతయైన ద్రౌపదిని రాజు వామపార్శ్వం బునఁ గూరుచుండఁజేసి యగ్నిముఖముచేసికొని హోమతంత్ర మంతయు నిర్వర్తించెను.

అంత శుభతమముహూర్తము సమీపింపఁగా జక్ర ధరుఁడు శ్రీకృష్ణమూర్తి వేదికాతలంబున నలంకృతమై తగుశం ఖము నెత్తి తజ్జలంబున భూపతివి కమ్మా యని ధర్మరాజు నభిషే

కించెను. ధృతరాష్ట్రుఁ డంతఁ దనయాత్మ శాంతియుతంబై యుం
డుటం జేసి ప్రతిష్ఠితకలశంబులలో నొక్కదాని ధౌమ్యుం డెత్తి
యం దీయఁగా నాధర్మసుతు నభిషేకించెను. మఱియుం గలరాజు
లందఱు నట్లే యభిషేకించిరి. శుభవాద్యధ్వను లంబరంబు
దనుక వ్యాపించెను. అభిషేకమహము సాగినపిదప ధర్మరాజెల్లఁ
ర నుచితరీతి గౌరవించి శ్రీకృష్ణునియాజ్ఞ చేయువాఁడ ననిపలికి
యామహాత్ముని విడిదిపట్టునకుం బనిచెను. పదంపడి యొక్క
నాఁడు శ్రీపరాత్పరుని శ్రీకృష్ణు నుచితపీఠంబున నునిచి నిలువం
బడి చేతులుజోడించి మహాత్మా! భవదనుగ్రహమున శత్రువులను
జయించి యాపదలం గడచి రాజుగాఁ జేయఁబడితిని. కృతార్థ
జన్ముఁడ నైతిని. బావలని మఱఁదులని దయారసమున నీవు
మన్నించుటచే మే మొకమానవుల మైతిమి. ఉన్నదున్నట్లు నీమ
హిమమును గొనియాడ మే మెంతవారము? ఆదిపురుషుఁడవని
వేదములుచెప్పుచు నీదృక్ప్రసార మిట్టిదని నిర్ణయింప భయింప
డును. ఇతరుల కెఱుంగఁదరంబగునే? పాపములఁ బరిహరింపఁ
గను శుభముల నాపాదింపను జాలునట్టినామములు నీకుఁ
బెక్కులు గలవు అవియే పరమార్థద్యోతకము లగును. అని
బహుప్రకారంబుల నభినుతించిన నామురాంతకుఁడు నిరతిశ
యవాగ్వైఖరి నాధర్మరాజుసద్గుణంబుల నభినందించెను. పిదప
ధర్మరాజాంబికేయుననుమతంబుఁ బడసి భీమునకు దుర్యోధను
సౌధమ్ము, నర్జునునకు దుశ్శాసనునిమందిరంబును, దుర్మర్షణదుర్ము
ఖులప్రాసాదంబులు నకులసహదేవులకును నివాసముగా నుండ
నియమించెను. శ్రీహరియు నాతనివర్తనంబున కలరి దా నెల్ల
భంగుల నాతనికి బాసటయై యుండెను.

## భీష్మకృతశ్రీకృష్ణస్తుతి.

రాజ్యపాలనాదరుండై ధర్మరాజు శ్రీకృష్ణానుమతంబున సోదరులసాయంబున జనానురంజనముగా విధి నెఱవేర్చుచుండి యొక్కనాఁడుదయకాలమునఁ గృష్ణదర్శనార్థము దివ్యమందిరమునకుం బోయెను. భగవంతుని నిరుపమానమూర్తిఁగాంచి పరమానందభరితుండై కరంబులు ముకుళించి రాత్రి సుఖముగా గడచెనే యని ప్రార్థించి చెంతకుంబోయెను. ధర్మరాజుమాటకు మాధవుఁ డొక్కమాటయైనను బదులాడక పరమధ్యాననిష్ఠనుండెను. ధర్మరాజు సంశయించి పలుకకుండఁ గతంబేమియో యెఱుంగఁజాలకున్నాఁడను. దయారసము పరఁగఁ దెల్పవే యని ప్రార్థించెను. పాంగజన్యధరుఁడు కొంతసేపటికి మందహాసమొనరించి యిట్లు బదులిడెను. ధర్మరాజా! గంగాదేవి యేవినుతచరిత్రుని దనగర్భమునఁ బూజ్యభంగి భరించెనో, భార్గవుం డేసాధుమతిని బ్రియశిష్యునిగా గ్రహించి గురుత్వవిఖ్యాతి నొందెనో, ఆపరశురాముఁ డేయాశూరాగ్రేసరునితో నిరువది మూఁడుదినములు పోరాడి పౌరుషమును గోలుపోయెనో, కాశీరాజ దుహితలకారణమున ననేకరాజన్యులేవీరాగ్రేసరుని ధాటికి నిలువఁజాలక పాఱిపోయిరో, ఏమహాత్మునియందు వేదములు నాలుగు ధనుర్వేద మొక్కఁడు గుదిరికఁగాంచి వెలింగెనో ఆమాననీయమూర్తి భీష్ముఁడు నన్నిత్తరుణమున ధ్యానించుచుండుటంజేసి నాచిత్తమందే లగ్నమయ్యెను. ఇంద్రియములను మనస్సు నిగ్రహించి నన్నతఁడు ధ్యానించుచున్నవాఁడు. శరతల్పగతుండగు నాతఁడే శరణముగా నాశ్రయించెనో యాతనియందు నామనస్సు లగ్నమయ్యెను. ఇది యామాన్యుని

ఖ్యానప్రకారము. ఆతఁడు వసిష్ఠమహానిశిష్యుడు. భూతభవిష్య ద్వర్తనంబుల నెఱుంగఁజాలు. సర్వవిద్యాధారభూతుఁడు. ఆతం డస్తమించిన సకలజ్ఞానంబులు నస్తమించును. కావున నీవతనిపాలికింబోయి సమస్తధర్మంబులఁ దెలిసికొని నిరస్తసంశయుండవై రాజ్యంబు పాలింపుమని యానతిచ్చెను. ధర్మరాజామాటలకలరి గద్గదకంఠుఁడై మహానుభావా! జగదీశ్వరా! గాంగేయునివర్తనంబెల్ల మున్నే మహాద్విజులవలన వింటిని. నీవు నాతనిభక్తికి మెచ్చితివి. నీసన్నిధి నామాన్యునింగాంచిన నామదిఁగలవాంఛ చేకూరును. ఉత్తరాయణంబు నాతఁడు వేచియున్నవాఁడు కావున నిన్నుంజూడ నాభీష్మఁడు వాంఛించును. నామీఁదియనుగ్రహంబును, గాంగేయునందలి పరిగ్రహంబును గారణంబులుగా నీవట్లు కటాక్షింపవలయు అని వేఁడుకోనఁగా నామురారి చెంతనున్నసాత్యకిం గాంచి తేరాయితంబుచేయుమని దారుకుని కాజ్ఞాపింపుము భీమాదులను గృపయుయుత్సుసంజయులను రావింపుమన నాతం డట్టులే యొనరించెను.

ఏసమయమున నిచట రథము సన్నద్ధముచేయఁబడియెనో యాచోటఁ బారాశర్యనారదదేవలదేవస్థానువాత్స్యదేవరాత ప్రభృతు లగుపరమమునులు పరివేష్టింపఁగా గాంగేయుండు సకలగ్రహపరివృతుం డగుచంద్రుండువోలెఁ దల్పముగా శాతశరములున్నను శోభిల్లుచు సందర్శనీయప్రభావిభాసితుఁడు నస్తమయప్రభాకరువడువున వెలుఁగుచుఁ దనచిత్తంబున నిరతిశయనిష్ఠ నిల్పి చేతులు ముకుళించి సుపుష్టస్వరంబున నిట్లు విను

తించెను. *ఓలోకేశ్వరా! శుచివి నీవే. హంసశబ్దవాచ్యుఁడవు. తత్పదవాచ్యుఁడవు. పరమేష్ఠివి. సర్వాత్మవగు నాత్మను రూపవంతముగా నొనరించినప్రజాపతి వగు నిన్ను శరణుపొందెదను. ఆద్యంతములు లేక యుత్కృష్టుఁడ వై తగునిన్ను దేవతలు మునులు నెఱుంగరు. అద్వితీయుఁడవు ధాత నారాయణుఁడు హరి లోనగునామముల వెలయు నిన్ను సేవింతును. మునులు సిద్ధులు మహోరగములు దేవతలు దేవర్షులు పరాత్పరునిగా నవ్యయునిగాఁ దలంతురో యానారాయణమూర్తిని శరణుపొందుదును. దేవదానవయక్షరాక్షసులు భగవంతుఁ డెవ్వఁడని యేల భగవంతుఁడను శబ్దముగలిగెనని యూహింతురో యామహాత్ముని సేవింతును. ఎవ్వనియందు సకలలోకము లుండునో యన్నియు నెవనియందు గుణభూతములై సూత్రమునందు మణిగణములుండునట్లు ప్రవేశించునో యాపరాత్పరునకు నమస్కరింతును. వేయిశిరస్సులు వేయిపాదములు వేయినేత్రములు వేయిబాహువులు నెవ్వని కలరునో యటియవ్యయుని

---

—◎ భీష్మకృతశ్రీకృష్ణస్తుతిః. ◎—

భీష్మః. ఆరిరాధయిషుః కృష్ణం వాచం జిగదిషామి యామ్, తయా వ్యాసనమాసేన ప్రీయతాం పురుషోత్తమః. ౧. శుచిం శుచిపదం హంసం తత్పదం పరమేష్ఠినం, యుక్త్వా సర్వాత్మనాత్మానం తం ప్రపద్యే ప్రజాపతిం. ౨.అనాద్యంతం పరం బ్రహ్మ న దేవా న ర్షయో విదుః, ఏకో ఽయం వేద భగవాన్ ధాతా నారాయణో హరిః. ౩. నారాయణాదృషిగణాస్తథా సిద్ధమహోరగాః, దేవా దేవర్షయశ్చైవ యం విదుః పరమవ్యయం. ౪. దేవదానవగంధర్వా యక్షరాక్షసపన్నగాః, యన్న జానంతి కో హ్యేష కుతో వా భగవానితి.౫. యస్మిన్ విశ్వాని భూతాని తిష్ఠంతి చ

బ్రార్థింతును. దివ్య స్తుతులచే నెవ్వని బూజింతురో గుహ్యాము లగు నిరుపమానసామము లెవ్వనికిఁగలవో యెవనిగూర్చి తప స్సుచేయుదురో యాదేవదేవుఁడే నాకు దిక్కుగుఁగాక. ఏమహా త్ముని వసుదేవుఁడు దేవకీదేవియు నరకాసురవధార్థము ధర్మ రక్షణార్థము కుమారునిగా నరణియను పాత్ర మగ్నినింబోలెఁ గనిరో యాపరబ్రహ్మమే నామది నిలుచుఁగాక. యజ్ఞవరాహ రూపుఁడై భూమినుద్ధరించి లోకత్రయమునకు హితమొనరిం చెనో వీర్యాత్మకుఁడగు నాభగవంతునకు నమస్కరింతును. సహ స్రఫణారూపపర్యంకమున నెవ్వఁడు శయనించునో నిద్రాత్మకుఁ డగు నాదేవునకు నమస్కారము లర్పింతును. అమృతయోని

విశంతి చ, గుణభూతాని భూతేశే సూత్రే మణిగణా ఇవ. ౬. యస్మిన్నిత్యే తతే తంతౌ దృఢే స్రగివ తిష్ఠతి, సదసద్గ్రథితం విశ్వం విశ్వాంగే విశ్వ కర్మణి. ౭. హరిం సహస్రశిరసం సహస్రచరణేక్షణం, సహస్రబాహుముకు టం సహస్రవదనోజ్జ్వలం. ౮. ప్రాహుర్నారాయణం దేవం యం విశ్వస్య పరాయణం, అణీయసామణీయాంసం స్థవిష్ఠం చ స్థవీయసాం. ౯. గరీయ సాం గరిష్ఠం చ శ్రేష్ఠం చ శ్రేయసామపి, యం వాకేష్వనువాకేషు నిషత్సూ పనిషత్సు చ. ౧౦. గృణంతి సత్యకర్మాణం సత్యం సత్యేషు సామసు, చతు ర్భిశ్చతురాత్మానం సత్త్వస్థం సాత్వతాం పతిం. ౧౧. యం దివ్యైర్దేవమర్చంతి గుహ్యైః పరమనామభిః, యస్మిన్నిత్యం తపస్తప్తం యదంగేష్వనుతిష్ఠతి. ౧౨. సర్వాత్మా సర్వవిత్సర్వస్సర్వజ్ఞస్సర్వభావనః. ౧౩. యం దివ్యం దేవకీదేవీ వసుదేవాదజీజనత్, భౌమస్య బ్రహ్మణో గుప్త్యై దీప్తమగ్నిమి వారణిః. ౧౪. యమనన్యోవ్యపేతాశీరాత్మానం వీతకల్మషం, దృష్ట్వానం త్యాయ గోవిందం పశ్యత్యాత్మానమాత్మని. ౧౫. అతివాయ్వింద్రకర్మాణ మతి సూర్యాతితేజసం, అతిబుద్ధీంద్రియాత్మానం తం ప్రపద్యే ప్రజాపతిం. ౧౬. పురాణే పురుషం ప్రోక్తం బ్రహ్మప్రోక్తం యుగాదిషు, క్షయే సంకర్ష

యగు సత్యముచేత నెవ్వఁడు సత్పురుషులకు నుద్ధారకుఁడ
గునో సత్యాత్మకుఁడగు నాదేవదేవునకు నమస్కారము. పెక్కు
రీతులగు ధర్మముల నాచరించుచుఁ బృథక్ఫలములఁ గోరు
దురో వేలువేలుధర్మములచే నర్చింతురో ధర్మాత్ముఁడగు నాశ్రీ
కృష్ణునకు నమస్కారము. మాసర్త్వయన సంవత్సరములచేత
యుగములయందుఁ దిరుగుచుండునో సర్గప్రళయములకుఁ గర్త

---

ణం ప్రోక్తం తముపాస్యముపాస్మహే. ౧౭. యమేకం బహుధాత్మానం
ప్రాదుర్భూతమధోక్షజం, నాన్యభక్తాః క్రియావంతో యజంతే సర్వకామ
దం. ౧౮. యమాహుర్జగతః కోశం యస్మిన్ సన్నిహితాః ప్రజాః, యస్మిన్
లోకాస్స్ఫురంతీమే జలే శకునయో యథా. ౧౯. ఋతమేకాక్షరం
బ్రహ్మ యత్తత్సదసతోః పరం, అనాదిమధ్యపర్యంతం న దేవా నర్షయో
విదుః. ౨౦. యం సురాసురగంధర్వాస్సిద్ధా ఋషిమహోరగాః, ప్రయతా
నిత్యమర్చంతి పరమం దుఃఖభేషజం. ౨౧. అనాదినిధనం దేవమాత్మయోనిం
సనాతనం, అప్రేక్ష్య మనభిజ్ఞేయం హరిం నారాయణం ప్రభుం. ౨౨.
యం వై విశ్వస్యకర్తారం జగతస్తస్థుషాం పతిం, వదంతి జగతోధ్యక్షమక్షరం
పరమం పదం. ౨౩. హిరణ్యవర్ణం యం గర్భ మదితేర్దైత్యనాశనం, ఏకం
ద్వాదశధా జజ్ఞే తస్మై సూర్యాత్మనే నమః. ౨౪. శుక్లే దేవాన్ పితౄన్
కృష్ణే తర్పయత్యమృతేన యః, యశ్చ రాజా ద్విజాతీనాం తస్మై సోమా
త్మనే నమః. ౨౫. మహతస్తమసః పారే పురుషం హ్యతితేజసం, యం
జ్ఞాత్వా మృత్యుమత్యేతి తస్మై జ్ఞేయాత్మనే నమః. ౨౬. యం బృహంతం బృ
హత్యుక్థే యమగ్నౌ యం మహాధ్వరే, యం విప్రసంఘా గాయంతి తస్మై
వేదాత్మనే నమః. ౨౭. ఋగ్యజుస్సామధామానం దశార్ధహవిరాత్మకం,
యం సప్తతంతుం తన్వంతి తస్మై యజ్ఞాత్మనే నమః. ౨౮. చతుర్భిశ్చ చతుర్భి
శ్చ ద్వాభ్యాం పంచభిరేవ చ, హూయతే చ పునర్ద్వాభ్యాం తస్మై హో

యగు నాకాలాత్మకునకు నమస్కారము. వేదములు ముఖము క్షత్రము భుజములు వైశ్యులూరువులు శూద్రులు పాదములో యావర్ణాత్మకునకు వందనములు. లోకాత్మకుఁడును విశ్వాత్మకుఁడు గోప్తయునగు శ్రీహరిని భజింతును. ప్రాణాత్మకుఁడగు పరమేశ్వరు నారాధింతును. పాకాత్మకుఁడగు విష్ణు నర్చింతును. దృష్టాత్మకుఁడయి సూక్ష్మాకృతియగుచు వీర్యాత్ముఁడునై మోహాత్ముఁ

---

మాత్మనే నమః. ౨౯. యస్సుపర్ణో యజుర్నామ చ్ఛందోగాత్రస్త్రివృచ్ఛిరాః, రథన్తరం బృహత్సామ తస్మై స్తోత్రాత్మనే నమః. ౩౦. యస్సహస్రసమే సత్రే జజ్ఞే విశ్వసృజామృషిః, హిరణ్యపక్షశ్శకునిస్తస్మై హంసాత్మనే నమః. ౩౧. పాదాంగం సంధిపర్వాణం స్వరవ్యంజనభూషణం, యమాహురక్షరం దివ్యం తస్మై వాగాత్మనే నమః. ౩౨. యజ్ఞాంగో యో వరాహో వై భూత్వా గాముజ్జహార హ, లోకత్రయహితార్థాయ తస్మై వీర్యాత్మనే నమః. ౩౩. యశ్శేతే యోగమాస్థాయ పర్యంకే నాగభూషితే, ఫణాసహస్రరచితే తస్మై నిద్రాత్మనే నమః. ౩౪. యస్తనోతి సతాం సేతుమృతే నామృతయోనినా, ధర్మార్థవ్యవహారాంగైస్తస్మై సత్యాత్మనే నమః. ౩౫. యం పృథగ్ధర్మచరణాః పృథగ్ధర్మఫలైషిణః, పృథగ్ధర్మైస్సమర్చంతి తస్మై ధర్మాత్మనే నమః. ౩౬. యతస్సర్వే ప్రసూయంతే హ్యనంగాత్మాంగదేహినః, ఉన్మాదస్సర్వభూతానాం తస్మై కామాత్మనే నమః. ౩౭. యంచ వ్యక్తస్థమవ్యక్తం విచిన్వంతి మహర్షయః, క్షేత్రే క్షేత్రజ్ఞమాసీనం తస్మై క్షేత్రాత్మనే నమః. ౩౮. యం త్రిధాత్మానమాత్మస్థం వృతం షోడశభిర్గుణైః, ప్రాహుస్సప్తదశం సాంఖ్యాస్తస్మై సాంఖ్యాత్మనే నమః. ౩౯. యం వినిద్రాజితశ్వాసాస్సత్త్వస్థాస్సంయతేంద్రియాః, జ్యోతిః పశ్యన్తి యుంజానాస్తస్మై యోగాత్మనే నమః. ౪౦. అపుణ్యపుణ్యోపరమే యం పునర్భవనిర్భయాః, శాంతాస్సన్న్యాసినో యాంతి తస్మై మోక్షాత్మనే నమః. ౪౧. యోఽసౌ యుగసహస్రాంతే ప్రదీప్తార్చిర్విభావసుః, సంభక్షయతి భూతాని

డనంబరఁగుచు జ్ఞానాత్మకుఁడయి దివ్యాత్మకుండును. దానే యయి దివ్యాత్ముఁడయి యలరు శ్రీగోపాలబాలునకు నంజలి యొనర్తును. అతసీకుసుమసంకాశదేహచ్ఛాయగలిగి పీతాంబరుఁడై యచ్యుతుఁడై తనరు శ్రీకృష్ణున కెవ్వరు నమస్కరింతురో వారికి భయమే లేదు. శ్రీకృష్ణునకుఁ జేసిన యొక్కనమస్కా

---

తస్మై ఘోరాత్మనే నమః, ౪౨. సంభక్ష్య సర్వభూతాని కృత్వా చైకార్ణవం జగత్, బాలస్స్వపితి యశ్చైకస్తస్మై మాయాత్మనే నమః. ౪౩. అజస్య నాభౌ సంభూతం యస్మిన్ విశ్వం ప్రతిష్ఠితం, పుష్కరే పుష్కరాక్షస్య తస్మై పద్మాత్మనే నమః. ౪౪. సహస్రశిరసే చైవ పురుషాయామితాత్మనే, చతుస్సముద్రపర్యాయ యోగనిద్రాత్మనే నమః. ౪౫. యస్య కేశేషు జీమూతానద్యస్సర్వాంగసంధిషు, కుక్షౌసముద్రాశ్చత్వారస్తస్మై తోయాత్మనే నమః. ౪౬. యస్మాత్సర్వాః ప్రసూయంతే సర్గప్రళయవిక్రియాః, యస్మింశ్చైవ ప్రలీయంతే తస్మై హేత్వాత్మనే నమః. ౪౭. యో విషణ్ణో భవేద్రాత్రౌ దివాభవతి విష్ఠితః, ఇష్టానిష్టస్య చ ద్రష్టా తస్మై ద్రష్టాత్మనే నమః. ౪౮. అకుంఠం సర్వకార్యేషు ధర్మకార్యార్థముద్యతం, వైకుంఠస్య చ యద్రూపం తస్మై కార్యాత్మనే నమః. ౪౯. త్రిస్సప్తకృత్వో యః క్షత్రం ధర్మవ్యుత్క్రాంతగౌరవం, క్రుద్ధో నిజఘ్నే సమరే తస్మై క్రౌర్యాత్మనే నమః. ౫౦. విభజ్య పంచధాత్మానం వాయుర్భూత్వా శరీరగః, యశ్చేష్టయతి భూతాని తస్మై వాయ్వాత్మనే నమః. ౫౧. యుగేష్వావర్తతే యోగైర్మాసర్త్వయనహాయనైః, సర్గప్రళయయోః కర్తా తస్మై కాలాత్మనే నమః. ౫౨. బ్రహ్మ వక్త్రం భుజౌ క్షత్రం కృత్స్నమూరూదరం విశః, పాదౌ యస్యాశ్రితాశ్శూద్రాస్తస్మై వర్ణాత్మనే నమః. ౫౩. యస్యాగ్నిహోత్రం ద్యౌర్మూర్ధా ఖం నాభిశ్చరణౌ క్షితిః, సూర్యశ్చక్షుర్దిశశ్శ్రోత్రం తస్మై లోకాత్మనే నమః. ౫౪. పరః కాలాత్పరో యజ్ఞాత్పరాత్పరతరశ్చ యః, అనాదిరాదిర్విశ్వస్య తస్మై విశ్వాత్మనే నమః. ౫౫. విషయే వర్తమానానాం

రము దశాశ్వమేధావభృథస్నానసమానము. పదియశ్వమేధము లొనరించినవానికిఁ బునర్జన్మము కలదు. కృష్ణునకు సమస్కరించినవానికి బునర్జన్మములేదు. కృష్ణవ్రతముగలవారలై కృష్ణునే స్మరించుచు రాత్రియందు గృష్ణునిస్మరించి మరల లేచుచు మరల నిద్ర చేయుచుండువారలు కృష్ణపరమాత్మునియందే ప్రవే

---

యం వై వైశేషికైర్గుణైః, ప్రాహురీవిషయగోప్తారం తస్మై గోప్త్రాత్మనే నమః. ౧౬. అన్నపానేంధనమయో రసప్రాణవివర్ధనః, యో ధారయతి భూతాని తస్మై ప్రాణాత్మనే నమః. ౧౭. ప్రాణానాం ధారణార్థాయ యోఽన్నం భుంక్తే చతుర్విధం, అంతర్భూతః పచత్యగ్నిస్తస్మై పాకాత్మనే నమః. ౧౮. పింగేక్షణసటం యస్య రూపం దంష్ట్రానఖాయుధం, దానవేంద్రాంతకరణం తస్మై దృప్తాత్మనే నమః. ౧౯. యం న దేవా న గంధర్వా న దైత్యా న చ దానవాః, తత్త్వతో హి విజానంతి తస్మై సూక్ష్మాత్మనే నమః. ౨౦. రసాతలగతశ్శ్రీమాననంతో భగవాన్ విభుః, జగద్ధారయతే కృత్స్నం తస్మై వీర్యాత్మనే నమః. ౨౧. యో మోహయతి భూతాని స్నేహపాశానుబంధనైః, సర్గస్య రక్షణార్థాయ తస్మై మోహాత్మనే నమః. ౨౨. ఆత్మజ్ఞానమిదం జ్ఞానం జ్ఞాత్వా పంచస్వవస్థితం, యం జ్ఞానేనాభిగచ్ఛంతి తస్మై జ్ఞానాత్మనే నమః. ౨౩. అప్రమేయశరీరాయ సర్వతో బుద్ధిచక్షుషే, అనంతపరిమేయాయ తస్మై దివ్యాత్మనే నమః. ౨౪. జటినే దండినే నిత్యం లంబోదరశరీరిణే, కమండలునిషంగాయ తస్మై బ్రహ్మాత్మనే నమః. ౨౫. శూలినే త్రిదశేశాయ త్ర్యంబకాయ మహాత్మనే, భస్మదిగ్ధోర్ధ్వలింగాయ తస్మై రుద్రాత్మనే నమః. ౨౬. చంద్రార్ధకృతశీర్షాయ వ్యాళయజ్ఞోపవీతినే, పినాకశూలహస్తాయ తస్మై ఉగ్రాత్మనే నమః. ౨౭. సర్వభూతాత్మభూతాయ భూతాదినిధనాయ చ, అక్రోధద్రోహమోహాయ తస్మై శాంతాత్మనే నమః. ౨౮. యస్మిన్ సర్వం యతస్సర్వం యస్సర్వం సర్వతశ్చ యః, యశ్చ సర్వమయో నిత్యం తస్మై సర్వాత్మనే నమః. ౨౯. విశ్వకర్మన్నమస్తేఽస్తు విశ్వా

శింతురు. ప్రాణకాంతారముపాథేయమై సంసారోచ్ఛేదభేష
జమై దుఃఖశోకపరిత్రాణమై హరియను నక్షరద్వయము ప్రకా
శించును. సత్యమువిష్ణుమయము. జగము విష్ణుమయము. సర్వము
విష్ణుమయము. కావున నాపాపముల నాశ్రీకృష్ణుఁడు నశింపఁజే
యుఁగాక. విద్యాతపస్సుల కుత్పత్తిస్థానమై తా నజుం డై

---

త్మక విశ్వసంభవ, అపవర్గసభూతానాం పంచానాం పరతస్థ్సితః. ౨౦. నమస్తే త్రిషు లోకేషు నమస్తే పరతస్త్రిషు, నమస్తే దిక్షు సర్వాసు త్వం వా సర్వమయో నిధిః. ౨౧. నమస్తే భగవన్విష్ణో లోకానాం ప్రభవావ్యయ, త్వం హి కర్తా హృషీకేశ సంహర్తా చాపరాజితః. ౨౨. న హి పశ్యామి తే భావం దివ్యం హి త్రిషు వర్త్మసు, త్వాంతు పశ్యామి తత్త్వేన యత్తే రూపం సనాతనం. ౨౩. దివం తే శిరసా వ్యాప్తం పద్భ్యాం దేవీ వసుంధరా, విక్రమేణ త్రయో లోకాః పురుషోఽసి సనాతనః. ౨౪. దిశో భుజా రవిశ్చక్షుర్వీర్యం శుక్రః ప్రజాపతిః, సప్తమార్గానిరుద్ధాస్తే వాయోరమితతేజసః. ౨౫. అతసీపుష్పసంకాశం పీతవాససమచ్యుతం, యే నమస్యంతి గోవిందం న తేషాం విద్యతే భయం. ౨౬. ఏకోఽపి కృష్ణస్య కృతప్రణామో దశాశ్వమేధావభృథేన తుల్యః, దశాశ్వమేధీ పునరేతి జన్మ కృష్ణప్రణామీ నపుర్భవాయ. ౨౭. కృష్ణవ్రతాః కృష్ణమనుస్మరంతో రాత్రౌ చ కృష్ణం పునరుత్థితా యే, తే కృష్ణదేహాః ప్రవిశంతి కృష్ణమాజ్యం యథా మంత్రహుతం హుతాశే. ౨౮. నమో నరకసంత్రాసరక్షామండలకారిణే, సంసారనిమ్నగావర్తతరికాష్ఠాయ విష్ణవే. ౨౯. నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ, జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః. ౩౦. ప్రాణకాంతారపాథేయం సంసారోచ్ఛేదభేషజం, దుఃఖశోకపరిత్రాణం హరిరిత్యక్షరద్వయం. ౩౧. యథావిష్ణుమయం సత్యం యథావిష్ణుమయం జగత్, యథా విష్ణుమయం సర్వం పాప్మా మే నశ్యతాం తథా. ౩౨.

యుండు విష్ణువు నాచే వాగ్యజ్ఞముచేత నర్చితుండై ప్రీతి నొందుఁగాక. నారాయణుఁడే పరబ్రహ్మము. నారాయణుఁడే పరమతపస్సు నారాయణుఁడే పరదైవము. సర్వము నారాయణమూర్తియే అని వినుతించి గాంగేయుఁడు తద్గతమానసుఁడై యుండెను.

భీష్ముఁ డిట్టు లాహరి వినుతించి చేతులుజోడించి నమస్కరించెను. అచ్చటి మౌనులందఱు గద్గదకంఠులై శ్రీకృష్ణపరమాత్మను సన్నుతించిరి. అంత ధర్మరాజునుగూడి శ్రీహరి గాంగేయునికడకుఁ బ్రయాణము సాగించెను. ధర్మనందనధనంజయు లొక్కరథంబునను, భీమనకులసహదేవు లొక్కయరదంబునను, గృపయుయుత్సుసంజయు లొక్కస్యందనంబు నెక్కి యుచిత పరివారముం గొనిపోయిరి. గాంగేయుఁ డున్నతావునకు సమీపమునందే రథములు డిగి చని వ్యాసాదులకు నమస్కరించి గాంగేయుం బరివేష్టించి కూరుచుండిరి. అచ్యుతుం డాశాంతనవు నాలోకించి యిట్లు ప్రశ్నించెను. గాంగేయా! పూర్వము రీతిగా నీచిత్త మిపు డవ్యాకులమై యున్నదియా? మనఃక్లేశము నకంటె దేహపీడ యధికమందురు. ఒక్కములికి తనువుననాఁటిన నెంతయో శ్రమము కల్గించును. నీయంగమో బహుబాణకీలితమై

త్వాం ప్రపన్నాయ భక్తాయ గతిమిష్టాం జిగీషవే, యచ్ఛ్రేయః పుండరీకాక్ష తద్ధ్యాయస్వ సురోత్తమ. ౮౩. ఇతి విద్యాతపోయోనిరయోనిర్విష్ణురీడితః వాగ్యజ్ఞేనార్చితో దేవః ప్రీయతాం మే జనార్దనః. ౮౪. నారాయణపరం బ్రహ్మ నారాయణపరం తపః, నారాయణపరో దేవ స్సర్వం నారాయణ స్సదా. ౮౫. ఏతావదుక్త్వా వచనం భీష్మస్తద్గతమానసః, నమ ఇత్యేవ కృష్ణాయ ప్రణామమకరోత్తదా. ౮౬.

ఇతిభీష్మకృతా శ్రీకృష్ణస్తుతిస్సమాప్తా.

యున్నది. ఇట్టులుండియు నించుకేని బాధనొందకుండుట పితృ
వరప్రభావముగాదా. ఓమహాతేజా! దేవతలకుంగూడ నీ వుప
దేశింతువు. కలిమిలేములకు వికారమొందకుండ నిన్ను బోధిం
పఁగలవార లెవ్వరు గలరు? భూతములసంసరణము భూతభవి
ష్యద్వర్తమానకార్యగతులు కర్మమార్గము ననునివన్నియు
నీయఱచేతిలోనివికదా. రాజఁట, రాగహీనుఁడఁట, రాజితసుందర
మూర్తియఁట, సంపదున్నతివిభాసితమూర్తియఁట, కామినీరాజి
మనోజ్ఞభంగిచతురత్వఘనుండఁట, బ్రహ్మచర్యదీక్షాజితమన్మథుం
డఁట. ఇట్టిజన్మము లెందుఁగలవు? శంతననందనా! అంతరింద్రియ
నిగ్రహము సత్యము తపము దానము వేదములయందు ధను
ర్వేదమునందు నైపుణియు ధర్మవిధిజ్ఞత విరోధిభూజాని విమ
ర్దనక్రమవిరాజితశౌర్యము నీకుండినట్లు నైజములుగఁ గల
వాఁడు వేఱొకఁడు భూలోకమునఁ బుట్టఁడు. గంగానందనా!
వేయిపలుకు లేల? సాయకతల్పమున నుండియుఁ జావఁబూనను.
అది నాయిచ్ఛాధీనము. అనునంతటివాఁ డేయుగముననైన
నెందైన నుండునా! వింటిమా! సత్యనిత్యా! తపోవిశేషమహా
నీయత్వముచేత సకలజగంబులను భావమునఁగాంచఁగల్గుదువు.
ఈధర్మరాజు సుహృదాప్తమరణమున నత్యావిలచిత్తుఁడై
యున్నవాఁడు దుఃఖార్ణవమగ్నుఁడై యున్నవాఁడు. నీపుణ్యాత
మస్ఫుటవాక్యపద్ధతిచే నీతని విగతశోకునిగాఁ జేయుము.
నాలుగుజాతులకు నాలుగాశ్రమములకు నివ్వియివ్వి యర్హంబు
లని నాలుగువేదంబులందును జెప్పినధర్మంబులు నీకుఁ గరతలా
మలకప్రాయములు. ప్రవృత్తినివృత్తులు సాంఖ్యయోగములు
పురాణేతిహాసములు ధర్మశాస్త్రములు నవగతంబులే సర్వసంశ
యవిచ్ఛేద మొనరింప దక్షుండవు. కావున నీ వీక్షితిపతి నాధ

రింపుము. శోకమోహాగ్రస్తమగుజనంబు నిస్తరింపఁ జేయుట
కదా మీబోంట్లబుద్ధిచమత్కృతికి ఫలము. అని యాజ్ఞాపించిన
మురాంతకునిపలుకు లాలకించి యించుక మొగంబెత్తి కృతాం
జలియై శాంతనవుం డిట్లు పలికెను. మహాపురుషా! కర్తయు
భర్తయు సంహర్తయుఁ బ్రపంచములకు నీవేకదా. ఓయాశ్రి
తజనఘోరార్తినిరాసనిపుణసంకీర్తనా! యోగీశ్వరేశ్వరా! శ్రీకృ
ష్ణా!యని మఱియు బహుప్రకారంబులం బ్రశంసించి నాకు
మేలేదియో దాని నీదివ్యచిత్తంబునం దలంపుము. అనుటయు
శ్రీహరి యిట్లు పలికెను. తపస్స్వరూపా! భీష్మా! నాయందుఁ
నిశ్చలభక్తి నీకుఁ గలదు. కావున నీయంతరంగమునందు నాది
వ్యరూపంబును బ్రవేశింపఁజేసితిని. ప్రమోదభాజనంబైతి.ఇంత
కంటె వేఱొకమేలు గోరనేల? భక్తియు నార్జవము రెండును
గలిసి యున్నమనస్సునందే నే నాసక్తితో నిలుతును. అందొ
కండు లేకున్నను నిలువను. అనఘా; నేఁటికి నేఁబదియాఱుదిన
ములకు భానుఁ డుత్తరాయణమున సంచరింపఁబూనును.నీ వా
కాలమున నీదేహమును విడిచిపోవుదువు. అపునరావృత్తిప
దమునకుందువు.నీరాకంగోరి వసువులు విమానముం గొనివచ్చి
యంబరమున వేచియున్నవారు నిన్నుఁ దమలోకంబునకుం గొని
పోవఁ ద్వరపడుచున్నవారు వీరె మహర్షులెల్ల నీవలన ధర్మం
బుల వినఁ బరివేష్టించి యున్నవారు. ఈధర్మరాజు శోకోపహత
బహుశ్రుతుండు కావునఁ దెలివొందునట్లు ధర్మార్థసమాధియు
క్తంబులగు వాగ్విశేషముల ననుగ్రహింపుమని తెలిపిన నాగాం
గేయుండు దేవకీనందనుంగాంచి *శివా!నారాయణా!అచ్యుతా!

* లోకనాథ మహాబాహో శివ నారాయణాచ్యుత, తవ వాక్యముప
శ్రుత్యాహం హర్షేణాస్మి పరిప్లుతః—అని మూలము.

భవదీయమధురభాషణములు నాశ్రుతులను పావనములుగా నొనరించెను. అమృతసాగరమున మునింగినట్లయ్యెను. ప్రమోద భరితుండనైతిని. నీవు వాగధిపతివి అట్టి నీవాగ్వైభవములో పల సమస్తంబు వెలయును. అట్టి నీయెదుట బ్రహ్మాదులుకూడ మాటలాడంజాలరనంగా నేనెట్లు పలుకుదును? విషాగ్నిసమానములగుసాయకములు దేహమెల్లనావరించియుండుటంజేసి యంగములు నంతరంగము నవశములై యున్నవి. ప్రతిభాషించునంత శక్తి కలుగదు. దౌర్బల్యమునం గంఠరవము నాలుకయుం బ్రస్ఫుటములుగాలేవు. ఇట్టితఱి నెట్లు సంభాషింప నుత్సహింతును? ప్రతిభాషింప శక్తి లేమింజేసి యశక్తుండనగు నాయందుం గరుణింపుము. ధర్మరాజున కేదివిహితమో దానినెల్లనీ వుపదేశింపుము. నీయెదుట నేనుపదేశించుట పాడిగాదు. లోకగురుండవగు నీయెదుటనేం బలికినది గురువుండంగా శిష్యుండు చెప్పినట్లేయగు. అని ప్రార్థించుటయు భక్తార్తిహారుండగు నాశ్రీకృష్ణమూర్తి *పరమభక్తుండగు భీష్ముని పరమార్థవేత్తృత్వమునకుం గరము సంతసిల్లి శాంతనవా! భరింపందరముగాని శరవే

---

*యచ్చ మామాత్థ గాంగేయ బాణాఘాతరుజం ప్రతి, గృహాణాత్ర వరం భీష్మ మత్ప్రసాదకృతాం ప్రభాం. ౧౫. న తే గ్లానిర్న తే మూర్ఛా న దాహో న చ తే రుజా, ప్రభవిష్యంతి గాంగేయ క్షుత్పిపాసే నచాప్యుత. ౧౬. జ్ఞానాని చ సమగ్రాణి ప్రతిభాస్యంతి తేఽనఘ, న చ తే క్వచిదాసక్తిర్బుద్ధేః ప్రాదుర్భవిష్యతి. ౧౭. సత్త్వస్థం చ మనో నిత్యం తవ భీష్మ భవిష్యతి, రజస్తమోభ్యాం రహితం ఘనైర్ముక్త ఇవోడురాట్. ౧౮. యద్యచ్చ ధర్మసంయుక్తమర్థయుక్తమథాపి చ, చింతయిష్యసి తత్రాగ్ర్యా బుద్ధిస్తవ భవిష్యతి. ౧౯. ఇమం చ రాజశార్దూల భూతగ్రామం చతుర్విధం, చక్షుర్దివ్యం సమాశ్రిత్య ద్రక్ష్యస్యమితవిక్రమ. ౨౦. అని మూలము.

దనఁ దెలిపితివి. విచారమయ్యెడిని కావున నీయెడం బ్రసన్నుం డనై వరములు మూఁడీయఁ దలంచితిని వానిం దప్పక పరిగ్రహింపుము. అందు బాణఘాతముల మూర్ఛగలుగక యొక్కింతయు డప్పి గలుగక యథాపూర్వశరీరము గలుగునట్లొక వరమిచ్చితిని. అనఘా! క్షుత్తు. తృష్ణయు నెప్పుడును గలుగకయుండుట భూరిశక్తి నీకుఁ గలుగునట్లు రెండవవరమిచ్చితిని. వానిబాధలు నిన్నంటక యుండును. ఇది రెండవవరము. సకలభూత వర్తనము లాలోచించునపుడు నీయెదుట జరగినట్లుండును. బుద్ధిస్ఫూర్తికిఁ గొఱంత రాదు. దివ్యబోధము నీ కలవడును ఇది మూఁడవ వరము. నాయనుగ్రహమున నీవిట్టి ప్రభావుండవై నెగడుమని యాదరమునఁ బలికెను. ఆయనుగ్రహవాక్యములకుఁ బానాశ్చర్యాని మహర్షులు మహానందమునఁ శ్రీకృష్ణుం బ్రశంసించిరి. అంబరమున దేవదుందుభులు మొరసె. ముంగారిగాం గేయ ధర్మనందనులమీఁద బూలవానలు గురిసెను. మునులు మురారిచే ననుజ్ఞాతులై రేపువత్తుమని పోయిరి ధర్మరాజాదులు భీష్మానుమతి నందియరదంబు లెక్కి తమనివాసముల కరిగిరి.

మహాశయులారా! ఈఘట్టము పరమరహస్యార్థబోధకము. కావున నిందలిరహస్య మెఱుంగవలయును. ధర్మరాజు భగవద్దర్శనమున కరిగెను. శ్రీకృష్ణమూర్తి శయనించి యుండెను. కాని యాతని చిత్తమందు లేదు. భీష్ముని చెంత నుండెను. యుధిష్ఠిరుని రాక నెఱుంగనట్లుండెను భగవంతుని కీ విషయము తెలియదనరాదు భీష్మునిమాహాత్మ్యమునుధర్మరాజునకుం దెలుపుటకే యట్లుండెను. ఇంచుకసేపటికి ధర్మజుంగని చిఱునవ్వున మాటలాడెను. ధర్మజుఁడు కారణ మడిగెను భీష్ముఁడు తలంచుచున్నందున నామనస్సాభక్తాగ్రేసరునియందు లగ్నమయ్యెనని

నుడివి యాతనింజూడఁబొమ్మని ప్రోత్సహించెను. సకలధర్మములు తానుపదేశింపఁ గలిగియు భీష్మునిమూలమున ధర్మరాజునకుఁ దెలియునట్లొనరించి తనభక్తునిఖ్యాతి లోకమున వెల్లడి చేయఁదలంచెనని యీవిషయమునుండి మనము గ్రహింపవలయును. భక్తులమేలే తనమేలని తలంచుపరాత్పరుని మహాత్త్వము వర్ణనాతీతమని మన మెఱుంగుటయే యుత్తమమార్గము. తనయవతారఫలమగుభూభారహరణకార్యమును బూరించి సకలధర్మముల ధర్మజునకుం దెలుపుట యను వ్యాజమునఁ బామరులకు భీష్మునిమూలమున వెల్లడింపఁ దలంచినపరాత్పరుని మనము స్మరించుటకన్నఁ జేయవలసినపురుషార్థము వేఱొకటి కానరాదు.

అర్జునుని సాధనముగాఁ జేసి తానే మృత్యుంజయుని రూపమును దాల్చి యారూపము తెలియకయుండఁ జేసి భూభారభూతులగువారినెల్లం దునిమి దానఁగలుగువిఖ్యాతి నర్జునునకుం గల్గించి దానిచే నతనికి నహంకార ముదయించి చెడునను తలంపున నాతనికే తనముందట నెవరో శూలమున నెల్లరం జంపుచున్నట్లు కనఁబడంజేసి యాసంశయమును వ్యాసముని మూలమునఁ దీర్పించి యీమహాకార్యమునకు నేను గర్తను గానని యర్జునునకుఁ దోపఁజేసి దీనింజదువుటచేత జ్ఞానులగువారు తమయహంకారశేషమును బాపికొనునట్లొనరించిన సర్వేశ్వరునిమహిమమును స్మరించుటయే పరమపురుషార్థమనుట విచిత్రమా! ఇట్టిమహావిచిత్రచరిత్రునిచరిత్రము పరమపవిత్రము ఇందు ముఖ్యము గీతోపదేశము. ఆగీతాశాస్త్రమే సకల వేదసారము. కలియుగమున కది యత్యంతోపకారకము. దానిం జదివించి యుపన్యాసముచెప్పిన లాభము విశేషించి కలుగదు

దానినుండి గ్రహించినయర్థము నాచరణమునకుఁ దెచ్చుకొనినఁ గాని భగవద్దర్శనము లభింపదు. దానికై గీతోపదేశముల ననుసరించి నిర్మములు నిరహంకారులును గావలయును. వేషధారణమున లాభములేదు. లోకమును వంచించి ధనమార్జించిన లాభము లేదు. చెట్టుగొట్టి దాని క్రిందఁ గూరుచున్నట్టులగును. నిష్కపటవృత్తినూని పరమతసహిష్ణుతగలిగిభగవంతుని నదంభమార్గమున సేవింపవలయును. సర్వదేవతాసామ్యము గనవలయును. సర్వశబ్దవాచ్యుఁడు భగవంతుఁడని గ్రహింపవలయును. "శివ నారాయణాచ్యుత" అని భీష్మస్తుతియందుఁ గలదుకదా. శివశబ్దమునకు వీరవైష్ణవు లింకొక్కయర్థమును జెప్పుదురు కాఁబోలు. అప్పుడు నారాయణశబ్దమున కింకొక్కయర్థ జెప్పు నవకాశము వీరశైవులకుండదా. ఆయర్థమును జెప్పుకొనుచు వారు తృప్తినొందుటకంటె సర్వనామము లాభగవంతునకుఁగలవనియు, సర్వదేవత లాయాయికార్యార్థము భగవంతుఁ డెత్తిన రూపములే యనియు గ్రహించుట సముచితము కాదా. అట్లు వారు గ్రహింపనిచో నుత్కృష్టపదవి చేరఁజాలరని మాత్రము ఘంటాపథముగఁ జెప్పవచ్చును. సర్వరూపములయందొక్కరీతిగా నన్నుంజూచువాఁడే పండితుఁడని భగవంతుఁడే ఘంటాపథముగాఁ జెప్పుచుండ దానివదలిన ముక్తిదొరకుననుటకంటె నవివేకము వేఱుగ నేముండును? అట్టిభేదబుద్ధిని మాని సర్వసమత్వమును బాటించి జగద్రక్షకుఁడు కరుణాసముద్రుఁడు నగు శ్రీకృష్ణపరబ్రహ్మము నాశ్రయించు టుత్తమమని మనమెఱుంగవలయును. అదియే పురుషార్థము. దానికంటె నీకలికాలమునఁ జేయఁదగు మహాకృత్యము వేఱుగ లేదు. ఇంతట

నీ ప్రకరణమును ముగించుచు నాపన్నివారకుఁడు భక్తాభీష్ట ప్రదాయకుఁడు నగు శ్రీకృష్ణపరబ్రహ్మస్తవమును వ్రాసెదను.

శ్లో. శృంగారరససర్వస్వం శిఖిపించవిభూషణం,
అంగీకృతనరాకారమాశ్రయే భువనాశ్రయమ్. ౯౨

నాద్యాపి పశ్యతి కదాచన దర్శనేన
చిత్తేన చోపనిషదా సుదృశాం సహస్రమ్,
సత్యం చిరం నయనయోరనయోః పదవ్యాం
స్వామిన్ కదాను కృపయా మమ సన్నిధత్సే. ౯3

కేయం కాంతిః కేశవ త్వన్ముఖేందోః
కోఽయం వేషః కోఽపి వాచామభూమిః,
సేయం సోఽయం స్వాదుతా మంజులశ్రీః
భూయో భూయో భూయశస్త్వాం నమామి. ౯౪

తత్త్వన్ముఖం కథమివాబ్జసమానకక్ష్యం
వాఙ్మాధురీబహుళసర్వకళాసమృద్ధమ్,
తత్కిం బ్రువే కిమపరం భువనైకకాంతం
యస్య త్వదాననసమా సుషమా సదా స్యాత్. ౯౫

శ్రీకృష్ణకర్ణామృతము ౧. ఆశ్వా.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

శ్రీకృష్ణావతారతత్త్వమునందుఁ బరమార్థోపదేశమను
పదునొకండవ ప్రకరణము

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

కావ్య స్మృతి తీర్థ

# శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| శ్రీకృష్ణావతారతత్త్వము 1 మొదలు 10 భాగములు | | | |
| ఒక్కొకభాగము | ... | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, నిర్వచనము, వ్యాఖ్యానముల లోని భావముకూడ విడువక తెనిగింపఁబడినది. ఏ శ్లోక మున కే పద్యమో తెలియుటకై శ్లోకసంఖ్యకూడఁ దెలుపఁ బడినది. 3-సంపుటముల ప్రతి | ... | 12 | 1 |
| 7-సంపుటముల ప్రతి | ... | 14 | 0 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము, భండాసురుని లలితాదేవి చంపుట మొదలగు గాథ లనేకము లిందున్నవి. | | 1 | 8 |
| విచిత్ర పాదుకాపట్టాభిషేకనాటకము | ... | 0 | 12 |
| పాండవాజ్ఞాతవాసనాటకము | ... | 0 | 12 |
| రామవనవాసనాటకము | ... | 0 | 10 |
| సంగ్రహరామాయణము, వచనము, సులభశైలి | | 0 | 10 |
| సంగ్రహభారతము | ... | 1 | 0 |
| సంగ్రహభాగవతము | ... | 1 | 0 |
| స్వప్నయాత్ర, నవల | ... | 1 | 0 |
| హనుమద్విజయము | ... | 0 | 8 |
| తెలుఁగు బ్రహ్మపురాణము | (అచ్చగుచున్నది) | | |
| భగవద్గీతలు, వచనము | ,, | | |

వావిళ్ల, రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.